AUM

# Sree Jeeva Yatra.



BY

## Sreemathi

## Kanchanapalli Kanakamma

PUBLISHED BY

PANGANAMALA. TIRUMALA.
JAGANNADHA RAO.

PRINTED AT THE

SREEHARI PRINTING WORKS, MADRAS.



Price Rs. 2-8-0] [Postage Ex.

శ్రీరస్తు

శ్రీభాష్యకారాయ నమః.

# శ్రీజీవయాత్ర.



శ్రీమతి

కాంచనపల్లి. కనకాంబా ప్రణీతము

---

పంగనామాల తిరుమల జగన్నాథ రావుచే ప్రకటితము.

---

చెన్నపురి.

శ్రీహరి ముద్రాక్షరశాలయందు ముద్రితము.

౧౯౨౭



వెల. రూ. ౨-౮-౦.] [తపాలాకర్చులు ప్రత్యేకము.

# విజ్ఞాపనము

క॥ ఎక్కుడమక్కువఁబెంచిన
చక్కికిసచ్ఛాంతినొసఁగుకనకాంబరునిన్
మ్రొక్కిభజించెదనతఁడే
దిక్కగునిక్కముగమాకు స్థిరసంపదలీన్ ॥

క॥ అబ్బమ్మకుమాకందఱి
కబ్బయగున్ వేంకటేశుఁడతనిచరితన్
గబ్బంబచ్చొత్తించుట
కుబ్బఁడెయెవఁడేనిపరగమునొందెదు వేడ్కన్ ॥

క॥ ఘనతేజోవ్రానంబుల
ధనసంపూర్ణతనురామదాసులఁ బ్రోవన్
గనకముకనకమనిజముగఁ
గనకాంబరుతోడిపుట్టుఁగాంచినకతనన్ ॥

ఆ. వె॥ "చెట్టుక్రిందపక్షి జీవుండుపైనున్న
పక్షినాత్మఁజూడఁబైకినెగురఁ
దద్వ్యమాత్మయొకఁడు తానునీడయటంచుఁ
దెల్పుజీవయాత్రకల్పనగము.॥"

క॥ వినిపింపఁగబ్రహ్మోత్సవ
ముననీకృతిబ్రాహ్మణముఖమునశ్రీపతికిన్
బనివడియచ్చొత్తించుటఁ
గనినన్ బొరపాటు దిద్దఁగలరుమహాత్ముల్ ॥

2/11, ఆలంగత్తపిళ్ళై వీధి,
త్రిరువల్లిక్కేణి, మద్రాసు.

పం॥ తిరుమలజగన్నాథ రావు,
సంపాదకుఁడు.

శ్రీ రామ

శ్రీ జీవయాత్రయను మహాప్రబంధమును జూచితిని. అందుఁ గల "పదానాం సౌభ్రాత్రాదనిమిషనిషేవ్యం శ్రవణయోః" అను రీతినిఁబడసౌభ్రాత్రలాలిత్యములను గణయతిప్రాసలక్షణ పూర్తిని నమృతతుల్యార్థసౌష్ఠల్యమును "సారవద్విశ్వతోముఖమ్" అను రీతిననేకార్థప్రదత్వమును "అర్థోత్థమనవద్యంచ" యనురీతిని నిరర్థకపదరాహిత్యనిర్దుష్టతలను నపూర్వాతివిచిత్రకథాసందర్భమును జూడఁగ "నిస్సారసరస్వతీ" "ననువ్యాసప్రాచేతసపరిషదర్వాక్వచిదియం సుధాసిక్తాసూక్తి స్స్వయముదయమన్విచ్ఛతిజనే" యనురీతిని నాపద్మభవుని రాణియతివిలాసంబున తానైయీవిదుషీ రత్నము శ్రీమతి కాంచనపల్లి కనకాంబముఖారవిందమునుండి యావిర్భవించినట్లు తోఁచుచున్న దేగాని లోకరీతిగ విద్యాభ్యాస మొనర్చుటచే నీ కవయిత్రి రచియించిన ప్రబంధముగాదనఁగాఁ గేవలమా సరస్వతీ ప్రసాద మేయీగ్రంథరచనాముఖ్యకారణమని నానమ్మకము.

విద్వాన్. సేనాపతినరసింహాచార్యః.

నిజాందేశస్థ<br>కురుట్లగ్రామం<br>13-9-1925

వేదాంతద్వయవర్ధనీ సంస్కృతపాఠశాలా<br>శ్రీరామ స్థాపకః

— శ్రీమత్పరదేవతాయైనమః —

శతావధానులు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారిచే

రచియింపఁబడిన జీవన్ముక్తా ప్రశంసా

## పద్య రత్నములు

ఉ॥ భారతఖండమందుఁ బ్రభవంబునుగాంచినమాత్ర దేహికిం ।
గౌరవుఁగబ్బమల్లిననుగాక మఱొక్కటిఁగట్టినన్ బహి ।
స్సారములోఁబనేమియది శాంతినొ దాంతినొ యంతరార్థవి ।
స్తారముచేతఁ దెల్పుటయెతత్త్వముగాఁగనుపట్టునెల్లెడన్ ॥

సీ॥ భారతమెన్నాళ్లు పఠియించినను దాని
సారంబుతుదకు మోక్షంబుగాదె ।
భాగవతం బెంతగాగమనించిన
దానిసారము పరతత్త్వముకద
రామాయణం బెంతగామది నెంచినఁ
సారంబుముక్తిప్రశస్తియకద
ఎన్నిపురాణములెంతశోధించినఁ
దేలుసారంబొక్క దేవుఁడకద॥

గీ॥ అటవిసంద్రంబుఋతురాజులయ్యనంగుఁ
డల్లచందురుఁడలమలయానిలుంపు
వర్ణ్యమనుకొనువారు కావ్యపరమార్థ
మెఱుఁగలేనిపండితులంట యేద్భవంబు ॥

తే. గీ॥ అర్థవాదముగాఁగ పదార్థమొకటి
యున్నదియొ లేనిదియొ పట్టియొక్క విషయ
మునకె కవులెల్ల శ్రమ చేసి మనకు పరము
ముఖ్యమని బోధ చేసిరి మునులు మొదలు ॥ ౩

ఉ॥ ఇంతవచింపనేలకడు నేవమునంజనుజారతాపరి
శ్రాంతికి గోపకామినులనాంత్యంతముల్ గుఱిచేసి దానినిం
తింతనరాని ముక్తిపదమేకద సారముగాఁగఁ దేల్చెన [టీక
శ్రాంతము వ్యాసమౌని పలుచన్ మఱియొండుగణింపనే

తే. గీ॥ ఒకటి చెప్పుచు మఱియొకటి దెల్పు
టన్న మనవారికిది సహజానుభావ
మైన సామాన్యమందమియ్యర్థమునందు
యిమిడియుండెను వేదములింత నిజము ॥ ౫

మ॥ ఇది యిట్లుండఁగఁ గొంత సందితమకుం దేఁ బ్రీతియాదానికా
స్పదమౌ నట్టి గ్రంథసారమును సంపాదింపఁగా నెంచి త
త్పదవాచ్యంబులఁ గు శబ్దముల్ నడిపి తత్త్వజ్ఞత్వముల్ జాటినె
మ్మదికిన్ శాంతిఘటించి చిత్రవిలసంభావింపనత్యల్పముల్ ॥ ౬

క॥ ఆకృతుల కేమి ముఱియా
యాకృతులకు నేమి కర్తలెల్లఁ బురుషులై
రే కాని స్త్రీజనులలో
నేకొంచెము కాని లేమి యేయెల్లెడలన్ ॥ ౭

తే. గీ॥ ఆపెనామంబుకనకమ్మయల్లజ్ఞాన
వతికి బాల్యమ్మునన దైవవశతసంస
రణపుమూలంబుభర్తస్వర్గతికిఁబోయె
భాగ్యవశముతప్పింపనెవ్వరివశంబు ॥ ౧౩

క॥ ఇలఁగలతరుణులకిదు
ర్బలతాహేతువనియెల్లవారెఱిఁగినదే
తొలిబాముసగలవిజ్ఞా
నలవంబునకె సగమకుమసము చెసదయ్యెన్ ॥ ౧౪

క॥ ఆపదలసిసంపదలని
ప్రాపించినయపురుషుఁడుదుఃఖపడిసుఖపడితా
నీపాదుసంస్మృతినిఁబడి
యేపామునుఁడేఁబ రమానందంగలఁడే ॥ ౧౫

క॥ ఆపదసంపదసంపద
యాపదగాఁదలచునట్టియనఘులులవముం
డాపంబన్నదియెఱుఁగఁగ
సోపానములౌ ఘటింత్రుసుఖభూమికకున్ ॥ ౧౬

క॥ ప్రకృతమునునకనకాంబకు
వికలతకున్ హేతువై సవిధురతవిద్యా
ధికృతికినాధనమయ్యెన్
ముకురమువలెనదియుజ్ఞానమూలముఁ దెలిపెన్ ॥ ౧౭

క॥ కలిగినజ్ఞానప్రతతికి
బలమొసఁగెఁ గురులఁగొలిచివడసినవిద్యా
విలసనమదియేతుదకి
మ్ములనీపాత్రమ్ముగాఁగఁబొడమెఁబుడమిన్॥ ౧౮

ఉ॥ పాత్రములెన్నియోగలవపూర్వవిశేషములందునందువి
ద్వత్తములైనవారలకుఁదద్దయుబోధ్యములౌచునుండునీ
విత్తముగల్గుపాత్రములువృద్ధినిమృగ్యములౌటదీనికిన్
విత్తములైనవారలువివేకముమైనతిసేయుటొప్పగున్॥ ౧౯

ఆ. వె॥ పేరుజీవయాత్రధోరణిసరళంబు
తప్పుగానరాదుతత్వమెల్ల
యెడలవేద్యమిట్టియెడదయేసాధ్వికిఁ
గలుగుఁబున్నెమంతొసలుపకున్న॥ ౨౦

ఉ॥ ఈయనుపాండితీగరిమయీయమజ్ఞానవిశేషమీమహా
ధీయుతురాలివర్తనవిధేయతయోగ్యతనీతియుక్తియున్
స్థైయకళాప్రసృష్టిశ్రమలీమసకార్యపరాఙ్ముఖత్వమున్
ధీయుతుశ్రీకృతిన్ గనినఁదెల్లముగాఁబొడకట్టుసర్వమున్॥ ౨౧

ఉ॥ కావ్యనవిస్తరింపకయిఁకన్ విరమించెదఁగబ్బమిద్దిన
ద్భావులకున్ ముదంబిడుచుభావికలార్థులభాగ్యరాశియై
యీవిపులన్ యశమ్మునగనియెల్లెడలన్ జయమందుగాక యీ
కోవిదురాలిపుట్టువునకున్ ఫలమబ్బెడిగాతఁబూర్ణమై॥

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి శతావధాని

9-5-1925 శ్రీరామ.

బ్రహ్మశ్రీ కవిరాజు శ్రీపాద. కృష్ణమూర్తి శాస్త్రిగారిచే రచి
యింపఁబడిన జీవయాత్రా ప్రశంసాపద్య రత్నములు

ఉ॥ కాంచనపల్లివంశమునఁ గాంచన మైత్రగురంగమూర్తికిన్
గాంచనగంధిరంగమకు గాదిలికూతురు సద్గుణంబులన్
గాంచన మేయనంగఁ గనకమ్మయనంగను బేరుగాంచి వి
ద్యాంచితమూర్తియైన పరమాత్మమతిన్ సతిసన్నుతించెదన్॥

మత్తకోకిల॥
వింటిఁ గంటిఁ గవిత్వముంగడు వేడ్కమీఱ రచించు వా
ల్గంటులన్ భువివారలెవ్వరుగాని యీకనకాంబకే
వెంట నేనియు సాటిరారని వేవిధంబులఁ జెప్పఁగాఁ
నుంటి నాయమ జీవయాత్రను హౌన్నతిన్ గనియుండుటన్॥

క॥ గీతాశాస్త్రము వెనుకన్
సీతారామాంజనేయ చిరసంవాద
ఖ్యాతగ్రంథంబిపుడీ
భూతలమున జీవయాత్రఁ బోలుంబొగడన్॥

ఉ॥ పద్యములెల్ల హృద్యములు పండితపామర వేద్యముల్ పవి
త్రోద్యమబోధకంబులననొప్పెడు నెప్పుడు నాత్మచింతయే
విద్యయటంచుఁ జెప్పు గుణవిశ్రుతురాలల కాంచనాంబకా
హృద్యముగా రచించిన మహోత్తరతత్త్వము జీవయాత్రలో॥

సీ॥ సంస్కృతాంధ్రంబుల సరణి యెల్ల నెఱింగి
విదుషీమణిత్వంబు వెలయఁగాంచి
పురాణవిద్యావిశేషోచితత్వంబది
సాకల్యముగ నేర్చి సౌరుగాంచి
చెన్నపురంబునన్ శ్రీకళాశాల నాం
ధ్రమున నుపాధ్యాయితను వహించి
సద్గామినరుగాఁగ నెన్నఁ గోఁబడుచుండి
తనదు వైదుష్యంబుఁ దనరఁ జేసి॥

గీ॥ పెక్కుగ్రంథములను వ్రాసి పేర్మిఁగాంచి
సతతపరమార్థచింతయే సద్వ్రతంబు
గాఁగ నిష్ఠాగరిష్ఠమై కాంతిగాంచు
వినుతసద్గుణనికురుంబ కనకమాంబ॥ ౧

చ॥ యమకము వచ్చునట్టి సమయంబున భాగవతంబు పోలికన్
గమకము రీతులన్ గనిన కాలమునన్ మనువట్టులర్థచి
త్రము గలచోటులన్ వసువుదారిని భావగభీరతన్ హరి
క్రమము నజీవయాత్ర కుతుకంబు ఘటించుఁ గవీంద్రకోటికిన్॥

మ॥ మొదలుం బట్టిన దాదితుట్టతుదకున్ బోకంత యేఁగొంకి పా
టొదవం జేయదుహాయి హాయియననై యొప్పించు నెప్పట్టునన్
బదసందర్భము బాలదండగరిమం బాలింగు బాళించెడిన్
జదువం బూనిన జీవయాత్ర జగతిన్ సంతానముం బోలెడిన్॥ ౨

చ॥ సహజముపాండితీగరిమసాధుతరంబుపురార్జితార్థముల్
సుహితముసర్వముఖ్యమగుచొప్పునమెప్పొనగూరసజ్జనో
ద్వహనమొనర్పనేర్పుమెయివ్రాసినకావ్యముజీవయాత్రతా
నిహపరసాధనంబగుచునేర్పడునెల్లజగంబులన్ బ్రభన్॥ ౮

తే. గీ॥ సాధుసమ్మతముగనిట్లుసర్వమాన
వోపయోగముగాఁదత్వముత్తమార్థ
బోధకంబుగఁగనకాంబపొందుపఱచె
నెల్లరకుదీననానందమొసగుఁగాత॥ ౯

శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రి

10-5-25 రాజమహేంద్రవరము.

---

*

శ్రీరస్తు

శ్రీభాస్యాయనమః

# వి ష య సూ చి కం.

## ప్రథమోల్లాసము.

—: జీవాధికారము :—

విషయము. పుటసంఖ్య.



## ద్వితీయోల్లాసము.

—: సేవాధికారము :—

విషయము, పుటసంఖ్య.



తృతీయోల్లాసము.

—: పూర్వాధికారము :—



శ్రీ రా మ.

# శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 14 | కందమ్మెత్తి | కందమ్మెత్త |
| 11 | 18 | త్రోఁడ | త్రోడ |
| 15 | 18 | చిత్రఫలపుష్ప | చిత్రపత్రఫలపుష్ప |
| 17 | 2 | ఆతండున | ఆతండును |
| 19 | 11 | యుండిరి | యుండెను |
| 19 | 13 | వారినెల్ల | వారినెల్లర |
| 20 | 16 | నావుడునవ్వంభట్టు | నావుడునవ్వంబట్టు |
| 23 | 2 | యానతీయ | యానతిచ్చినన |
| 24 | 15 | భస్త్ర | భస్త్రనక |
| 27 | 6 | గంగాదిస | గంగాలస |
| 28 | 2 | కర్ణికాంత | కర్ణికార |
| 29 | 3 | నూతము | నూఁతము |
| 33 | 21 | మేకాంత | మేకాంతం |
| 41 | 3 | లంక్రీ | లక్ష్మీ |
| 42 | 1 | మరచే | మఱచే |
| 45 | 20 | బ్రాహంస్యకిఁ | బ్రాహ్మస్యకి |
| 47 | 1 | హంసన | హంసను |
| 48 | 13 | యొసంగెద | యొసంగఁదె |
| 59 | 5 | ప్రవాత్త | ప్రవక్తా |
| 61 | 31 | భవపాగర | భవసాగర |
| 63 | 10 | నాడనునీకృపఁ బడసినాఁడ | తిగదయ్యనీకృపఁ బడసితయ్య |
| 69 | 3 | మది | మదిఁ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 70 | 6 | నంశసయు | నసంశయ |
| 72 | 5 | మూకన్న. | మూఁకన్న |
| 73 | 12 | గ్రధ | గ్రంధ |
| 74 | 2 | పండితుఁడు | పండితుఁడు |
| 79 | 14 | నాకై | నాకఁటే |
| 81 | 16 | సుగుణరు | కముకులు |
| 84 | 6 | ఘనవిద్యలు | ఘనవిద్యలు |
| 84 | 7 | గీ॥ | ఆ॥ వె॥ |
| 86 | 21 | నిలిచినాఁడభక్తిఁ గొలిచినాఁడ | నిలుచువాఁడ భక్తిఁగొలుచువాఁడ |
| 87 | 18 | తదితరముతో | తదితరవిషయ |
| 90 | 13 | ప్రాప్తికి | ప్రాప్తికి |
| 91 | 1 | పరాయణు | పరాయణు |
| 91 | 18 | దానిచర్చింప | దానిఁజర్చింప |
| 96 | 2 | భక్తింపగ | భక్తింపంగ |
| 103 | 5 | జవ్వవి | జవ్వని |
| 104 | 17 | తే॥ | ఆ॥ వె॥ |
| 105 | 19 | శృంగారంబున | శృంగారంబున |
| 107 | 3 | పెద్దరిక | పెద్దరిక |
| 108 | 9, 10 | ఆలించు, చాలించు | ఆలింపు, చాలింపు |
| 113 | 7 | ఛీ | ఛీ |
| 114 | 4 | స్వాత్మ | స్వగురు |
| 114 | 16, 17 | పంక్తులసున్న | నిరంజనుఁడుజయంతమునకరుగుట |
| 118 | 2 | మోదా | మేమో |
| 118 | 12, 13 | పంక్తులసున్న | నిరంజనునకు రాజశేఖరోపదేశము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 126 | 3 | నందబిచ్చు | నందంబిచ్చు |
| 131 | 16 | దూరబోవు | దూఱంబోవు |
| 151 | 1 | పాంత్రను | పాత్రము |
| 151 | 11 | [illegible]ంచు | వే[illegible]ంచు |
| 152 | 19 | వాత్మ | నాత్మ |
| 167 | 3 | పఙ్క్తి | పంక్తి |
| 167 | 18 | [illegible]నట్లు | [illegible]న్నట్లు |
| 170 | 14 | రౌఱుంగ | రౌఱుఁగున |
| 175 | 14 | చెఱుఁజే | చెడఁజే |
| 179 | 2 | జీపుఁడా | జీవుఁడా |
| 180 | 12 | మహులుఁడో | మహాలుండ |
| 181 | 3 | లీలలగ | లీలగ |
| 181 | 8 | గడుచుణ | గడచుణ |
| 184 | 15 | దాఁచమి | దోఁచమి |
| 185 | 13 | ఆత్మ | ఆత్మ |
| 186 | 4 | కల్ల | కల్ల |
| 189 | 2 | గ్రింవగ | గ్రింపఁగ |
| 182 | 17 | స్వస్వ | స్వస్వ |
| 189 | 18 | లోలుకుల | లోకుల |
| 191 | 6 | కత్యాయని | కాత్యాయనీ |
| 191 | 6 | కంజంబారలు | కంజంబాల |
| 192 | 4 | ప్రాణ | ప్రాణద |
| 193 | 5 | వ్రూర్ణ | పూర్ణ |
| 199 | 12, 13 | పంక్తులమధ్య | నిరంజనుఁడగుగురుబోధమును స్మరించుచు |
| 209 | 4 | మూర్తులు | మూర్తులను |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 216 | 16 | రింప | రింపు |
| 217 | 13 | జెంద్రుఁడు౯ | జంద్రుఁడు౯ |
| 219 | 1 | నారస | సారస |
| 219 | 8 | సరసామృతె | సరసన్మధు |
| 223 | 11 | స్వోక్తి | సూక్తి |
| 272 | 6 | నీచుఁజాప | నీనుపాప |
| 320 | 18 | మార్జించులు | మార్జించులుసత్ |
| 232 | 13 | స్వోక్తి | సూక్తి |
| 233 | 10 | శృగా | శృంగా |
| 233 | 20 | దీని౯ | దీన౯ |
| 236 | 18 | సత్సేవయు | సాంబార్చన |
| 237 | 8 | దెలుపవె | దెలుపవె |
| 239 | 10 | చదు | చదువు |
| 241 | 22 | బోటులు | బోఁటులు |
| 244 | 16 | నైక్యంపుందు | నైక్యమందు |
| 248 | 18 | సిరసం | సిరసం |
| 250 | 14 | సంసారబు | సంసారంబు |
| 251 | 1 | మొని | మొఱ |
| 256 | 2 | నడపడి | నడల |
| 265 | 13 | శాంతిని బెంచు | శాంతిఁ బెంచు |
| 266 | 16 | బాపుచుందురు | బాపఁజూతురు |
| 267 | 3 | నూటి | సూటి |
| 267 | 20 | కృపచూ | కృపఁజూ |
| 269 | 18 | వ్సామి | స్వామి |
| 280 | 7 | బలికినాఁడ | బలుకువాఁడ |
| 281 | 6 | రసగలసొక్కు | రసఁగ [illegible] |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 284 | 19 | జనులకా నిర్భాగ్య | వులనెల్లభ్రష్టు |
| 290 | 2 | నవ్వడు | నెవ్వఁడు |
| 290 | 20 | సత్యమె | న్యాయమె |
| 292 | 8 | నళిన | నాళీక |
| 295 | 7 | లవుగాము | లఁగావుము |
| 302 | 19 | దాఁకెడు | దాఁకెడు |
| 305 | 8 | యేలుకో | యేలుకా |
| 308 | 12 | ఁగెలుచు | గెలుచు |
| 319 | 14 | భ | భక్తి |
| 320 | 10 | నక్లు | నయాక్లు |
| 350 | 17 | శ్రీపద | శ్రీశ్రిత |
| 362 | 14 | మేంతము | మంత్రము |
| 364 | 11 | తనతోడ | తనతోడ |
| 371 | 19 | చిత్రకవు | చిత్రకవు |
| 379 | 17 | పెంచుచు | పెంపుచు |
| 383 | 11 | పేర | పేఁ |
| 383 | 20 | మగుకవ | మగుఁగవ |
| 399 | 20 | ద్వద్వంబు | ద్వంద్వంబు |
| 407 | 12 | ముదముదా | ముదమునదా |
| 415 | 3 | సదమూల | సదసుల |
| 417 | 17, 18 | పంక్తులమూర్త | శాంతివచనము |
| 418 | 16 | హృదయాఘ | హృదయాః |

N. B. తగ్గుటలు-తక్కువలుగను సముద్రించబడిన సకారశకారములయందును, పకారవకారములందును భేదము స్పష్టముగాఁ గనఁబడమిఁ బాఠకులు సందర్భానుసారముగ దిద్దుకొన ప్రార్థితులు.

# అనుబంధము.

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 19 | బగుటకుఁ | బగుటకు |
| 4 | 3 | పెంచఁగ | పెంపఁగ |
| 24 | 16 | గలుగకేయుఁగద | గలుగఁజేయుఁగద |
| 29 | 6 | హారినిపద్మా | హారినిఁబద్మా |
| ,, | 16 | యుఁగాతప్రీతి | యుఁగాతఁబ్రీ |
| ,, | 17 | మెరిఁ | మెది |
| 36 | 10 | ణంబుఁగా | ణంబుగా |
| 38 | 5 | విడుకొని | నందిడి |
| 41 | 17 | గాంచు | కాంచు |
| 45 | 4 | జుఁమి | ఁజుమి |
| 47 | 3 | కితర | కిఁదర |
| 49 | 4 | న్నుబట్టి | న్నుఁబట్టి |
| 53 | 5 | జ్ఞప్తికిత | జ్ఞప్తికిఁద |
| 56 | 1-2 | ఫలముగుతె | ఫలముగుఁదె |
| 57 | 14 | ఎల్లెపోనీ | ఎల్లెఁబోనీ |
| 72 | 11 | చేఁత | చేత |
| 74 | 14 | లరుగమి | లఱుగమి |
| 79 | 19 | కయగుందు | కయకుంగు |
| 86 | 11 | మునతనయుఁ | మునఁదనయుఁ |
| 89 | 10 | మా!రామేశా | మారామేశా |
| 90 | 9 | చరాణా | చరణా |
| 91 | 12 | పొడనూపు | పొడచూపు |
| ,, | 20 | లినతద్భిన్న | తినఁబద్భిన్న |
| 108 | 6 | గొర | గొఱ |
| ,, | 12 | కర్మసలిపి | ధర్మమందు |

| | | | |
|---|---|---|---|
| 104 | 12 | మాతుడిగా | మాఁదుడిగా |
| 107 | 20 | భాసింప | భాసిల్ల |
| 112 | 15 | వడకె | వడఁకె |
| 116 | 4 | తత్త్వమసి | ఁదత్త్వమసి |
| 122 | 12 | టింపగా | టింపంగా |
| 132 | 15 | భ్రమసి | [illegible]మసి |
| 138 | 11 | జనలుం | జనమును |
| 145 | 9 | క॥ | గీ॥ |
| 146 | 5 | డనము | డనుము |
| 148 | 3 | బ్రహ్మతేజ | బ్రాహ్మణతేజ |
| 155 | 2 | జరగెడు | జరిగెడు |
| 156 | 15 | గమపద | గమపథ |
| 157 | 10 | గతము | గతమ్ము |
| 168 | 19 | చనిన | గనిన |
| 178 | 1 | విషయా ॥ తి | విషయమునుది |
| ,, | 20 | చేఁత | చేత |
| 181 | 15 | గాలోచిత | కాలోచిత |
| 189 | 16 | గడిచి | గడచి |
| 196 | 15 | భక్తిఁబోగడెనుక్కొ | విభక్తిఁబోగడెఁగ్కొ |
| 201 | 19 | గడిపె | కడపె |
| 210 | 19 | నుండ | ఁజేర |
| 217 | 14 | స్నేపాత్రుఁడ | స్నేఁబాత్రుఁడ |
| 220 | 16 | దోఁచమి | దోపమి |
| 230 | 9 | క॥ | గీ॥ |
| 236 | 12 | వెట్లుఁదెలి | వెట్లుతెలి |
| 237 | 18, 19 | పుణ్యాలు. . .తనకు | ఁబుణ్యాలు . . . దనకు |
| 239 | 16 | మహోనీయా | మహానీయా |
| 250 | 7 | ప్రాజ్ఞత | ప్రాప్తియ |

| | | | |
|---|---|---|---|
| 254 | 11 | తోఁచ | తోఁప |
| 259 | 1 | శ్రీఘ్రు | శీఘ్రు |
| 264 | 11 | మూర్తైన | మూఁర్తైన |
| 265 | 8 | నినుము | గరిటె |
| ,, | 13 | శాంతినిబెంచు | శాంతిఁబెంచు |
| 266 | 14 | వరమదీ | పరమతీ |
| 278 | 9 | నఃజనియిం | మునజనిం |
| 300 | 11 | గడిచిరి | గడచిరి |
| 302 | 14 | బూటకములు | బూటకముల |
| 314 | 13 | తాడక్కుల్ | తాఁడక్కుల్ |
| 322 | 1 | శుద్ధమైన | శుద్ధమయిన |
| 326 | 7 | కష్టముల్ | నష్టముల్ |
| ,, | 9 | పోకలఁ | పోకలుఁ |
| 333 | 4 | నిజ | వని |
| 338 | 12 | కల్బన | కల్పన |
| 343 | 13 | సద్గురురు | సద్గురు |
| 345 | 9-10 | మేమిరయుందోఁచకపూ- మెద్దయేఁదోఁచినఁబూ | |
| 355 | 5 | వెదకి | వెదకి |
| 366 | 16 | గురిగా | గుఱిగాఁ |
| 376 | 10 | రీతిత | రీతిఁద |
| 380 | 4 | విప్రవరా | విప్ర!హరిఁ |
| 383 | 3 | బనిరెయె | బూని |
| 388 | 8 | కుండునె | కుండును |
| 390 | 20 | హరినినెంచు | హరినెంచు |
| 403 | 13 | వాణిం | వాణీం |
| 413 | 3 | దోఁచమి | దోఁపమి |
| 414 | 1 | గొమరుఁడు | గుహుఁడోం |
| 424 | 5 | క్రింద | క్రింది |



శ్రీ రా మ.

కం॥ సాధులువినిచినశ్రీహరి
గాధలుబోధలునుగాఁగృతికల్పనమునసా
రాధనమొనరిచివేంకట
నాధునిసంప్రీతుఁజేసి నడపెదయాత్రన్ ॥

శ్రీ రా మ.



శ్రీరామ.

శ్రీభాస్కరాయనమః. శ్రీవేంకటేశాయనమః.

శ్రీశారదాగురుభ్యోనమః. శ్రీమత్పరాభట్టారికాయైనమః॥

# పీఠిక.



గణపతికిని వాణికి
శ్రీగౌరీపతికి భక్తశేఖరగతికిన్
శ్రీగరుడవాహనునకున్
శ్రీగురుమూర్తికిని భక్తి జేజేజేజే ॥ ౧

శ్రీరఘుకులసోమంసీ
తారామం జీవ దశరథాత్మజ మాద్యమ్
సారాకారం సకలా
ధారం వాయ్వాత్మజవరదం భజ సతతమ్ ॥ ౨

క॥ వరదుఁడు నాగాభరణుఁడు
పరమాప్తుఁడు యోగినుతుఁడు బ్రహ్మాంబచలా
కరుఁడును బిల్వప్రియుఁడగు
తిరుమలహరిహరుఁడుమమ్ముఁదీరముజేర్చున్ ॥ ౩

క॥ సంకల్పపంక జాతక
ళంకుఁడు జీవుండు కర్మలాంఛనుఁ డంత
శ్శ్యాంకోత్పాదితదేహుఁడు
వేంకటపతిసర్వమనుచు విశ్వము మఱచున్॥ ౩

క॥ శేషాచలపతికిన్ స
ద్భాషలుగా భక్తికావ్యముల్ రచియింపన్
దోషంబుల నరయుట కవి
దోషాకరులకును జెల్లదు సకలభూషా॥ ౪

క॥ కందము కందంబై యా
నందంబున నిందు సుకవినందనుల సదా
చిందగుఁ గవిజనముల చెవి
కిం దగుఁ బరిపూర్ణబోధకే గురుమూర్తీ॥ ౫

క॥ కందమ్ముల సందమ్ముల్
కందమ్మునట్టి చిట్టికావ్యమ్మున నా
కందమ్ముల కందమ్మగు
చుం దనరెను నీదుమూర్తిఁ జూచెద నెందున్॥ ౬

క॥ గురుమిత్రరుచిని దెల్పఁగఁ
బరమార్థమరందమొసఁగ భక్తాళికి మో
క్షరమానిలయం బగుటకుఁ
నరవిందంబయ్యె సహృదయహృదయ మౌరా॥ ౭

క॥ గురుమిత్రచరణసేవా
చరణాతురశిష్యహృదయజలజము విచ్చన్
బరమార్థైకపరాయణ
వరభక్తాళి యమృతంబుఁ బడయుచు మెచ్చన్॥

ఉ॥ తిక్కనఫక్కియంద్రు కవిధీరుఁడు నన్నయ పండితుండు తా
నొక్కివదించెనంద్రురమణుల్ గొని యాడఁగ బోతనందుర
మ్మక్కప్రపూర్ణభావమున వ్యక్తులభేదములున్న యూరకా
ఫక్కినిబల్కుచంద్రు తలఁపన్ బుధకోటికి సద్రసంబులే
చక్కనిఁ బాఱుచున్నఁ గవిచంద్రులచంద్రిక యాట నేకమై
మక్కువగల్గఁ జేయునొగిమాన్యతఁగాంచునుదత్త్వవృష్టిచేన్॥

ఉ॥ దేహివసించు దేహమున దీనునిభంగిఁ గృశించుః శలో
నూహజనించు సద్గురునినుత్తముఁ గొల్వఁదదీయబా ఘచే
నీహానశించు యోగమున నెంతయు ంతివహించుభక్తితో
శ్రీహరినెంచు మించు భవసింధువు వేగఁదరించురాముఁడై॥

ఉ॥ కాంచనపల్లివంశమునఁ గాంచిరి రంగఁడురంగమాంబయున్
గాంచనచేల నీకృపను గన్యలముప్వుర వారిలోనన
భ్యంచితరీతిఁ బ్రీతిఁ గనకమ్మని పేరిడినారు నామదిన్
నించిరి నీదుతత్త్వమవనిన్ననుఁ బ్రోవగఁనిన్నుఁజూపి చా
లించిరి జన్మముల్ మఱల లేవు భవాబ్ధినివారినీవ దాఁ
టించితి మేలుమేలు ప్రకటించెద నీచరితల్ బుధాళియా

లించి సుఖించి యెంచి యవలీలఁగసాధులలీల నిన్నుఁబూ
జించి తరించి శాంతినిభజించుచుఁ జల్లగఁజూచినన్ను దీ
వించి ముదమ్ము పెంచఁగఁ బవిత్రతగాంచెద లోననిన్ను ధ్యా
నించెద నేర్పుమైభవము నీకృపదాఁటి సదామదిన్ వినో
దించెద సద్గురూక్తులఁ ద్వదీయపదాబ్జ మధువ్రతంబనై॥

గీ॥ దుష్టకీర్తనకాంతారదూరగమన
పాంసులయగు వాక్కుఁ బరిశుభ్రపఱుతు నీక
హరికథాలాపగంగ రంగమ్మతల్లి
హేమకల్పకవల్లి సాధ్వీమతల్లి॥ ౧౩

ఉ॥ రాముఁడుసద్గురుండు రఘురాముఁడుతండ్రిభవాబ్ధిదాఁటుచో
రాముఁడుకర్ణధారుఁడు విరామమునిచ్చును రాముఁడాత్మకున్
రాముఁడు సర్వకాముఁడు రాజిలుసర్వముఁదానయాపరం
ధాముఁడు నిత్యరక్షునిజధర్మముఁబాయనిభక్తకోటికిన్॥ ౧౪

ఉ॥ కోరిభజించుసాధులకుఁ గోవిదులుజ్వలపూర్ణతత్త్వమున్
సారపువాక్కులం దెలిపి శాశ్వతసౌఖ్యమునిచ్చి ప్రోచుచున్
పారముఁజేరునంతకు నపారకృపాకరదృష్టిచే సహ
స్రారమునందునిల్పఁగలరాప్తులసాటియెవండు ధారుణిన్॥ ౧౫

కం॥ బాల్యంబున నెట్టిటూహారి
కల్యాణ గుణములఁ బలుకఁ గలిగితి నవి సౌ
కల్యంబుగనేఁడిటగై
వల్యామృతపానకలనఁ బల్కెద భక్తిన్॥ ౧౬

క॥ అచ్ఛపుభక్తిని ధీరుం
డిచ్చరితముఁ జదువ ముక్తియే సిద్ధించున్
సచ్చరితుల నడవడి గని
యుచ్చైఃపద మందుచుందు రుత్తము లెందున్ ॥ ౧౭

క॥ అది గురుముఖాబ్జపదకా
ముది యీదృగ్బోధసారపూరితమోక్షా
స్పదమగు శ్రీహరికరుణా
ర్ద్రదృష్టిసంపూర్ణవృష్టి రహిఁ దోడ్పడుఁగన్ ॥ ౧౮

క॥ జీవుఁడు ముక్తిం గనియెడు
త్రోవల నన్నింటి భక్తితో వర్ణింపం
గా వ్రాసెదఁ గావ్యంబు సు
ధీవర మానసగమన మదియు యొనరించున్ ॥ ౧౯

కథాసంగ్రహము

క॥ అంబాతనయునిగజముఖు
లంబోదరువిఘ్ననాథులక్ష్మీగణనా
థుం బ్రహ్మపదవినిడి ప్రో
వం బ్రార్థించెదనుభక్తవత్సలుసతతమున్ ॥ ౨౦

ఆ-వె॥ పరమహంసవేద్య పదహంసకోజ్జ్వల
హంసయాన రాజహంసయాన
నలినభవునికొమ్మ నారాయణుని కోడ
లమ్మ లోకములకు నాత్మ మాతు ॥ ౨౧

శారదరాత్రి నిండుచందురుండు పండువెన్నెల గాయుచుండెను. సోమశిలాక్షేత్రంబునఁ గార్తికోత్సవదీపంబులు సహస్రంబులుగ వెలుంగుచుండెను. జనులు కోలాహలంబుగహరహరమహాదేవ యనుచు సోమేశ్వరుందర్శించుచుండిరి. ఆలయమునంటి యిసుకతిన్నెలనడుమఁ దేటనీటితోఁ బినాకినీనది పాఱుచుండెను. అయ్యేటియొడ్డున దేవళమునకసతిదూరంబున వైదికజనంబులు సంజవేళల ననుష్ఠానంబులు సేయు ఱాతితిన్నెపై నొకయోగిని దీర్ఘాలోచనతత్పరయై యుండెను. అట్లొకింతసే పాంటరిపాటుననుండి తనలో "నెన్ని చదివిన, నేమినేర్చిన, నెంతయున్న నేమిప్రయోజనము? చిత్తశాంతియు నానందమ్ము లేనిజన్మమ్ము వమ్ముగదా! ఈ సంసారదుఃఖసాగరంబుఁ దరించుమార్గం బేమి? గురుమూర్తికరుణ లేక సుఖమార్గంబలవడదని పెద్దలంద్రు. నాకట్టి మహానుభావుదర్శించుసుకృతం బెట్లుసిద్ధించు ఆపాదమస్తకంబుఁదపింపఁజేయు నీసందేహదవానలం బేఘనుఁడు తనబోధామృతవర్షంబున శాంతింపఁజేయునో కదా! అట్టివాఁడెందుండునో నాకేమియుం దోఁచకున్నది. భగవంతుండె నాకొక్కదారిఁ జూపవలయు" ననుకొనుచుండెను.

అత్తఱి జ్ఞానాంబయను బాలిక యొకర్తుక పొల్లనవచ్చి యానారీమణికి నమస్కరించి "తల్లీ నీ వెవ్వరవో? నే నెఱుంగను. నీవు లక్ష్మివో! పార్వతివో! ఆపరస్వతివో!.. విన్నంతఁజూచి

నాటినుండియు నీకుంబరిచర్యనొనరించుచు నీచెంతనుండిన నాకు సకలార్థంబులు సిద్ధించునని తోఁచుచున్నది. సోమేశ్వరుండును నిన్న స్వప్నంబునఁగనఁబడి నాకటులనానతిచ్చెను. నేను ప్రత్యహంబు సోమేశ్వరునకుఁ దోమాలియలు రచియించి సమర్పించుచుందు. నన్ను జ్ఞానాంబ యందురు. దాసురాలిం జేసికొను" మని ప్రార్థించె. అదివిని యాకాంతారత్నంబు "అమ్మా! నిన్ను జూచిన నాకును బ్రియంబుగలుగుచున్నది. నేనే గురుదర్శనంబు గాంక్షించుచుఁ జిత్తశాంతి గుదరకయున్నదాన, నీకేమియొనరింపఁగలుగుదు" ననియెను. అంత జ్ఞానాంబయు "తల్లీ! నీతోడన నేనుందును. వలదనకుము. ఇతరచింతలేదు. నీకుఁగలుగు ఫలంబే నాకునుజాలును. చేకొను" మని యర్థించె. "ఇది దైవయోగంబుగ నున్నది. నిన్నుఁ బ్రియంబునఁ జూతు నేనింతియు యిప్పుడు చెప్పఁదగినమాట" యని యాకాంతారత్నంబు పల్కుచుండఁ బైనుండి వాయువశంబున వీడిపడిన మబ్బు తునకయో యననొప్పు నొక్క హంసరాజంబా యంచయానచరణతలంబునకు వ్రాలి మోమెత్తి మనుజభాషణంబుల "నవ్యనీరంబొల్లక తొలకరి చినుకులకై యెదురుచూచుచాతకంబుం బలె గురుబోధామృతమునకై తపించు నోసాధ్వీమణీ! నీకుశుభంబగు. ఏలచింతించెదవు. నీకుఁబరమేశ్వరియనుగ్రహంబున మనోరథసిద్ధి శీఘ్రంబయగు" ననియె. ఆయంచలరాయని పలుకులాలించి యక్కాంతామణి యచ్చెరువంది "హంసరూపంబున నాకు శుభసందేశము

దెలుపనున్న పుణ్యమూర్తీ! నీ యాగమనప్రకారంబు నీ మాటల తెఱంగును నాకు నబ్బురపాటు నానందంబు గలిగించు చున్నవి దయగలదేని నామదిలోని కొదదీఱు త్రోవ నీ వెఱుంగుదేని నాకుం దెల్పు" మని యడిగెను. ఆహంసరాజంబు నాసతీమణి సమ్మానింపఁ జెంతనున్న తిన్నెపైఁ గూర్చుండి యిట్లని చెప్పఁ దొడంగె.

"అమ్మా! నీ తత్త్వజిజ్ఞాసకు మిక్కిలి యానందించితి. నీ వంటిమహానుభావకు నాయెఱింగిన యుత్తమవిషయంబుం దెల్పుటయె పరమధర్మంబు జన్మపావనకరంబుం గావున నేనిప్పుడొక్క వృత్తాంతంబు నీప్రయోజనంబున కనుకూలమగుదానిం బ్రకటింతు. సమాహితవై యాకర్ణింపుము.

శ్రీచరణ శ్రీశరణసేవాచరణపరాయణ సకల సరస సుకవికేసరివిరాజితంబై భారతీక్రీడోద్యానంబునాఁ బరఁగుభరతఖండంబున నాంధ్రదేశంబున శేషాద్రియను నొక్కమహీధరంబు గలదు. దానికాద్యంతంబులై యెఱమల నలమలలొప్పు. ఆ రెండుకొండలనడుమ సకల సంపదలచే విరాజిల్లు కళ్యాణపురంబను నపరనామంబుగల యానందపురమును రాజధానిగఁ జేసికొని రాజశేఖరుఁబోలు రాజశేఖరుఁడను రాజు పరిపాలించుచుండెను. ఆరాజశిఖామణికి సుదర్శనుఁడను మంత్రియు ధర్మాంబయను ధర్మపత్నియుఁ గలరు.

ఒకసమయమున రాజశేఖరుండు వేంకటాచలయాత్రఁ జేయ నిచ్ఛగించి ధర్మాంబా సుదర్శనులతో బయలుదేఱి స్వామిసన్నిధిం జేరెను. శ్రీనివాసులఁ ద్రికాలార్చనల సేవించుచున్న యారాజశేఖరుండు యాతాయాతజనంబులచే నచటికనతిదూరంబున జాబాలితీర్థంబున జయంతాశ్రమంబొండు కలదనియు నందుఁ బరమహంసయనుమునీంద్రుండు వసించుననియుఁ దత్త్వము దెలుపుటలో నతఁడసమానుఁడనియు విని యామహర్షిం జూడనేగెను. ఈతఁ డేగునప్పటి కాపరమహంసయుఁ గొందఱుభక్తులకుఁ దత్త్వంబు కరతలామలకంబుగ నుపన్యసించుట గాంచి, తన జన్మము సార్థకంబుగ నెంచి, భవంబుమించ నుత్సహించి, మంత్రియుభార్యయుఁ దన్ననుసరింప, మునికి సాష్టాంగప్రణామంబొనర్చి యొరఁగనిల్చి యంజలిఘటియించి "స్వామీ! నిరంతరవిరాభవాబ్ధి మునింగి దరి గానక తపియించు నీదీనుని నీకటాక్షవీక్షణంబను తెప్పచే రక్షింపవే. ఇహసౌఖ్యములన్నియు, దుఃఖపరిణామంబులే యగుట నెందును సారంబరయనైతిని. అనిత్యమైన కాయముతో నిత్యానంద మార్గము నన్వేషింపవలయుఁ గదా! సంపదలరోసితిని. విషయ సుఖలవిసగితిని. తత్త్వమర్థించితిని. కావునఁ బరమపదంబొసఁగి నను బరిపాలింపవే మహాత్మా" యనిడగ్గుత్తికతో వేఁడికొనెను. మునియు నతనిమాటలయందలిసత్యమెఱింగి మహాత్ములమనంబులతికోమలంబులగుట నారాజుం గరుణించి చేరఁబిలిచి లలిత వాక్కులచే ధర్మాంబకును సైతము భక్తులకు బోధపడునట్లు తత్త్వము

నేత్రింగించెను. అంతట ముప్వురునాతనికినమస్కరించి యమ్మహా నుభావునుపదేశంబునం గృతార్థులుగాఁదలంచి మంత్రంబర్థింప నతఁడనుగ్రహించె. ఐదుదినము లాయాశ్రమంబున నివసించి బోధాకరుఁడగు నప్పరమహంసయనుగ్రహంబున విగతమోహులై రాజునిజస్థానంబునకుఁబోఁదలంచి,యాతనియనుజ్ఞవడసిపయన మయ్యెను. మార్గమధ్యమున మంత్రియుఁదాను నమ్మహాశీయుండొనర్చినబోధలఁ బ్రశంసించుచు నీయాత్రచేఁ దమజన్మము సార్థక్యముగాంచెనని యెంచుకొనుచుఁ బూర్వమువలె వ్యావహారికమైనమిత్రత్వమేకాక యిఁకనమ్మహనీయునిచేఁ గలిగినపారమార్థికమైనస్నేహము కూడఁబోషించుచు జగమున నిందాస్తుతుల గణింపక యుండవలయుననుకొనుచు నిజపురంబునకరిగిరి.

వేంకటాచల యాత్రనుండి వచ్చినసంవత్సరములోపల ధర్మాంబకొక్కసంతానముదయించెను. ఆబాలునకుఁ దండ్రినిరంజనుఁడని నామకరణంబొనర్చెను. ఐదేండ్లప్రాయమున నొక్కనాఁడు నిరంజనుండుమంత్రియొద్దకేగి తన్ను జనులునిరంజనుండని యేల పిలిచెదరు? ఆనామంబునకర్థ మేమని యడిగెను. మంత్రియు నబ్బాలునితో నిరంజనుండనఁగా శివుఁడనియుఁ బాపరహితుండగుట నాపేరతనికిఁగలిగినదనియుఁ జెప్పెను.అట్లైననేనుశివుండనా యనిబాలుఁడడిగెను. మంత్రియుఁ "నాయనా శివుండు దేవుండగు. మనముజీవుల"మని ప్రత్యుత్తరమిచ్చెను. అంతనక్కుమారుండు తాను దేవుఁడు కాఁడుగావునఁ దన్నుందఱు జీవుండనిపిలువవలెనని

చెప్పుచురాఁగ నందఱాబుడుతని గారాబమున నల్లేజీవుఁడని పిలు
చుచుండిరి.

విద్యాభ్యాసమునకుఁ దగినవయస్సు వచ్చిన కుమారుం
గాంచి తండ్రి గురుముఖమున గురుకులమున విద్యనభ్యసించినఁ
గాని పరిపూర్ణుఁడుకాఁడని శుశ్రూషావిధుల బోధించి నిరంజ
నుని సుశీలుఁడను పండితునికడకనిపెను. ఆస్థానపౌరాణికుండగు
నారాయణభట్టుతన తనయుఁడగు నన్నంభట్టును రాజనందనునకు
సహాయార్థము పంపెను. నిరంజనుఁడట నచిరకాలముననే తండ్రి
ప్రోత్సాహమున సకలవిద్యలను సంప్రదాయానుసారంబుగ నభ్య
సించుచున్ననులోకసంగ్రహబుద్ధిగలవాఁడగుటచేలౌకికవిద్యలను
మతాంతరము నన్వేషించుకోర్కె గలవాఁడుగ నుండెను. రాజ
కుమారుండగుటచే రాజాజ్ఞనుల్లంఘింపఁజాలక తనకుఁజెలికాఁ
డైనయన్నంభట్టు విద్యలం బ్రవీణుఁజేయనెంచి తనతోఁజదు
పుటమాన్పించి యితర గురువులయొద్దకుఁ బోయి విశేషం
బులు నేర్వఁ బ్రోత్సాహపఱచెను. ఆతఁడావిద్యల నెఱిఁగి
వచ్చినఁ దానాతని సాయంబున లోకంబును సంస్కరింపఁ దలఁచి
కొని యుండెను.

తనవిద్యాభ్యాసము పూర్తియైనతోడనే నిరంజనుండు
గురుననుమతినిఁ బొంది నిజగృహంబునకరుగుదేఁగాఁ దండ్రియు
సమ్మదంబందితానిశ్చయించుకొనినటులఁ గుమారునిపై రాజ్య
భారము మోపి తానుభార్యాసహితముగఁ బరమహంసాశ్రమము

నకుఁ బోసమకట్టి మంత్రినిఁ బిలిచి "నిరంజనుఁడు బాలుఁడు రాజ్యపరిపాలనభారమంతయునీది. నేనుశాంతముగఁ బరమహంస సమీపంబునఁ గాలంబుంగడిపెద. నీవంటిమిత్రుఁడుండుట నేను నిశ్చింతగ మునిజనసన్నిధి నాత్మానుసంధానము గావింపనవకాశ ములభించెనని చెప్పి రాజ్యమును, నిరంజనుని సుదర్శనున కొప్పగించిభార్యాసహితుఁడై జాబాలితీర్థమునకేగెను.

ఇటసుదర్శనుఁడు రాజచక్రముద్రిప్పుచుండ నిరంజనుఁడు పరోపకారమునందును విద్యాగోష్ఠియందును గాలముగడపుచు రాజ్యమేలుచుండెను. రాజకుమారుఁడుయుక్తవయస్కుఁడైనం దున వివాహముఁజేయుభారము తనపైనుండినందున మంత్రిసత్త ముఁడు రాజకుమారుని మేనమఱఁదలగుబుద్ధిమతిని వివాహమా డుమని ప్రోత్సాహపఱచెను. రాజనందనుండందులకునవ్వి వివా హముతనకు ముక్తికంతరాయంబనియు, విషయసుఖంబులునరక హేతువులనియుఁ, బరోపకారమునజన్మముసార్థక్యముఁజెందునని యు భూతదయయే ప్రధానముగనుండవలసినగుణమనియు, సం ఘమిట్టి యధమస్థితి యందుండఁదాను వివాహమాడుట యుస మంజస మనియు, బ్రహ్మచర్యమునందే తనజీవితము గడపనిశ్చ యించుకొంటి ననియుఁ, జెప్పెను. మంత్రి యామాటలవిని తా నెంతబోధించినను బ్రయోజనముఁగానక బాలునికేమియులోక జ్ఞానము లేదనియు, నతనిమనస్సుత్రిప్ప గురువులెతగుదురనియు నిశ్చయించి యాతనిజాబాలితీర్థమునకుం గొంపోయెను.

రాజకుమారుఁడు తలిదండ్రులకు నమస్కరించి పిదపఁ బద్మాసనస్థుండై యున్న పరమహంసపాదంబుల కెరగి "మహాత్మా మాతలిదండ్రులందరింపఁజేసినమీకరుణ నాపైఁగొంతఁ బ్రసరింపఁజేయుఁడు. ఏమహాత్కార్యములఁ జేయుటచేజీవుండీభవవార్ధిఁ దరించు. గమ్యస్థానంబెయ్యది యెఱింగింపవే" యనుఁడునప్పరమహంస "బాలకా! స్వాత్మధర్మమునిర్వహించుటలోజనకునింబోలు నీజనకుఁడే నీసందేహముల నన్నిటినిదీర్పఁగలండని" యానతిచ్చెను. రాజశేఖరుండు తన్నర్థించిన కొమరునకు గృహస్థవిధుల నుపదేశించి యింటనుండియే ముక్తినిసాధించుమార్గము బోధించెను. తల్లియుఁ దన మేనకోడలగుబుద్ధిమతి బుద్ధమతియనియు నతనికిఁదగినదనియు నామెనుబరిగ్రహింపుమనియుఁ జెప్పెను. నిరంజనుం డాబోధలవిని తనకన్నులపొరలువిచ్చినట్లు స్వస్వరూపానుసంధానంబున సర్వసిద్ధులంబడసెను. ప్రపంచమునంతయు నూతనముగఁ గనుఁగొనెను. రాజకుమారుఁడు తత్త్వబలసంపన్నుండై యానందపురమునకు మరలివచ్చి సుదర్శనుఁడు సంతోషింపఁ దల్లిచెప్పినబుద్ధిమతిందనకుధర్మపత్నిగ గ్రహించెను.

నిరంజనుండు వివాహముచేసికొనినవార్త దేశాంతరముననున్నయన్నంభట్టువినిరాజనందనునియొద్దకువచ్చి "ఏమోయీ మనము లోకసేవఁజేయ జీవితమువినియోగింప నెంచినమాటల వ్యర్థపుచ్చితివి. నిన్నుజూడ మునుపటివాఁడవుకావని తోఁచుచున్నది. నీవు పూర్తిగ మాఱిపోయితివి, మఱచితివి. మఱచితివి ఈ

నడుమ జాబాలితీర్థమునకుఁ బోయివచ్చితివఁట. అచటిపరమ హంస సామాన్యుఁడుకాఁడని విందు. నీవుతప్పక తత్త్వోపదేశము నాతనివలనఁబొందియుందువు కాఁబోలు. ఆతని దర్శించునంతటి పుణ్యము నాకులభింపదయ్యెఁగదా!" యనుచుండ నిరంజనుండు "ఔనౌను. ఆతఁడు శివపరావతారము. రాజశేఖరుండౌట మా తండ్రి యాతనిం జేరఁగలిగెఁగాని యితరులెట్లులోపుదురు. తదా త్మజుండనగుట నాకునమ్మహాత్మునిదర్శనములభించె"నని యూర కుండెను. అన్నంభట్టు రాజకుమారునితో "మిత్రమా! మనము యావజ్జీవము చెలికాండ్రుగనుండ నిశ్చయించుకొంటిమి గదా! నీవు తత్త్వసిద్ధిం గాంచియుండ నేనిట్టి యజ్ఞానదశయందుండిన మనకెట్టులు సఖ్యముపొసఁగు. నాకును జ్ఞాననేత్రంబుం బ్రసా దింపవే" యనుడు నిరంజనుండు తాను యాత్రార్థము మఱు నాఁడు భార్యాసహితుండై బయలుదేఱునట్లు చెప్పి యాతఁడు కూడఁ దనతోవచ్చినయెడలఁ ద్రోవలో నావకాశముగఁ దావిన్న బోధలనెల్ల విస్తరించెదనని చెప్పెను. అన్నంభట్టందుల కంగీ కరించెను.

మంత్రియగుసుదర్శనుండు వృద్ధుండగుటచేతను, మంత్రి త్వమునకుఁదగిన లక్షణంబులచే నన్నంభట్టొప్పుచుండుటచేతను, నిరంజనుఁడన్నంభట్టును మంత్రిగానియమించితానుదీర్ఘయాత్రలఁ జేసికొని తిరిగివచ్చువఱకు రాజ్యమును సుదర్శనునికొప్పగించి మిత్రునితోఁడను గళత్రముతోఁడను దీర్ఘయాత్రలకు నిర్గమించి

తీర్థంబుల సేవించుచు నాయా క్షేత్రంబులందలి మాహాత్మ్యంబుల నెన్నుచు ముక్తుల సందర్శించి ప్రశంసించుచుఁ గాలంబు గడపుచున్నాఁడు.

జయంతాశ్రమంబునఁ బరమహంసయు, రాజశేఖరుండును సాధుబృంద సేవితులై యున్నారు. నీవు నా వెంట వచ్చితివేని నిటఁ గొనిపోయెద.

ఆపుణ్యాశ్రమంబున సమ్మహనీయులవలన నీకు సర్వసంశయంబులు వీడి స్వస్వరూప జ్ఞానంబు కలుగు నని హంస చెప్పిన ప్రత్యక్షకథా విధానంబున కాసాధ్వీలలామ యద్భుతానందంబులఁ బొందుచు "ఆడఁబోయిన తీర్థ మెదురయ్యె నన్నట్లు నామనోరథంబునకనుకూలంబగు స్థానంబును మహనీయుల నెఱింగించితివి. నాకొంచుకు శంకయు నాలోచనయు లేదు. సన్నా జయంతాశ్రమంబునకుం గొనిపొమ్ము. పుణ్యంబుఁ గట్టుకొమ్ము," అనుచు లేచి యయ్యండజంబు నడుగుల జాడం బడి జ్ఞానాంబ తన్ను వెంబడింప సమందగమనంబున దేవతాజనాతిశయంబునఁ దెల్లవాఱువఱకు జయంతాశ్రమప్రాంగణముం జేరెను.

ప్రశాంతంబగు నుపవనంబున మనోహర కాసారతటంబున విరాజిల్లు శిలాపర్ణశాలయు, నల్గడల బహుచిత్రఫలపుష్ప విరాజితంబగు నారామంబుం గాంచిరి. ఆశ్రమంబున బ్రహ్మచారులు ప్రభాతంబున నుచ్చైస్స్వరంబున భగవత్కీర్తనంబుఁ.

శ్లో॥ శాంతాయ సాధువరదాయ పరాత్పరాయ
గోపాంగనాహృదయపంకజ భాస్కరాయ
యోగీంద్రవేద్యనటనాయ భవప్రియాయ
ధర్మాయ ధర్మనియమాయ నమోనమస్తే॥ ౧

శ్లో॥ నందాత్మజాయ నళినాయతలోచనాయ
దుర్యోధనాదినరవైరికృతాంతకాయ
రామానుజాయ పరితోషితదేశికాయ
ధర్మావలంబనధియా మహసేనమస్తే ॥ ౨

శ్లో॥ శ్రీవేంకటేశాంఘ్రియుగాశ్రితానా
మస్మాకమానందభుజాం గురూణామ్
సత్సేవకానాం భవతారకాణామ్
కిందీయతే దీనజనేన కామ్యమ్ ॥ 3

ఇట్లొనరించుచుండఁ దత్పరయై నిలువంబడియె. ప్రార్థనా పర్యవసానంబున నల్లడలఁగలయఁజూచి హంసంబుంగానక ముందుఁజేయునదియుంగానక దిగ్భ్రమఁజెంది యుదయించుచున్న మిత్రమూర్తిం ధ్యానించుచుండె.

అంతలో లోపలసమాధిఁజాలించి కన్నులు తెఱచి పరమహంసయొక్క బ్రహ్మచారినిఁబిలిచి యంగణముననున్న యంగనామణిం దోడ్కొనిరమ్మని నియమించెను. ఆవడుగువచ్చి నమస్కరించి యాసతీమణిని లోనికిఁ దోడ్కొని పోయెను. జ్ఞానాంబ

వెంబడింప నామెయటకరిగి వినయామృతంబులు సందడింప నా పరమహంసకు నమస్కరించెను. ఆతఁడును దల్లీ! శారద! కృతార్థురాలవయితివని యాశీర్వదించెను. అంతలోఁ దనధ్యానంబు నుండివిరమించి రాజశేఖరుండును బరమహంసకు వందనంబాచరింపవచ్చెను. పరమహంస యాతనింజూచి "రాజశేఖరా! నిన్నటి దినము సాయంసంధ్యోపాసనాంతంబున మనము ప్రస్తావవశంబున ననుకొనిన దీపుణ్యశీలయ సుమా!" యనెను. శారద లేచి రాజశేఖరునకు నమస్కరించెను.

అంత సూర్యోదయంబగుటయు, నమ్మహాత్ముఁడు శారదకు మంగళస్నానాదికంబు గావింపం, దగువారలనియమించి మంచిముహూర్తంబున నుపదేశవిధి స్వస్వరూపనిరూపణ సమర్థంబగు విజ్ఞానంబు గటాక్షించి యాశీర్వదించె. సకలవిద్యాస్వరూపిణియు, వాగ్వధూచూడామణియు ననందగు నాశారదగురుకటాక్షమాత్రంబున స్వస్వరూపంబుం దెలిసికొని సర్వసంశయంబులడఁగ నిర్విచారంబుగ నయ్యాశ్రమంబున జ్ఞానాంబ శుశ్రూష సేయుచుండఁ దపంబొనరించుచు సుఖంబుండె. జ్ఞానాంబయు సమయోచితముగ శారదాబోధామృతంబున సంశయదవానలం బార్చికొనుచుండె.

ఇట్లుండఁ గొంతకొకదినంబునఁ బ్రభాతసమయంబున జపావసానంబునఁ బ్రతీహారియొక్కఁడు వచ్చి రాజశేఖరునితో

"మహాప్రభూ! రాజకుమారుండు సపరివారుండై తీర్థయాత్రలం బూర్తిగావించుకొని తెల్లవాఱుసఱికుఁ దుంబురుకోనవిడిసి తత్తీర్థంబునఁ గృతస్నానుండై పరివారంబునక్కడనయుంచి తానును బట్టమహిషియు, నన్నంభట్టారకుఁడును దమదర్శనార్థము వచ్చుచున్నార"ని విన్నవించెను.

పరమహంసరాజశేఖరు లానందించిరి. రాజనందనుండు బుద్ధిమతియు, నన్నంభట్టును గతిపయవైశ్వాసిక పరిజనమాత్ర పరివృతులై పెద్దలకు నమస్కరించి యాశీర్వాదంబుఁబడసి లోనికింబోయి ధర్మాంబకు వందనంబాచరించి వచ్చి యాదఱును బరమహంసంగొలిచి కూర్చుండిరి.

ధర్మాంబ బుద్ధిమతినిలాలించి, యన్నంభట్టును గుశలం బరసి, నిరంజనుని దీర్థయాత్రవిషయంబులడిగెను. నిరంజనుండు, తానుబట్టాభిషిక్తుండైన కొలఁదిదినములకే యన్నంభట్టు తన యొద్దకువచ్చుట మొదలగు విషయంబులెఱిగించి యాయాదివ్యస్థలంబుల విశేషంబుల వర్ణించి యన్నంభట్టునకుఁ దానొనరించిన బోధలను గుఱించియుఁజెప్పెను.

అంతలో శారదయనుష్ఠానంబునుండివిరమించి మంత్రరాజంబులం బరమయోగానుభూతిం దేజరిల్లు తనదివ్యరూపంబుతో జ్ఞానాంబాసేవితయై యుయ్యెడకువచ్చి పూజ్యులకు నమస్క

రించి వారలసన్నిధిం గూరుచుండెను. నిరంజనుం డమ్మహాను భావకు వందనంబాచరించెను. ఆతని వెంటబుద్ధిమతియు, నన్నం భట్టును శారదకువందనంబులాచరించి దీవెనలువడసిరి. రాజ శేఖరుం డమ్మహానుభావురాలి విజ్ఞానవిశేషంబును, యోగాను భూతియుఁ బ్రస్తుతించెను.

శారదాపరావతారంబుంబోలె వెలుంగు నీనారీమణి యెవ్వరీ మహనీయురాలివృత్తాంతం బేమి యని యన్నంభట్టు తనలో యోజించుచుండెను. అంతలో బ్రహ్మనందనంబుగ వీణా గానంబుసేయుచు నారదుండక్కడకు వచ్చెను. గోష్ఠియెల్ల లేచి నమస్కరించి నారదుంబూజించి యన్యాసనంబునఁగూ ర్చుండఁబెట్టి పరివేష్టించియుండిరి. నారదుండు పరమహంస రాజశేఖరులం బ్రశంసించి, ధర్మాంబంగటాక్షించి మ్రొక్కిన వారినెల్లదీవించి శారదాంబను సబహుమానంబుగఁ జూచుచు నిట్లనియె. "ఈగోష్ఠి నాకు నేత్రపర్వంబుగా నున్నది తాత యనుగ్రహంబునఁగదామిమ్ముంగాంచుట. ఎట్లన నేటియుదయం బు బ్రహ్మలోకంబునఁ బితామహునిం గాంచి లోకంబునఁ గలివ్యాపకంబున వాటిల్లిన యధర్మంబునకు వగచి యక్క డక్కడ ముక్తికాంక్షతోఁ దత్త్వాన్వేషణ పరులైనవారలకు శరణం బేమియని యడిగితిని, నన్నునుగ్రహించి విరించియిట్లు నియెను. "వత్సా! అజ్ఞానావృతంబైన యీకలియుగంబున జిజ్ఞా

సువ్రులకు విజ్ఞానంబొసంగుటకు జయంతాశ్రమంబు గల్పింపఁ
బడియె. అయ్యాశ్రమంబున నాదిశేషుండే పరమహంసగా నవ
తరించె. కలియుగంబున నారాయణుండె వేంకటేశుండై శేషా
చలంబున జాబాలితీర్థంబున నున్న యీ జయంతాశ్రమంబుఁ
గటాక్షించుచుండు. ఆపరమహంసశిష్యుండగు రాజశేఖరుండు
రాజశేఖరుండె. పరమేశ్వరుండు రూపరహితుండయ్యు బహు
రూపధారిగాఁ గ్రీడించుట సహజంబుగదా!" నిరంజనుండు నార
దుని మాటలాలించి "ఋషిపుంగవా! అస్మద్గురుపరంపరా ప్రభా
వంబుదామువర్ణింపవినుటచేధన్యుండనైతి" నని నమస్కరించెను,
అన్నంభట్టు నిరంజనునివైపు చూచెను నారదుండదిగాంచి "నీ
సంశయంబు నేఁడీర్చెద. ఈశారదచరిత్ర వినఁగుతూహలపడు
చున్నాఁడవు. ఈమె దివ్యచరితంబంతయు సర్వజ్ఞమూర్తులైన
పరమహంస రాజశేఖరాదులెఱుంగుదురు. నీసంప్రశ్నంబునకు
సమాధానంబగునట్లుగ నేఁడేనలినభవునిచే విన్నవాఁడనగుట
నీశారదదివ్యచరితంబుఁగీర్తించి సంతుష్టాంతరంగుండనగుదును"
నాపుడన్నంభట్టు మహాప్రసాదం బనియెను.

నారదుండంత "శ్రీశారద పూర్వభవంబున సకలవిద్యా
స్వరూపిణియగు సరస్వతీదేవి సీమంతంబున జీవమణియై ప్రకా
శించుచుండు. చతుర్ముఖుండొకనాఁడు తనకొలువుఁజాలించి
శైలార్థంబద్దవింజూడఁబోయి సర్వాలంకారభూషితయగునా జగ

న్మాత సీమంతమున నున్న జీవమణిం బ్రతిబింబించు తనరూపంబుం గాంచి భ్రమంజెంది "ఏమేమి! వేఱొక్క బ్రహ్మను శిరసావహించితివే" యని యలుకంబూనెను. వాణియు సందులకునవ్వి "నాథా! నాసీమంతమణిం బ్రతిబింబితంబగు దేవరరూపంబదికాని వేఱుకాదు" అనిసమాధానముం జెప్పెను. బ్రహ్మయుం దనభ్రాంతికి విస్మయంబొంది "నాకుభ్రాంతియు నీకుదోషాకరత్వంబుం గలిగింపంజాలు ప్రకాశముంగల యీసీమంతమణికించుక జడత్వంబొక్క ముహూర్తమాత్రంబు సిద్ధించిన బాగుండునుజుమా" అనియెను. ఆమాటలాలించి ప్రక్కనసడచుచున్న హంస నవ్వెను. విరించి యదిగుఱుతించి నీవేలనవ్వితివని యడుగ "సర్వజ్ఞులనం ప్రసిద్ధిగాంచిన దేవరకిట్టిభ్రాంతిగలుగుటంజూచి నవ్వువచ్చినదనెను. నీకునవ్వేలనున్నదా. నాయనుగ్రహవిశేషంబుననొదవినది నీకీకించిద్విజ్ఞానంబని యెఱుంగవు. భ్రాంతిలోబాధ యించుకేని యుందెలియక నవ్వితివి నీకుంగూడం గొంతభ్రాంతి యాజీవమణి జడత్వముతోడన యొక్క ముహూర్తము సిద్ధించిన బాగుండునని తోంచెడిని." సరస్వతి యీవాక్యంబులకచ్చెరువంది "నాథా! ఎంతమాటాడితిరి. పరిహాసమునకన్నను మీమాట నిక్కంబు గాకుండునే. మదాశ్రయంబు వడసి నిత్యప్రకాశముగాంచు నీజీవమణికిని, భవద్వాహనమై విజ్ఞానంబునొప్పు నీరాజహంసమునకును, జడత్వభ్రాంతులు సిద్ధించుటకు నామనంబోర్వకున్నయది. నాయందుంగరుణించి యిందులకుం బరిహారంబనుగ్ర

హింపవే "యనుటయు బ్రహ్మ యామాటలాలించి "ఆశ్రితపక్షపా తంబు నీకింతయొప్పునే! భూలోకంబునఁ నాంధ్రదేశంబునఁ బినాకినీతీరంబున సోమశిలాప్రాంతంబున నీసీమంతజీవమణి నీశిరము నుండి చ్యుతంబై శారదనా నయోనిజయై జన్మించి, హంసోపనీతంబై జయంతాశ్రమంబునఁ బరమహంస రాజశేఖరులచే స్వస్వరూపంబు దెలిసి మనుష్యమానంబునంగల దేవమహూర్త శేషంబున జన్మపరిపూర్ణతకొఱకునిలిచి భక్తులకు జ్ఞానబోధంబు చేసి లోకంబునఁ బారయశంబుంగాంచి యాపరమహంస మునీంద్రునికరుణవలన శారదాపీఠంబునిర్మించి తిరిగి నీకుశిరోభూషణంబు కాఁగలదు. ఈహంసయు రాజర్షి సత్తముఁడగు రాజశేఖరునకుం గుమారుండై యాతనివలనన స్వస్వరూపజ్ఞానంబును సకలసిద్ధులను బడసి సపరివారంబుగఁ దీర్ఘరాజంబుల సేవించుచుఁ గామరూపుఁడై హంసరూపంబున శారదను బరమహంసాశ్రమంబుం జేర్చి, మంత్రియగునన్నంభట్టారకుండు తత్త్వమస్యాది మహావాక్యములనుభవమునకుఁ దెచ్చికొని నిరంజనుండవే గాని జీవుండవు కావని రాజుంబోగడి యాతఁడు నిరంజన నామధేయమును లోకమున వ్యాపింపఁ జేయుచుండ నిజరాజ్యంబు స్వధర్మపురస్సరంబుగఁ బాలించి యార్తులకుజ్ఞానంబుపదేశించుచు రాజధర్మంబున జయంతాశ్రమంబును రక్షించుచు నాకఁడకుఁ జేరఁగలదు. కావున వీరలకుయశంబును, వీరలవలన జిజ్ఞాసువులకు మోక్షంబును సిద్ధించును. ఆట్టిలోకోపకారకంబులగు

జడత్వభ్రాంతులు కేవలనిమిత్త మాత్రంబులుగాని దోషాకరం బులుకావు." అని బ్రహ్మయానతీయువిని వారలసందర్శించుభాగ్యము నాకెట్లులభించఁగలదని యడిగితిని. పితామహుండు "పరమహంసరాజశేఖరులు జయంతాశ్రమంబున బ్రహ్మానుభూతింబ్రవర్తిల్లుచున్నారు. నిరంజనుండు సచివోత్తముఁడగునన్నంభట్టుతో స్వధర్మదీక్ష రాజ్యంబుఁ బాలింపుచున్నాఁడు. శారద, పరమహంస రాజశేఖరులచేఁ బోషింపఁబడుచు జ్ఞానాంబ సేవించుచుండ నాత్మానుభూతిం దేజరిల్లుచున్నది. వీరందఱిపుడు జయంతంబున నున్నవారు. జాగుసేయక యచటికేగెదేని యందఱ నచ్చటను కాంచనగు"ననియె. అనుటయు తడవుగ నేనిటకువచ్చి మిమ్మెల్లరంగాంచి యానందించితిననుచు నారాయణ స్మరణంజేయుచు నానందంబున పొంగిపోవుచు నారదుండు బ్రహ్మలోకోన్ముఖుండయ్యె.

అంతనన్నంభట్టు శారదవలన నుపదేశంబుఁ బడయం గోరి యర్థింప నామెయు మంత్రము నుపదేశించి తత్త్వముబోధించెను. పిదప భట్టును, బుద్ధిమతీసహితుండైన నిరంజనుండును నానందపురినిఁజేరి నిజరాజ్యంబు సుఖంబుగఁ బాలించుచు సుదర్శనుని వానప్రస్థంబున కనుకూలంబుగఁ బనిచి జయంతాశ్రమంబున శారదాపీఠంబు తమకును, తాము పీఠంబునకును నన్యోన్య సంరక్షణంబుగాఁగఁ గాలంబు శాంతంబుగఁ గడపుచుండిరి.

నిరంజనునకు జీవుండనునపరనాము ధేయము గల్గుటం బట్టియు, నితనిచరిత్ర రాజమాత్రులొనర్చు దండయాత్రా దులతోఁ, గూడియుండక తీర్థయాత్రాదులతో నిండియుండు టంబట్టియు ననేక జీవు లాత్మాభిముఖులగుట యిందు వర్ణింపఁ బడుటను జీవనుణియగు శారద జీవచరిత్ర యిందుఁగీర్తింపఁబ డుట నీకతి జీవయాత్ర యనంబరఁగె.

ఈకథయందు ధర్మతత్త్వంబుల నుపదేశించు భాగంబు లనెత్తి వ్రాయుచు నితరవర్ణనాదులు గలభాగంబుల సంగ్రహం బుగా వ్రాయుటచే నీగ్రంథంబునకు జీవయాత్రా సంగ్రహంబను పేరొసంగఁబడియె.

క॥ నామాకృతులను గృతులను
గామింపమటకి పులకుపలక విహాసలకో
భూమానందద సగుశ్రీ
నామాత్మ ప్రత్యయోగరాజసుకృతినిన్ ॥

క॥ శ్రీనిజభక్తుకద్దిః
జ్ఞానాబ్ధిఁ గలుగ జేయుగద వాచాశ్రీన్
దానఁగవియగున పులసన్
మానం బేజపముసకలమంగళములకున్ ॥

క॥ నిర్మలమతి మాయావ్వన
లక్ష్మలమ్మను దదీయ లలిత వచస్స
ద్ధర్మము భజియించి కవిత
నర్మలినాయమ్మ వెలె హరి! వినిపింతుఁ ॥ ౨౮

క॥ ఆచంద్రార్కము వసుమతి
నీచల్లనిచూపుకలిమి నిలుచుచు శ్రీ శే
షాచలపతి జయమందెడు
నీచరితము నీచరితము నేఁదెల్పుటచే ॥ ౨౯

క॥ ఆశ్రితరక్షక! దీనస
దాశ్రయముగఁ జేయుమయ్య న్యాయముకదవి
శ్వశ్రేయఃకావ్యమ్మని
సుశ్రీలఁ బెంచుఁ బెంచు శ్రోత్రప్రియముఁ ॥ ౩౦

క॥ శ్రీలక్ష్మీపతిసన్నిధిఁ
గాలక్షేపంబు సేయఁగల్గితి నల్పం
బే లక్షవిధంబులనా
కాలక్ష్యం బెఱుఁగఁ బల్కితాచార్యుఁడవై ॥ ౩౧

క॥ వేంకటకృష్ణకవీంద్రుల
వేంకటరంగార్య నాప్తు విద్వన్మణిశ్రీ
వేంకటపతికృప నీకృతి
పొంకంబుఁ మదిని జేర్చుబుధులనుతింతుఁ ॥ ౩౨

కం॥ కనకమ్మ

శ్రీరస్తు.

# జీవయాత్ర.

(సంగ్రహము.)

సీ॥ శ్రీపతిపదపద్మ సేవానుభూతిప్ర
శస్తమేమహనీయుహస్తయుగము
కాశీప్రయాగగంగాదిసత్తీర్థకృ
పావృష్టి యెవనియపాంగదృష్టి
నిగమశాస్త్రపురాణనిర్మలసద్ధర్మ
పుంవ్యక్తియెవ్వానిపుణ్యమూర్తి
తత్త్వమసిహరిచందనతత్త్వఫలసార
కలితవాగ్భూషయేఘునునిభాష ॥

గీ॥ యట్టిసుగుణాలవాలుదయాసుశీలుఁ
బార్వతీజానిస్మృదుపాదపద్మలోలు
నతజనావనునిపస్మృతానందనాథు
సతతమారాధనముఁజేసిశాంతినుందు ॥

క॥ శివకేశవవినుతంబై
కవిజనహృత్కమలకర్ణికాంతస్థంబై
ప్రవిమలమై భవహరమై
శివశంకరమైనపదముఁ జేరి సుఖింతున్ ॥ ౨

క॥ శివదంబును శాంతిదమును
గవిజనభవనంబు జన్మకలుషహరంబున్
నవరసమృదునాదాత్మక
నవయౌవనమోక్షలక్ష్మినాళీకంబున్ ॥ ౩

క॥ గురుచరణము గురుశరణము
సరసము ప్రణవార్థసారసంగ్రహ మజరా
మరణము విముక్తికాంతా
పరిణయమందిరమునందు భక్తి వసింతున్ ॥ ౪

క॥ యోగులకును రోగులకును
భోగులకును భూసురులకు బుధులకు నొకఁడై
శ్రీగురునామంబే
వేగూర్చున్ బలము దోషవితతి నడంచున్ ॥ ౫

క॥ శ్రీనాథుని గణనాథుని
మానాథుని విశ్వనాథు మాయానాథున్
దీనావనసద్బోధల
నానందంబిచ్చుకొఱకు నారాధింతున్ ॥ ౬

క॥ నేనెఱుఁగనీసుతుఁగంటివి
లే నీవని మేలమాడ లేనగవున మే
లోనాథా! నీవేగద
మేనాత్మయునొకఁడను శివమిథునముగొలుతుఁ ॥ ౧౨

క॥ అజురాణిహంస వెంబడి
ఋజువర్తనఁ గమలషట్క మే స్థానముగా
భుజగాకృతిలోఁగనుఁద
ద్భజన సహస్రారమందుఁ దత్త్వముగందుఁ ॥ ౧౩

క॥ శక్తిత్రయమున కాదిమ
శక్తి పరావాక్కునై జశబలతఁబలుకఁ
శక్తిని నిచ్చెడుఁగద యా
సక్తిం బూజింతుశక్తి సరసపుసూక్తిఁ ॥ ౧౪

క॥ లంకారిభక్తశేఖరు
సంకటపరిహారు సాధుసంఘవిహారుఁ
హ్రీంకారప్రియు లోకవ
శంకరు హనుమంతుఁ బరమశాంతు భజింతుఁ ॥ ౧౫

క॥ కుజనుల కేది చక్రంబై
సుజనులకు సుదర్శనంబు శుభకరమయ్యెఁ
గజవరద దాని నీకళ
భజియించెద మెపుడుమాకు భద్రముకాఁగఁ ॥ ౧౬

క|| ధీరుండై గురునాజ్ఞన్
నీరధులదలంగ వైరినికరమ్ముసడలన్
జారలు చెదరఁగ వెడలెను
శూరుఁడుభద్రుండురక్షసుజనులకెందున్ || ౧౭

క|| అంజలిఁ జేసి నుతింతుఁ బ
తంజలి సద్వైద్యు గురుని ధర్మాత్ముఁ దమో
భంజను నాగేంద్రుని యో
గాంజను శబ్దార్థవిదు సహస్రవదనునిన్ || ౧౮

క|| ఇనశశికుజరాహులనున్
ఘనగురుశనిబుధుల భక్తిఁ గవికేతులనా
జననముసఫలముఁ జేయఁగ
ననుకూలత నుండుకొఱకు నారాధింతున్ || ౧౯

క|| రంగన్మంగళవిగ్రహుఁ
డుం గరుణాళుండు రంగఁడు న్గురుఁడు న్నా
రంగాక్షి రంగమాంబయు
నంగని సౌఖ్యాబ్ధిఁ దేలినారఁట రంగా || ౨౦

క|| మంగళములుసమకూర్చుచు
సంగంబెడఁబాపి ముక్తిసంపదలీయన్
ముంగలముదమునఁదోఁచిన
యుంగన రంగమ్మఁ గొల్తు నాత్మభక్తిన్ || ౨౧

క॥ సుకవులసంస్మరియించుచు
వికలాత్ములనవ్వి వేదవిదుల నుతింతున్
సకలాళిప్రీతికి నే
నొక కావ్యముఁ బల్కు చో శుభోదయమొదవఁగన్ ॥ ౨౨

క॥ వ్యాసవశిష్ఠాదుల హరి
దాసుల వాల్మీకి కాళిదాసాదుల వా
క్యాసను దిక్కనను సుకవి
కేసరిసోమనను గవులఁ గీర్తింతు సదా ॥ ౨౩

క॥ పంచమమునఁ బాడుచు మ్రో
యించుచుఁదంత్రికలను బరమేశ్వరినిన్ ధ్యా
నించుచుఁ బ్రపంచముల్ క
ల్పించునజునిరాణిఁగొలిచి లీల సుఖింతున్ ॥ ౨౪

క॥ అక్షరమెఱుఁగనినన్నిటు
లక్షలుపద్యములువల్క లాలించెదు నీ
దక్షతఁజెప్పఁగవలెనా
సాక్షాన్మోక్షప్రదానచతురనిదానా ॥ ౨౫

క॥ నీసత్సంకల్పంబే
నాసత్వంబైనతన నాదీక్షభవ
ద్దాసాశీర్వచనంబునఁ
జేసెదుసఫలంబునైక్య సిద్ధిఁబలికెదన్ ॥ ౨౬

—: కథాప్రారంభము :—

క॥ శ్రీవేంకటగిరివల్లభ!
కావేరీరంగ! కనకకలితశుభాంగా!
సేవకతమఃపతంగ! స
దావాస! రమేశ! ఈశ!యనిమిషభూషా ॥ ౨౭

క॥ బాలికవలెంబలుకుచు నీ
లీలల్ విబుధాళి మెచ్చులీలన్ నాలో
నాలింపుము నిన్నే వే
బాలేందుకలాపమిత్ర పరమపవిత్రా ॥ ౨౮

క॥ అమృతాబ్ధినిశయనించును
గమలాపతి యోగనిద్రఁ గమలజుఁడతఁడై
సుమిస్సృష్టించు సనుజగము
తమిసగుప్రకృతిముఖశశి చదల వెలుఁగొందన్ ॥ ౨౯

క॥ ఆకాశము సహృదయహృద
యాకాశము పెంపుపోక హరిపదతీర్థం
బేకడఁజూడ నగస్త్యుని
రాఁక శివార్చనమునకు శరన్నిశలందున్ ॥ 30

:పినాకినీతీరంబునయోగినియేకాంతంబుననీశ్వరు ధ్యానించుట:

క॥ సోమశిలాక్షేత్రంబును
సోమేశ్వరుదర్శనంబు శోభనగంగాం
భోమజ్జన మేకాంత
బేమహానీయుండుగూర్చె నెన్నెద నతనిన్ ॥ ౩౧

క॥ అనుచున్నేత్రోత్సవముగఁ
గనుచుఁ సద్భక్తకోటి కాంతయొకత శాం
తిని గనక సర్వకళలన్
గనియుఁ దమమూనరించెనా శశిబోలెన్ ॥ ౩౨

క॥ శారదరాత్రిని నిగమవి
శారద యోగానుభూతిసారద నిజసం
సారదవానలనీరద
ధీరదయాహృదయసన్నిధిన్ గోరిమదిన్ ॥ ౩౩

క॥ కనవలెగురుచరణంబులు
వినవలెఁ దన్ముఖమునుండి వేదాంతోక్తుల్
చనవలె నజ్ఞానంబట
మనవలె సుజనాళిమెచ్చ మహిమలు హెచ్చన్ ॥ ౩౪

క॥ గురుమూర్తిని గురుభక్తిని
గురుకృపకై కొల్చుభక్తకోటుల కెందున్
బరమాప్తుఁడు పరమాత్ముఁడు
ధరజీవుఁడు యోగశక్తిఁదగులున్ వానిన్ ॥ ౩౫

క॥ జ్ఞానంబొక్కఁడు గురుకృపఁ
గానందగునంచు నెంచి కాఁబోలు నిట
జ్ఞానులు గురుచరణములన్
గాన రనుభవమునకు గురుఁగాంతురు విజ్ఞుల్ ॥ ౩౬

క॥ అభిమానము నశియించిన
శుభదంబగు గురునిపదము( జొప్పడు(గాదే
ని భయము శోకంబు గలుగు
విభవంబుల్ బ్రభయు( జెడును వెట్టియుపట్టుల్ ॥ ౩౭

క॥ గురుచరణము సుఖకరణము
శరణము భవతారకంబు సత్పురుషులకా
భరణము నిగమచయాలం
కరణము భవహరణము శివకైవల్యదముల్ ॥ ౩౮

క॥ ఒకమాఱైననులోలో
వికలత(గాంచంగవలెను విజ్ఞతలేమిన్
సకలార్థసిద్ధినొసగెడు
ప్రకటితగురుభక్తి యవల(బ్రాప్తించవలెన్ ॥ ౩౯

క॥ దేశికసాన్ముఖమున నుప
దేశవిధిన్ దత్త్వమెల్ల(దెలిసికొని తదా
దేశమున మెల(గవలెను స
దాశీర్వాదంపుబలిమి నానందమునన్ ॥ ౪౦

క॥ గురునామస్మరణంబే
గురుదోషంబడ(పజాలు గురుతరభక్తిన్
బరమౌషధమని సేవిం
తురుగదదానిని ఘనులు మునులు నీమహిలోన్ ॥ ౪౧

క॥ గురుభజనముల సేవింపక
పరమార్థముఁ గోరకు గ్రంథభాండాగారం
బరయుట వీణెమృదంగము
గరసుర్థిం జేముగలిగఁడ గానంబునకై ॥ ౪౨

క॥ పాకమునొందని జీవులు
లోకమునన్ శోకవార్ధిలో మునుఁగఁగ న
స్తోకానందం బొసఁగుచు
సాకన్ సవరింప శివుఁడు సద్గురుఁడౌరా ॥ ౪౩

క॥ ఘనపూర్ణతఁ దాఁగనుఁగొన
ఘనగురుఁడే కారణంబుఁ గావున నతనిన్
గనునప్పుడె ముక్తిపదం
బునుగను భక్తుండు ధైర్యముంగని రామా ॥ ౪౪

క॥ అనియోజింపఁగ యోగినిఁ
గనిశుశ్రూషయొనరింపఁ గౌతుక మొప్పన్
జని తచ్చరణంబుల శిర
మునఁ దాజ్ఞానాంబ భక్తిమొక్కి యిటులనెన్ ॥ ౪౫

క॥ అమ్మా! దయనాపై రా
నిమ్మా! నీసుతను జుమ్మా! యిహపరసౌఖ్యం
బిమ్మా! నాదాస్యముగై
కొమ్మా! భక్తులనునేలుకొమ్మా! యమ్మా! ॥ ౪౬

క॥ సోమేశ్వరునకు భక్తిం
దోమాలియలప్రచింప దురితము దొలఁగెన్
స్వామియు సంగరుణించెను
సీమూర్తింగొల్వఁబనిచె నిన్నటిరేయిన్ ॥ ౪౭

గీ॥ నన్నుజ్ఞానాంబయందురు కన్నతల్లి
చిన్ననాటనుగోలె సంప్రీతిమెఱయ
శివునిబూజించుచుందు నీక్షేత్రమందుఁ
గోవెలనిడుప్రసాదంబు గైకొందు ॥ ౪౮

క॥ అనివిన్నవించు జ్ఞానాం
బనుగని విస్మయముఁజెంది మానిని నాకే
ల యిదియొసఁగ్చెను నేనే
ఘనగురుపదన్నసము మదినిఁగాంక్షించియుంటిన్ ॥ ౪౯

క॥ వనమధ్యమందుఁ దిరుగుచుఁ
గన నెందున్ శాంతి నీవుకాంక్షించిన దా
నిని ముక్తినీయఁగల నా
ఘనునొక్కనిఁగొల్చి శాంతిగనుమా వినుమా ॥ ౫౦

క॥ ఎందాఁక గురునివినవలె
నందాఁకన్ శిష్యకోటినందిన దుఃఖం
బందును సాధారుఁడు చే
నందినపాత్ర నుదకంబులల్లాతనినన్ ॥ ౫౧

క॥ వినిసంభ్రమంబు మనమునఁ
బెనఁగొన జ్ఞానాంబయిట్లువినయమ్మునఁదా
ననియెను మును నేవినిచిన
వినియునునాచరితతగునె విడఁనాడ నను౯ ॥ ౫౨

క॥ శివునాజ్ఞ శిరమునిడుకొని
శివదంబగునీదుపదముఁ జేరిననాకు౯
భవమైన మోక్షమైనను
జవదాఁట౯ వశమె కరుణ నాకుము జననీ ॥ ౫౩

క॥ అనవిని యది దైవికముగ
మనమున గణియించి మంచిమాటలతో నా
పెను బెనునెనరునఁ బెంచుచు
ననుకూలతనుండఁదలఁచి యానన నాలో౯ ॥ ౫౪

—:హంస యోగినితో రాజశేఖర చరితంబుఁ జెప్పుట.:—

క॥ కంసారిస్మరణంబున
సంసారముగడచుహంసచాయను జగము౯
హింసించెడు నజ్ఞానము
ధ్వంసంబొనరించుహంస తలుకున బ్రాలె౯ ॥ ౫౫

గీ॥ బ్రాలి మనుజభాషణముల వనితఁజూచి
పలుకవాడెఁగనఁ బ్రీతిసద్భక్తిమెఱయ
నమ్మసత్యమ్ము నీవాంఛితమ్ము తెలిసి

సచ్చరిత్రంబుఁ దెలిపి నీ సంశయంబుఁ
దీర్చి దేశికస్వామినిఁ జేర్చు కొఱకు
వచ్చితిని దాని వినుమమ్మ హేమ్నశుభము ॥ ౫౬

క॥ జనసంబాధిగ నివ్విధి
జననీ సర్వార్థసారసంగ్రహమనరయన్
వనిమునిజనములఁ గనుఁగొనఁ
జనుదెంచెదు నిన్నుఁ బోలు సాధ్వులు గలరే ॥ ౫౭

క॥ అనవినియోగిని హంసం
బునుఁగని విధివశమునని టు పుణ్యాత్మా! నా
జననము సఫలముఁ జేయుఁగఁ
జనుదెంచితి చెప్పు మట్టిచరిత యననన్ ॥ ౫౮

క॥ శ్రీశేషాచలమందునఁ
గాశికిఁ బ్రతిగాఁ గనొప్పుఁ గల్యాణపురం
బాశాంతకీర్తిమంతం
బై శివములఁ బెంచుఁ బరమహంసలకిలలోన్ ॥ ౫౯

క॥ జనులచ్చటఁ గల్యాణం
బునుఁ గాంచఁగ యోగిజనులు ముక్త్యానందం
బునుగనఁ గల్యాణపురం
బని యానందపురమనియు నందురు దానిన్ ॥ ౬౦

క॥ ఆనందపురినినుండారు
జ్ఞానులు యోగులును సర్వకాలంబుల వి
జ్ఞానముఁ గృపనజ్ఞానికి
దానము సేయఁగ భవముదాఁటింపంగన్ ॥ ౬౧

క॥ శుకముఖముల సుకవీంద్రులు
ప్రకటించెద రాత్మబోధ ప్రాప్తనపుణ్యం
బౌకయింత గల్గినన్నరుఁ
డకలంకత నప్పురంబునందు వసించున్ ॥ ౬౨

క॥ ఆపురము రాజధానిగ
శ్రీపతిభక్తుండు రాజశేఖరుఁడనుస
ద్భూపతి రాజ్యము చేయుచుఁ
గాపాడున్ బ్రజలశాంతిఁ గలియుగమందున్ ॥ ౬౩

క॥ తిరుమలవరదునికరుణన్
బరముం బడయఁగలండు పతితుండైనన్
ధరనని గురువులు దెలుపఁగ
నరిగెన్ శేషాద్రికతఁడు హరిదర్శింపన్ ॥ ౬౪

క॥ ధర్మాంబ నిజకళత్రము
ధర్మజ్ఞుఁడు మంత్రియగుసుదర్శనుఁడు హితుం
డర్మిలి సేవించుచు రా
నిర్మలమతితోడముక్తిన్ హరి వేఁడన్ ॥ ౬౫

— రాజశేఖరుఁడు వేంకటేశ్వరస్వామిని స్తుతించుట. —

క॥ చనికాంచి రాజశేఖరుఁ
డినకులసద్భాగ్యుఁ గృష్ణు నిరుగడలం శ్రీ
నినురమ్మున నిల్పినయ
య్యనిమిషపతివరదు నిట్టులనికీర్తించెన్ ॥ ౬౬

క॥ జీవత్వం బిలఁదాల్చుచు
నీవిధి భ్రమియించువాఁడ నీవా నేనా
దేవా! తెలియఁగ నీవే
యీవే నీపదము ముక్తినీవే శాంతిన్ ॥ ౬౭

ఉ॥ శక్తులఁజేయుచోఁ బరమశాంతినినిచ్చి తరింపఁజేయుచో
యుక్తులఁజేయుచోఁ బ్రబలయోగముకల్పనఁజేయుచో మదిన్
భక్తినినిల్పుచో మదనబాధహరించి వరించుచో మమున్
ముక్తులఁజేయుచో వివిధమూర్తులుదాల్చెదు వేంకటేశ్వరా॥

ఉ॥ శ్రీనినురమ్మునన్నిలిపి చేసెదుమాకభయప్రదానమున్
బూనిభుజంగభూషణము బోధయొనర్చెద వైక్యమెంతయున్
దీనులమ్రొక్కులందుకొని తీర్చెదుకోర్కెలుశక్తిఁజూపుచున్
జ్ఞానిశివంకరుండవని గాంచుప్రపూర్ణత వేంకటేశ్వరా॥ ౬౮

ఉ॥ చేసినలోకజాల మంచేతినినిల్పి రమింపలేమినో
వేసమునందుఁబ్రీతినొ ప్రవీణతలేమినొ వేఱులేమినో
దోసమటంచునీమదినిదోఁచమినో యిటుచిత్రమూర్తివై
వాసునిభంగినొక్కయెడ దైవతమట్లమఱొక్కచోట నా
యాసమునొందుచుండుట దయాపర నీకిది క్రీడయేసుమీ ॥

క॥ నీలీల లోకజాలము
నీలోనం గల్గునుండు నీలోనడఁగున్
నీలోనిది నీకల్పన
శ్రీలోలా నీవెయనుచు సిద్ధాంతంబుల్ ॥ 20

క॥ నుతియించిన నతిఁజేసిన
పతిసుతులన్విడిచి జపముసల్పిన నదినీ
మతికింపుగాదటో శ్రీ
పతి! నిజధర్మంబుఁబూనుభక్తివిధమునన్ ॥ 21

క॥ నిన్నుంగనియెడువేడుక
కన్నన్ నిజధర్మమెపుడుకాచుటకన్నన్
బన్నగశాయీ! వేఱొక
టున్నే? ముక్తియనిబంధ మున్నే? యవలన్ ॥ 23

క॥ లోచనగోచరమైన చ
రాచరమంతయును నీవ యనినిశ్చింతన్
జూచుతపస్వికి నజ్ఞత
వేచను సాయుజ్యమబ్బు వేంకటనాథా ॥ 24

క॥ ప్రారబ్ధమనఁగ నీచే
ప్రారంభమునందుఁగోరఁబడుసంసారం
బారా మరలింపగలరు
వీరా? యటనున్నవారె? వేంకటరమణా ॥ ౭౫

క॥ నగమున మొగమిడి తాఁకెడుఁ
బొగరునఁ దగరా పొడుపునఁ బోవుచునుదననే
నగుబాటగుఁ బ్రారబ్ధము
నోగిఁదాఁకన్ జీవుఁడెందు నుత్సాహమునన్ ॥ ౭౬

క॥ ద్వైతంబన్ని విశిష్టా
ద్వైతంబో నిన్నుఁగోరు వైరాగ్యంబ
ద్వైతం బూరక యుండియు
నీతోఁగైవల్యమందు నిజము మురారీ ॥ ౭౭

క॥ అన్నియుఁగోరును మొదలన్
నిన్నేగోరెడునుబదప నియతాత్ముండై
కన్నయ్యా నినుఁబోలుట
కన్నన్ గోడుకునకు వేఱుకలవే శుభముల్ ॥ ౭౮

క॥ కావుమని నిన్ను వేఁడెద
జీవన్ముక్తునిఁగ వేగఁజేయుమటంచున్
నీవలెనుండెద నూరక
కైవల్యంబద్దికోరక యసిద్ధించున్ ॥ ౭౯

క॥ కోరెదరు మూఢులూరక
కోరికలన్నియును ముక్తిఁగోరుదురు బుధుల్
కోరక యెద్దియునూరక
ధీరులు నిన్గనెదరాత్మతృప్తికి శ్రీశా! ॥ ౮౦

క॥ జీవత్వమునినుమఱచుట
దేవత్వంబరయనిన్నుఁ దెలియుటభక్తిన్
సేవలదృక్కైనిలుచుట
కైవల్యంబగును గరుడగమనా! సీతేశా ॥ ౮౧

క॥ రామా! జీవుఁడు నీయెడఁ
బ్రామాణికబుద్ధిఁగలిగి భక్తుండైనన్
గామాదులఁజిక్కఁడుగద
వేమారున్ బుద్ధినిమ్ము వేంకటనాథా ॥ ౮౨

క॥ ఔదాసీన్యంబెందును
మోదావహ మార్యమతము మోక్షప్రదమున్
నీదయకుమూలమదియును
నీదయ నీదయ ఫలంబు నీదయ రామా! ॥ ౮౩

క॥ తెలిసినపిదపన్ నీతోఁ
గలిసినయంబాఁక జపముఁగావించుటయే
వలసిన కార్యము సిద్ధుల
వలచుట దోషంబు భక్తవత్సల! యెందున్ ॥ ౮౪

క॥ నీచరణాభజనమున నా
లోచనములుమానుటయుఁ ద్రిలోచనుఁడగుటల్
జోఁచుట దిగంబరుఁడునై
చూచుట స్వాత్మన్ బరాత్మఁగఁ మిసిన్ శ్రీశా! ॥ ౧౫

క॥ అంతశ్శాంతికిమూలం
బెంతయు సుజ్ఞానమగుటనేగద విబుధుల్
చింతింతురు నీపదముల
నంతా! నీమూర్తిజ్ఞానమగుటన్ గాదే ॥ ౧౬

క॥ ఏయేరూపముఁదాల్చుచు
మాయార్తిన్ బాపి ముక్తిమా మాకిడెదో
యాయామూర్తులునీవని
పాయనిసద్భక్తిఁగొల్చుప్రాజ్ఞత నిమ్మా ॥ ౧౭

క॥ తొలినినుస్మరియింపనుగద
యిలలోజన్మించుటను హరీ! యిఁకముందున్
దలఁపనుజన్మములేమిని
దలఁచెద రెండున్ దలఁపక తత్త్వముఁదెలుపన్ ॥ ౧౮

క॥ హరినిటునుతించిగృహమున
కరిగిరి మువ్వురును భోజనార్థంబాలో
నరవరుదర్శింపఁగన
ప్పురమునఁగలబ్రాహ్మణోత్తములు సంప్రీతిన్ ॥ ౧౯

క॥ వచ్చిరియాత్రికనరవరు
లెచ్చుగ గుమిగూడి వెంటనే తేఱఁగ వే
చొచ్చిరి నృపుగృహముకృత
లిచ్చిరిజాబాలితీర్థమే మెచ్చిరొగిన్ ॥ ౯౦

క॥ వెండియునాతీర్థంబున
నుండున్ మహాసియుఁడొక్కఁ డుత్తమపదమున్
దండిగ భక్తులకిచ్చుం
జుండీ యతఁడుండుస్థలముఁ జూచినఁ జాలున్ ॥ ౯౧

క॥ సదసద్వస్తువివేక
ప్రద మానందపదము శివరామగురుకృపా
స్పదము జయంతాశ్రమమును
పదము పరమపదము భక్తభాజనమొసఁగున్ ॥ ౯౨

క॥ నావిని నృపతియు శ్రీపతి
సేవలకున్ ఫలము నేఁడు సిద్ధించెను వే
పోవలెను బరమహంసన్
శ్రీవిద్యన్ వేఁడి భక్తిసేయఁగ ననుచున్ ౯౩

క॥ చివ్వున లేచి మహీపతి
జవ్వనియున్ మంత్రివరుఁడు సరసనడువఁగా
నవ్విభునిఁ జూచు వేడుకఁ
బువ్వులుపత్రియును మార్గమునఁ గొనిచనియెన్ ॥ ౯౪

## రాజశేఖరుఁడు జయంతాశ్రమమునఁ బరమహంసను దర్శించి స్తుతించుట.

క॥ చని భవజలధికితరణం
బనఁదగునామూర్తి నాత్మనారాధింపన్
జననము సఫలంబగునని
వినుతించెన్ మునిని ముక్తివేఁడుచుభక్తిన్ ॥ ౯౫

క। మదిఁగలశంకలుగ్రుంకఁగ
నుదయించితిమమ్ముఁబ్రోవనుత్సాహమునన్
గదమిత్రవరుఁడవీవే
సదమలకరుణాంతరంగ సద్గురులింగా ॥ ౯౬

క॥ భారంబైతోఁచెను సం
సారంబికఁజేయఁజాల సద్గురుమూర్తీ
సారంబేమియులేదట
నీరమొక్షీరంబా చాలు నీకృపగలుఁగన్ ॥ ౯౭

క॥ విసిగితి దుర్విషయంబులఁ
బసచెడి ప్రాణంబులుండు భవదావాగ్నిన్
వ్యసనము నసియింపదు నీ
దెసబుద్ధిన్ద్రిప్పకున్న ధీసంపన్నా! ॥ ౯౮

క॥ ఉత్తది గేహము బలగం
బుత్తది స్వర్గము శరీర ముత్తది జీవం
బుత్తది సర్వంబుత్తది
సత్తొక్కటి చిత్తుమాయ సద్గురురాయా ॥ ౯౯

క॥ సర్వస్వము సద్గురునకు
నిర్వంచనబుద్ధి నిచ్చి నియతాత్ముండై
గర్వము విడిచి భజించిన
నిర్వాణము నొందఁగలఁడు నిశ్చలభక్తిన్ ॥ ౧౦౦

క॥ పరిపూర్ణభావమెవ్విధి
నరుఁడొందెడు జగతి నుభయనాదానుభవం
బరయక వేదాంతోక్తుల
సరసోక్తుల మిథునమునుసంతతిగలదే ॥ ౧౦౧

చ॥ గురుచరణాభివాదనము కోటియొసంగదె ముక్తిగిరీటికిన్
బరులను వేఁడి వేఁడి బహుభంగుల నీచులుభంగమొంది నీ
చరణముఁగాంచలేమి భవసాగర సంపదనమ్మికో ప్రభా
కరచరణమ్ములన్ భయమొకాక ప్రమాదమొ దేశికోత్తమా॥

క॥ బాఁపనికినిగమచయమును
దాపసులకు మంత్రమూర్తి దైవజ్ఞులకున్
బ్రాపగు గణితము శిశువులఁ
గాపాడఁగఁదల్లి నన్నుఁగావఁగనీవే ॥ ౧౦౩

క॥ వలలిలఁ జేఁపలఁ బట్టఁగఁ
జాలులున్ రసికాళిఁబట్ట సిద్ధులరసమున్
నిలువం బెట్టఁగ నీని
ర్మలదృష్టియు నన్నుబట్టి మనసుంగట్టన్ ॥ ౧౦౪

క॥ ఎప్పుడునీపదపద్మము
లొప్పఁగ భజియించుచుండునుత్తమునకు వే
తప్పుంగద భవబంధం
బప్పులనుప్పుంచ నుదకమయ్యెడుభంగిన్ ॥ ౧౦౫

క॥ దుష్టజనమధ్యమందునఁ
గష్టమునిల్వంగ నిన్నుఁగాంచినపిదపన్
గష్టముద్విగుణంబగుఁగద
శిష్టులభజనంబులేమిచే గురుమూర్తీ ॥ ౧౦౬

క॥ వినుతించునృపతిఁగనుఁగొని
కనుగొనలన్ బాష్పవారి గడలుకొనంగాఁ
గన లేకలోకమాత్మం
గన నెంచినయట్టులుండెఁ గౌతుకమొప్పన్ ॥ ౧౦౭

క॥ మునిగురువరుచరణంబులు
మనమునధ్యానించి తత్త్వమార్గము కృపతో
జనపతికిఁదెలుప నెంచుచు
వినుతింపఁదొడంగె గురుని వేవేగతులన్ ॥ ౧౦౮

పరమహంస గురుధ్యానరూపముగ రాజశేఖరునకుఁ

దత్త్వ ముపదేశించుట.

క॥ ఓపరమపురుష గురుకృప
నీప్రాపే కోరి మనము నిజధర్మంబుల్
గాపాడఁగఁ బ్రణవంబను
దేపల్ భవవార్ధిఁ దాఁటితిల్ భక్తులతోన్ ॥ ౧౦౯

క॥ ఓమ్మనునాత్మార్పణమగు
నోమ్మనసాంబునిస్మరణము నోమ్మననిజరూ
పమ్మగు సనధాన్వర్థము
నోమ్మనిస్మరియించు భక్తుఁడుత్తముఁడెందుల్ ॥ ౧౧౦

క॥ ఓంకారముశివనాదమ
హంకృతి జీవునికిసహజముగుట సతతమా
యోంకారముశ్రుతియాట న
హంకృతి నిజకృతులనాత్మ నందెడువీఁకల్ ॥ ౧౧౧

క॥ అతులితగతి జగతిగశ్రీ
పతియగు తనుదానఁ దెలియఁబలుకుచు నొకచోఁ
గతిలేక నిలుచుఁ గాష్ఠా
కృతి నతనింజూచుజగము కృతకృత్యునిఁగన్ ॥ ౧౧౨

క॥ ఆలోచనమునజీవుం
డాలోచనమెఱుఁగకునికి నజ్ఞుండగుఁగా
నాలోచనమేయుండినఁ
గైలాసము వానినెలవుగద పరికింపన్ ॥ ౧౧౩

క॥ తోఁచినసర్వముహరిగాఁ
దోఁచును దనలోనఁదాను దోఁచకయున్నన్
వాచామగోచరుండై
తోఁచునులోకులకుగుణముతో ముక్తుండై ॥ ౧౧౪

క॥ కృతకృత్యునిగన్గొనఁగా
నతిశాంతుఁడు పొందదెందహంభావము సం
తతముదతాత్ముఁడు విబుధ
తతిసేవాచింతనపరతన్ విదితుండౌ ॥ ౧౧౫

క॥ సతిసుతులిరువురకెందున్
స్మృతిలేనిసమయమునఁగద క్షేమప్రసవ
బతులధ్యానంబుననా
గతిస్మృతిలేకుండు నాత్మ కాంచు విముక్తిన్ ౧౧౬

ఆ. వె॥ పారదంబుమనము పరుగిడుచుండెడు
నొకటకట్టివేప నొకటజారు
బాటగట్టనేల బంధింపనగుఁగాక
దానసిద్ధిశుద్ధి తత్త్వమమరు ॥ ౧౧౭

క॥ వైరాగ్యమగ్గిచురుకీ
సారామలభ_క్తిరసము స్వరసమగు మన
స్సేరసము తనువుమూఁకుడు
ధీరుండిరుగడలనూద దేవుఁడునిలుచున్ ॥ ౧౧౮

క॥ ఇతరము లేదని తెలియుసు
మతియున్నటులుండునుగద మఱువకతత్త్వం
బతనికినదియే సర్వము
హితముఁ నైజంబు ము_క్తియే వేయేలఁ ॥ ౧౧౯

ఆ. వె॥ ఉన్నయట్టులుంటనున్నయట్లుండును
లేనివాఁడయగుట లేక యుండు
వృత్తిరహితుఁడైనిమి త్తమాత్రంబుగఁ
దత్త్వబుద్ధ రామదాసుఁడొకఁడు ॥ ౧౨౦

క॥ తలఁపుల కెడమీయక లో
పలిదికై క్యప్రబలుతపసి బయలుపడెడుచో
నడువకదుమి కెడుమృగమటు
కడు వేగఁ గడచి పూర్వగతి శాంతించున్ ॥ ౧౨౧

ఆ. వె॥ ఆత్మమూర్తియైన నమ్మహానీయుండు
చేయరానిదెద్ది చేయునెద్ది
సర్వతంత్రములనస్వాతంత్ర్యమునుగల్గి
యాత్మశాంతినుండునాత్మఁగాంచు ॥ ౧౨౨

ఆ. వె॥ మాటలాడ వెఱచు మైమఱచియుఱచు
మౌనమ్ముదఖిలుల మత్తు చెఱచు
నసులఁజూచిపఱచు నళిననేత్రుఁదఱచు
తలఁచి యాత్మనాత్మ వలచి నిలుచు ॥ ౧౨౩

క॥ మఱచినదానినిజ్ఞప్తికి
తఱచు తరుచులోనఁదాను దజ్ఞులబోధల్
గఱచుచుఁ గాష్ఠాకృతితోఁ
దెఱచునుజ్ఞాననయన ముపదేశంబిదియే ॥ ౧౨౪

క॥ కాత్యాయనిమృదుపదములు
సత్యముగామదినినిల్పుసజ్జనుఁడైనన్
నిత్యమ్ము తీవ్రగతితో
నృత్యమ్మొనరించు నాత్ముఁడే యగుణాతచేన్ ॥ ౧౨౫

క॥ దుర్జయమగుదృశ్యమును వి
సర్జింపన్ బోధఁజేసె సారథిగాఁదా
నర్జునునకు శ్రీకృష్ణుఁడు
మార్జాలముకాష్ఠమట్లు మఱచినభంగిన్ ॥ ౧౨౬

క॥ చొక్కపుసౌఖ్యముజగమున
నెక్కడఁదక్కమికిఁ బొక్కు నెంతయువిరతిన్
నొక్కనుదృశ్యము జీవుఁడు
దృక్కైసృష్టిక్రమంబుఁదెలిసి సుఖించున్ ॥ ౧౨౭

క॥ ఆలంబమొల్లకునికియు
కాలాదులమించుకీలకంబగుఁగాదే
యాలంబరహితుఁడయ్యును
గ్రీడించుఁ జత్రరీతిఁ గేవలుఁడాత్మన్ ॥ ౧౨౮

క॥ జీవుఁడవా కాలంబెటో
కావరమడఁగించు శుష్కకర్మము పెంచున్
దేవుఁడవా లోకంబే
దీ వైతె తెలియలేవె యిదితపమునకున్ ॥ ౧౨౯

క॥ కనుమూసి కీర్తనము వా
క్కునమూయుచు మంత్రము గురుకులమున స్థితి యా
సనమున యోగము జ్ఞానం
బున మానము ముక్తిసర్వముం హరికృపచేన్ ॥ ౧౩౦

గీ॥ నేతినేతిమహావాక్యనియతి సర్వ
దృశ్యజాలంబుకడద్రోఁచి ధీరుఁడాత్మ
నాలకింపంగఁ దాదాత్మ్యమమరునట్లొ
బుధులుదీనినిదపమంద్రు పూర్వబుధవి
దారి సూరిమనోబ్జవిహారి శౌరి
కరుణఁజూచినఁగాదె తత్పరతగలుగు ॥ ౧౩౧

తే. గీ॥ చిత్తవృత్తినిరోధించు నుత్తముండు
తనకుఁదనవారికొకరీతితారకంబు
నూరకుండియు కల్పించుచుండునొర
యాత్మపౌరుష మాలంబమైనకతన ॥ ౧౩౨

క॥ ఎవ్వనిమాటలుమంత్రము
లెవ్వనినడనడయెబోధ మెవనిసుదృష్టిఁ
జు వ్వేతరింత్రతనికినతి
యెవ్వండాచార్యమూర్తినిలజనియించెఁ ॥ ౧౩౩

ఆ. వె॥ వార్ధినలలవలెనె బ్రహ్మమందునజీవు
లుద్భవింతురనుటయుత్తమాట
జలము ఫేనమలలుగలిసిఁగడలియౌం
జగముబ్రహ్మమయము శాంతినయము ॥ ౧౩౪

క॥ నిద్దురలోఁగలయుండును
నిద్దురకలలోననుండు నిజముగనటులే
య ద్దేవిలోన నేనుఁ
మ ద్దేహామునందు దేవి మసలుటవినుమా ॥ ౧౩౫

క॥ బీజమువృక్షంబందున
బీజమునఁ వృక్షముండుఁ బృథివీస్థలిలో
బీజంబోమ్మందురుకద
బీజములన్నిటను,బణవబీజము వెలయుఁ ॥ ౧౩౬

క॥ తెలిసిన తెలివికిఫలముగు
తెలియమి దానికిఫలంబు ధీరతయుమనో
విలయము కేవలదృక్కై
నిలుచుట హరియందుభక్తినిల్చుటసుమ్మీ ॥ ౧౩౭

తే. గీ॥ సంతతాత్మావలోకన సంపదాప్త
ముక్తికాంతాపరిణయ ప్రమోదమగ్న
మానసేంద్రియసమితిసమాధి దేవ
గురువిబుధసేవ భక్తుండు పరముగాంచు ॥ ౧౩౮

క॥ తపమనఁగనాత్మయజ్ఞము
తపమునకర్థ్వర్యుఁడుగుసు దైవతమజస
త్కృప ధనముసాధనంబును
చపలుఁడుజీవుండుపశువు శాంతిఫలంబౌ ॥ ౧౩౯

తే. గీ॥ స్వస్వరూపానుసంధానసరణిజగము
నీకునాకునులోకుల కేకముగను
స్వగతి స్వస్థితి ద్వంద్వంబుబ్రహ్మమొకఁడ
యాత్మయోగంబునందు నోమ్మందువిందు ॥ ౧౪౦

సీ॥ జీవత్వమూలేదు దేవత్వమూకాదు
భావింపసర్వంబు బ్రహ్మమగుట
చింతయూలేదు నిశ్చింతయూకాదు
శాంతంతపోయనుట విశ్రాంతికాంతి

ధనకాంక్ష లేదుగా తనకాంక్ష లేదుగా
తనుకాంక్ష లేదుగా తనువైలేపు
పరమేశ్వరప్రీతి ప్రభవించుటకునీతి
కాకున్న మతికోఁతి కమలసూతి

గీ॥ బ్రహ్మమనెద రస్మత్పదవాచ్యుఁ డెంచు
నెందుఁ గనుఁగొందు వేఱు నే నెందునుండుఁ
దావులేలేవు నాకెందుఁ దత్త్వమందు
సచ్చిదాత్మకముఁ జగత్తు స్వామిసత్తు ॥ ౧౪౧

క॥ జీవము వదలిన వానిని
నేవైనన్ బద్ధుఁ జేయునే విధులిటులే
జీవత్వశంక వదలినఁ
గేవలుఁడై మించు నురక క్షితి ద్వంద్వంబుల్ ॥ ౧౪౨

క॥ పైపైన ద్రిప్పుచుండుట
యేపని మరమేకెపుడది యెట్లైపోనీ
యాపగిది మంత్రపఠనం
బోని జీవాత్మనీకు నేమేఁ గానీ ॥ ౧౪౩

క॥ అటునిటుఁ జూడక కదలుచుఁ
దటుకున నిజధర్మమందుఁ దద్దయుఁ బ్రీతిన్
బటుతర భక్తిని నిల్పిన
ఘటికామాత్రమున గల్గుఁ గైవల్యమిలన్ ॥ ౧౪౪

క॥ ఓంకారముస్మరియింపుము
హంకారమువిడువుబుంకనై ననుద్వరలో
శంకలువాయు భవానీ
శంకర మానందకరము సాధులకదియుః ౧౮౫

క॥ కృతకృత్యుఁడుండుఁగాస్థా
కృతినిర్వృతినొందుచుండుఁ గేవలమాన్మ
స్థితినుండునెందుఁగనతుత
దితరమునిరుపాధికుఁడయి యుంగలినైనన్ ॥ ౧౮౬

తే. గీ॥ బోధఁజేయుటమాని చిన్ముద్రఁబూని
కాలమొకరీతిఁగడుపు విజ్ఞాని వాని
హృదయమగు నిజముగవిష్ణుపదము తత్త్వ
బుద్ధిహెచ్చును సర్వసంసిద్ధిగలుగు ॥ ౧౮౭

తే. గీ॥ తత్త్వవిదులము మాకేల ధర్మచయము
చెలఁగి యష్టాంగయోగముల్ సేయనేల
మంత్రతంత్రమ్ములేల కర్మమ్ములేల
నున్న లేకున్ననొక్కటే యునికిగాదె ॥ ౧౮౮

చ॥ సరసము సాత్త్వికంబు ఫలసారసమన్విత మార్యసన్నుతం
బరమరలేనిహస్తముల సాదరముప్పఁగ సబ్బుఁబట్టుడో

గిరమదిశాంతిబాయక మకిల్బిషమచ్యుతసుప్రసాదమై
పరముసుఖఃఖ్మనీఁగలుగుపావనవస్తువు గానదానికై
కరతలభిక్షఁ జేసెద సుఖమ్ముగఁ బుణ్యగృహాంగణమ్ములన్॥

మాలిని॥ జయ హృతిపరాత్మా సర్వవేదాంతరాత్మా
నిఖిల వనకర్తా నిశ్చలానాంప్రవర్తా
బుఁ జ భజనీయః స్వోక్తకీర్త్యానమేయః
జనకవరభర్తా జన్మకర్మాపహర్తా
నిఖిలకలుషసేతుః నిత్యసౌభాగ్యహేతుః
సుదకరయమపాశ స్సోసహామాకాశ కేశః
రతిపతిజనక శ్రీ రామరామేతిసంజ్ఞః
పరమపురుషఈశః పార్వతీపార్శ్వదేశః॥ ౧౫౦

క॥ అనిచల్లగధర్మాంబుం
గనిభక్తికిమెచ్చియిట్లుకౌతుకముసఁదా
ననియెన్ శుభవాక్యముజగ
మునఁబలిసద్భక్తిఁగొల్చుముదితలకరుదే॥ ౧౫౧

క॥ శ్రీకరుణావీక్షణమున
సాకంబడుచుంట వాక్కుసత్యముసుమ్మా
నీకెప్పుడాసఁగ్రహోత్సుత
లోకైకగురుండు జ్ఞానలోచనమమ్మా॥ ౧౫౨

పరమహంసబోధవిని రాజశేఖరుండు కృతజ్ఞతాపూర్వకంబుగ
స్తుతించి నిజపురంబున కరుగుట.

క॥ గురుదేవ స్తవరూపక
పరమాద్భుతబోధ కరుణఁబల్కెన్ దసక్తి
పరమాప్తుఁడనివినిస్తృతి
కరమానందించి ముట్టెఁగ్రైవల్యంబున్ ॥ ౧౫౩

క॥ కృతకృత్యుండయ్యెను దన
కృతజ్ఞతఁదెలుపుచునిట్లుకీర్తించెన్ భూ
పతిపరిమహంసపుడా
కృతిఁదాల్చినబ్రహ్మమనుచుఁ గేవలభక్తిన్ ॥ ౧౫౪

క॥ దంగలనార్గురఁబట్టిత
సంగంబెడబాసి శాంతిసమకూరెన్ శ్రీ
రంగనికృపనాకిటుఁదెలి
యంగఁబలికిలేనివెలుకినదిమితివివిభూ ॥ ౧౫౫

క॥ స్వామీనినుగొలుచుచునే
నేమంబేమియునులేమి నిష్ఠయులేమిన్
గామించినఁగేవలకృపఁ
గామించితి భక్తులట్లకాగురుమూర్తీ ॥ ౧౫౬

క॥ జేజేమొజ్జలుదక్కన్
నేఁజేసిన దేమిగలదు నిజముగ నీకున్
యోజన లేక యనీపద
రాజీవములిచ్చినావురా గురుమూర్తీ ॥ ౧౫౭

క॥ వాసననాశముఁ జేసితి
దోసం బెడబాసి నీవతోఁ చెద వెందున్
గాసిలఁ జేసితి దండము
తోసరి ననుఁగైకొను కృపతో గురుమూర్తీ ॥ ౧౫౮

క॥ నీసరినీవేసరి గురు
కేసరి భవమత్తదంతి కేసరి ధరనే
నీసరికింగననీసరి
నీసరనన్ నిలుపఁబ్రదుకనే గురుమూర్తీ ॥ ౧౫౯

క॥ శరణంబై భవసాగర
తరణంబై ధన్యులకిలఁద త్త్వప్రాప్తిన్
గరణంబై భక్తులకా
భరణంబై నట్టి పాదపద్మముఁగొలుతున్ ॥ ౧౬౦

క॥ జీవత్వంబజ్ఞానము
భావింపఁగ లేనిదయ్యెఁ బ్రారబ్ధమునన్
జేవిధములఁదలఁచూపెడు
దేవేయుపసంహరింప వే గురుమూర్తీ ॥ ౧౬౧

క॥ మౌనంబునధ్యానంబున్
ధ్యానమువన్ జ్ఞానమబ్బు ధన్యులకెందున్
మౌనమునీవాక్యంబుల
చేనగు నవిగల్గుభక్తిచే గురుమూర్తీ॥ ౧౬౨

క॥ దేహాదులు నేఁగానని
మోహంబునువదలి మొదటిమూర్తిఁగని సం
దేహమువిడుచుచులోనన్
సోహమ్మని జపముచేయనో గురుమూర్తీ॥ ౧౬౩

క॥ సోపాధికుఁడాభాసుఁడు,
రూపంబులు లేనియాత్మ రూఢిగ నొకఁడై
దీపించు స్వేచ్ఛారాముఁడు,
పాపంబిజీవుఁడెవఁడు భ్రమ గురుమూర్తీ॥ ౧౬౪

క॥ మనమేకాగ్రతలోకం
బును సంహారంబుఁజేయుఁ బూర్ణుంజేయున్
దనుతత్త్వ మబ్బఁజేయున్
ఘనతేజఃపుంజమట్లుగా నొగిఁజేయున్॥ ౧౬౫

ఆ॥ వె. పరులఁజూడకునికిఁ బాపంబునశియించు
గురునిబోధమహిమ గుఱినిఁగాంచు
నాత్మనాత్మఁగనిన నానందముదయించు
నాత్మకాత్మవిడున కంతరంబె॥ ౧౬౬

క॥ చనుచుండి మాటిమాటికి
మనమూరక దేశికేంద్రు మఱలుకొనంగాఁ
దనలోఁ బానిటుస్మరియిం
చెను దేశికు సతనిబోధ శ్రీపతిగాథన్ ॥ ౧౭౨

— రాజశేఖరుండు మార్గంబున హరిహరులస్మరించుట.;—

క॥ ఓమ్మనఁగా గురుమంత్రం
బోమ్మనమంగళకరంబు నూహింపంగా
నోమ్మననంగీకారం
బోమ్మనిజపియించిపరము నొందెదనింకన్ ॥ ౧౭౩

క॥ సంకటములు తొలఁగింపఁగ
శంకలుహరియింపఁ బరమశాంతినినింపన్
గింకరులకుఁగలియుగమున
వేంకటపతిగాక బ్రహ్మవేత్తలుగలరే ॥ ౧౭౪

ఉ॥ చక్కనివాఁడు సాధువులఁజల్లనఁజేసెడుసద్వ్రతంబువాఁ
డొక్కఁడు సద్గురుండునయనోత్సవముంబొనరింపనాఁటితోఁ
దక్కినలోకముంగనఁగ దాసునకేమిటికక్కఱయక్కటా
దిక్కులఁబెట్టకింక ననుఁజేర్పుమునీపదపంజరంబునన్
మక్కువతోడనిల్చి యనుమానమువీడఁగభక్తకోటికిం
పెక్కఁగఁబల్కుచుందుజననీ భవదీయమహత్త్వమెంతయున్ ॥

ఉ॥ అంతయునీప్రభావమసి యారయు శాంతమునాకునిచ్చుప
ర్యంతము దీక్షితుండనయి యానెదనీపదపద్మసారమ
త్యంతముభక్తితోడఁబరమాత్మునిఁడపొందుడుదీనమూటశ్రీ
మంతులఁజేయకిట్లు జనమాత్రులఁజేసెదెరామదాసులన్ ?

—: రాజశేఖరుండు మంత్రికి గురుప్రభావంబు దెలుపుట: —

క॥ ఓమంత్రివర్యకంటే
యామహనీయునిసుమూర్తి యామొదబోధల్
నీమదికేమో సాక్షా
ద్దామోదరుఁడట్లు నాకతండునిజంబౌ ॥ ౧౭౭

క॥ ప్రామాణికబుద్ధింగల
భూమిసురుల్ గలరుగానిబుద్ధింబోలన్
సామాన్యమెందులేదను
నీమహనీయునకుసాటియే మంత్రివరా ॥ ౧౭౮

ఉ॥ అంతటివాఁడు లోకములయందునసెందునుఁగానరాఁడు వి
శ్రాంతిపరాయణుండు భవసాగరతారకమార్గరక్షశ్రీ
కాంతుఁడుమానవుండెకద జ్ఞానమునన్ సకలాళిమెచ్చ వా
క్కాంతుఁడు విద్యలందుమము కారవిహీనుఁడహీనతేజుఁడున్

క॥ వదలించెసంశయంబులు
సదయుండాపరమహంస సద్బోధలచే
మదినిల్పెనాత్మతత్త్వము
గదతద్భజనంబె మాకుమంగళ్యంబౌ ॥ ౧౮౦

—: పారమార్థికస్నేహప్రశంస :—

క॥ తత్త్వజ్ఞుల మిత్రత్వము
సత్త్వముతోఁగూడియుంటసత్యము నిర్వ
క్రత్వముతో నడచును బం
ధుత్వమ్ముపాలిక్కి పరమతుచ్ఛంబిలలోన్ ॥ ౧౮౧

క॥ అమలంబై వికసితహృ
త్కమలంబై నానుపాలితత్వాబలంబై
సమలంకరణంబై వే
దమయంబై యార్తమూర్తిధన్యునిఁ జేయున్ ॥ ౧౮౨

క॥ దేహంబులు వేర్వేఱట
స్నేహితులకునాత్మయొకఁడు సిద్ధంబట సం
దేహము లేకిటుఁగనియుఁట
మోహముహరియించిమొదటిమూర్తింగనుటల్ ॥ ౧౮౩

క॥ స్నేహితులు లేనిపశువుల
కూహింపఁగనగు నె బ్రహ్మము నెడురీతుల్
దేహమువిడవలె మోహము
సోహమ్మనుజపముకుదురుచో మంత్రివరా ॥ ౧౮౪

సీ॥ మిత్రుఁడు లోకబాంధవుఁడు మేటినృపుండుభిషగ్వరుండు వే
దత్రయమూర్తి ముక్తులకుద్వారముదీయుమహాత్ముఁడాత్మ
జిత్రవిభూషణుండు దరిఁజేరసహింపరుసన్నిధిన్ గటా (దుర్

మిత్రుఁడు లేని జీవనము మేదినిఁ గల్గు నెయేరికైననీ
చిత్రముగాంచి పుత్రులనుఁ జేర్చుట చేరుటవట్టిమాట స
ర్వత్ర నిజార్తిఁ బాపఁగ నవశ్యము దెంతొ భజింతురంతయే ॥

క॥ పరవశతఁ జరియించుచు
గురుపుత్రులు గలియ శాంతికుదురుఁ ధరలోఁ
బరరంధ్రాన్వేషణత
త్పరులగు దుర్జనులు గలియఁ బాడియె సుంత్రీ ॥ ౧౧౬.

క॥ ఎప్పటికైనను సాహస
మొప్పఁగ జనియింపనగు నపాయాంత్రంబుల్
దప్పక గుణనిఁ గొల్వఁగ
ముప్పోకుల కుదనకు మోఁకుమునిజ మహా ॥ ౧౧౭

క॥ కోరిన దానివిచారణ
నేరిఁ జేయఁగ నేల హితమది వేత్తై
దూరంబైనను బోధలఁ
గోరుఁ గాధలనుదూరుఁ గోరనికేతనఁ ॥ ౧౧౮

క॥ నిష్కల్మషహృదయులకగు
నిష్కారణమైన ప్రేమ నిర్వృతినొందఁ
ముష్కరుఁ డెవ్విధిఁ దెలియున్
శుష్కపువాక్కులనుమంచుచుఁ బడనుఁగుచునుఁ ॥ ౧౧౯

ఉ॥ పాడుపడేటి జగంబు భవపాశమువిప్పెడుబాంధవుండు కా
పాడెడుబాంధవుండొరునిపాపముచూచిసహించు బాంధవుం
డేడనుగావరాదు పరమేశ్వర సద్గురుమూర్తినిన్ వినా
లేదుహితుండులోకమున లేడనిచాటెదమాటిమాటికిన్॥

క॥ నీచుండిల నాచుంబలె
నే చెఱచున్ జీవనంబు నెప్పుడుఁబైగాఁ
దోచున్ గదస్వామింబలె
దాచున్ గదమిత్రమూర్తి త్రాచుంబలెనే॥ ౧౯౧

ఉ॥ వెన్నెలరాత్రులందుఁ గడువేడుకతోఁ జెలికాండ్రఁగూడిసం
పన్నులుక్రీడసల్పగఁ బ్రపన్నులుసద్గురుగొల్వఁ జల్లగాఁ
గన్నులఁగానలేమిఁ దనకాకబయల్పడ దుష్టవార్తలన్
బన్నెడునీచునిన్ జడుఁడుపాసనఁజేయును బాపవృత్తికై॥

క॥ ఆగురుకృపకున్ బాత్రుల
మై గర్వమువిడిచి పారమందెదుమనకున్
బాగగునె కపటసఖ్యము
తోఁగాలముగడపుటింకఁదోలివలె సచివా॥ ౧౯౩

క॥ మనసఖ్యముపూర్ణంబై,
కనునీచులమనము నెంతకలఁచినన్నైనన్
మునిజనులకు మదమొసఁగిన
మనమింతయుచింతలేక మనవలెననుచున్॥ ౧౯౪

క॥ పురిఁ జేరి శాంతి నుండిరి
పరమార్థమరందపానపరవశులై స
ద్గురువర చరణంబుల మదిఁ
గరమారాధించు వేడ్కఁ గలకాలంబున్ ॥ ౧౯౫

—: రాజశేఖరునకుఁ బుత్రుఁడుదయించుట. :—

క॥ ప్రాక్తనవాసనలన్ గురు
శక్తినిఁ బోఁదోలి నూత్నసామగ్రీసం
యుక్తుల భోగాసక్తుల
ముక్తులఁ జేయుబుతు రాట్టు బుధులు నుతింపన్ ॥ ౧౯౬

గీ॥ రాజశేఖరుండు రాజీవనేత్రవ
సంతకాలమున వనాంతరమున
సంతులేని చింత చాల బాధింపంగ
హరినిభక్తి మొక్కె సంతవింత ॥ ౧౯౭

క॥ మలయాచలపవమానుఁడు
కలఁచెన్ గామానలంబు కాంతయు మదిలో
వలచెను పెనిమిటిఁ గొలిచెను
నిలిచెను గర్భంబు మానినీ! మానినికిన్ ॥ ౧౯౮

గీ॥ దేవకార్యంబు సాధింప భావజుండు
జీవరూపంబుఁ దాల్చె నా భూవిభునకుఁ
బుట్టెఁ బుత్రుండు పురజనుల్ పొంగియాడఁ
దల్లిదండ్రుల యుల్లంబు చల్లఁగాఁగ ॥ ౧౯౯

క॥ రంజనమీాఅనతనిని ని
రంజనుఁడనిపిలిచి యబ్బురంబుగఁబోషిఁ
పం జన్న నాఁడెమ్ముత్రివ
రుంజేరి ప్రసంగముఁబొనరుచు నవ్వించుః ॥ ౨౦౦

క॥ చన వెఱ్ఱిడై నకొలఁదిని
మనమునంశసయమువిడిచి మాటికిఁదానే
మనబుజ్జగించుచుండుటఁ
గని యొకనాఁడతనిఁ బ్రశ్నగావించెనిటుల్ ॥ ౨౦౧

—:నిరంజనుండు జీవుఁడను నపరనామంబును బొందుట:—

క॥ నన్ను నిరంజనుఁడని యెద
రన్నా యుద్దాని కేమియర్థంబనఁగాఁ
దన్నామముశివపరముగ
నెన్నంబడునంచుఁబల్కె నెంతయుఁబ్రీతిః ॥ ౨౦౨

క॥ అనుటయు నేజీవుఁడనగు
దునుగద నా కెట్లుచెల్లుధూర్జటినామం
బని తననుజీవుఁడనవలె
ననిపట్టుబట్టు పట్టియాశ్చర్యముగః ॥ ౨౦౩

క॥ గారాబుపట్టిగాపుస
నారీతిఃజీవుఁడంచు ననసాగిరిగా
పౌరులుజననీజనకులు
ప్రేరేపఁగఁ బాలునకుఁబ్రీతిజనింపః ॥ ౨౦౪

రాజశేఖరుఁడు నిజకుమారుని గురుకులంబునకుఁ బంపుచు

నీతిగఱపుట.

క॥ యుక్తవయస్కునిసుతునా
సక్తినినునీతుఁజేసి సద్విద్యలవి
ధ్యుక్తముగ గురుకులంబున
భక్తింబఱయింప నృపుఁడు పనుపుచుఁబలికెన్ ॥ ౨౦౫

క॥ సరసంబై భక్తాళికిఁ
బరుసంబై యెద్దితోఁచు భ్రష్టాత్ములకున్
ధరనాఖ్యంబే లేనిది
గురువాగ్ఝరిగొల్వు మాత్మకుశలతఁదనయా ॥ ౨౦౬

గీ॥ గురుసన్నిధినైన సంకోచమున్న
గుణముకుదురునె లక్ష్మితోఁగూడియున్న
విష్ణువేపేదయైనచో విత్తమేల
గురుఁడు పరదైవతంబనుకొనుము మనుము ॥ ౨౦౭

ఆ॥ వె॥ తల్లిమాత్రసాని తండ్రియుగురుఁడైన
వారివారిపనులు వారొనర్ప
లేరు మోహమాపలేరుగా నిజమిది
మమతమబ్బుఁదెచ్చుమహిమఁజచ్చు ॥ ౨౦౮

ఆ. వె॥ పరులధర్మమెంత బాగనితోఁచిన
దానిఁ జేయకుంట ధర్మబుద్ధి
చూచువానినెల్ల నాచరించి చెడును
స్వీయధర్మమందుఁ జింతమందు ॥ ౧౦౯

ఆ. వె॥ లోకమన్న పెద్దకాకులమూకన్న
ముద్దకైననఱచు గ్రద్దకైన
దెబ్బకైననఱచు దీనినైజంబింత
లోకమందు దూఱఁబోకు జీవ ॥ ౧౧౦

ఆ. వె. అఱచువారిఁజూచి వెఱచువాఁడెవ్వఁడు
అఱచువారు పనులు చెఱచువారె
అఱచుకాకిచేఁత నదలింపనదెపోక
పెద్దవారిఁజూచి ప్రేలఁబోకు ॥ ౧౧౧

ఆ. వె॥ బుద్ధిలేనివాఁడు బుధుని సేవింపంగ
మెచ్చునంచుఁదలఁచు మెచ్చఁడతఁడు
ధన్యుఁడైనవాఁడు దత్త్వంబు మెచ్చుగా
భక్తపాదపద్మబంభరంబ ॥ ౧౧౨

క॥ పంటల్ గలిగిననాలుక
మంటల్ బాపంగమందు మహినెపుడైనన్
గంటల్ నములునె గురుకృప
కంటెన్ శరణంబు వేఱకలదే జీవా ॥ ౧౧౩

క॥ వేసముతో సేవించుచు
నాసలు నెర వేరకునికి నసమర్థునిఁగాఁ
జేసెనుగురుఁడని కుందుచు
దోసముఁ బలుకంగ నెంచు దుర్జనుఁ డటుపై ॥ ౨౧౪

క॥ వేసముతో యత్నించిన
వీసములాభంబు లేను వెతకలుగుటయే
దోసముగుణముఁ దెలియక
జేసినయుపదేశ మెట్లు సిద్ధించునొకో ॥ ౨౧౫

క॥ గురునుపదేశము వడయక
పరమార్థములనుభవించుపండితు లకటా
ధరలో వెలసిరి నేఁటికిఁ
దరణోపాయంబు గ్రంథతతియే చూపుగా ॥ ౨౧౬

క॥ తమతమవాదంబులచేఁ
దమమెచ్చెడుఁగాని దానఁద త్త్వజ్ఞానం
బమరునె సద్గురుదీక్షల్
భ్రమలని వచియింపవారి ప్రారబ్ధంబే ॥ ౨౧౭

ఉ॥ కాంచినమాత్రనే సుఖముగల్గునె కల్గునెపూర్ణభావముల్
గాంచినదేశికేంద్రుఁ డుపహారిగఁ బరుగా మదిఁ గాంచకున్న న
భ్యంచితరీతినర్చనల నార్తినివారణ గాంచకున్న స
త్కాంచనముబ్బకీర్ణముఖ దాల్తురె భూషణ నర్పకెవ్వరే ॥

క॥ ఎటులున్నను గురుమూర్తిని
బటుతరసద్భక్తిఁగొల్చు పండతుఁడైనన్
దటుకున మోక్షంబబ్బున్
గుటిలుండై చెడును బరమకోవిదుఁడైనన్ ॥ ౨౧౯

క॥ శైష్యోపాధ్యాయికచే
ఋష్యాదులుమున్నుఁగాంచి రిహాపరసుఖముల్
పోష్యముగాదని కలిని మ
నుష్యాధములదివిడిచి వినోదింత్రుగదా ॥ ౨౨౦

క॥ పుత్రుండై గురుబోధకుఁ
బాత్రుండగుఁ గానితనదుపాండితినా స
ర్వత్రయిదియెనిశ్చయ మి
ద్ధాత్రిన్ గురుకరుణకన్నఁ దారకమున్నే ॥ ౨౨౧

క॥ నూటికనాదముబ్రమింగిన
జాటున్ బ్రాణములరుగమి శాస్త్రార్థములన్
జూటినమారక చెవితో
నాటునుజ్ఞానాసలంబహోశ్రీఘ్రగతిన్ ॥ ౨౨౨

క॥ ఈరీతిగాంచియోగులు
ధారణనభ్యాసమునసుదార్ఢ్యముకలుగన్
జేరుదురుశ్రీనివాసుని
ధీరతగురుబోధమహత్త్వఁదెలియుచునెపుడున్ ॥ ౨౨౩

గీ॥ భేదబుద్ధినిహరియింప వేదవిదులు
సేయుచుండుదురుచిత్రముల్ శిష్యవరులఁ
గూర్చి యవ్వాని కెంతయుఁగుందకునికి
యొగదా సర్వసంసిద్ధి యెంచిచూడ ॥ ౧౨౪

క॥ గురుదేవత్వస్థితిఁగలుగఁగఁ
గరమారాధనము చేయఁగలుఁగుదుననుచున్
గరువముఁజెందకుజీవా!
కరుణాలుండాటనిన్నుఁగాచునతండై ॥ ౧౨౫

గీ॥ పాలుపిసుకనోవునకగు భంగపాటు
వత్సముకుడువంగనగు మహాత్మ్యవంబు
పండితుఁడు ప్రజకజ్ఞానిభంగినుండు
విద్యనిజభక్తులకునిచ్చు వేడ్కఁబోల ॥ ౧౨౬

క॥ పండితులనుగపటముతో
మెండుగసేవించియైన మేలుఁబడయునే
దండుగయాతనిశ్రమమది
పండియుఁ బాపంబుసర్వవిధములఁ బెంచున్ ॥ ౧౨౭

క॥ త్రుంచున్బుణ్యము సభలన్
వంచన మొనరించు దుష్టవాసననించున్
జించున్గొంతుక పిడ్డఁగ
ముంచున్ భ్రష్టత్వముఁజేసి ముల్లోకములన్ ॥ ౧౨౮

క॥ కానన్ జ్ఞానము నిచ్చెడు
వానిని నదిగోనువాఁడు వైరాగ్యంబున్
భూని భజింపఁగ నగుని
త్యానాదముతోడ శుద్ధుడై సతతంబున్ ॥ ౨౨౯

॥ ఉన్నదున్నట్లు దెలుపంగ నుత్తములిల
యత్నమొనరింత్రు తమవారలన్యులనెడు
భేదబుద్ధిని బ్రియము నప్రియము నెందుఁ
జేయరు మహాత్ములకిది విశేషగుణము ॥ ౨౩౦

మ॥ వరమా గ్రంథములందు గల్కొనుట సంవాదంబుచేము క్తినీ
తరమా మానసము మాను మా కృపల సత్తత్త్వంబు బోధించు శ్రీ
గురుమూర్తిన్ భజియింపుమా మదిని సంకోచింప "కాచార్య
వాన్
పురుషో వేద" యటంచుఁ బల్కెఁగద సంపూజ్యంబులౌ
వేదముల్ ॥ ౨౩౧

క॥ అనుజసఖుని బోధః విని
వినయంబున రాజసుతుఁడు వెడలఁగ నారా
యణ పౌరాణికుఁ డంతన్
దనసుతునిన్ నిల్పి చెప్పె ధరణిపు నెదుటన్ ॥ ౨౩౨

నారాయణభట్టు నిజకుమారుఁడగు నన్నంభట్టును
రాజసుతునితోఁ బంపుట.

క॥ నీసుతునకుసాయంబుగ
భూసురునిసుశీలుఁగొల్చి పూ_ర్తిగవిద్యా
భ్యాసముచేసి తరింపఁగ
నాసుతునిఁ వెంటఁబంపు నరపతి!కృపనాఁ ॥ ౨౩౩

క॥ అంగీకరించెభూపతి
మంగళకరమంచువిప్రమాణవకునితో
సంగము నిజసుతునకు, ను
ప్పొంగుచుభూసురుఁడు తన్నుఁబొగడుచునేఁగఁ ॥ ౨౩౪

క॥ నృపసుతుఁడువిప్రసుతుఁడును
నృపునాజ్ఞసుశీలుకడకు నెయ్యమునఁదో
నుపచారకులెవ్వరులే
కపయనమైచనిరి విద్యఁగఱచెడు వేడ్కఁ ॥ ౨౩౫

క॥ గురుకులముఁ జేరియిరువురు
గురుతరసద్భ_క్తి దేశికునిపదములమ్రొ
క్కి_రికరుణాళుండగుభూ
సురుఁడుఁ సంప్రీతివారిఁజూచి గ్రహించెఁ ॥ ౨౩౬

క॥ కాలోచితకృత్యంబుల
బాలురునక్రమముగాఁగఁ బ్రతిదినమున్శ్రీ
లోలార్పణముగఁ జేయం
జాలిరి గురుపాదపద్మషట్పదవృత్తిన్ ॥ ౨౨౦

—: సుశీలుఁడు జీవునకు నన్నంభట్టునకునీతిగఱపుట. :—

క॥ ఒకనాఁడు గురుఁడువారల
సకలాత్ములఁజేయ నెంచి సద్వాక్యములన్
బ్రకటించెనిట్లు సత్కృప
నకలంకస్థితినివార లాలింపంగన్ ॥ ౨౩౮

ఆ. వె॥ అందఱున్నిగోరి యాత్మ తెలోకంబుఁ
దెలియ లేరు హరినిఁగలియ లేరు
కన్నుముక్కువలెనె కాంచునావాసనల్
జగముదూఱవాదు శాంతిరాదు ॥ ౨౩౯

ఆ. వే॥ సర్వముహరియంచు సాధులు తెలిసిరి
మున్ను నేఁటికిట్లుమూఢతతికి
వేఱు లేదటంచు విజ్ఞానమీయంగఁ
జిత్రమూర్తిఁదాల్చె శ్రీధరుండు ॥ ౨౪౦

క॥ చదివెడుశాస్త్రంబులచే
వదలదుసంశయము హరియువంచించినచోఁ
గదుపురలోనుబవీరుఁడుఁ
గదయని లోఁగుందుచుండుఁ గద చిత్రముగన్ ॥ ౨౪౧

క॥ చదువులుచదువఁగఁజదువఁగ
వదలదుసంశయము శాస్త్రవాసనహెచ్చున్
మదిశివపదములనిల్పఁగఁ
గుదురునుగుదురైనకుదురు గురుతరభక్తిన్ ॥ ౨౪౨

క॥ అన్నముతినవలెనాఁకలి
సన్నంబౌనంతవఱకు సత్యముఁదెలుపన్
సన్నతిగురుఁగొల్వఁగఁవలె
నున్నంతవఱకుశరీరముండును రెండున్ ॥ ౨౪౩

క॥ భక్తియనికొందఱంద్రు వి
రక్తియయనికొందఱంద్రు రహిరెంటఁ దొకటఁడే
రక్తివిరక్తులయోగము
యుక్తినిసాధింపరాదు యోగమునసగున్ ॥ ౨౪౪

క॥ రెండునునొక్కటనుండును
రెండింటనునుండునొకటి రెండునునొక్కై
యుండును సిద్ధులకున్ లే
కుండును భేదంబు తెలియకుండుటజీవా ॥ ౨౪౫

క॥ లోకముమెచ్చులకై తాఁ
దాఁకునువిభ్రాంతి దానితత్త్వముఁదెలియన్
లేకయగుందును కాకను
శ్రీకాంతునిభూరికరుణచేఁ జల్లఁబడున్ ॥ ౨౪౬

క॥ కట్టెన్ గట్టెన్ రాచినఁ
పుట్టునుసద్దాన నగ్నిపుట్టునుదాఁకన్
బట్టువిడకుండవలెఁదాఁ
బట్టినపాదంబు నట్లుపట్టఁగవలెఁగా ॥ ౨౪౭

క॥ పండినఁదనభక్తికిఫల
మొండినగురుమూర్తివానిహేతువనెడువాఁ
డుండునిలనొక్కశిష్యుఁడు
ముండనమొనరించుకొనఁగ మూఢుఁడుతానై ॥ ౨౪౮

క॥ తనుమెచ్చినసద్గురుఁడను
దనుఁదిద్దిన దాపరించెదాంభికుఁడనుగా
మనసిచ్చిన మందుఁడను
వినయమ్మునయమ్ము విడిచివేయును శఠుఁడున్ ॥ ౨౪౯

క॥ వినయముగా సేవించుచు
ననయముయత్నించుచుండు నాచార్యునిలో
ఘనదోషములగణింపఁగ
వినయమ్ము నయమ్ము విడిచివేయును భళిరే ॥ ౨౫౦

క॥ ఛాత్రుండనఁగా గురునకుఁ
బుత్రుంబలె సంచరించిపోషణచేయన్।
బాత్రతగలవాఁడేత
న్మాత్రుఁడె గురుసేవఁజేయు మాన్యుఁడుజీవా! ॥ ౨౫౧

క॥ అక్కఱపట్టినివానికి
నొక్కివచింపంగవినఁడు నొచ్చెడులోలో
జొక్కెడుఁ దమమద్దానన్
జిక్కగుదుఃఖములఁబొక్కుఁ జేర్మిఁదక్కన్॥ ౨౫౨

క॥ ఏనరుఁగాంచినలోకము
లోనెద్దియుఁగానరాదు లోఁజూపునవి
జ్ఞానముగలుగునునాతం
డ్జ్ఞానాచార్యుండు సర్వమాహారికృపచేన్॥ ౨౫౩

క॥ వేదాధ్యయనంబేజ్ఞా
నోదయజనకమనిబాధ నొందుదురజ్ఞుల్
కాదదిమార్గముజీవా!
యోఁదుచుభవ మాత్మధర్మమేపూనఁగనౌ॥ ౨౫౪

క॥ సద్వంశమందుఁబుట్టక
హృద్వ్యధిన్ హారినినిల్వ కిలనేఁడు భ్రాంతిన్
విద్వాంసుఁడైనమాత్రన్
సద్వాదుండగునె ముక్తి సమకురునెసుతా॥ ౨౫౫

గీ॥ క్రమముఁదప్పిన సఫలతఁగాంచకుండు
నెంతసామగ్రిగూడిన నెట్టిపనియుఁ
బిదపఁజేర్చినరుచిదెచ్చు మొదలఁజేర్ప
మొదలుచెఱచునుప్పదిసూక్షము నునిజంబు॥ ౨౫౬

క॥ పాపాత్ముఁడు సద్గురువను
వ్యాపారము నందుదించి వైరాగ్యంబున్
లోపముఁ జేయం జూచును
గాపాడఁడు గడయతని నకారణముగ హా॥ ౨౫౭

క॥ ఆలింతురు సద్బోధల
సోలింతురు గురుని మనము శుభవాక్యములన్
జాలింతురు తత్స్మరణము
చాలునె మఱియొకఁడు వీని సవరింపంగన్॥ ౨౫౮

క॥ వీలున్న యంతవఱకున్
గాలించెద రతని యందుఁ గల మహిమలనున్
జాలింతురతని సేవలఁ
జాలఁగ ఫలియించు వెనుక సత్యంబసఁగన్॥ ౨౫౯

క॥ ఆలించిరి సద్బోధల
గాలించిరి శాస్త్రములను గలిదోషముగాఁ
బోలును బాలకులాలో
నాలోచనములకుఁ గడఁగి రాటోపమునన్॥ ౨౬౦

జీవుఁడన్నంభట్టును విద్యార్థము దేశాంతరమునకుఁ బోఁ
బ్రేరేపించుట.

క॥ రాచకొడుకనియెఁ గంటే
యీచదువుల రీతి నిప్పుడెన్ని యొ చదువుల్
పూచెనఁట వానిఫలములు
నాచందము లెఱుఁగ మైతి మన్నంభట్టా ॥ ౨౬౧

ఆ. వె॥ రాచకొడుకనొంట బ్రాహ్మణునట్టుల
నేడ కేనిచనుట కెడములేదు
చిన్ననాఁటిసఖుఁడవన్న నీవైనపొ
మ్మన్న! క్రొత్తత్రోవ లరసిరాఁగ ॥ ౧౬౧

గీ॥ అచిరకాలంబుననురాజునొందు నింత
లోననీవును లోకంబులోనివింత
లరసివచ్చితివా మనమిసుపురమును
సంస్కరింపంగవచ్చును సంఘమెల్ల ॥ ౧౬౩

క॥ అనియన్నంభట్టారకుఁ
వని పెనుబరిగురులబోధ లాఁసిరాఁ
జ్జనపతిసుతుఁ డాతఁడున్
జనియెన్ వేవేఁకి లోకసంగ్రహబుద్ధిన్ ॥ ౧౬౪

ఆ. వె॥ అరిగవిప్రసుతుఁడటం చనుశీలుంపు
తెలిసి తెలియనట్లు పలికెనిట్లు
రాజసుతునిఁగూర్చి రమ్మని యోదార్చి
కలినిహితుఁడు లేఁడుగద కుమార ॥ ౧౬౫

గీ॥ స్నేహమునఁ బెంచు నుంచును శిరముమీఁదఁ
జిక్కువదలించుఁ బూవులప్రక్కనుంచు
నెంచుదోషంబునే గుణముంచునాత్రె
యుంచుకొనియున్న విడిచెనాముంచుసొంపి
వెంద్రుకలఁబోలెఁ గుటిలులవీరుఁడిలను ॥ ౧౬౬

## రాజసుతుఁడు సుశీలునియొద్ద సెలవుపడసి నిజపురంబున కరుగుట.

క॥ విని రాజసుతుఁడుమనమునఁ
దనదోషముఁ దానెఱింగి తద్దయుశీఘ్రం
బునసంప్రదాయపద్ధతి
ఘనవిద్యలసంగ్రహించెఁ గదలెడుబుద్ధిన్ ॥ ౨౬౭

గీ॥ నిజసుతుం డువిద్య నేర్చినాఁడని విప్ర
వరునివలనభూమివరుఁడువినుటఁ
బంపె మంత్రిఁ బెక్కుబహుమానములతోడ
గురునిసత్కరించి కొడుకురాఁగ ॥ ౨౬౮

క॥ వచ్చినయమాత్యునింగని
చెచ్చెరజీవుండు గురుల సేమంబరసెన్
దెచ్చినకానుకలన్నియుఁ
బుచ్చుకొనెన్ దేశికేంద్రుఁ బూజింపంగన్ ॥ ౨౬౯

గీ॥ కానుకలనుభక్తిఁ గైకొని దేశిక
స్వామిపాదములనుఁబ్రాలనతనిఁ
గుక్కుటమును మత్స్య కూర్మంబులనుబోలె
నంటి చూచెఁ దలఁచె నాత్మవిదుఁడు ॥ ౨౭౦

క॥ దీవించినగురుమూర్తిని
జీవుండటసత్కరించి సెలవిండో దే
వా! పోయివచ్చెదననేఁ
గావించినదోసములనుగణియింపకుఁడీ ॥ ౨౭౧

క॥ మార్తాండజపపరాయణు
లార్తిధ్వంసకులు శంకరాత్ములు విద్యా
మూర్తులును దమోహార్తలు
స్మార్తులు భువికీర్తనీయసజ్జనులగుటన్ ॥ ౨౭౨

క॥ ఈతంత్రంబామంత్రం
బోతండ్రీ! యనఁగనేలనుత్సాహముతోఁ
మాతలలనించితన్నియు
నీతత్త్వంబెఱుఁగుదీవనిజముమహాత్మా ॥ ౨౭౩

క॥ అనిగురుననుమతిఁబడయుచుఁ
జనియెన్ నిజగేహమునకు సచివాగ్రణితోఁ
గనిజననీజనకులమ్రొ
క్కెనుజీవుండొడలెఱుఁగక కేవలభక్తిన్ ॥ ౨౭౪

—: రాజశేఖరుండు జయంతంబునకు వెడలుట. :—

క॥ మిత్రుండఁటసచివాగ్రణి
పుత్రుఁడుగుఱుఁగొల్చిపూర్వపుణ్యంబున వే
దత్రయిసాంగముఁగనిన ప
విత్రుండఁట, భవలతాలవిత్రుఁడుగుఁడున్ ॥ ౨౭౫

క॥ పరలోకముఁగోనియాఁడని
తరుణీమణినాకుసర్వదాతోఁడఁట శ్రీ
హరిపరమహంసస న్నిధి
కరుగుటకింకొక్కతరుణమరయఁగలదే ॥ ౧౭౬

క॥ అనితనయునినిజరాజ్యం
బునకభిషిక్తునిఁగఁ జేసి మోదంబునమం
త్రినిగనిసచివా! చెప్పవ
లెనాసకలమీ వెఱుఁగుదు లే యనికపలెఁ ॥ ౧౭౭

క॥ కదలెడునిజపతి వెంబడి
మదిసంశయమింతి లేక మానినియునుదా
ముదమునఁతనయునిరాజ్యము
వదలుచునే తెంచె నింత వైరాగ్యంబే ॥ ౧౭౮

క॥ చనుచుజయాత్రాశ్రమమును
మునిపరు దేపితతినిఁ గురుమూర్తినిబోధఁ
దనమనమునఁగోనియాడెను
జనపతియువ్విధినిభక్తి సమరససూక్తిఁ ॥ ౧౭౯

—:రాజశేఖరుఁడు మార్గంబున గురుబోధము స్మరించుట:—

ఆ. వె॥ రమకు నెలవు లేమి రమణువక్షముఁజేరెఁ
గాళిఁజేరశివుని కాయమట్లు
నాకు నెలవు లేమిసీకృపాదృష్టిని
నిలిచినాఁడభక్తిఁగొలిచినాఁడ ॥ ౧౮౦

క॥ కేవలదృక్కై పురుషుం
డీవసుధఁ గొంతతడవ దెట్లో శాంతిన్
జీవించుచుఁ గ్రీడించిన
జీవన్ముక్తుండటంద్రు సిద్ధమువానిన్ ॥ ౨౮౧

తే. గీ॥ దృశ్యమెందాఁకదోఁచు నవశ్యమంత
దనుక శాంభవినభ్యసించిన నరుండు
దృక్కుగానిల్చి శాంతిని నిక్కముగను
సాధుజనకల్పభూజ! విస్తారతేజ! ॥ ౨౮౨

క॥ చక్కెర నెక్కడనుంచినఁ
జిక్కంగదచీమనోటఁ జిక్కు నెరుకన్
దక్కినచోఁ గర్మంబునఁ
జిక్కఁడు జీవుండు హరినిజిక్కినయేనిన్ ॥ ౨౮౩

ఉ॥ చెప్పినదానినేతిరిగి చెప్పుచునున్నను రామరామ! క
న్గప్పనుమాయచిత్తమువికారముఁ జెందెడుసద్గురూక్తులన్
దప్పనుజన్మబంధమని తజ్ఞులువల్కుట దేశికేంద్ర! నా
కెప్పటికైననీపదములే గతిగానెరనమ్మికొల్చెదన్॥ ౨౮౪

క॥ యోగంబనసాత్మునితో
యోగము తదితరముతో వియోగము మనమా
యోగవియోగములపరి
త్యాగముఁ జేయఁగఁబరాత్మయోఁ బూర్ణతచేన్ ॥ ౨౮౫

క॥ ముక్తీచ్ఛఁ సద్గురువుల
భక్తిఁ సేవించి బోధఁబడసెదువాఁడా
సక్తిఁగలిగియుసీచేఁ
వ్యక్తుండై ముక్తిగనఁశుతథ్యమురామా ॥ ౨౮౬

క॥ జ్ఞానముగలిగిన దానికి
మానము పరిపూర్ణశాంతి మానుటలోక
జ్ఞానముఁ బూనుటమౌనము
తానుండియులేకునికి యుదాసీనుండై ॥ ౨౮౭

క॥ ఓరీజీవుఁడనీవిఁక
లేరా పోయెదముమనము లేలెమ్మిఁక వే
యారామంబులఁదిరుగుచు
నీ గైన ద్రావి బ్రదుక నేరమె శాంతిఁ ॥ ౨౮౮

క॥ దేహంబానిత్యమ్మా
గేహంబా బంధుజనుల కీర్తియ నీకీ
మోహంబా పోలెమ్మిఁక
సాహసమునఁబరమపదము సమకుగుఁజుమ్మా ॥ ౨౮౯

క॥ మీలేయాలోచనమిఁక
నేలేయిదియంత విష్ణుఁడేలేతలఁపఁ
జాలేయోగముఁబూనగ
వేలేమార్గములు వేన వేలేమనసా ॥

క॥ జీవా! నిజబంధులవిడ
లేవా? నేఁజెప్పినట్లు లేవఁగ లేవా?
లేవా? సౌఖ్యములటవిని
రావా? నాతోడ నాత్మ రమణుఁడుకాఁడా॥ ౨౯౧

ఉ॥ సిగ్గొకయింత లేక వనసీమల కేగక దుర్మదాంధులన్
దగ్గఱఁజేర్చి పేర్చితివి దారుణకర్మమునింక నైన నీ
బొగ్గులలోనమానికముఁ బొందెడుదుర్భ్రమమానిభక్తితో
నగ్గురుమూర్తిపాదములయాశ్రయ మొందుము మేలుపొంద (మా॥ ౨౯౨

క॥ ఆరామమందునారా
మారాధనఁ జేయుచునుముమం! రామేశా
కారతనొందుచుదుస్సం
సారానలమార్చు నమృతసారముఁగ్రోలన్॥ ౨౯౩

క॥ నేనొకపురుగునులోకము
లోనన్నియాజ్ఞచెల్లు లోలన మేలా
జ్ఞానముబూనెద రామా!
నేనున్నదిసున్న నీవునేననికన్నన్॥ ౨౯౪

ఉ॥ అన్నివిధమ్ములం దెలియనయ్యెను జ్ఞానముసర్వసాధనం
బన్నగురూత్తమోక్తి పరమాద్భుత మొప్పయథార్థదృష్టిచేఁ
గన్న సమస్తమాత్మయగుఁగాన విశేషమువాగ్వ్యయంబుచే
నున్నఫలంబు? దోషమగు నూరకయుండుట మేలుపొంద మా॥

క॥ తొంట్రేతాయుగనాఁడు
పట్టికిఁగన్నమ్మ చిలుకపందిరిఁగూర్చెన్
నెట్టుచుసర్వంబంబను
గుట్టుగభజియింప భక్తకోటులఁగూర్చెన్ ॥ ౨౯౬

క॥ కింకరుఁడేనిజమైనన్
జంకంబనిలేదు వానిచర్యయెట్లైనన్
శంకరమా నిజభవనా
శంకరమా శాంతికరము సంశయహరమా ॥ ౨౯౭

క॥ గురుచరణాన్వేషణత
త్పరవశతన్ సంచరించుభక్తులుగూడన్
వరమగు శుభకరమగు శం
కరమగు సకలార్థసిద్ధికరమగు దేవి! ॥ ౨౯౮

క॥ జ్ఞానప్రాప్తికిసూచన
మౌనము బాహ్యాంతరంబుమఱచుట నిత్య
ధ్యానమునిష్ఠెఁగుదురుట
యానందరసంబుఁగ్రోలనాత్మస్థితియున్ ॥ ౨౯౯

క॥ కలకాలముహరిపదముల
నిలిచిజగంబులనుజూడనేరనికతనన్
గలవో లేవో తెలియఁగ
వలెనన్నువాదంబు భక్తవరులకునేలా ॥ 300

క॥ పరమార్థైకపరాయణుఁ
డరయంగాఁబోఁడులోక మాత్మస్థితిచేఁ
దరియించునుసంసారము
విరమించు రమించు మించు విభుఁడై శ్రీశా!॥ ౩౦౧

క॥ గురుకేసరి! భూసురకే
సరి! నరకేసరి! త్వదీయసత్త్వము మాకే
సరి యిటుసద్యోగముతో
సరి కదపుట్టువులుమాకు సరిసరినీకున్॥ ౩౦౨

క॥ పంకంబునఁబుట్టితినని
జంకెడుపద్మినికిముక్తి సమకూర్చుటకై
శంకరసహస్రకరుఁడై
పొంకంబునమిత్రమూర్తి పొడసూపుఁగదా॥ ౩౦౩

క॥ మనమునవాక్కునఁగాయం
బునఁజలనంబెట్టిదైన మూఢత్వంబే
యునఁదగులోనెలిశాంతిని
గనినంగదముక్తిపదముఁగను జగదంబా॥ ౩౦౪

సీ॥ శ్రీపరమేశ్వరక్రీడయౌలోకంబు
దానిచర్చింపనధర్మమగును
జర్చింపనెంచినఁజాలువాఁ డెవ్వండు
చాలినతద్జ్ఞన్నుజంతువెది

లేనిభారముపైనఁబూనినజీవుండు
చేయుచుండునుదుష్టచేష్టితంబు
లనరాదువినరాదుకనరాదువేఁకొండు
తత్సత్తనుటనువేదంబులెందుఁ

గీ॥ జేయునదిలేమిఁదెలియుటఁ జిత్తరువటు
దాల్చియున్నాఁడదేహంబుదైనఘటనఁ
జేయుచున్నాఁడఁజేయమిసేత రెంటు
మాయగాదోఁచుఁబ్రదుకిట్లుమామహేశ॥ ౧౫

క॥ సాదరముగఁ దాఁగోరిన
దేదియొయదిగల్గుఁదపము నెచ్చుగఁ జేయన్
దాదాత్మ్యబుద్ధినిల్చిన
రాదగుపరిపూర్తివచ్చురా గురుమూర్తీ॥ ౫౦

ఉ॥ ఏముదితాత్మదృష్టులను నెంతయుశాంతినినించు నెంచునా
కేమహనీయమూర్తికృత కేతరసూక్తిమనమ్మునమ్మున
న్నేమరకేసుకీర్తిప్రతియేమగువారికిరామరామశ్రీ
రామపదత్రయాత్మకులఁ బ్రస్తుతిఁ జేసెదమాటిమాటికిన్ ॥

సీ॥ పరమేశ్వరధ్యానపారీణుఁడైనస
ద్భక్తుండుసంసారపంకజాతఁ
మునసున్నాసర్వశుభములనిచ్చుబు
ధాళికినిబ్రధానమఁదునాఫ్సుఁ

శ్రీసూర్యనారాయణాఖ్యసర్వేశుండ
తనుఁ జేర నెడమిచ్చుజనము మెచ్చ
నిజధర్మపోషణనిరతాత్మమూర్తియై
తిరుగునుజగముల తెగులుమాన్ప

గీ॥ నాత్మవిదుఁడౌట నాత్మయందణఁగియుండు
బయలుపడుచుండుదర్శింపఁ భక్తవరుల
మౌనముద్రనుబూనినజ్ఞానమూర్తి
శాంతికర్మాగసానపర్యంతమూర॥ ౩౦౮

క॥ అయినది కాకుండఁగఁ జే
సియుమారక చెడినది బాగుచేసెదునీ వే
నియమమును లేకిటుచిత్రము
భయ మేలామాకు సర్వభద్ర! ముకుందా!॥ ౩౦౯

క॥ నేరమివిరతియు నేరుపు
సారామలభక్తిశక్తిసామీప్యంబుల్
సారూప్యముసాయుజ్యము
ధీరునకొకఁడౌటఁదపము దృక్కై చేయుల్॥ ౩౧౦

క॥ అలలడఁగినసంద్రంబున
వలనుగలుగు మజ్జనంబు వలదందాఁకన్
వలనుగదాసంకల్పము
లడఁగినసీస్మరణఁ జేయనౌననుకొనిన్॥ ౩౧౧

క॥ లంకెగదా జీవునకును
సంకల్పంబులకునవియు సమసినచో నే
వంకన్ నిలుచునుజీవుఁడు
కింకరపరివృత్తినిన్నుఁ గీర్తింపహరీ! ॥ ౩౧౨

క॥ అలలవలెన్ సంకల్పం
బులుతన్నున్ జుట్టిముట్టఁ బురుషోత్తముఁగే
వలభక్తిమంత్రరాజం
బులఁగీర్తనఁజేయు శక్తిముక్తియుఁగలుగున్॥ ౩౧౩

క॥ శివరామబ్రహ్మలనఁగ
శివరామబ్రహ్మలట్లచేయఁగనీవే
భువనములఁద్రివగతితో
నవిరళముగసంచరింతువనమాలికరా?॥ ౩౧౪

క॥ ఆదిమమూర్తికిఁబ్రకృతివి
గాఁదెలియుదురాత్మవిదులుకళ్యాణీ!నినున్
మాదృశులకునాధారముఁ
నీదయయనిచెప్పనేలనేయిందందున్ ॥ ౩౧౫

క॥ కోరనివికోరఁదఁగనివి
యూరకచేయించిచేయుచుండెదవీసం
సారమునీదనిశాంతిని
గోరికలన్విడిచినిన్నుఁగొలుచువఅకజా!॥ ౩౧౬

క॥ మిన్నక యుందుముగీకను
సన్నలమెలఁగెదము పరమసాధులలోనన్
బన్నగశాయీ! యెవరే
మన్నన్ భక్తులకులోపమా! నినుఁగొలువన్॥ ౩౧౭

ఉ॥ యోజనమాని శ్రీధరుఁబయోజభవార్చితు భక్తకల్పస
ద్భూజు స్వధర్మవర్తనముతోనలరించి తరించుచుండుస
ద్రాజితదీయవృత్తిఁగని తత్తరపాటదిన్యాయమానెని
ర్వ్యాజసుభక్తికల్పితశివార్చనలన్ భవతాపమార్చెదన్ ॥

క॥ గురుబోధమహేశచరణ
సరోజసేవాచతురతసత్సంగతియున్
దరుణీమణిఘనయోగము
పరాపరసుఖములనొసఁగిపాపునుభవమున్॥ ౩౧౯

క॥ కరమనురక్తింబెంచును
పిరామమాత్మకునొసంగు విజ్ఞానంబున్
గరుణించిదానమిమ్మను
సరోజదళనేత్ర దేవి సద్గురుఁడిలలోన్॥ ౩౨౦

క॥ ఘనులుందురు మునులుందురు
వనమందిరమందు లక్ష్మి వసియించుఁగదా
తనుతాపమతనుతాపం
బునుబోవును వారిసేవపుణ్యముమనసా ॥ ౩౨౧

క॥ ద్విజవర్గముద్విజవర్గము
భజియింపఁగరామఫలముభక్షింపఁగనే
విజనస్థలిముక్తిగాఁగన
భజియింపంగల్గునెట్టిభాగ్యమునునసా ॥ ౩౨౨

క॥ సత్యమునమ్మినవారిని
నిత్యమురక్షించువేడ్క నిజరూపముతోఁ
బ్రత్యక్షంబగుటనునా
కాత్యాయనిపదముఁ గొలుతు ఘనతరభక్తిన్ ॥ ౩౨౩

క॥ సర్వాత్మునిసర్వేశుని
శర్వునిదర్శించువేడ్క సద్గురుపదముల్
సర్వావస్థలఁగొలునఁగఁ
శార్వతి కృప శక్తినాకుభక్తునకిమ్మా ॥ ౩౨౪

క॥ తపియింపఁగృపనుబెంచెదు
కపటంబున్ విడనశాంతిఁగాపాడెదవే
నెపమునసైననన్బ్రోచెదు
చపలతలేకుండఁగొల్వఁజాలినదేవీ!॥ ౩౨౫

సీ॥ నిజధర్మమందుననిల్కడచే సర్వ
ధర్మంబులందునాదరముకరము
గురుమూర్తిసద్భక్తిఁగొల్చుటచే బేల
తనమదియెందేనికనమువినము

క్షమకల్మిఁబరులదోషంబులఁదెలిసియుఁ
దెలియనివానియట్టులమెలంగి
తాఁజేయునుపకృతిఁదలఁపఁడెన్నఁడొరులఁ
దెలియనీఁడాత్మశుద్ధినిదలంపఁ

గీ॥ సర్వతంత్రస్వతంత్రత్వసరణిధరణి
శివపరావతారమనఁగఁజెల్లుఁగాని
మనుజమాత్రుఁడె యద్వైతమండనుండు
శాశ్వతుఁడు మద్గురుండు యోగీశ్వరుండు ॥ ౩౧౬

క॥ భగవద్భాగవతులసే
వగదానేనింకఁగోరవలెనుసదా ప
న్నగభూషణ యొసుమరగిన
నగుబాట్లగు జన్మమెల్ల నానాగతులన్ ॥ ౩౧౭

క॥ దోషములఁబాపినిజపద
భూషలమముఁజేయనెంచిపుణ్యాత్ములసం
తోషమునకుఁదగువేషము
శేషాచలవాస! కలుగఁజేసితి జేజే ॥ ౩౧౮

క॥ ఎన్నదరెన్నదరెన్నద
రెన్నఁగ నీరూపులన్నియేయని తెలియన్
పన్నగపతినగపతి! యే
మన్నన్ విన్నఁగనుగొన్న నానందంబా ॥ ౩౧౯

చ॥ చల్లనినీటితో మనసుచల్లనఁ జేసెడుపాటతోడమీా
తల్లియొసంగుసాదమునుఁదద్దయుభక్షణ సేయునోటితో
ఫుల్లసరోజనేత్రుఁబరిపూర్ణుభజించుసుభక్తకోటితోఁ
బల్లవపాణితోఁబరమపావనమాగురుమూర్తివాణితో
నుల్లముచల్లఁజేసినసుయూరసుఖంచెద వేంకటేశ్వరా!॥ 330

క॥ మనమునసిటుతలపోయుచు
జనపతినిజభార్యతోడజని యమ్మునిశాం
తినిగని తపమొనరించుచు
వనమునమునివృత్తినుండె వనజదళాక్షీ! ॥ 331

—: మంత్రి నిరంజనుని వివాహోన్ముఖునిం జేయుట :—

గీ॥ రాజ్యభారంబునహించి రాజసుతుఁడు
మంత్రినసుసంప్రతించుచు మహిమఁగాంచి
ప్రజలఁబాలించుచుండె నప్రతిమశక్తి
హేమకల్పకవల్లి! సాధ్వీమతల్లి! ॥ 332

గీ॥ అంతటనమాత్యుఁడొగి వివాహప్రయత్న
మునొనరింప నిరంజనుఁడనుమతింప
కునికినెంతయు మనమునవోర్వలేమి
బుజ్జగించుచునివ్విధిబోధఁజేసె॥ 333

ఉ॥ భారతమందు సత్కథలసారముగావినుచుండునీకు సం
సారమసారమంట యపచారముగాదె తలంచిచూడఁగా
ధీరచరిత్రముల్ బుధవిధేయపవిత్రపతివ్రతామణీ
చారుచరిత్రముల్ సకలసాధుచరిత్రలు కృష్ణకీర్తనల్॥ 334

క॥ శంకరుఁడర్థంబయ్యెన్
బంకజనాభునిహృదయ మభావంబయ్యెన్
బంకజభవుఁడున్ మ్రాకై
జంకిరి సద్భార్యలకయి సంశయమేలా! ॥ ౩౩౯

క॥ నమ్మవలెరాము నైనన్
నమ్మంగావలెను రామునిగుడిని మఱియున్
నమ్మందగు నారాముము
నమ్మంగారాదు సువ్వో! నయవిరహితులన్ ॥

క॥ అనుకూలపుసతియైనన్
మనమునురంజించు సుగనిమార్గంబెంగన్
గానిన్యాపెడుపరలోకముఁ
దనపెనిమిటితనకుఁదాన దైవంబగుటన్ ॥ ౩౪౧

క॥ నిర్వాణపదమునిచ్చున్
గర్వములేనట్టిరమణి కపటమువీడన్
సర్వముఁదెలియంబల్కున్
శిర్వాంగాఁజేయుఁ దానుశక్తియయగుటన్ ॥ ౩౪౨

క॥ భ్రమరముకమలముఁనొక్కట
సమకూర్చినదేవుఁడిచ్చు సకలశుభంబుల్
అమరత్వమైననొల్లమి
సమరసమిథునము తనయెడసర్వంబుంటన్ ॥ ౩౪౩

క॥ తేజోబలయశములకై
భూజనులు భజింపఁ గల్పభూజముభంగిన్
దాఁ జేయును బరిపూర్ణుల
రాజీవదళాక్షి! మిత్రరత్నంబిలలోన్॥ ౩౮౦

క॥ గురుకృప సత్పథముంగని
తరుణీమణియోగమునను ధైర్యంబబ్బన్
బరమాత్మతోడ నైక్యము
నరపతి! హరికరుణచేత నరుఁడందఁగదా॥ ౩౮౧

క॥ తనకిల శాంతి నొసంగెడు
వనితామణిగల్గియున్న వైరాగ్యంబున్
ఘనబోధమిచ్చుగురువరు
ననుకూలపువాక్యమొసఁగు నాత్మప్రీతిన్॥ ౩౮౨

క॥ నిజధర్మముభజియించుట
భజియించుట దేశికేంద్రు భామామణినిన్
భజియించుట భక్తాళిన్
భజియించుట యాత్మమూర్తిభజనము జీవా!॥ ౩౮౩

గీ॥ ఈశ్వరేచ్ఛవలన విశ్వంబుమఱచిన
గురునికరుణవలనఁ దరుణివలన
భక్తకోటివలనఁ బ్రాప్తించు మోక్షంబు
జాతరూపమూర్తి! సాధుకీర్తి!॥ ౩౮౪

-: నిరంజనుండు వివాహమువలదని స్త్రీనింద యొనర్చుట. :-

క॥ అనవినిజీవుండను మా
నినులఁ భువినమ్మరాదు నీచెప్పినచొ
ప్పునగానరారు ముదితలు
మనమునకుఁ శాంతినీరు మంత్రివరేణ్యా! ॥ ౩౮౫

క॥ కట్టింతురు కొట్టింతురు
పుట్టింతురు లేనిమాటఁ బూవుంబోఁడుల్
పెట్టింతురు విషమైనఁ
గట్టా! యిటువంటిచిత్రకర్మము తగునే॥ ౩౮౬

క॥ మందుండై కాంతలకుఁ
సందిచ్చినఁజావునిజము సంశయమేలా
మందైనఁబెట్టుకుందురె
విందునకేయొప్పుకొన్న వెలఁదులుమంత్రీ! ॥ ౩౮౭

ఆ॥ వె॥ సమ్మతంబునున్న స్వాగతంబేదన్న
నమ్మకంబులేదు నవ్వరాదు
బొమ్మకీలనుండు బొందికోమాత్రంబు
కొమ్మపట్టువిడుకొమ్మ గాదె ॥ ౩౮౮

ఉ॥ లేదుగదా కృపాలవము లేమలయందునఁ గాముకాళికిఁ
లేదుగదా సుఖంబులవలేశము వారలయందు ధైర్యమా
రాదుగదా యథావిధిగఁ బ్రాంజలులై భజియించి మ్రొక్కినఁ
బోదుగదా మనోమలిసముఁ దరిజేరగ నెట్లుపూరుషుల్

ఆ. వె. చదువఁజదువఁజదువ సంసారమాత్రేదు
వంటలేదు కడుపుపంటలేదు
మంటమగనిజూడ మహిళాసభలనుంటఁ
జదువునకుఫలంబుశాంతిగాదె ॥ ౨౫౦

ఆ. వె. కంటనిద్రలేదు ఘనముద్రయూగాదు
తిండిలేదు యోగముండికాదు
కరుణగలదుమెండు కామంబులేదంత్రసు
ధర్మమునకుఁగాంతిదాంతికాదె ॥ ౨౫౧

క॥ కాంతలుకాంతులనమ్మక
కాంతునినోదార్చ వారుఁగైకొంద్రకటా
యంతఃకరణాంబుదుః
సుంత్రైననుగరుణలేదుసుమి మంత్రివరా! ॥ ౨౫౨

క॥ కాంతలహృదయముమాయా
క్రాంతము నిజకాంతహృదయరంజనకేళీ
భ్రాంతం బంతశ్శూన్యము
కాంతము హరిభక్తిఁజొకఁడు గడచునుసచివా॥! ౨౫౩

క॥ గాసిలజేసినఁగాంతలు
మోసముఁజేయంగనెంచి మోహము లోనన్
ద్రోసినఁదెలియగవశమే
కాసునకుంగాఁడునరుఁడు కష్టంబవలన్ ॥ ౨౫౪

క॥ ఎక్కువమక్కువఁజూపిన
గుక్కలవలెఁద్రిప్పుచుండ్రు గోలలుధరలోఁ
జక్కలఁబెట్టఁగవారికి
నక్కలుచాలవ్వగ బుద్ధినైపుణ్యమునన్ ॥ ౩౫౫

క॥ జవ్వనిముందరపురుషుఁడు
గవ్వకుఁగొరగాఁడు వట్టికష్టంబేలా
గువ్వవలెగూఁటనుండిన
నివ్వసుధన్ గొంతబ్రదుకు నెట్లోసచివా!॥ ౩౫౬

ఆ. వె. కామియైనవాఁడు కల్లసంసారంబు
లోమునుంగు నాత్మలోఁగలంగుఁ
గామిగానివాఁడు రాముఁడై నిశ్చింత
సహజకర్మసలిపి శాంతిఁజెందు ॥ ౩౫౭

క॥ మగవాఁడుపిచ్చివాఁడై
మగువలనెఱనమ్ముచుండు మాయాక్రాంతం
బగునఁటస్త్రీరూపంబహా!
తగునేయద్దాన భ్రాంతిఁదగులన్ వగలన్ ॥ ౩౫౮

క॥ అనవినిసచివుఁడునరపతిఁ
గనియెంతయుమనమునందుఁ గటకటఁబడియు
ట్లనియెను నిరంజనునితో
వినయమ్మునయమ్ముఁదెలియవే యిటుకలదే ॥ ౩౫౯

క॥ ఓజలసన్నిధిని౯ని
ర్వ్యాజపుసద్భక్తిని సకలాగమములను౯
రాజా! నేర్చియునీవి
యోజ౯ బలుకంగనెచ్చునో జనమనుచు౯ ॥ ౩౬౦

గీ॥ ఇతనికింకొక్కసారినే హితముదెలిపి
చూచెదనుగాకయంచు సంకోచమెడల
నూదిచెప్పనాగెను సచివోత్తముండు
రాజునకుఁజూడ నేజాడరక్షమంత్రి ॥ ౩౬౧

ఉ॥ లోకముఁజూచిచూచి మదిలోఁగలగంబదిలేదు జీవుఁడా
లోకులుకాకిమూకలు సులోచనదృష్టిఁగనంగన౯సదా
కేకలువేయుచుండెదరు కీర్తికిఁబిండపుప్రాప్తికి౯ గటా!
ప్రాకెదువారిఁబట్టుకొని పాపముదుఃఖముకష్టపూతుది౯ ॥

చ॥ గురునుపదేశశక్తి ననుకూలసతీమణిసేవ భక్తిచేఁ
గరమనురక్తిచేఁ బ్రబలకామముచే మహనీయసూక్తిచే
సరసపుదృష్టిచే విమలసాత్త్వికభావముచే సదామనో
హరముగఁగొల్వ జీవుఁడుపరాత్మనుజెందెను రామసత్కృప౯॥

తే. వారిమార్గమందు వీరిమార్గమునందు
జారిపడగనేల సజ్జనునకుఁ
దనకుభద్రమగును దనమార్గముంబట్టి
జాతరూపమూర్తి సాధుకీర్తి ॥ ౩౬౪

క|| చదివినపండితులగుదురు
విదితముగాకున్న యెడల వెఱ్ఱులెపురుషుల్
చదివినఁజదుపక యున్నన్
ముదితలువిద్వాంసురాండ్రుపుట్టుకనృపతీ || ౩౬౫

క|| చదువుచుగ్రంథంబులనే
నదరెడుపురుషులనుగనరు వనితలుభువిలో
ముదమునఁదమహృదయంబున్
జదివినఁ జూచెదరువారి నాత్మీకదృష్టిన్ || ౩౬౭

క|| చదువనఁగాశ్రీహృదయము
చదువుట వేఱొండుగాదు చదువిలదానిన్
ముదితల కృపలేకుండిన
విదితంబగుటెట్లు బ్రహ్మవేత్తలకైనన్ || ౩౭౨

క|| మునివరులుయజ్ఞపురుషుని
మనమునసద్భక్తినిలిపి మాధవ్రుఁడడుగన్
మనసారసన్నమిడమినిఁ
గనిమునిసతులతనిఁబ్రీతుఁగావించిరో గేన్ || ౬౫

క|| అంగనవిభజించిభజిం
చుంగదతత్త్వజ్ఞధర్మసూక్ష్మజ్ఞ ఘనున్
శృంగారంబునఁ బాలిం
చుంగలచిజడపతి నేలఁజూపించుఁగదా || ౯౭

క॥ అంగనకును హంసంబున
కుం గమనంబొకఁడు తెలిసికొనఁదగుభేదం
బంగనపురుషోత్తముఁగొ
ల్చుంగతిహంసమెపుడునడుచున్ విధి వెంటన్ ॥ 320

క॥ చారువుఁదోలిచెడుభ్రమరము
నీరజబంధంబునందు నిలుచుఁగదలకే
ధారుణిఁబెక్కులుబంధము
లారయఁగాఁబ్రేమబంధ మదియుస్వమొకో ॥ 321

క॥ కుంతియు సాక్ష్యంబిచ్చున్
గాంతలసాహసపుఁబనికిఁ గఠినతకు దయన్
గాంతునిఁగాపాడుటకున్
శాంతింబొందింపఁగల్గుసమరసమునకున్ ॥ 322

క॥ వింతా? కాంతయతలఁచిన
నెంతైనన్ జేయఁజాలునిహపరములకున్
శాంతిఁజెలువున్ మనుపన్
గాంతారత్నంబు విలువగట్టన్ వశమే ॥ 323

క॥ ధనహీనులు పరతంత్రులు
ననువగుసామగ్రిలేమినన్నివిధములన్
వినయంబుగాంచినారట
మనసారగ నిట్టినీతిమంతులుగలరే ॥ 324

ఆ. వె. శక్తిలేమి సంసారజగమున నీతియనఁ
భీతియైన దాని పేరుగాంచు
పెండ్లిగామిఁ గొంత పెద్దలకింబబ్బు
నీతికొలకు వేల నియమమేల॥ ౩౨౮

క॥ పురుషార్థము స్త్రీయనన
త్పురుషార్థముగాక వట్టితుంటరికొలకా
పురుషార్థం బేయిచ్చినఁ
బురుషార్థంబగుట నిజము భూపతివినుమా॥ ౩౨౯

క॥ మతిలేక కొంపెలుందురు
గతిలేకయు గొందఱట్లు గణ్యతకొఱకై
చతురత వేషంబుందురు
క్షితివాంఛారహితులైన సిద్ధులభంగిన్॥ ౩౩౦

క॥ కాంతలు సంతోషంబున
నుంతురు తమపతుల నెపుడు మోహాంబువార్ధిన్
ముంతురు వైరమ్ముంతురు
నింతురు విజ్ఞానదృష్టి నిఖిలముఁ దిలకోన్॥ ౩౩౧

క॥ వాసవసంపద గలిగిన
దాసుని బలెఁ గొల్చుచున్న ధర్మంబున్నన్
గాసునకుం గాఁడాతఁడు
భాసింపఁడు కాంతలందు భగవన్మాయన్॥ ౩౩౨

క॥ ఏకాంతబోధమొసఁగెడు
నాకాంతయముక్తికాంత యాస్థానంబే
నాకముశూన్యస్థానము
శ్రీకామేశ్వరుఁడుగురుఁడు సిద్ధముజీవా ॥ ౩౮౦

వ॥ మాటలనిపుణతఁగొంతయు
నీటగురూపమునఁగొంత నీతినిబ్రీతిన్
బాటవముననొకకొంతయుఁ
జేటున్ దొలఁగింపఁగలవుచేడియలందున్ ॥ ౩౮౧

క॥ అలించుము మేలెంచుము
చాలించుము దౌష్ట్యమింకసంసారములోఁ
గీలెంచుముసద్గురుకృపఁ
బాలించుములోకిమెల్లఁబ్రాజ్ఞతజీవా ॥ ౩౮౨

క॥ జగమునుశోధింపఁగనీ
కగుసేవగపేల చాలునాత్మారామున్
దగురీతిగూడిశాంతిని
విగతాఘుఁడవైన సర్వవిధములమేలౌ॥ ౩౮౩

క॥ ఎద్దియుఁగోరమితానై
యుద్దికయొనరింతుసర్వముత్సాహముతో
సుద్దులచేముద్దులచే
దిద్దన్ మనవశమెయాత్మ తెలుపదెజడులన్ ॥ ౩౮౪

క॥ కాంతాముఖమదిసుమన
స్సంతాపహరంబుసకలసత్వనిధానం
బంతఃకలుషంబయ్యెఁ
జింతారహితంబువిబుధసేవ్యముశశియే ॥ ౩౦౫

క॥ వినివిననొల్లనిచందం
బుననిట్టులఁబల్కెమంత్రిపుంగవుతోన
జ్జనపతి ధీరునిభీరుగ
నొనరించుటనైజమందురువిదలకెందుఁ ॥ ౩౦౬

క॥ ఎన్నెనిచెప్పుమయ్యా
పున్నెంబునకంతరాయమువివాహంబొఁ
గన్నులఁగనమేయూఁగలు
తన్నుకొనఁశ్లేష్మమందుఁదగులుకొనంగఁ ॥ ౩౦౭

క॥ పురుషార్థముజనియించిరి
ధరఁగామినులన్నమాటతథ్యంబనఁగఁ
హరియింతురుమానసమో
వరమారుతపంచకంబొవలచినకతనఁ ॥ ౩౦౮

క॥ బొంకులమరగినటంకులు
జంకుచుసంసారజలధిసర్వవిధములఁ
సంకటపడిశంకలచేఁ
గ్రుంకుదురేగానిభక్తిఁగొల్వరెవరినిఁ ॥ ౩౦౯

క॥ జలజాక్షులవరియించిరి
జలజాతభవుండు హరుఁడు జానకిపతియున్
వలఁజిక్కి కాదువారటు
బలవంతులఁ జేయుచుంట్రు ప్రాజ్ఞతనుండున్ ॥ ౯౦

క॥ వారెక్కడ పిరెక్కడ
నారీమణులందుఁ జిక్కినారు భయమునన్
భారంబై తోఁచు మనసం
సారంబద్దానరసము సత్వము లేమిన్ ॥ ౯౧

ఆ. వె. మిడుత యగ్గియందు మిక్కిలి ప్రీతినిఁ
గన్నుగాన కెట్లు కాలిపోవు
ధరణిమూఢజనుఁడు తరుణులకూటమిఁ
దత్త్వమరయ లేమిఁ దన్నుకొనఁడె ॥ ౯౨

గీ॥ బ్రహ్మచర్యంబు నేతికిఁ బ్రతిగనుండు
నేతిబీరకుగా గార్హస్థ్య మేతగునిఁక
బోల్చిచూడంగనీ వెంతబోధపడుచు
మంత్రి! యీప్రయత్నంబింక మానుమనఁగఁ
జింతచేసెనీరీతిని మంత్రియంత ॥ ౯౩

ఉ॥ ఎన్నిదినంబులీజగతి నేవజనింపఁగ నాశ్రయించిసం
పన్నులపంచఁబొంచి యుపసర్గముకోల్పడి దుష్టవాసనల్
చిన్నగ పెంచి సీపదముఁ జేరగ లేక కృశించుచుంటయు
న్నన్న సహింపఁజాలము దయామయ రామయప్రోవవేమయా॥

క॥ ఇతరులఁ బోధించుటలో
మతిచాలునేకాక బుద్ధపూజమునుమిత్రా
గతిలేమిఁ జెప్పఁబూనుట
మతిహారియెడనిల్పనేనియురగుదురతనిన్ ॥ ౩౯౫

క॥ గుట్టుగనేకాక్షరినే
గట్టిగజపియించుమన్నుకాననసీమన్
గట్టింపుముపూరిండ్లన్
బుట్టింపుమువానమందుబుద్ధిమతుఁడా! ॥ ౩౯౬

క॥ జాలిన్ వాలముద్రిప్పుచు
నేలన్ గూలంగ నేలనే మెతుకులకై
చాలున్ జాలునుగిరిజా
లోలున్ గనుమనమ! యాత్మలోముక్తీచ్ఛన్ ॥ ౩౯౭

క॥ తనువా! రోగాస్పదమది
మనువా! పరగృహములందు నుతియిల్లాలా
ధనమా! బంధుగులా! ఛీ
మనమా! శాంతింపుమా! సమాధినిమనుమా॥ ౩౯౮

క॥ వనమా! యిటమందిరమా
జనమా! భక్తాళిఁగొల్వఁజనుమా! గనుమా!
వినుమా! తచ్చరితంబులు
ఘనమా! శాంతింపుమా! సమాధినిమనుమా! ౩౯౯

క॥ అనుమానంబే జన్మం
బనుమా యభిమానమున్న నజ్ఞానంబే
యనుమా గురుమూర్తిఁగనుమ
మనమా శాంతింపుమా సమాధినిమనుమా ॥ ౪౦౦

క॥ జననీజనకులు కరుణన్
గననీ నిజకాంత ప్రీతిఁ గననీ ధనమున్
గొననీ శిశువులఁ గననీ
మనమా శాంతింపుమా సమాధినిమనుమా ॥ ౪౦౧

క॥ చనెదో క్షేత్రంబులకిఁకఁ
గనెదో పుత్రులను జన్మకాంక్ష హరింపన్
వినెదో పురాణములఁ ఛీ!
మనమా శాంతింపుమా సమాధినిమనుమా॥ ౪౦౨

క॥ మనువా జపియింపవుగద
చనవా నిన్నెవరు చేయఁజాలరు ఘనభం
జనమా నడకెద వేటికి
మనమా శాంతింపుమా సమాధినిమనుమా॥ ౪౦౩

క॥ తినునా పెట్టినసాదము
కనునా నీముఖముఁ దానుగనఁబడునా తె
మ్మనునా తెచ్చిన ధనమది
మనమా శాంతింపుమా సమాధినిమనుమా॥ ౪౦౪

క॥ వినియెదవా చుట్టంబులఁ
గనియెదవా దుష్టచరితఖలులంగలియన్
జనియెదవా హాసిగ్గగు
మనమా శాంతింపుమా సమాధినిమనుమా!॥ ౪౦౫

క॥ చనునే కర్మముఁ బెంచఁగఁ
జనునే లోకంబు నెంచ నాథులవిడఁగాఁ
జనునే! తెలియవుగదఛీ
మనమా శాంతింపుమా సమాధినిమనుమా! ॥ ౪౦౬

క॥ తలిదండ్రులసద్బోధలఁ
బడయనియీవడుగుఁ దెలియఁబలుకన్ వశమే
తడయక సీతనిఁగొని నే
వెడలెదజా బాలిబ్రహ్మవేత్తలఁగనఁగన్ ॥ ౪౦౭

క॥ అనుమానము చేఁగుందుచు
ననుకూలంబైనమార్గమందు నడువన్
గనినవ్వననుచులోకం
బునుగనిసౌఖ్యంబుఁగోలుపోవునుజడుఁడున్ ॥ ౪౦౮

ఆ. వె. చదివినాఁడుగానిసంశయమాపోదు
చదువఁజదువఁ దెలివిసన్నగిల్లెఁ
బిదపఁజూడవీఁడు మొదటినిబోలుఁగా
గుణముకుదుర దేమికొట్టుకొందు॥ ౪౦౯

ఆ. వె. ధర్మమెఱుఁగరామి దయయుసత్యములేమి
నీశ్వరేచ్ఛలేమి నెఱుకలేమి
గుణముకుదురదేమికొట్టుకొందునుసామి
స్వాత్మధర్మనిరతభక్తకామి ॥ ౪౧౦

క॥ అనుకొనుచు రాజసుతునిం
గనియిట్లను మంత్రివరుఁడు కాలంబెంతేఁ
జనియెనుసీతలిదండ్రులఁ
గని యనఘా వారిఁజూడఁగాఁజనెదమునాఁ ॥ ౪౧౧

క॥ దైవవశమ్మునవో యనఁ
గావల్లెయటంచు నూచెఁ గాతలనృపుఁడున్
వేవేపయనముచేసెన్
భూవిభునిన్ మంత్రిపుంగవుఁడుసంప్రీతిన్ ॥ ౪౧౨

మ॥ దినముల్ దీర్ఘములై ప్రసూనలతలున్ దేజోవిహీనంబులై
ఘనకాంతారములగ్నినాహుతములై గాలింబరాగంబులున్
మినుముట్టన్ బ్రబలంబులై హ్రదములన్నీరంబుశూన్యంబునై
చనఁదాపంబొనగూడుఁబాంథులకుభీష్మంబై నగ్రీష్మంబునన్ ॥

క॥ చనికాంచెంజనపతిసుతుఁ
డనుపమసత్తేజుఁబరమహంసమునీంద్రున్
గనిజన్మముమాటనదో
యుగమ్రొక్కుచునాత్మశాంతినర్థించియనెన్ ॥ ౪౧౪

ఆ. వె. సాధుదర్శనంబుసన్మంగళంబను
మాటసత్యమాత్మమహిమగలిగెఁ
జదువులెల్లనిపుడుసఫలత్వమునుఁగాంచె
మనమునందుఁదగిలెమఱపురాదు ॥ ౮౧౫

ఆ. వె. పట్టినంగమొంతగట్టిగాఁబిత్తల
పాత్రనుంచిరుద్దఁబట్టుఁగొనుచు
కాలిక్రిందనొక్కిగట్టిగాఁదోమిన
నగ్ని యోగముననయంటుఁగాక ॥ ౮౧౬

క॥ గురుచరణశ్రీశరణము
శరణముభవతారకంబుశాశ్వతశుభముల్
గరమర్థించినవారిక
నిరాపలుకులఁగలనిజమునేఁడిటఁగంటిన్ ॥ ౮౧౭

శ్లో॥ సకలగుణనిధానంస్వానుభూత్యేకమానమ్
నిజగురుచరణాబ్జధ్యానలోలంసుశీలమ్
నిఖిలనిగమసారంవీతసంసారభారమ్
పరమపురుషమీశంభావయేబాలవేషమ్ ॥ ౮౧౮

క॥ శ్రీదంబై బుధజనులకు
మోదదమై భక్తకోటిమోహముబాపన్
వేదార్థంబనదగునీ
పాదద్వయిఁగొల్వనీకృపన్ గురుమూర్తీ ॥ ౮౧౯

క॥ పరమాత్మయుగురుమూర్తియు
హరిహరులునుశిష్యతతియునజుఁడునుసకలం
బరయఁగనీరూపంబై
పరఁగెడుతత్త్వమసివాక్యపరగురుమూర్తీ॥ ౪౨౦

క॥ సాధులువర్ణింతురుగురు
బోధలుభవబాధఁబాపుపురుషోత్తమునా
రాధనకుఁబాత్రునిగా
శోధనజేయఁగలుగుననుచుఁగురుమూర్తీ ॥ ౪౨౧

క॥ గురు దేవదేవు విశ్వం
భరుఁ జిన్మయు సకలభక్తపరిపాలనతత్
పరు మోక్షశ్రీచేత
స్సరసిజసుచారుధీరు శాంతిభజింతుఁ ॥ ౪౨౨

గీ॥ కొంతకాలమైనశాంతినిచ్చెడునీదు
మూర్తిగాంచసిమ్ము కీర్తిగాంచు
మాయువల్పమగుటహాయిగాబ్రతికెద
భక్తకుతుకసాంద్ర పండితేంద్ర ॥ ౪౨౩

క॥ హేయపుసంసారాబ్ధిని
గాయంబనునీఁతకాయకడతేర్చునట
య్యాయూరక మోహమునం
ద్రోయకనీపాదయుగముతోడ్పడనిమ్మా ॥ ౪౨౪

శా॥ ఈవేసద్గురుబోధలన్ మఱచి తే నేమందు నేనుందు సం
సేవింపందగునెద్ది బుద్ధిమమతన్ ఛేదించువిజ్ఞానమే
నైకైవల్యంబని చెప్పి చూపుగురునిన్ గామించి సేవింతు శ్రీ
దేవీపాదసరోజపూజనపరాధీనార్తచింతామణీ ॥ ౮౨౫

క॥ సద్వంశమందుబుట్టిన
విద్వాంసులుమౌనముద్ర వేల్తురుసర్వం
బద్వైతసిద్ధిఁగనియెడు
సద్వాదులచరితమిట్లుసమరసమూర్తీ ॥ ౮౨౬

క॥ ఎన్నందగుసద్గుణముల
వెన్నైనన్ సున్నతత్త్వమే లేకున్నన్
నిన్నున్ మెప్పించుటలో
నన్నా నీచరితమెన్న నౌనౌనన్నా ॥ ౮౨౭

క॥ ఎప్పుడునీపదభక్తికిఁ
దప్పన్ మనమపుడెతప్పుఁదత్త్వంబునకున్
గప్పినమాయనువిప్పఁగఁ
దెప్పైరక్షింపనీసుదృష్టియచాలున్ ॥ ౮౨౮

క॥ పట్టుదలబంధమందురు
పట్టున్ విడుచుటయె మోక్షపథమందురు చే
పట్టుముననునీపదములఁ
బట్టితిముక్తిచ్ఛజన్మబంధము విడఁగన్ ॥ ౮౨౯

క॥ శాంతియిల నేరికబ్బుఁ
శాంతియనఁగ నెద్ది శాంతిసాధన మేదో
శాంతికిఫల మేమిటియా
ద్యంతంబుల శ్రుతులఁగనెద ననవినిమునియుఁ ॥ ౪౩౦

క॥ నీజనకుండా జనకుని
యోజన్ రాజర్షి యతనియొద్దఁబడయుమా
రాజసుత విద్యలన్నిఁటి
నాఁజేరిభజించెగురునినందాత్ముండై ॥ ౪౩౧

ఆ. వె. అంతలోనమంత్రిఁయాతురంబున సైగఁ
జేయన్నృపతి రాజశేఖరుండు
బుద్ధిమలముఁబాప బోధింపఁదొడఁగెస
ద్గురునియాజ్ఞఁబ్రీతిఁగొమరునకిటు ॥ ౪౩౨

తే. గీ. సకలమూర్తిస్వరూపుఁడా శంకరుండు
గ్రహములకురాజు సూర్యనారాయణుండు
నాత్మమూర్తియుబ్రహ్మంబు నైనగురుఁడు
భక్తవరదుండుసులభుండు బ్రహ్మచారి
సర్వశక్తులనీకిచ్చు శరణమొందు ॥ ౪౩౩

క॥ అంధుండెవ్విధిఁగనునను
బంధచతుష్టయము ప్రేమబంధమునందుఁ
బంధురగతిగురుసేవల
బంధమువిడక హరికృప శివమగుటజీవా ॥ ౪౩౪

క॥ రాగంబున యోగంబున
భోగంబున నలరుమిథునముం గొనియాడన్
వాగర్థంబుల రెంటిని
బాగుగ వివరింపఁగలుగు ప్రాజ్ఞత గలుగున్ ॥ ౪౩౫

క॥ తనతోడ నైక్య మొందిన
మనుజుల సేవించి వారిమైత్రిని శాంతిం
గను శాంతియ బ్రహ్మమగుటఁ
గనును గరతలామలకముఁగా మోక్షంబున్ ॥ ౪౩౬

క॥ అన్యోన్యము కృపగలిగిన
ధన్యులు దంపతులుగాక తథ్యము భువిలో
నన్యాయము కపటవచో
విన్యాసముఁ జేయువారు వెడఁగులుగారే ॥ ౪౩౭

క॥ మానిని విషయము దెలిసియుఁ
గానఁడు తదనుభవము సతి గలుగకు నగుత
ద్జ్ఞాసము పూర్ణము మిథునము
చే నటు సర్వంబు గురునిచే శిష్యునకున్ ॥ ౪౩౮

క॥ కానన్ జ్ఞానము గలిగిన
మానవులే మిథునమందు మాయన్ దాఁటన్
బూనుదు రజ్ఞులు శరణము
మానీ యహంకారమొందు మానరు జీవా! ॥ ౪౩౯

క॥ పరలోకముఁగోనియాఁడక
పరమాత్ముఁ గురునిభక్తవరులఁ దరుణీ
గరమర్థించినఁజాలుఁ
బరమార్థముకొఱకుఁబొట్లుపడఁగానేలా ॥ ౪౪౦

క॥ శ్రీరామమంత్రమభవున
కారామజపంబుమునుల కారామమునన్
శ్రీరామరమణజనులకు
నారాయణతత్త్వబుద్ధి నయముగనొసఁగున్॥ ౪౪౧

క॥ ఆరామపదము జేరక
పారముగనుఁగొనఁగవశమె భవజలనిధికా
దారినిఁజూపఁగగురుఁడా
ధారంబని పెద్దలంద్రుతథ్యముజీవా!॥ ౪౪౨

క॥ సత్యపువర్తన లేమిన్
నిత్యముదుఃఖించుచుండునీచుఁడుపాతి
వ్రత్యముగల్గిననాతిని
సత్యముగాఁగాంచఁడయ్యొ!సమరసదృష్టిన్ ॥ ౪౪౩

క॥ నవరసభరితస్వాంతుఁడు
భవసాగరతారకంబుభవ్యాత్ముఁడున్
నవయౌవనకాంతుండై
భవుఁడనఁగఁదగిననరునిఁ దరుణివరించున్ ॥ ౪౪౪

క॥ సత్యంబప్రత్యక్షము
నిత్యముసౌఖ్యంబునిచ్చునీరజముఖి తాఁ
బ్రత్యక్షంబీరెంటన్
బ్రత్యయమే లేనివాఁడు భవమీటుదాఁటున్ ॥ ౧౧౫

క॥ దేశికుఁడుపదేశమున స్వ
దేశమునన్ హంసయాన దీవ్యత్త్రికినా
వేశముఁ గల్పించి భ్రమల
నాశముఁ జేయంగఁ దాఁటునరుఁడిలభవమున్ ॥ ౧౧౬

క॥ మనమెపుడు శాంతిఁ జెందునొ
తనువపుడే చేయుఁగాస్వధర్మం బెందున్
దనలో వెలినైక్యంబునఁ
గనఁ జెందున్ జీవుఁడుండఁగాఁ దావులనన్ ॥ ౧౧౭

క॥ కాలోచితనిజధర్మము
లాలోచన మేలఁ జేయు మనిశమ్మున్ శ్రీ
లోలునిభక్తులఁ గొల్వుము
చాలున్ సంపూర్ణశాంతిసమకురుజీవా ॥ ౧౧౮

క॥ ఆత్మారాముండును బు
ణ్యాత్మారాముండగు సకలాత్మారాముం
డాత్మయేతరవస్తువు
స్వాత్మన్ గణియింపఁడుండునో రాజీవా ॥ ౧౧౯

క॥ స్థూలముసూక్ష్మముధర్మము
స్థూలముభేదంబుధర్మసూక్ష్మంబొకఁడే
కాలముకర్మముకర్తయు
వేల్పులువిశ్వమగుచువిభుఁడొకఁడుండున్ ॥ ౪౫౦

క॥ సూక్ష్మముననైక్యముండున్
సూక్ష్మపుదృష్టిఁబరికింప స్థూలముభేదం
బేష్మాతలమందంతట
లక్ష్మినరుఁడొకఁడతనివిలాసమెజగమౌ ॥ ౪౫౧

క॥ పాత్రలకల్పనలొందన
సూత్రమునంగట్టవచ్చుఁ జుమ్మందఱనున్
బాత్రగనటియించెడువోఁ
బాత్రతలేకుండుస్వేచ్ఛపాటింపగన్ ॥ ౪౫౨

ఆ. వె. పశువుకసవుమేయ వర్ధిల్లుక్షీరంబు
పాముపాలుద్రావఁ బ్రబలువిషము
మంత్రముచ్చరింప మహానీయుఁడెట్లగు
సర్వమెంచఁబెంచుసహజగుణము ॥ ౪౫౩

క॥ సరసుండైజననముచేఁ
బరుసములంబలికియైన భవ్యాత్మకుఁడౌ
ధరసంగీతమునేర్చిన
నరుఁడేడ్చినబాగెయండ్రు న్యాయంబేగా ॥ ౪౫౪

ఆ. వె. పగయుమంచిదెచ్చుఁ బన్నీరువానితోఁ
జెలిమి సేయఁదెచ్చుఁ జెట్టపాఁకి
సరసుఁడైనవాని సన్నిధిబాగెప్డు
జాతరూపమూర్తి సాధుకీర్తి ॥ ౭౫౫

క॥ లోకవ్యవహారంబున
కేకద పూర్వోత్తరముల నెంచుటపరమా
ర్థైకపరాయణులొనరిం
త్రేకర్మములైన నూరకేయొగిజీవా ॥ ౭౫౬

క॥ చేయమిజ్ఞానంబగునా?
చేయుటయజ్ఞానమెట్లు? చేయఁగవలయుఁ
జేయుటలోఁగామము లే
కేయెడసుజ్ఞాన మిద్దియేసుమిజీవా! ॥ ౭౫౭

ఆ. వె. పువ్వారాలిపోక బూడిదెగుమ్మడి
వడియమునకుఁనగునె? వడిగఁద్రుంచఁ
గర్మమాపరాదు కాలంబుగాకుండ
సహజధర్మమదియశాంతికరము ॥ ౭౫౮

ఆ. వె. మూతిమీసమున్న నాతికిరోఁతది
మగనికదియులేమి నగవుకాదె
ధర్మబుద్ధిఁదలఁపఁ దత్త్వంబుతత్త్వంబు
జాతరూపమూర్తి! సాధుకీర్తి!॥ ౭౫౯

ఆ. వె. పాత్రలందఱొకటెపాడినరంగంబు
పాత్రమగునె? యదియపాత్రులెఱుఁగ
రేమిసేయవచ్చునీశ్వరమాయయ
మోహవార్ధిజనుల ముంచుచుండు ॥ ౪౬౦

క॥ తనధర్మముతనుగూడిన
ఘనశక్తియుశివుఁడుగూడుగతి శంకరమై
మనమాత్మంజేయుటచేఁ
గనుహాఁనింబరమపదము కవిపూర్ణుండై ॥ ౪౬౧

క॥ తానేలాభముఁబొందక
దానిన్నరుఁడేలఁజేయుఁ దాఁదాఁగాఁగా
దానిగుణమేమయినఁజు
క్కానియలేకుండఁబడవ కాదుగజీవా ॥ ౪౬౨

క॥ తనభర్తృత్వముఁబ్రోవఁగఁ
దనభార్యన్ బ్రోవవలెనుదక్ష్యంబట్లే
తనసత్త్వముఁగనినీవ్వఁగ
మనవలెనిజధర్మమందు మనుజుఁడుసతతమున్ ॥ ౪౬౩

క॥ కారణమునఁగార్యంబగుఁ
గారణమెపుడాత్మధర్మకలనన్ శాంతిన్
గూరును సఫలంబప్పుడె
ధీసులజన్మముసఫలము దేవత్వముచేన్ ॥ ౪౬౪

క॥ కృపగలదుహింసవలదని
తపమొనరుచుమృత్యు దేవతకుఁద ప్పెనె? యే
నెపమున నైనను విపరీ
తపుధర్మముమెచ్చరాదు తప్పదు తప్పో॥  ౪౬౫

క॥ తనువునిజధర్మ మొనరుప
మనమిటునటుఁజెదరనీక మాటికిహరినే
కనువాఁడు యోగనిద్రం
గనువాఁడిలముక్తిపదము గనువాఁడుగదా॥  ౪౬౬

క॥ అనుటయుననుకొనుటయుఁ దా
ననుకొన్నట్లాచరించి యలయుటయును గా
ననుటకుగుర్తులు గావున
మునినిశ్చింతనిజధర్మమును బూనునుబో॥  ౪౬౭

క॥ అధికారమునకుమించిన
పథమునఁదిరుగుచునరయక బాగోగుల్ తా
బృథుకార్యారంభంబది
వృథఁజేయుఁ వ్యథనుబొందుఁ బృథివినెవండేఁ॥  ౪౬౮

క॥ మనమునవాక్కునఁగాయం
బున నెద్దియుఁజేసినైన ముందును వెనుకన్
జనుఁడెంచఁడెట్టులేనియు
ననఁదగుదానినిస్వధర్మమునినిజమిలలోఁ॥  ౪౬౯

క॥ లోకములో దూరితివా
శోకముగలిగించుఁ దానిఁజూచితివా యు
స్తోకానంద బిచ్చుఁ
లేకుండఁగఁజేయుభ్రాంతి లేములఁబాపుఁ ॥ ౪౭౦

క॥ స్వేచ్ఛావృతుఁడగు దేవుడు
స్వేచ్ఛాయంజీవుఁడయ్యె స్వాతంత్ర్యంబీ
ప్రచ్ఛన్న నగు నెవ్విధి
వచ్ఛంబుగ వెలిఁగెడుపరమాత్మకుఁ దక్కఁ ॥ ౪౭౧

క॥ చింతయునిశ్చింతయుని
శ్చింతగ నేకలుగు చుంటచే నారెంటఁ
సుంతయుస్వాతంత్ర్యము లే
దంతయుఁ బర మేశ్వరేచ్ఛనగుటఁ జీవా ॥ ౪౭౨

క॥ పూర్వాపరములఁ దెలియక
సర్వజ్ఞత్వంబుతోడఁజచ్చెడుదాఁకఁ
సర్వమునఁ స్వాతంత్ర్యము
నిర్వర్తించుటకునగు నె నీకిటు జీవా ॥ ౪౭౩

క॥ అకలంకులు యోగీంద్రులు
సకలాత్ములు దెలియువారు సర్వములోలో
బకముంబలెజపియించెడు
వికలాత్ములు దెలియుటెట్లు విశ్వేశ్వరులఁ ॥ ౪౭౪

క॥ గురుచరణము గనకుండుట
పరమార్థము తెలిసికాదు భ్రష్టాత్ములిలన్
బరువునకు లోపమనిగద
పరువులు వెట్టుదురు రచ్చఁ బల్కఁగ వినఁగన్ ॥ ౪౭౫

క॥ గురుచరణముపట్టెడువాఁ
డరయఁగఁ దత్త్వంబుఁ దెలియనలయఁడు బోధా
కరుతర్కంబును బరులకు
గురువై తెలుపంగ మదినిగోరుట జీవా ॥ ౪౭౬

క॥ అభిమానంబునువిడువక
యభివాదముఁ జేయుచుండునజ్ఞుండిలలో
శుభమొందఁడు గురుసేవల
సభలన్ వాదించువారిచందమునఁజుమీ ॥ ౪౭౭

క॥ రచ్చలఁబల్కెడుపల్కులు
పిచ్చిఁబుట్టించు బుద్ధిపీచమడంచున్
విచ్చలవిడిదిరుగునరుఁడు
సచ్చరితులఁగొల్వలేఁడు సమరసదృష్టిన్ ॥ ౪౭౮

క॥ ముచ్చటమాటలఁజెప్పఁగ
వచ్చినఁదనకెట్లు శుభమువచ్చును ధరలో
నిచ్చలువాగును రచ్చల
మెచ్చులకై పడయఁగలఁడె మేలద్దానన్ ॥ ౪౭౯

క॥ రోగాపవాదభీతిన్
ఱేఁగెడుకోర్కెలను సంచురిక్షునకొరా
త్యాగము లేదని చెప్పఁగ
వాగును లోకంబు దానిసాక్ష్యంబేలా॥ ౪౮౦

గీ॥ సిగ్గువిడిపించు ధైర్యంబునుగ్గుఁజేయుఁ
గాంతిఁదగ్గించు మొగ్గించుఁ గామమునకు
బానిసఁజేయించు వేయించు వేసములొగి
వాసనాబలం బెంతదుర్వార మకట॥ ౪౮౧

గీ॥ వలయుగతిఁ గారణంబులఁబన్నుచుండుఁ
గారణంబులఁబట్టి తాఁగాంక్షసేయుఁ
డు విడువఁడు తెలియక జడులు వచియింత్రు
కార్యకారణసరణి జగానదానఁ
దత్త్వబుద్ధియు శాంతంబుఁ దగులవెందు॥ ౪౮౨

ఆ. వె. చూడఁ జూడ జగము చోద్యంబుగాఁ దోఁచు
దీనుఁడగుచుగాదె దానిఁడగుచుఁ
గాంచకున్నలోనఁ గైవల్యమబ్బురా
లోకమందు దూరఁబోకు జీవ॥ ౪౮౩

క॥ ఉన్నదియున్నట్లుండఁగఁ
దిన్నఁగఁ దనత్రోఁవబట్టు ధీరుఁడుజగమున్
దిన్నంజేయఁగ యత్నము
కన్నన్ దుఃఖంబులేదుగదరా జీవా॥ ౪౮౪

క॥ కసవును మేయుచు నమృతము
పసరం బేయిచ్చు మనుజపశువగటా ప
ద్రసముల భుజియించుచు నీ
రసవాక్కుల్ పల్కుచుండురా చిత్రముగన్ ॥ ౧౮౩

క॥ పశుపతి సేవలఁ జేయఁగ
వశమూ పశువులకు నోఁపలువంగదుగద దు
ర్వ్యశమున్ దెచ్చెదుపని పర
వశతన్ జేసెదవు వారిభాగ్యముజీవా ॥ ౧౮౪

క॥ గాలింపుమింక లోకము
నాలింపుము గురునిబోధ మాత్మారామున్
లాలింపు మంబపదములఁ
జాలింపుము జీవ! భవముసాయుజ్యమునన్ ॥ ౧౮౫

క॥ చాలు నిఁకఁజాలు దుష్టుల
నేలా సేవింప నీకు సేవగలుగదే
ఈలోకోక్తిని వినుమా
హాలాహలమునకు మందు హాలాహలమే ॥ ౧౮౬

క॥ బాధించెదు లోకంబున్
బాధింపుము జ్ఞానదృష్టి భగవత్కృపచే
సాధింపుము సద్గురువరు
బోధలనాలించిముక్తిభోగముజీవా ॥ ౧౮౭

క॥ అనుబంధచతుష్టయమే
లని బంధములోనఁ జిక్కు నజ్ఞానులనేఁ
గని విని సద్వేద వారల
మునుచేసినపాప మిట్లుముంచె నటంచున్ ॥ ౪౯౦

క॥ స్వీయగుణదోషజాలం
బే యితరులయందుఁజూచి యెంతయుభ్రాంతిన్
డాయున్ బాయును దనలో
మాయం గడునంగలేఁడు మానవుఁడిలలోన్ ॥ ౪౯౧

క॥ ఈశ్వరసంకల్పంబే
శాశ్వతసౌఖ్యంబు నీయఁజాలును గాకీ
నశ్వరమగువిశ్వంబున
విశ్వాసం బెట్లు బ్రహ్మవిదులకు జీవా ॥ ౪౯౨

క॥ లోకాళిఁ ద్రుంపఁగల్గిన
శ్రీకంఠునిఁజూఁచియైన సిగ్గుపడర హా హా
యాకుల మొందుచు జీవుల
మూఁకలు మర్యాదకొఱకు మఱుగుదు రకటా ॥ ౪౯౩

క॥ పరలోకమునకుఁ జూచున్
బరమాత్మున్ దెలియలేమిఁ బరలోకంబున్
బురుషుండెఱుఁగనికతమునఁ
బరులన్ వీక్షించు నెంచుఁ బాషండుండై ॥ ౪౯౪

క॥ ధరజన్మ మొందుటరయఁగ
హరికార్యముఁజక్కఁ బెట్ట నంతియకాక
పురుషుల కిలలో వేత్తె
పురుషార్థం బొక్కఁడుండఁబోలు నె జీవా ॥ ౪౯౫

క॥ పురుషుండన హరియగుఁ గా
పురుషుండీనరుఁడు దుష్టబుద్ధిఁ విడువన్
బుధుపో త్తమాంశమున భువిఁ
జరియించున్ భ క్తకోటి శాంతిని నించున్ ॥ ౪౯౬

క॥ అనుకొనుచు జీవుఁడుండఁగఁ
దనమార్గము తానుబట్టు దైవముభళిరే
కని కనఁడు రెంటినాత్ముఁడు
తనకన్యంబొండులేమిఁదాదాత్మ్యమునన్ ॥ ౪౯౭

ఆ. వె. మందుగాల్చిచూడ విందగుఁగంటికిఁ
గాని దానిఁదాఁకఁ గాల్చివైచు
లోకజాలమందు లోలత్వమటువలె
లోకమందు దూరబోకు జీవ ॥ ౪౯౮

క॥ క్షమసారులు సాధువులని
కమలాక్షునికళయ యీజగంబని విని తా
రమలాత్ములవలెఁ బరులనె
పములం బ్రకటింప లోకబాంధవు లఁటహో ॥ ౪౯౯

ఉ॥ చేసెడువాడు లేఁడు సరి చేయఁగఁ గార్యము లేదు లేద హో
చేసెడుమార్గమట్లె యిఁకఁ జేసెడి దేమని చింత సేయుటే
దోసము వాసుఁడైనఁ గనుదోయి నిగుడ్చి నిరీక్ష సేయమున్
జేసిన కర్మమేఁగుఁ గృపసేయును రాముఁడు సద్గురూక్తులన్
వాసనఁ బాసి శాంతిఁ గని వర్ధిలఁగాఁ దగఁ దెల్పు సత్యమున్॥

క॥ కాదుసుమీ పథమిది కా
మాందులలోఁ ద్రొటుపడెడు నజ్ఞునకిలలో
లేదుసుమీ సుజ్ఞానము
పాదుసుమీ వాని బ్రదుకు పాషండతకున్ ॥ ౫౦౧

ఆ. వె. తెలియలేని చింత తెలిసిన గోరంత
పట్టలేని వింత బెట్టుకొంత
వట్టియావులింత పట్టి చూచినయంత
దంభినాశ్రయింప దండుగగద ॥ ౫౦౨

క॥ శేషగిరివాసవిగ్రహ
వేషములంజూచి భ్రమసి వేఁడరు ముక్తిన్
దోషాకరములు గోరిక
లీషచ్ఛాంతియును నీయవిందును నందున్॥ ౫౦౩

క॥ విషయేంద్రియసంయోగము
విషయంబుఁ జర్చించుమనము వేదాంతంబున్
మిషలోఁ గృషి లేమినినగు
మృషయయిదియని యాత్మఁ జేర్పుమీ కోరికలన్ ॥ ౫౦౪

గీ॥ శక్తిఁగల్గియునౌర! యశక్తుఁడయగు
సక్తిలేమిని నభిమానసక్తివలన
శక్తిచాలమిఁ బ్రతినిధిచాలవెదకు
యుక్తులనుబన్ను రిక్తుండు శక్తిగోలఁది ॥ ౫౦౫

క॥ ఎద్దైనఁజాలుననువాఁ
డెద్దైనన్ జేయుఁ జేయునెద్దియునైనన్
ఎద్దియొయొకఁడనుమూఢుం
డద్దియుచేయఁగలఁడు జడుఁడన్నియుఁ జేయున్ ॥ ౫౦౬

ఆ. వె. సర్వధర్మములకు సాహసంబె పెద్ద
యదియు శాంతిమూలమైనసంద్రము
తత్త్వవిదుఁడొకండు దానిఁబూనననుగాక
మనుజమాత్రునకు బ్రమాదకరము ॥ ౫౦౭

ఆ. వె. స్వేష్టసిద్ధికొఱకు దుష్టుండుజీవుండు
సేయరానిదెద్దిచేయునెద్ది
యాజ్ఞకష్టమంచు నాచార్యునిందించు
మోహమాపలేమి మోక్షకామి ॥ ౫౦౮

క॥ సర్వేంద్రియములవిషయము
లుర్విన్ సంపూర్ణవృష్టి నొదవియునకటా
నిర్వాణపదమునీయవు
సర్వజ్ఞులఁజేరి భక్తిసలుపకయున్నన్ ॥ ౫౦౯

ఆ. వె. ఐక్యబుద్ధిలేనియధముల సేవించి
సంచితంబుపెంచి సంశయించి
ముంచి ముంచుకొనుచు మోహాబ్ధిఁగ్రుంకుట
దాంభికకుల సంప్రదాయసరణి॥ ౫౧౦

క॥ లోలోఁ బ్రేరణఁజేయఁగఁ
జాలిన దేవుండు చేయఁజాలును జీవుం
డేలాజాలినిలోకులఁ
గూడున్ విడుచుండుపేరుకొ అకుజితారీ॥ ౫౧౧

---

క॥ గురుఁడై పరుఁడై బోధా
కరుఁడయి పావనకరుఁడయి కమలాకరుఁడై
హరుఁడై భవసంహరుఁడై
వరుఁడై వాణికిని మనకువరదుండయ్యెన్॥ ౫౧౨

క॥ శ్రీగురుపాదాబ్జంబుల
బాగుగమదినమ్మినట్టిభక్తులకిలలో
రాగాదులునశియించున్
భోగముయోగంబు నొకటఁ బూర్ణతఁజెందున్॥ ౫౧౩

క॥ గురువచనంబాలించియుఁ
బరులంబ్రార్థించుచుండ్రు పాపంబకటా
తరియించు నెభవజలనిధి
వరశిష్యుఁడు గురువునందువైరాగ్యమునన్॥ ౫౧౪

క॥ పరమార్థముశరణార్థిని
బరమార్థపుదృష్టిగురుఁడు పటుతరభక్తిన్
గరమర్థింపకమునుపే
పరమా? తెలుపంగ వానివశమా తెలియన్!॥ ౫౧౫

ఆ. వె. కట్టలోననున్న కాల్వకుబంధంబు
వదులుకట్టుకట్ట వదులకగునె
గురునిసూత్రమెన్నఁగూళలకేయున్న
జాతరూపమూర్తి! సాధుకీర్తి! ॥ ౫౧౬

క॥ ఏమైనఁజెప్పనీతాఁ
బ్రామాణికబుద్ధిఁగలిగి ప్రభువాక్యములన్
బ్రేమించినఁగోపించిన
గాపుంచఁగవలెను ముక్తిఁగామించినచోన్ ॥ ౫౧౭

క॥ విధియునిషేధములేకీ
విధినిఁగురుమూర్తినరుఁడు విజ్ఞతఁగొల్వన్
విధియునిషేధముకలుగని
విధిచోదితమైనపథము వేగమలవడున్ ॥ ౫౧౮

క॥ మంత్రంబైననువేఱొక
తంత్రంబేమైన శుద్ధతత్త్వంబైనన్
యంత్రంబైననుస్వగురుని
యంత్రితుఁడైనట్టివానికల్లవడుఁగాదే । ౫౧౯

క॥ శాంతాకారముసుమన
స్సంతాపహరము సమరసపారముకవితా
కాంతాగారము మనసై
కాంతస్థలము గురుచరణకమలముజీవా! ॥ గీ_౨౦

ఆ. వె. విష్ణుఁగొల్చుచుంటవిజ్ఞానముదయింపఁ
బగయులేదు భోగిఖగములకిల
స్థానమందుఁ గొంతసత్వంబుగలదంద్రు
సరససుజనసేవ చాలుజీవ ॥ గీ_౨౧

క॥ తనువుండియునిజమూర్తి సి
గను యోగికి దేహబాధకలుగమిఁగదదీ
నినిగనగురుపదములనే
గనవలె సకలార్థసిద్ధిఁగనవలె వానన్ ॥ గీ_౨౨

క॥ సరసముచెఱకుంబలెలో
విరసముకఠినంబుపైన వెట్టియెటులుఁగుర్
సరసుండుదంతపుష్టిన్
గురుసేవలలోనిరసముఁగ్రోలునుగాదే ॥ గీ ౨3

క॥ గురుబోధకుఁజెఱకునకున్
వరభేదంబొండుగలదు వలచికఱచినన్
గురుబోధమఖండంబౌ
నరయంగానిక్షుఖండ మదిఖండంబే॥ గీ_౨౪

సీ॥ గురుపాదుకాదీక్షగురుపాదుకారక్ష
గురునిగాంచినవాఁడుగుఱినిగాంచు
గురుపాదుకాదీక్షగుఱినిగాంచినవాఁడు
గూఢమంత్రార్థంబుగుఱినిగాంచు
గూఢమంత్రార్థంబుగుఱినిఁగాంచినవాఁడు
మంత్రాత్మకంబైనమహిమఁగాంచు
మంత్రాత్మకంబైనమహిమఁగాంచినవాఁడు
శూన్యస్థలంబునుజూడఁగల్గు
శూన్యస్థలంబునుజూడఁగల్గినవాడు
శివమిథునంబుదర్శింపఁగల్గు
శివమిథునంబుదర్శింపఁగల్గినవాడు
దర్శించుఁదత్త్వంబుఁదత్త్వమట్లు

గీ॥ తత్త్వదృష్టినిద్వంద్వంబు దాఁటు దాఁటి
భవమహాబ్ధినిదాఁటు దాఁటివిమలమగు
శుద్ధచైతన్యమై సుప్రసిద్ధిగాంచుఁ
గాంచివిహరించుహరిపాదకమలమందు ॥ ౨౭౨

క॥ గురుమూర్తికరుణయింతని
తరమా తెలుపంగఁ? దెలియఁదరమా? వరమా ?
పరమార్థమరయఁగోరినఁ
గరమర్థించుటఁయె కాని గణనలుతగునా ॥ ౨౭౩

క॥ మాటలుమరగినముక్తిక
వాటంబుఁ గ్రమ్మాయుగురుఁడు వైరాగ్యమునన్
నూటించెదప్పకఁ గొలిచినఁ
జేటుం దొలఁగించు శాంతిఁ జేకుఱుచుఁగడా ॥ గీ ౨౭

ఆ. వె. గురునిమూర్తియన్న గోవిందుపదమన్న
వేదమన్నఁ దత్త్వవేత్తలన్న
సరసులన్న భక్తవరులన్న నతిసేత
సకలసంప్రదాయసరణి ధరణి ॥ గీ ౨౮

క॥ దినకరునింబలెగురుఁడిలఁ
దనశిష్యులబోధచేయఁదగు నట్టిపైనన్
జనులంబలెబుధజనలుం
గనిమెదరు తమతమవిధులు క్రమమునజీవా ॥ గీ ౨౯

క॥ పరజనములపొగడొందఁగఁ
బరాత్పరునిభజనసేయుభ్రష్టులకిలలోఁ
బరతత్త్వమెఱుఁగరాదని
గురువులుగననీరొరుఁదమ గుట్టునుజీవా!॥ గీ ౩౦

---

క॥ స్ఫోటముబ్రహ్మాండాత్మక
వాటము మిథునాత్మకంబు వాంఛారూపం
బౌటన్ జిత్రము దృశ్యము
పేటిక కేవలదృగాత్మ ప్రీతివసింపన్ ॥ గీ ౩౧

క॥ కింకరవృత్తికిబత్తెము
సంకల్పహారంబు ముక్తిసంపత్ప్రదమౌ
నోంకారమంత్రరాజము
వేంకటపతిఁగూర్చి పలుకవీనులవిందౌ॥ ౩౨

క॥ పనిలేనివాఁడుపూనిన
పనివారించుటకుఁ బరమపదమిచ్చుటకున్
బనివడనెఱవేర్చుటకున్
బ్రణవముగాయత్రితనువు రాముఁడమర్చున్॥ ౩౩

---

క॥ వేగముసాతత్యముతో
యోగంబునఁబూర్ణశాంతి యోగిజనులకే
యీఁగల్గెడునోడుదుడుకుల
శ్రీగురుచరణాబ్జయుగళసేవాఫలమున్ ॥ ౩౪

ఉ॥ అన్నియునున్నజీవతయునంతియయెన్నఁబరాత్మఁడొక్కఁడే
యున్నది రామరామ యికనూరకచింతలఁగుందనేల? నీ
కన్నులుమూసి సర్వమయుఁగల్మషదూరుని నంతరాత్మునిన్
దిన్ననిచూపులంగనినఁదీరముఁజేరెదునమ్ము నెమ్మదిన్॥

క॥ జాగ్రన్నిద్రావస్థల
సాగమిజపమేరికేని స్వప్నస్థితిలో
యోగమునశుద్ధజీవుఁడు
శ్రీగురుకృపగాంచిశాంతిఁజేయునుజపమున్॥ ౩౫

గీ॥ స్వప్నగతుఁడైనజీవుండు ప్రణవసంజ్ఞ
శక్తిరూపంబుఁదాల్చును సతతమౌర!
జగముపాలింప, సేవింప శంకరాత్మ
నంతరాత్మనిఁబరమాత్మనాదిమూర్తి ॥ ౧౩౭

గీ॥ గట్టిదొక్కటి యొక్కటి వట్టిదగుట
రెంటిఁగట్టంగఁబుట్టి నావెంటనంటి
సదసదాత్మకరూపుఁడై శాంతినుండు
శుద్ధజీవుండు పురుషార్థసిద్ధిదుండు ॥ ౧౩౮

క॥ నిజమూర్తియునికిపట్టగు
గజవరదునకట్లుజగముకలిగిహరింపన్
భజియింపఁగనాధారం
బుజీవుఁడుకృతార్థుఁడనుట బొంకగునెభువిన్ ॥ ౧౩౯

క॥ తపము సమాధియుఁబథ్యము
నుపకారకముల్ దలంపనుత్తమములు పా
పపరిత్యాగముఁజేసి భ
వపయోధినిదాఁటు రామభక్తులకిలలోన్ ॥ ౧౪౦

క॥ మితిమించితినుట తిరుగుట
యతినిద్రయు నల్పనిద్ర యాశయుభయముల్
వెతలకుఁగారణములు స
ద్గతిఁగోరెడుయోగులకవి తగవంద్రుబుధుల్ ॥ ౧౪౧

తే గీ. కర్మమీశ్వరార్పణముగా నిర్మలమతి
నొకటిమూసినయపుడు వేఱొకటి తెఱచి
నాసికారంధ్రముల రెంటి మూసికొనుచుఁ
బీల్చురంధ్రానవిడువక విడుచుదానఁ
బీల్చుచుండియు స్థైర్యంబుప్రియమెసంగ
నొకటఁబూరించి నాల్గింటనుంచిలోన
రెంటవిడిచిసదాగతి వెంటనంటి
యుంట యోగమూలంబునా వింటిఁగంటి
మహిమపద్మాసనంబున మంత్రశక్తి
మాధవారాధనమున సమాధినిజము
గురునిఁగొల్వక యెద్దైనఁగుదురుపనునె?
గురుఁడుపరదైవతం బనుకొనుముమనుము ॥ ౫౮౨

ఆ॥ వె॥ పాలువేఁడినీళ్లు పంచదారయుగోదు
మలునునేయిపెసలు వలయుయోగి
వరులకండ్రు యోగవర్ధకములగుట
వీనిఁదినుచు నియమవృత్తినున్న ॥ ౫౮౩

క॥ కనుగొన వేదముశాస్త్రం
బనంతమనియండ్రు తద్జ్ఞులాగొడవేలా
తనకనువగుసామగ్రిని
గనిధీరుఁడు గురునిచెంతఁగను గదశాంతిక్ ॥ ౫౮౪

క॥ సామగ్రిభేదమైనన్
సామాన్యపు శాస్త్ర మొండు జగమున నుండున్
ధీమంతులచుకాన్కనది
యేమార్గంబైనఁబట్టనీ హరికరుణన్ ॥ ౧౮౧

త॥ నానావిధనిగమవ్యా
ఖ్యానములరయంగఁదరమె? కాలంబల్పం
బౌనావిఘ్నంబెక్కుఁడు
గానందగుఁదత్త్వ మాత్మఁ గవిహంసవలెన్ ॥ ౧౮౨

ఆ. వె. మతమదెద్దియైన మాధవార్పణబుద్ధిఁ
జేయుకర్మమొకఁడు చేయుముక్తుఁ
గానినాఁడు భవముఁ గల్పించి భ్రమముంచు
నాసహెచ్చిహెచ్చి మోసపుచ్చు ॥ ౧౮౩

క॥ ఏకాక్షరమేకాంతము
శ్రీకాంతునికరుణ గురుఁడు సిద్ధాసనమున్
సాకెడుసుజనులుగూడినఁ
గాకెటుయోగానుభూతి కవులకునిలలోన్ ॥ ౧౮౪

క॥ యోగాంకురము బుద్ధిఁద
పోగతిగురుసూక్తినాటఁబుట్ట్యావశమునన్
దీగెలువాఱుఁదదీయవి
రాగప్రసవమున ముక్తి రమ ప్రభవించున్ ॥ ౧౮౫

కం॥ అజ్ఞానాపహ మూర్తికి
సుజ్ఞానప్రదము ధర్మసూక్ష్మ ఫలంబుల్
జిజ్ఞాసామూలంబని
విజ్ఞులువర్ణించుచుండ్రు వినుమౌనంబున్ ॥ ౫౫౦

గీ॥ జపతపంబులమెచ్చఁడు శార్ఙ్గపాణి
భక్తిమెచ్చినచందాన భక్తిదలఁప
స్వస్వరూపాను సంధానశక్తి సూక్తి
మౌనముద్రాభిధానంబు మంగళంబు ॥ ౫౫౧

ఆ॥ వె॥ ఊరకుంటకంటె నుత్తమధర్మంబు
గానరాదుజగముఁ గలియరాదు
మౌనముద్ర సర్వమంత్రసారంబది
జాతరూపమూర్తి! సాధుకీర్తి! ॥ ౫౫౨

---

కం॥ శమదమములయమనియమము
లమరును గురుమూర్తి కరుణ నజ్ఞతయడఁగున్
విమలంబగుజ్ఞానంబున
సమరసముదయించుఁ బ్రబలసత్త్వముకలుగున్ ॥ ౫౫౩

కం॥ సమరసమనసర్వంబున్
సమముగదర్శించుచుంట సత్యముదానిన్
గ్రమమెఱుఁగక శ్రమఁజెందెదు
కుమతులు దెలియంగలేరు కోవిదుఁడెఱుఁగున్ ॥ ౫౫౪

క॥ సమరసమనసర్వంబున
సమబుద్ధియు భేదదృష్టి సర్వంబగుయో
గముకాని సర్వమొకఁడను
భ్రమఁదత్త్వమునఱచి బాధపడిచెడనగునా? ॥ ౧౧౧

క॥ క్షమయే యోగముజ్ఞానము
క్షమయే దైవంబు శక్తి సారస్వతముల్
క్షమయే బ్రహ్మానందము
క్షమయే సమరసము శాంతిసర్వము క్షమయె ॥ ౧౧౬

క॥ ఆరూఢజ్ఞానంబున్
సారామలభక్తిశాంతిసమరసమునుసం
సారోత్తారకములు ధర
నౌరా!పర్యాయపదములగురాజీవా!॥ ౧౧౭

క॥ అండజవాహనభక్తిని
నిండినమనమెట్లు తెలియనేర్చునుభేదం
బుండునెనుఘువునఁబూలం
దుండినగుణదోషజాల ముర్విన్ బాలా ॥ ౧౧౮

క॥ అమనస్కమనగమనమది
విమలమగుట వడినిమనమువిడు దిగఁబడమిన్
గ్రమమెఱుఁగమి లేకుంటని
కుమ్మకులువచియింతు రదియుఁగూడునెజీవా ॥ ౧౧౯

క॥ మనమునకుసహజముగువశి
మనమదిసంశయముచేత మల్లడిఁగొనఁగా
మనమునకుమందగతియగుఁ
ఘనులడిజాడ్యంబటంచుఁ గనిమెద రెందుర్ ॥ ౫౬౦

క॥ కానసమనస్కమనఁగా
మానసమునసంశయంబుమానుట యెటులో
పూనుటపనులర్ జీవుఁడ
నేనన్భ్రమలేమి హరినినెందుఁగనుటయే ॥ ౫౬౧

క॥ సచ్చిదానందరూపంబు జ్ఞానితాల్చి
సహజకాంతిని శాంతినిఁ జక్కవెలుఁగ
మనమునిర్వృతినొందునో మాయమగునో
నిశ్చలంబగునో తెలియునేవృథాభి
మాని జీవుండుమిన్నకెం దేనియణఁగు
రెంటివలెనుండియొక్కఁడౌచుంటనాత్మ॥ ౫౬౨

క॥ అమనస్కరాజయోగము
విమలాత్ములసామ్ము దాని వెలయించెడిధ
ర్మముగురునిది గురుశిష్యుల
సమకూర్చెడిశక్తిహరిది సత్యముజీవా॥ ౫౬౩

క॥ కోరికలమనస్కంబున
జారును హరిఁ జేరునాత్మ సత్యముదేహం
బారబ్ధమనుభవించుర్
శ్రీరామపదాబ్జభక్తిచే నిటుజీవా! ॥ ౫౬౪

క॥ అహమనిసోహమ్మనియున్
బహుగతులఁదెలిసి తెలియక పల్కెడునాత్మం
డహహా! జీవునిఁగఁగనియు
నిహపరములలెక్కలిడుదు రిలభ్రాంతిజడుల్ ॥ ౫౬౫

క॥ అదియొక్కఁడనచుఁదెలిసిన
విదపన్ మదిసంశయములఁ బేర్చదు తా వే
గదియుసమాధినినాత్మన్
గద యటఁగృత్యంబులేమిఁగదరాజీవా! ॥ ౫౬౬

క॥ బాధలకుఁదాళఁజాలమి
గాధలవినుచుండియుండి కళ్యాణంబా
బోధజనింపఁగ సహజస
మాధియగున్ దత్క్షణంబుమాధవకృపచేన్ ౫౬౭

క॥ తనువున్నయపుడుము క్తియు
జనులకుగోచరముకాదు శాంతిఫలించున్
దనువున్న లేకయున్నన్
గననికతంబున సమాధిగదసత్యముగన్ ॥ ౫౬౮

ఆ॥ వె॥ తావులెందులేమిఁ దద్దయునెఱిఁగిన
జీవుఁడాత్మయందు జీర్ణమగుట
నవలనునికిలేమి నాత్మతాదాత్మ్యంబు
గానియూహా యేది?కర్మమేది? ॥ ౫౬౯

క॥ శంకలువాసిననరులకు
జంకంబనిలేదు లేదుసంసారంబే
వంకందృష్టిమరల్చిన
సంకల్పములేమి నాత్మసాయుజ్యంబే ॥ ౫౭౦

క॥ ఉన్నాఁడని విన్నాఁడని
కన్నాఁడని జనులువల్కఁ గానానన కే
యున్నటులేయున్నాఁడా
వెన్నునియందాత్మనాత్మ వేల్చెడునిష్ఠః ॥ ౫౭౧

క॥ జ్ఞానమవస్థాత్రయమున
మానంబామూటిఁదాఁట మమతహరింపం
గానరహరియగుటయుఁబ్ర
జ్ఞానముమూర్తిభవించి కైవల్యంబౌ ॥ ౫౭౨

సీ॥ రామునికరుణసర్వంఖల్విదంబ్రహ్మ
యనుమహావాక్యంబుననుసరించి
తుల్యయోగముననతులితశాంతినిసర్వ
కాలంబులందువిజ్ఞానమహిమఁ
గాంచియేకాంగియైసంచరించుచుభక్త
సంఘంబునకుమేలొసంగుచుండి
సంతతాత్మానందజలధిమజ్జనశుద్ధ
దేహుఁడైసకలసందేహముడుఁగఁ

గీ॥ తెలిసి తెలియరాక ధీరుఁడై గురుమూర్తి
దాల్చునాత్మనాత్మ వేల్చుశక్తి
భక్తియుక్తిగల్గి ప్రబలు బ్రహ్మతేజ
మునననంతసత్త్వమునధరిత్రి ॥

క॥ యోజన వాసన యనుభవ
మోజన్ గూడంగ బ్రహ్మ మూరక వేత్తై
యోజనలఁ బెంచుచుండిన
చో జన్మపరంపరయగుఁ జుమ్మీ జీవా ! ॥ ౫౭౪

క॥ మనమాత్మతోడ నొకఁడై
గననుండన్ లేక యుండుఁగద యెట్టులో
యనుభవమునఁ దలచూపున
మనస్కయోగమిది ముక్తిమార్గంబదియే ॥ ౫౭౫

---

క॥ యోగానుభూతి లేకయ
శ్రీగురువాక్యములఁ దెలియఁజెల్లు నె బ్రహ్మాం
డాగారవిహారుండగు
భోగిని విభుడంద్రుగాదె బుధులుధరిత్రిన్ ॥ ౫౭౬

గీ॥ కార్యజాతంబుఁ జేయును గలత లేక
ధర్మసూక్ష్మపరుండగు ధన్యతముఁడు
కాననవ్వానిజన్మంబు జ్ఞానముద్రఁ
బూనినట్లుండు సర్వదాపూర్ణుఁడతఁడు ॥ ౫౭౭

క॥ ఆశారహితునిచర్యకు
నీశుఁడు కారణమనంగనితమగుశంకా
లేశమువలదదినమ్మినఁ
బాశుపతంబతనిచర్య భవహరమయుగున్ ॥ ౫౭౮

గీ॥ సంశయమువీడుమనమున శాంతిగూడుఁ
గర్మముహరించువసియించుఁ గాననమునో
యింటనో యెందో యొకటముక్కంటియగుచు
హరినిగొల్చెడుభక్తిశేఖరుఁడుధరణి ॥ ౫౭౯

క॥ పటమగునుగపటసూచన
నిటలాక్షుండడిదియలేమి నిక్కంబయ్యెన్
గుటిలుఁడదియోర్వఁజాలఁడు
కటకటకపటంబు మైత్రికారణమయ్యెన్ ॥ ౫౮౦

క॥ నిష్కపటవృత్తిఁదిరిగిన
శుష్కించెడుజగము వానిఁ జూచిభయమునన్
నిష్కపటులభరియింపఁగ
నిష్కపటుఁడుయోగిగాక నేర్తురెయలఁతుల్ ॥ ౫౮౧

క॥ తననిద్రతనకుఁదెలియుట
ఘనయోగమునందుఁదాను గాంచినబలమే
మునులుప్రబోధంబనిరది
గనువాఁడెభవముఁగనఁడుగా హరికృపచేన్ ॥ ౫౮౨

క॥ కలఁగాంచిమేలుకొనినన్
దెలియునుమందుండుదానిఁ దెలియునెకలలో
దెలిసినయప్పుడెకలగాఁ
దెలియుటతత్త్వముదెలియుట ధీసంపన్నా! ॥ ౫౦౩

క॥ యోగికియోగంబేయగు
భోగికిభోగంబయగును బుధుఁడా రెంటిన్
ద్యాగముఁ జేసియుఁగలిగియు
శ్రీగురుకృపఁబొందుసిద్ధి సిద్ధముజీవా! ॥ ౫౦౪

క॥ అశారహితుని దేహం
బీశునిదేవళము వానికెచ్చటనున్నన్
గాశియు సర్వస్థలముల
నీశుండుండియుఁగననగు నిచటనెజీవా ॥ ౫౦౫

క॥ లోవెలియోగంబొక్కఁడు
గావలయును గురునికరుణగావలయునుగా
భావమునదేవినిల్పం
గావలయు నటీశ్వరేచ్ఛ గావలయునుగా ॥ ౫౦౬

గీ॥ ఆత్ముఁడష్టాంగయోగమునభ్యసించి
యాత్మతాదాత్మ్యమొంద బ్రహ్మానుభూతిఁ
గర్మవశమునఁగాయంబు కదలియాడఁ
గదలదుమునముజీవుండు కానరాఁడు
తానునిల్వంగఁదావులు లేనికతన॥ ౫౦౭

సీ॥ కనకపాత్రను బాయకం బొనర్చినఁ
గంచుపాత్రలను బ్రయోగించనేల
అంబాప్రసాదంబు నారగించుచునుండు
దేవళంబుల నేల దేవుల్లాడుఁ
దుపదేశమునందుఁదత్త్వంబుఁగాంచినఁ
దంత్రజాలంబులఁదగులనేల
పూర్వోత్తరముల నైక్యముం బొందినట్లు సం
పూర్ణభావంబును బొందుపిదప

తే. గీ. లోకమే లేదు లేదుతల్లోలతయును
సచ్చిదానందరూపంబు సమరసంబు
దక్క వేరొండు మనమునఁ జిక్కకుండు
స్వాత్మధర్మంబు కంటె శ్రేయంబు కంటె ॥ ౫౮౮

క॥ ఆనందనందనుండై
యానందంబిచ్చె వెన్న డందఱకున్ని
త్యానందమీయఁ డేరికి
నానాత్వముఁదోఁచనట్టి నరునకుఁదక్కన్ ॥ ౫౮౯

క॥ ముక్తివనితాపరమనము
శక్తియు యుక్తియును గెలువఁజాలవు శాంతిన్
భక్తిం గొల్చిన నదియా
సక్తిం జేర్చుఁజుమి చెంత సాధుల జీవా! ॥ ౫౯౦

క॥ విద్యాదాయకమాద్యము
సద్యఃఫలితంబు సకలసాధుహితంబై
యుద్యమపరహితంబగుటన్
హృద్యముభిక్షాన్నమంచు నెంతురుధీరుల్ ౫౯౧

శా॥ శాంతిస్థానమునన్ సుఖించి పిదపన్ సంసారియైయుండియున్
భ్రాంతింజెందఁడుచిక్కఁడెవ్వెడలఁగర్మబ్రహ్మబుద్ధిన్ జువా
వంతైనన్ స్పృహలేము లేమియగదాయాతండెబ్రహ్మంబయౌఁ
జెంతన్నిల్చినజీవలోకమతనిన్ శ్రీమంతునింజేయుచో
స్వాంతంబందునఁబూర్ణమై ప్రణవమై సర్గాదిసద్ధేతువై॥

క॥ తనస్థానముశూన్యముగా
ఘనయోగమునందుఁదన్నుగాంచున్ హరిలో
మనసారఁగఁదాఁదానై
మునిజనములువొగడనాఁడు ముక్తుఁడుజీవా॥ ౫౯౩

క॥ తనవలెనేపరులంగని
తనువుని పేధించుసాక్షి తత్త్వజ్ఞుండై
గనఁడామృత్యువెందున్
దనకెందున్ దనువులేమి ధన్యుఁడుజీవా॥ ౫౯౪

క॥ అచలాధివాసుపదముల
నచలాకృతి దృష్టినిల్పునాత్మారాముల్
రుచిమింతురుపచరింతురు
సచరాచరసృష్టిజంతుసంతతికెందున్॥ ౫౯౫

క॥ కృత్యము నెఱి వేర్పుచుఁ దా
సత్యముతుద ముట్టఁ జెట్టి శక్తియుతుండై
పత్యముగాంచినఁ దాఁ దన
కృత్యము లేదంచుఁ దెలిసి కృతకృత్యుఁడగున్॥ ౫౯౬

ఉ॥ వ్యక్తివిలాసముల్ గనుచు వస్తువివేకము గల్గియున్న సద్యథా
ర్థ్య భక్తుఁడు ముక్తుఁడౌ గురుఁడు తానయి తత్త్వము దెల్పుచున్
శక్తిఁ జరించు భూతముల సంతత తృప్తినినించు మించు శా
స్త్రోక్తవిధిన్ దరించు పరసోక్తుల ముక్తులఁ జేయు భక్తులన్ ॥

క॥ రాగద్వేషము లేకయు
శ్రీగురుకృప ద్వంద్వసమితిఁ జేరుచు విడుచున్
సాగించు లోకయాత్రన్
లోగుటి హరిమీఁద నిల్పి లోలత విడుచున్॥ ౫౯౭

క॥ లీలాస్పద సద్వస్తుల
లీలన్ గూడుచు నువిడుచు లేశంబైనన్
లోలత లేకయు చింతలఁ
జాలించున్ ముక్తుఁ డాత్మజప మొనరించున్॥ ౫౯౯

గీ॥ వ్యక్తి వైచిత్ర్యమున భయభ్రాంతులుడుగ
వస్తుదృష్టిని నెప్పుడు వదలకుండ
చింతలేకయు యిట్లుదాసీనుఁ డైన
యోగివరుఁడుండు రెంటిని నొకటిచేసి ॥ ౬౦౦

క॥ ద్వంద్వజ్ఞానముగలిగియు
ద్వంద్వంబుసహించునరుఁడు ధన్యుఁడుభువినా
ద్వంద్వంబెఱుఁగనిమందుఁడు
ద్వంద్వంబుసహించుటన్న దబ్బఱగాదే॥ ౬౦౧

క॥ తత్త్వావలోకనంబున
సత్త్వముధర్మంబు పరమసాధుత్వముదా
తృత్వము వక్తృత్వంబుశి
వత్వముగల్గియునులేదు వాంఛయునౌరా!॥ ౬౦౨

క॥ గురునాజ్ఞజనదాఁటక
శిరమునఁదాల్చుచునుజేయసిద్ధుండైయె
వ్వరిఁజేరకతనయందున
మరుమహనీయుండు లోకమాన్యుఁడుజీవా!॥ ౬౦౩

క॥ జీవాత్మభిన్నరూపక
మైవిశ్వముచిద్విలాసమై పూర్ణంబై
కేవలమాభాసంబై
వేవిధములవెలయు బ్రహ్మవిదులకులోనై॥ ౬౦౪

క॥ ఆకసముంగబళించుట
శోకంబునకగునుగాని శుభదంబగునా
ఆకారముగలిగి యుఁదా
లేకుండుమహానుభావు డీశోనుటటులే॥ ౬౦౫

క॥ జరగినదానినినింకను
జరుగగనున్నట్టిదాని జరగెడుదానిన్
నరహరివిలాసమనున
ప్పురుషుండరయుండు శాంతిఁబొందునజీవా ॥ ౬౦౬

క॥ పండితునకుఁగావ్యంబె
ట్లుండినబాధాకరముగ నుండనిగతిఁబ్ర
హ్మాండంబంతయుహరిదై
యుండుటఁదద్జ్ఞునకు భ్రాంతియుండదుజీవా ॥ ౬౦౭

ఆ. వె. ఆవుదూడలందు నాలపోతది మొద
లాలపోతుగానె యతిశయిల్లు
కోడెలరయవేలు గోజాతియొకఁడయ్యుఁ
బూవుతోడఁదావిపుట్టుఁజూవె ॥ ౬౦౮

క॥ చేయించెడికార్యంబులఁ
జేయించుచుఁజేయుచుండు సిద్ధుండిలలో
నాయాసంబొందక తా
న్యాయంబున జీవయాత్రనడుపునుజీవా! ॥ ౬౦౯

క॥ వాదములువదలిసద్గురు
పాదంబులఁదగిలి భక్తిపరవశులై దా
మోదరుకృపగాంచినవా
రీఁదెదరు భవాంబుధి వెలువేదికుమారా! ॥ ౬౧౦

ఆ. వె. నదినిఁ జేరుమలము నశియించువేగాన
గుంటనంటనదియుఁ గుదుఱుచెఱచు
గొప్పవారిలోనిగుణదోషముల కేమి
కొద్దివారియందుఁ గొఱతచెందు ॥ ౬౧౧

క॥ సుజ్ఞానియైన దేవుం
డజ్ఞానిగఁబుట్టు జీవునట్టులవిధిస్వ
ప్రజ్ఞన్ మార్పఁగలేఁడని
విజ్ఞుఁడుశాంతించుఁగోర్కెవిడుచునుజీవా! ॥ ౬౧౨

క॥ పనిలేదని తెలిసినజీ
వున కెప్పుడునాత్మతో నవునుయోగంబ
ప్పని కెప్పుడునచలుండై
యునికియెమార్గంబుఁ దపమునుద్యోగంబున్ ॥ ౬౧౩

క॥ క్షమఫలరసపానోద్భవ
సమరసవిజ్ఞానదృష్టిసంపదవగతా
గమపదసంచరదానం
దముతో నైక్యంబుధన్యతమునకు జీవా! ॥ ౬౧౪

క॥ జీవునకుభ్రాంతిదెలియమి
దేవునికిందెలియశాంతి ధీసాక్షికినా
నావిధిసృష్టిపరంపర
లేవియు లేకుండుఁదజ్ఞుఁడీగతినుండున్ ॥ ౬౧౫

క॥ హరిస్మరియించుసమాధిని
హరితానై యుండుఁ గాలహరణముఁ జేయం
దరిషడ్వర్గంబులనీ
కరణిన్ హరియించుఁ బెంచుగై వల్యంబున్ ॥ ౬౧౬

గీ॥ ప్రకృతిమలినశుద్ధయునఁగఁ బరగు రెంటి
రాపిడిమెతప మగ్నిహోత్రంబుపురుషుఁ
డన్నిటిలయించితుదిఁదాను హరినిఁ జేరు
జీవచరితంబు ముక్తిసంజీవనంబు ॥ ౬౧౭

క॥ శ్రుతిమార్గమనుసరించుచు
గతాగతములకు నెందుఁ గందక సత్య
వ్రతుఁడౌనతనియమానుష
గతి సత్త్వముసర్వసిద్ధికరము కుమారా! ॥ ౬౧౮

క॥ భీరుండితరముగోరున్
గోరున్మోక్షంబు బుద్ధికుశలుండెందున్
ధీరుండూరకయుండియుఁ
జేరున్ బారంబు నైక్యసిద్ధికుమారా ॥ ౬౧౯

క॥ తనువనుసరింపఁబ్రకృతిని
మనమదితత్ ధ్యానమందుమగ్నముగాజీ
వుని కెందునునికిలేమిని
గనిముక్తతయుండ్రు దానిఘనులు కుమారా! ॥ ౬౨౦

గీ॥ బ్రహ్మజిజ్ఞాసమఱిగినపండితుండు
తొంటివిషయంబులంటునే? కంటనైన
బ్రీతిఁగాంచునె? యెంచునె? ప్రీతిఁదొలుతఁ
దిన్నయన్నంబుఁగ్రక్కినఁ దిరిగితినఁగ
శక్యమౌనెట్లు? పదివేలవాక్యతతుల ॥ ౬౨౧

క॥ కోరికలవిడిచిహరిపద
నీరజములమఱిగి విడువనేరనిమనుజుం
డీరేడుజగంబులలో
ధీరుండై సంచరించు ధీసంపన్నా! ॥ ౬౨౨

ఆ. వె. భూమిఁదాఁకునీడ పురుషునిమలినఁగాఁ
జేయనేరనట్లు సిద్ధుఁగలఁత
పఱచలేదుమనము ప్రాప్తనదుష్టసం
కల్పసంగతి శతకల్పములకు ॥ ౬౨౩

క॥ తనుఁబూర్ణుఁజేయువాఁడే
తనునితరులదృష్టియందు ధన్యునిఁజేయుఁ
దనుఘనునిఁగనీచునిఁగాఁ
గనుజనములఁబొచ్చిద్రుంచిగౌరవముసఁగుఁ ॥ ౬౨౪

క॥ తెలిసినఁదెలియఁడుపరులకు
దెలియుటదుర్లభము స్వాత్మతేజము సాక్ష్యం
బిడుపరులకుఁదనలో వెలి
కడునిండుఁ మొందుపండుఁగర్మము తనయా ॥ ౬౨౫

క॥ ఎటువంటిదైనఁ జేయుఁ
దటుకునఁ జాలించు జ్ఞాని తత్త్వంబదిరా
కటకటఁబడఁడెన్నండును
బటుతరహరిభక్తిఁ బరమపావనుఁడగుటన్ ॥ ౬౩౬

క॥ అంతయుబ్రహ్మంబను తెలి
వెంతయుఁబరిపూర్ణమైన నెదియెటులైనన్
జింతయొకయింత లేమిని
శాంతిన్ విహరించు మించు సాధువుజీవా! ॥ ౬౩౭

క॥ తనునితరులనిందాస్తుతు
లనెంచుకొనకెంచకముని లలితాత్మండై
కనికనకయుండుజగముల
ననిశముహరితోడ నైక్యమందుటజీవా ॥ ౬౩౮

క॥ కేవలశుష్కక్రియముల
కీవసుధన్ సంతసించునే యోగి క్రియా
కేవలముత్తరమని కను
లోవెలినైక్యంబు నెప్పుడున్ హరికృపచేన్ ॥ ౬౩౯

క॥ నోటన్ వెడలుచునడలుచు
నూటింబడలేమపదములఁ జూచుచువిడుచున్
మేటికపీంద్రుఁడుమరలెడు
స్ఫోటముదర్శించువేడ్కఁ జూమ్ముకుమారా! ॥ ౬౪౦

క॥ కాలోచితకృత్యంబుల
లీలం జేయించుఁ జేయు లే తనలోఁదా
నేలేమినాత్మ నెఱిగెడు
నేలా! భక్తుండు దేవుఁడేగద జీవా॥ ౬౩౧

గీ॥ తన్మయుండైనయోగికితరులవలనఁ
గామరోషాదివృత్తులు గలుగుటెట్లు
కల్గినవయేనివిష్ణుసంకల్పములగు
నంబికాజానిచరణసేవాభిమాని॥ ౬౩౨

గీ॥ తన్మయుండౌటదోషానఁ దగులుకొనమిఁ
దగులుకొనుచుంటరోషానఁదథ్యమరయఁ
జేసిమానియుధర్మంబుఁ జేయుచుండు
సిద్ధుఁడజ్ఞుండో యెంతైనఁ జేసియుఁజెడు॥ ౬౩౩

క॥ మమకారమహంకారము
క్రమముగవిడువంగ సర్వకాలములందున్
సమతన్ సుస్థిరుఁడైవి
శ్వమునఱచుచు నాత్మనాత్మసందర్శించున్॥ ౬౩౪

క॥ పతితుండనిపావనుఁడని
కృతకృత్యుండెందు భేదమెంచఁడుగదని
త్యతపశ్చరణంబునశ్రీ
పతితోనైక్యంబు వానిభాగ్యముజీవా॥ ౬౩౫

క॥ ఉనికియు లేమియుఁ దెలియక
మనమెట్టులొ యట్టులుండు మహానీయుండున్
గనగనాతనిమూర్తిని
మనుజాకృతిఁ జర్యలందు మాధవకృతియున్ ॥ ౬౩౬

క॥ ఉన్నపుడు మిన్నకుండున్
కొన్నుండై చేయుచుంట వెలినఁడు భక్తుం
డెన్నఁగ ముక్తుండివ్విధి
నున్నన్ బరమేశ్వరేచ్ఛయున్నన్ జీవా! ॥ ౬౩౭

క॥ రతివస్తుతత్త్వమందు వి
రతినామాదులను యోగరాజంబిది స
ద్గతికి గురుమూర్తిఁ గొల్చిన
మతిమంతులకబ్బు సులభమా! కాకున్నన్ ॥ ౬౩౮

క॥ తనతోనైక్యంబొందిన
మనుజులకుందనకు ముక్తిమా లభియింపన్
గనఁదగునొకమార్గంబిది
ఘనగురుకృపచేత శ్రీశుకరుణన్ జీవా! ॥ ౬౩౯

క॥ ఆకాశంబునఁబోగవలె
నాకారములేనియాత్మయంతయువ్యాప్తం
బై కాంచును బూర్ణత్వము
లోకంబేకాంచకుంట లోలోనుంటన్ ॥ ౬౪౦

క॥ శ్రీగురునుపదేశంబున
బాగుగవిజ్ఞానదృష్టి ప్రబలినశోలఁదిన్
లోగుటెనిలుచునుభగవ
ద్భాగవతులసేవలు శుభదంబులగుఁజుమా ॥ ౬౪౧

ఉ॥ దాసులపాదధూళిసుఖదాయకమంచుఁదలంచికాదెమున్
వ్యాసుఁడునారదుంగొలిచిభాగవతంబురచించిభక్తివి
శ్వాసములొప్పదానిఁజదువన్ నియమించెనుబుత్రకున్ శుకున్
వ్యాసునికన్నమిన్నలగువారలుమీరలుభక్తిసేతురే॥ ౬౪౨

గీ॥ దయయుసత్యంబుశౌచంబు ధర్మతతికి
మూలమందురు తజ్జ్ఞులుమునులుఘనులు
మూఁటిసేవింప మూఁటినిదాఁటునంద్రు
జన్మరోగికిమందెందు శాంతియందు ॥ ౬౪౩

ఆ. వె॥ చెడ్డవారిమంచి చేఁటుకేకరణంబు
మంచివారిచెట్ట మంచికల్గె
పుట్టువుననయుండుఁబుణ్యంబుఁబాపంబు
పురుషుఁడేమి చేయఁబోలుఁబుడమి ॥ ౬౪౪

క॥ ఒకమార్గముగురుకృపచే
నకలంకస్థితినిమనుజుఁడందునుభవమూ
రక దాఁటగ నకట మనో
వికలత్వముఁబొందుచున్నవిజ్ఞతసున్నా ॥ ౬౪౫

క॥ నియమాదులభ్యసింపఁగ
భయవిరహితమైనపదవి ప్రాప్తించునుద
న్మయమైతోఁచెడు లోకము
లయమొందునుమనము నిశ్చలంబగుకతనన్ ॥ ౬౪౬

క॥ కాయంబేమాయంబని
న్యాయంబుగఁదెల్పుగురుని నయహీనుండై
యీయాయర్థములడుగుట
న్యాయంబే? నందనంబు సరికదమగునే? ॥ ౬౪౭

క॥ జ్ఞానమెగదగురురూపము
జ్ఞానమెగదతారకంబు సాంఖ్యంబదియే
జ్ఞానమెయోగంబనినీ
మానసమున గురునిఁగొల్చి మనుముకుమారా ॥ ౬౪౮

క॥ జ్ఞానముసౌఖ్యముదుఃఖము
తానీయఁగలుగు దానితత్త్వంబదిరా!
తానిత్యముమృతినొందుచు
నానిద్రమృతియని తెలియనజ్ఞుండడలున్ ॥ ౬౪౯

క॥ తనజననముఁదానెఱుఁగఁడు
తనమృత్యువు తనకుఁదెలియఁదరమా? మనుజుం
డనయముజీవనపరుఁడై
యునికియె తానెఱుఁగునట్టు లూహించిచెడున్ ॥ ౬౫౦

క॥ మనమునఁ గాలుష్యంబది
ఘనదేవుని జీవునట్లుఁ గాఁ జేయును దా
నినివిడువ నాత్మతానై
ఘనకాంతిని బయలుపడును గాదే తనమా! ॥ ౬౫౧

క॥ గురునాథుని యెడఁ జేయున
పరాధములచే విశేష బాధలు కలుగన్
గురునామము తన్నాశం
కరమగు స్మరియింపు సర్వకాలము దాపి ॥ ౬౫౨

క॥ దేవీహృదయజ్ఞానము
దేవునికిఁ దదీయ సన్నిధిన్ వసియింపన్
జీవునికిం గల్గును గురు
దేవుని సన్నిధి వసింప దీక్ష వహింపన్ ॥ ౬౫౩

క॥ తోఁచిన శివశక్తుల వలెఁ
దోఁచుఁ బెరగఁ దత్త్వమగును దోఁచమి నందే
వాచామగోచరంబై
యేచర్యలు లేమిఁ జిత్తదెట్లో సత్తై ॥ ౬౫౪

క॥ ఎన్నిటికైనను మోక్షం
బున్నది భేదంబు మిథ్య యున్నది హరియే
యున్నది స్వానుభవంబునఁ
గన్నన్ నిజదేశికేంద్రు కరుణన్ జీవా! ॥ ౬౫౫

క॥ ఆత్మయనఁగ దేహంబగు
నాత్మయమనమగును బుద్ధియాత్మయయగు నా
యాత్మయె జీవాత్మయుఁ బర
మాత్మయు హరిమూర్తియగుఁజుమా సర్వంబున్॥ ౬౫౬

క॥ శ్రీసద్గురూక్తవిధినిను
దాసీనుండై సఁగోసి యద్వాసనముం
దాసీనుండై ధ్యానముఁ
జేసిన సకలార్థసిద్ధి చేకురుఁ జీవా ॥ ౬౫౭

క॥ ఆధారము శ్రీవిద్యకు
సాధనములు నాల్గటంచు సాధులు మునులున్
భోధింపఁగ నేవినియెద
బాధింపఁగ నేల నిచ్ఛ భగవంతుని దే॥ ౬౫౮

క॥ శమదమములలో చూపుల
సమతన్ హరిపాదపద్మసారముఁ గ్రోలన్
దమముం బాసినశశివలె
విమలాకృతిముక్తికాంత వెడలెడుజీవా॥ ౬౫౯

ఆ. వె. ఈశ్వరేచ్ఛయొక్కఁ డీశ్వరుఁడొకరుండు
శాశ్వతములు జ్ఞానసాధనములు
విశ్వమెల్లకల్ల నశ్వరంబేయగు
నిల్వఁదావులేవి నీకుజీవ ౬౬౦

క॥ ఎందాఁక లాభ ముండునో
యందాఁక యమిత్రబంధ మటుపై మోక్షం
బందును గురుపదమందుఁ
బొందునగ్గై వల్య మవలఁబూర్ణత నరుఁడుఁ ॥ ౬౬.౧

గీ॥ స్థూలదేహంపుబంధంబు స్థూలమరయ
సూక్ష్మదేహంపుబంధంబు సూక్ష్మమట్లె
తత్త్వవిదులకుబంధంబు తత్త్వమట్లు
నిత్యనైమిత్తికములందు సత్యనిరతి
నిలిచియొకటిగానిలిచిన నిలువకున్న
నొక్కతీరునఁబ్రబలును జిక్కులెంత
యెక్కువైననుబోధంబ యెక్కుచుండు
భేదబుద్ధియ యైక్యంబుఁ బెంచుచుండు
లేమిపరిపూర్ణసౌఖ్యంపు సీమయట్టి
సఖ్యమేమని చెప్పంగఁ జాలుమూఢుఁ
డవనిహరిహరపూజచే నదియుఁదెలియు
గురునిబూజింప నద్దానిగుట్టుఁ గాంచుఁ
భేదవాదంబులెప్పుడుఁ బాదుగొల్ప
విట్టిజ్ఞానంబుస్వానుభూ త్యేకమాన
మనిరిపెద్దలు గురువులు ఘనులుమునులు
దానినీయంగ జాలునే ధరణినొకఁడు
స్వేచ్ఛసద్గురుమూర్తిగాఁ జేరఁదీసి

శివుఁడుబోధించుఁదత్త్వంబు శివకరంబు
ప్రేమహస్తంబుశిరమునఁ బెట్టిదృష్టి
పజ్తిశిష్యునిజన్మంబుఁ బావనంబు
సేయుఁదనశక్తిఁదనశక్తి మాయఁజేయు
కుండనైక్యంపుసిద్ధిని నొసఁగిస్వీయ
పాదతీర్థప్రసాదము లాదరమున
నిచ్చిప్రోచినముక్తియే వచ్చునిజము
భక్తిమదినున్నసద్గతిఁ బడయుదన్న ॥ ౬౬౨

ఆ. వె. అఖిలదోషములను హరియించునభిజిత్తు
త్యాజ్యయుక్తమైనఁ ద్యాజ్యమండ్రు
వాసనాబలంబు వర్ధిల్లశాస్త్రిమా ?
చదువునకుఫలంబుశాంతిగాదె ౬౬౩

క॥ స్వచ్ఛంబేకముబ్రహ్మము
చిచ్ఛక్తిఁదోఁచుచుండుఁ జిత్రముగనహో
స్వేచ్ఛావనమునఁదిరిగెడు
సచ్ఛాత్రుఁడుదక్కఁ దెలియసరసుఁడుగలఁడే ॥ ౬౬౪

క॥ ఉన్నదిబ్రహ్మంబేకం
బున్నట్లున్నది ప్రపంచముత్తది బీజం
బున్నది మాయం దెలియఁగ
నున్నదిజీవులకుముక్తియుత్తమసూక్తిఁ ॥ ౬౬౫

కం॥ అన్నిఁటిఁగల్పనఁజేయఁగ
నన్నిటఁదత్త్వంబులేనియని యందఱకున్
దిన్నఁగస్వేచ్ఛఁ దెల్పఁగ
నున్నదిచిచ్ఛక్తి దెలియనున్నదిగాదే॥ ౬౬౬

కం॥ అంతయునాచేఁగల్పిత
మంతమమధ్యంబునాది యానందంబౌ
శాంతంబనిశివుఁడనుప
ర్యంతము సంశయమువిడదురామది! జీవా ॥ ౬౬౭

కం॥ వచ్చుటలేదసలైనది
చచ్చినమఱిరాదు దానిచాయయునటులే
చచ్చినవారలుమఱలన్
వచ్చెదరనుశంకవలదు వలదురజీవా ॥ ౬౬౮

కం॥ తనకుందాఁదోఁచమియే
ఘనమృత్యువు జీవునకటఁగలుగదుజన్మం
బనయముఁబుట్టుటచచ్చుట
తనలోఁదాఁదోఁచుచుంటతథ్యముజీవా ॥ ౬౬౯

కం॥ ప్రతిబింబమునశియించిన
గతివేఱొకఁడుండఁబోదుగా! వసియింపన్
బ్రతిబింబమునుఱలఁచనినఁ
బ్రతిబింబముగాదు దానిప్రతిమయజీవా॥ ౬౭౦

క॥ అజ్ఞానమయుద్దంబగు
నజ్ఞానాభాసుజీవు సమరుచునుగదా
యజ్ఞానమునశియించిన
నజ్ఞుఁడుజీవునకుఁడావులా! యెందేనిన్ ॥ ౬౭౧

క॥ చచ్చెడుచోనజ్ఞానము
చచ్చినజీవుండులేక చచ్చునుదానన్
వచ్చునెమఱల నతండట
వచ్చిన నవ్వానిఁబోలవచ్చును జీవా॥ ౬౭౨

క॥ అజ్ఞానిగమృతినొందిన
నజ్ఞానంబున్నకతన నాభాసుఁడుతా
విజ్ఞానంబమరుదనుక
నజ్ఞతజనియించుచుండు నందునఁదనయా! ॥ ౬౭౩

క॥ జీవుఁడుసుజ్ఞానంబున
జీవత్వమువదలు పిదప జీవుండేఁడీ?
యేవిధమునఁదోఁచియునా
జీవుఁడుగాకుండు నొండుజీవుఁడసుమ్మా ॥ ౬౭౪

క॥ దేవుండొక్కఁడునిత్యము
జీవులనేకులునులేమి సిద్ధించెడువా
రేవిధమునఁజూచినను ద
దావిర్భావంబుమాయయయా! వేయేలన్ ॥ ౬౭౫

క॥ ఆనందంబున్నదియని
తా నెట్టులఁ దెలియవచ్చుఁ దథ్యముగాని
త్యానందపుస్మరణముచేఁ
గానందగుదానియునికిఁ గాదే జీవా ॥ ౬౭౬

క॥ జీవుఁడుదిక్కుందోఁచక
గావించెడుజగములయము ఘనయోగమునన్
శ్రీవిద్యన్ హరికృపచే
గోవులుగతిలేమిఁ బులినిఁ గ్రుమ్మెడు భంగిన్ ॥ ౬౭౭

క॥ ఒకపరిశూన్యస్థానము
నకలంకస్థితినిఁ బొంది యటుపై మిథ్యన్
బ్రకటింపసత్యవాక్కగుఁ
బ్రకటించుటమిథ్యయైన బాధయె! జీవా ॥ ౬౭౮

క॥ జ్ఞానప్రాశస్త్యంబున్
జ్ఞానియెఱుం గతనిఁ గొల్వఁ గలవాఁడెఱుఁగున్
లోనన్ గుణతతిగల్గుట
చేనందములేదు తెలివిచేనగు జీవా ॥ ౬౭౯

క॥ గుణదోషంబులఫలములు
గుణములజ్ఞానంబసుమ్ము కూర్చునుధరలో
ఫణిపైఁ బ్రాఁకఁగభయమే
ఫణిజూచినఁగల్గుఁగాక భయముకుమారా ॥ ౬౮౦

చ॥ తరిచిరి దేవదానవులు దారుణయత్నముతోడ క్షీరసా
గరమును మందరంబు పెనుకవ్వము చేసిరి పాము త్రాఁడుగా
మురహరుఁ గూర్మమూర్తిగను ముందుగఁ గోరిరి యీశ్వరేచ్ఛగా
గరళము గాంచి శంకరునిఁ గావఁగ వేఁడిన గౌరి ప్రేమతోఁ
గరము ననుగ్రహింపఁగ సుఖంబున మ్రింగెను దాని నాతఁడీ
కరణిఁ బరాత్పరుండు తనుగాన నివారినిఁ ద్రిప్పుచుండు సం
సరణమునందుఁ దుట్టతుద సత్త్వముగల్గిన బూర్ణశాంతిచే
కురునమృతంబు నిచ్చునటు కూర్చునువో యమృతంబుఁ దాన తా
మరసదళాత్ముఁడం బయయి మాయగఁ బంచెను దేవతాళికిన్
వరకృప నన్ని రూపములు వారిజనేత్రుఁడు దాల్చుచుండు శ్రీ
కరుఁడు గురుండు భక్తుల ననుగావఁగ సర్వము నంబయున్ గదా॥

క॥ దనుజుని ననుజుని చేతన్
దనయుని చేఁ దండ్రిజంప ధర్మము దెలిసెన్
ఘన వైరంబనురాగము
గనుఁగొనని లసున్న హరియ కారణమెన్నన్ ॥ ౬౮౨

క॥ విశ్వంబే నశ్వరమగు
విశ్వేశ్వరి యీశ్వరుండు వెలయుదు రెపుడున్
శాశ్వత సాంబాత్మకుఁడై
పశ్వర్థము మిథునమగును బరమాత్ముండే ॥ ౬౮౩

క॥ జీవుండా! ప్రతిబింబము
దేవుండా! గానరాఁడు దేహంబన్నన్
జా వేనిజమైతోఁచున్
దేవీమాహాత్మ్యమేమి దెల్పుదు! జీవా ॥ ౬౮౪

క॥ రాగము బాధింపంగ వి
రాగము దానిని శమింప రమ్యంబగుచి
ద్యోగము దానన్ జ్ఞానము
భోగము జ్ఞానమున ముక్తిపూర్ణత జీవా ॥ ౬౮౫

క॥ సర్వేంద్రియముల విషయము
సర్వమునకు ద్రష్టయాత్మ సర్వంబది యే
సర్వము దాన హరించిన
నిర్వాణంబందు నరుఁడు నిజముగ జీవా ॥ ౬౮౬

క॥ దానికివలయును యోగము
ధ్యానము మంత్రంబులయముఁ దలఁపఁగఁ దత్త్వ
జ్ఞానము శాశ్వతపదవిన్
దానము జేయంగఁ జాలుఁ దథ్యము తనయా ॥ ౬౮౭

క॥ తనబరువెఱుఁగఁడు నరుఁడిలఁ
దనబరువితరులకుఁ దెలియుఁ దథ్యంబట్లే
ఘనునిమనము శూన్యంబై
గనపడు నితరులకు భేదకర్మమువలెనే॥ ౬౮౮

క॥ జ్ఞానముబుధులకుము క్తిని
ధ్యానము యోగానుభూతిదాయక మంబా
ధ్యానము విర క్తిమానము
దానిసకలదానమనఁగఁదగును ధరిత్రిన్ ॥ ౬౮౯

క॥ నియమము లేదీజగతిని
రయమునసక్కఁలుగనిన రామునియందే
భయవిరహితపదమబ్బున్
దయయును సత్యముగలుగు నధర్మముదొలఁగున్ ॥ ౬౯౦

క॥ తనయొఱుకయుఁ దత్ప్రాప్తియుఁ
గనుఁగొనఁ డొకకాలమున నె గదమనుజుఁడుగా
వునఁదనతోలోకముగనుఁ
దనుఁగాంచమిఁదనువులేమిఁ దన్మయతయగున్ ॥ ౬౯౧

క॥ నిద్దురనడఁగినజీవుఁడు
నిద్దురబాయంగఁ దెలియనేరఁడుగద యా
నిద్దురయగుఁబెదనిద్దుర
గ్రుద్దుచుకర్మంబుమేలుకొలుపకయున్నన్ ॥ ౬౯౨

క॥ బాగుగదీనింగాంచుచు
యోగమునకుఁబూనఁడయ్యయో చపలతచే
రోగముతోడుతనైనన్
భోగముమానంగలేని పురుషునిభంగిన్ ॥ ౬౯౩

క॥ సరసులుగానిమనుష్యుల
సరసన్ వసియించి మనముశాంతింగనుటే
సరసతజీవా! యీయా
సరసమువలదను వలదను సరగున దానిన్॥ ౬౯౪

క॥ చచ్చినయటుకలగన్నన్
వచ్చునుమెలఁకువయు దానివలెనే పట్టున్
విచ్చినవెనుకనెగద వే
నచ్చున్ హరిమహిమజీవునకిలకుమారా॥ ౬౯౫

క॥ పట్టినపట్టొడగూడుట
పట్టుదలయుభంగమగుట పరికించినచో
వట్టిదియైననుదానన్
గట్టిగవిజ్ఞానదృష్టి కలుగున్ జీవా॥ ౬౯౬

క॥ మదముడిఁగినరోదయడఁగున్
ముదమొదవును మోక్షలక్ష్మి మురియునుగదలోఁ
బదపదమునకుదయించున్
గదవిజ్ఞానంబు చిత్రగతితో జీవా॥ ౬౯౭

క॥ దుష్టుండై పలుభంగులఁ
గష్టములందెలిసి పిదపఁ గాలముగూడన్
శిష్టుండై గురుకృప హరి
కిష్టుండౌ నదియుసతనికిష్టంబైనన్ ॥ ౬౯౮

క॥ చెడిగానిబాగుపడఁడని
కడుదెలుపన్ వినక తానెఘనుఁడనుకొనుచున్
బుడమిందిరుగుచుఁగాలము
పడఁద్రోయన్ లేచి నరుఁడు భక్తుండౌఁగా ॥ ౧౯౯

క॥ తడిసినపిదపన్ గట్టున్
గుడిసెన్ దోషంబు దెలియఁగోవిదుఁడేయా
పడిలేచినఁబూర్ణుండగుఁ
బడిలేవనిజీవుఁ డెట్లుపండితుఁడౌరా ॥ ౨౦౦

క॥ పడకున్న నిలిచియుండున్
బడిలేవకయున్న బాధపడుచుండుఁగదా
పడిలేచినముక్తుండౌఁ
బడఁడాత్ముఁడు జీవుఁడన్నఁబడిలేవవలెన్ ॥ ౨౦౧

గీ॥ మంచిచెడ్డలు తెలియని మనుజుఁడెవఁడు
మంచిచెడుఁజేయఁ జెడుఁగునుమంచిచేయ
మనకువశమౌనె దైవనిర్మాణమగుట
యనుచుఁదెలియుట తెలియుట యట్లుకాన
దానిదీనిఁగ దీనినిదాని గాఁగఁ
జేసిచేయించి పశువులఁజేసి నిజము
చిక్కులెడలించి మూఢులతిక్కఁదీర్చి
యొక్కఁడైనట్టిపరమాత్మ నెక్కుడైన

మఱ్ఱువుదయింప శాంతంబునుహిమ పొంచి
తపము సేయుంగఁ గృపను తత్త్వంబుఁ దెలుపు
దేవదేవుఁడు శ్రీవాసుదేవగురుఁడు
భక్తిహారిఁగన్న సద్గతిఁ బడయుదన్న ॥ ౨౦౨

గీ॥ చేయుపనిలేదు పనిలేదు మాయజగము
చేయఁగలదేది! కలదేది? మాయజగము
చేయవిధిలేదువిధిలేదు మాయజగము
మాయధర్మంబు ధర్మంబు మాయజగము ॥ ౨౦౩

క॥ పొగబండి వెనుక నడుపఁగఁ
బగలేకయదానివాఁడు బంధించుక్రియన్
బొగరునఁ బాఱెడుజంతులఁ
దగుమార్గమునందునుంప దైవతమటులే ॥ ౨౦౪

క॥ ముందడుగిడక వెనుకబో
వుందగజీవుఁ డచలతశివుండై యటుకా
సందనకర్తృత్వములే
మిందెలుపఁగ శూన్యుఁజేసి మేలొనగూర్చున్ ॥ ౨౦౫

క॥ వైరాగ్యమునకుజ్ఞానము
కారణమగుఁగాని నిజముగానమియెల్లా!
సారామలమణిగనిక్రొన
నేరనియంధునివిరక్తునిఁగ నెన్నుదురే॥ ౨౦౬

క॥ దేహాత్మబుద్ధిఁగాల్చెడు
దాహము తపమనఁగఁబరఁగు ధన్యులకిదియున్
సాహసమునసమకూరెడు
నీహానశింప గురుమూర్తి యింట వసింపన్॥ ౨౦౨

క॥ తనువులఱచి తనువులఱచుచు
ఘనయోగమునందు సిద్ధికనఁదగుఁదనలోన్
మనమెపుడుమెచ్చినొచ్చుచు
ఘనకార్యంబొకఁడు చేయగాలేదుసుమా!॥ ౨౦౩

క॥ తనకన్న వేఱులేదని
కనియున్ మిఱిమిఱియుఁదాను గనఁగోరినయ
ట్లనవరతముసృష్టించున్
మనలన్ దనక్రీడకొఱకు మాధవుఁడౌరా॥ ౨౦౪

క॥ కవికల్పనయనికొందఱు
కవికళయే పాత్రలందుఁగనపడుననుచున్
భువికొందఱందురెనన్
గవినానాగతుల మెలఁగఁ గలఁడొక్కండే॥ ౨౦౫

క॥ అభిమానముదుఃఖదము ని
రభిమానముశాంతికరము నగుటనరునకౌ
శుభ మదిసర్వమురాముని
ప్రభ యని యభిమానముడిగి పరముభజింపన్॥ ౨౦౬

క॥ స్వవిషయముతలఁపనివా
నివిషయమురమేశ్వరుండు నిజవిషయముగా
సవరించిశాంతినిచ్చున్
దివిభువినొకరీతి ధర్మదీక్షతరింపన్ ॥ ౨౧౨

క॥ ఈశేచ్ఛబీజ మాశా
నాశమ్మ్మకుడు రిలభవము జ్ఞానముమూలం
బౌ శాఖమ్ముదమనువగుఁ
బూశివమేసుమిఫలముతపోనగమునకున్ ॥ ౨౧౩

క॥ మనమునకుఁదనువులనన్
దనువునకున్మనమువలనఁ దద్దయుఁబీడా
జననం బౌరెంటన్జీ
వునికామూడెన్న సున్నవున్ హరిగన్నన్ ॥ ౨౧౪

క॥ హరిగనసంకల్పంబులు
కరులవలెన్గూలు జీవకాంక్షహరింపన్
హరిఁజేరిగ్రహించుకళే
బరమటమదముడఁచి ప్రీతిఁబ్రకటించుఁదనున్ ॥ ౨౧౫

క॥ సంకల్పములకుశరణము
జంకద్దానికినిపాదు శంకయ జగముల్
బొంకని తెలియుమినది యివి
జంకున్హరిస్మరణచేతఁ జయ్యనజీవా ॥ ౨౧౬

క॥ సంకల్పంబులశంకల
నంకితుఁడౌ జీవుఁడార్తుఁడై భక్తుండౌ
కింకరవృత్తినిగురురుచి
నంకితుఁడును జ్ఞానముద్రనంకితుఁడుగదా ॥ ౨౦౭

మత్తకోకిల:-పచ్చిగారియు వెచ్చనేతిని బక్వమైతరియింపగాఁ
నచ్చమైనసనాతనంబులు న్యాయమార్గనువస్తువుల్
నిచ్చలున్ వసియించుచుండునులే ప్రపూర్ణతరెండునున్
బచ్చిఁబోలదు వెచ్చపోవును బథ్యమాపురుషుండుతా
నిచ్చవచ్చినయట్లుదానిని నెచ్చుగాభుజియించెడున్
వచ్చుచుండును బోవుచుండు నవస్థలిట్టులనేకముల్
మచ్చరంబునువీడి జ్ఞానముమార్గవార్పణఁజేయుచో
సచ్చరిత్రునిస్వీకరించును సంతసించునురాముఁడున్
మెచ్చుచుండెదర మ్మహాత్మునిమేనుగొల్తురు ప్రీతితోన్ ॥

క॥ అన్నిటసంగమువిడుపది
వన్నెగదా!భక్తికరయ వలపుడుగుటకున్
వన్నెయగుముక్తిఁగోరమి
యన్నిఁటికిన్ వన్నె విష్ణునారాధనమే ॥ ౨౦౯

క॥ భగవంతునావరించును
భగవతియే భక్తిఁజేయు భగవతియే కాఁ
దగుకార్యముచేయగనా
భగవతియే ముక్తుఁజేయు భగవతియె సుతా॥ ౨౧౦

క॥ క్రీడాసక్తుఁడు దేవుం
డీడగు జోడై పిదప ననేకంబై శ్రీ
లోలత సుఖయించుచు నీ
రేడు జగంబులఁ జరించు నిచ్ఛాప్రవృత్తిన్ ॥ ౭౨౧

క॥ బోధింపఁగ సన్మూర్తియు
శోధింపన్ జగముఁ బాపు శుభ మొనగూర్పన్
సాధుల వేషము దాల్చుచు
సాధించున ముక్తి భక్తసంతతి కతఁడే ॥ ౭౨౨

క॥ ముందును వెనుకను జూడక
సందడిచాలించి ధర్మసంశయములలో
గుందక ధ్యానము బ్రహ్మం
బందున నిల్పు మనుజుఁడవై యిక జీవా ॥ ౭౨౩

క॥ ఆర్గురదొంగల గెల్వక
మార్గమునన్ నరుఁడు ముక్తిమార్గోల్పోవున్
భర్గుని భక్తుండైనన్
దుర్గమమెద్దియును లేదు దోషవిదూరా ॥ ౭౨౪

ఆ. వె. పరమభక్తుఁ జేసి ప్రజ్ఞానమీనెంచి
ముంచునట్టులుండు ముంచఁడతఁడు
గర్వముడిగి తన్నుఁ గాలోకములఁ జూచు
దనుక నట్లు పిదపఁ దనను దెలుపు ॥ ౭౨౫

క॥ కలయిదియని తెలియనిచోఁ
గలలన్ గల్పించు ఘోరకర్మములనుశాం
తిలభింపదు హరిలీలలగఁ
దెలియమి జీవునికదియగతిగదా సృష్టిన్ ॥ ౭౨౬

క॥ కలలోనగుఘోరక్రియ
వలనుఁగని మేలుకొనిన బ్రదికెడుగతిఁ దా
నిల జేయుఘోర కర్మముఁ
గడుచున్ సర్వంబు హరియకాగని తనయా ॥ ౭౨౭

క॥ నిలిపినజీవులఁగలచెడు
తలఁపది శ్రీహరికిఁగలదె ధన్యులఁజేయన్
గలచును చెఱచఁడుదేహుల
నిలనిజభోగాయతనము లీదేహములో ॥ ౭౨౮

క॥ తా లేమిఁదనకుఁగర్మము
లేలే పునరునకునీశ్వరేచ్ఛయొకండే
గాలోచితకర్మంబుల
లీలన్ జేయించు ఁజేయులే!మన కేలా॥ ౭౨౯

క॥ తపమనఁబరోపకారము
తపమనసద్విద్య భక్తితాత్పర్యంబున్
దపమునముక్తియుశక్తియుఁ
దపమునసర్వమగు హరిమదాసుల కెందున్॥ ౭౩౦

ఆ॥ వె॥ సర్వముహరియంచుసారెసారెకుజీవుఁ
డెఱిఁగియెఱిఁగి యాత్మనలుగఁడౌర!
మమతఁగర్మమెందుమాలిన్యమునుఁబొందు
లేనియెడలవిష్ణులీలసువ్వె॥ ౨౩౧

ఆ॥ వె॥ సిగ్గులేదెజీవ! జీవత్వమేభ్రాంతి
పలుతెఱంగులిట్టిపాట్లుఁదగునె!
యూరకొదిగియుండు ముత్తమోత్తమమది
యాత్మయాత్మయంద యాత్మయగును॥ ౨౩౨

ఆ॥ వె॥ ధర్మమెఱిఁగి పట్టుదలమాన వేమందు
నేమిసేయువాఁడ వెద్దిదిక్కు
వాసనాబలంబు వైరాగ్యమునఁదగ్గుఁ
దపమువలనవస్తుతత్త్వమమరు॥ ౨౩౩

క॥ పశ్చాత్తాపముగల్గిన
నిశ్చయముగజ్ఞానమబ్బు నియతాత్ముండై
దుశ్చింతమాని హరినెద
నిశ్చింతన్నిల్ప భక్తినేరుపుజీవా॥ ౨౩౪

క॥ తుదిమొదలుతెలియరానిది
గద యీజన్మంబు దీనికావిభ్రాంతిన్
రొదసేయుటాత్మనాత్మన్
వదలకదర్శించి ముక్తిఁబడయుముజీవా॥ ౨౩౫

క॥ తనపైఁ దనకుఁగలదయ
జనుఁడేలుఁగఁడు పూర్ణముసహజమునగుటఁగదా
జననంబాదిగ నాత్మన్
గనుపిదపన్ భక్తవరులఁగనుపట్టిదయన్ ॥ ౨౩౬

క॥ ఉన్నదిలేనిది తెలియమి
నున్నదిజీవంబు దానికున్నది మోహం
బన్నా యెన్నటికైనన్
దన్నెదిరింగాంచకునికి ధన్యఁతగాదే ॥ ౨౩౭

క॥ ఉన్నాఁడా! లేఁడా! యను
కొన్నాఁడా! లేకచదువుకొన్నాఁడా! వే
విన్నాఁడా! గురుపదములఁ
గన్నాఁడా! యాత్మశాంతికలుగఁగజనుఁడున్ ॥ ౨౩౮

క॥ సాంబుఁడుపరాత్పరుఁడు వి
శ్వంబగుఁబ్రతిబింబమదియు వదలుచుఁజిత్తో
నంబన్ దేశికునుపదే
శంబునసేవింపసాంబసాయుజ్యమగున్ ॥ ౨౩౯

క॥ జీవత్వశంకవదలక
కావించెడుకర్మమెల్లఁగలుషకరంబౌ
జీవత్వశంకవిడిచినఁ
గావించెడుకర్మమెల్లఁగలుషహరంబౌ ॥ ౨౪౦

క॥ ప్రియమైనదానియందఁ
ప్రియముఁ జూపంగవలయుఁ బ్రియునికిఁదక్కన్
బ్రియవస్తువరసి నీచులు
భయముంగల్పింత్రు పరమపదమునకైనన్ ॥ ౨౮౧

క॥ ఇది తెలుపఁగాదె శక్తియుఁ
బవపదమున జీవతతిని భంగపఱచెడున్
సదమలమతిశివసాంబుని
నెదఁదోఁపఁగఁజేయదయ్యె నెట్టినరులకున్ ॥ ౨౮౨

క॥ సత్యంబగునిజభక్తిని
సత్యముగాఁదోఁచునీకు సత్యంబిదయే
సత్యమగోచరమగుటన్
గాత్యాయనిచరిత దెల్పుఁ గవులకునిలలో ॥ ౨౮౩

క॥ తోఁచినదంతయులేనిది
తోఁచునెతత్త్వంబు తానుదోఁచుచునున్నన్
దోఁచుటమానినఁదానై
తోఁచునులోకులకుబొందితో నాత్మండే ॥ ౨౮౪

తే. గీ. చెప్పిచూపంగఁదెలియమి సిద్ధియంత్రము
స్వానుభూత్యేకమానంబ హార్నిశంబుఁ
జెప్పిచూపెడుదానిని దప్పవోలె
సత్తులేకుంటగణియింప రుత్తములిల ॥ ౨౮౫

క॥ తెప్పయగుననుభవంబిలఁ
దప్పయగునొక్కటిమాట తప్పియగుఁగా
యొప్పగుఁగద కన్నుదిప్పిన
విప్పినదోషంబు బ్రహ్మవేత్తలకెందున్ ॥ ౨౪౬

క॥ కనఁదగునామము రూపం
బున్గ్రియయుంగాక యాత్మముంగనవశమే
తనువునఁగల్గెడుపుల్కలు
కనఁదగుభావంబు తెలియఁగల్గునెజడుఁడున్ ॥ ౨౪౭

గీ॥ భక్తవరులకుగురులకు బండితులకు
బాంధవులకును బరులకుఁబామరులకు
భూతములకునుస్వాత్మకు భూరిశాంతి
నిచ్చునేకాంతసేవనే మెచ్చవచ్చు ॥ ౨౪౮

గీ॥ ఆత్మతాదాత్మ్యమందున నఖిలవిద్య
లడఁగియున్నవి గురుకృప నదియుఁగలుగఁ
దానుదనయందనిల్చి సంతాపముడిగి
విష్ణుమూర్తినిదాల్చెఁడువిత్తముండు ॥ ౨౪౯

క॥ బోధామృతపోతంబున
సాధులుతరియించెదరట సంసారాబ్ధిన్
గాధలఁగల్పనఁజేయుచు
వేధన్దిట్టెదరుగాదె వెట్టులుజగతిన్ ॥ ౨౫౦

క॥ అన్నియుఁ దెలిసిన తెలివికి
వన్నెయిదున్ జచ్చినట్లువర్తించుటగా
కెన్నిగొనితన్నునితరుల
కన్నన్ ఘనుఁడన్న ముక్తికల్గయుయున్నా ॥ ౭౫౧

క॥ సాంబునికృపచేతన్నా
యాంబఖిలంబని తెలిసిన నభిమానముతోఁ
డంబడుజీవుఁడు లేనిజ
గంబెల్లైతోఁచనేమి కైవల్యమగున్ ॥ ౭౫౨

క॥ తనధర్మమెంత తెలిసిన
వినసీయదుపూర్ణబోధ విజ్ఞతగలుగన్
మనసీయదుశాంతిని గురుఁ
గనసీయదు దేహమాత్మగాభ్రమముంచున్ ॥ ౭౫౩

క॥ ఎందాఁకవాక్కు మనమున్
బొందదో యందాఁకపొందుబోధల నట్టుపైఁ
జెందదునిజానుభూతిని
బొందున్ బ్రహ్మంబుఁ దెలియఁబోలునె వేత్తై ॥ ౭౫౪

క॥ ఉనికిని నేకంబయ్యున్
గనునప్పుడు భేదబుద్ధిఁగల్పించెడుగా
వినఁబడుబ్రహ్మంబొకఁడుగఁ
గనఁబడుబహురూపధారిగా నైజంబే ॥ ౭౫౫

క॥ వాచాతీతునగోచరు
లోచనములదోషదృష్టిలోఁబడనీకా
లోచనమునదాచినచో
గాచున్ నిజవిమలమూర్తి కర్మమునూచున్ ॥ ౨౯౬

క॥ తొయ్యలులుపిల్లలజ్ఞలు
నయ్యలవలెనూఁగునీచు లుత్తమునకెటుల్
నెయ్యమునకువియ్యమునకుఁ
గయ్యమునకు సమతవలయుఁగావె కుమారా॥ ౨౯౭

క॥ చదువఁగలవిద్యలన్నిఁటఁ
బొదవినయర్థంబు సర్వమున్ హరియనియే
యదిగతముగబహుముఖముల
నదియిదియన కహమటంచు నాత్మసుఖించున్ ॥ ౨౯౮

గీ॥ విక్రమునిభక్తి జ్ఞానినిర్వక్రగతిని
బెరుగుచుండును సిద్ధులఁబరగుచుండుఁ
జింతయేలేదువానికావంతయైన
ముక్తిఁబడయంగ శ్రీరామభక్తిశక్తి॥ ౨౯౯

గీ॥ లోనువెలినొక్కరీతి ప్రధానమరయ
జీవలోకంబులోకంబుఁజేర్పునార్పుఁ
గాననిశ్చింతనుంటలోఁ గల్పనంబుఁ
జేసిసామగ్రినోనఁగూర్చు సిద్ధియిదియ ॥ ౩౦౦

క॥ అంతర్ముఖుఁడై జగముల
భ్రాంతిందగులకయ యెద్దిప్రాప్తించినని
శ్చింతన్ భజియించినశ్రీ
కాంతుఁడు శ్రీకాంతుఁ జేయుఁ గైవల్యంబిన్ ॥ ౭౬౧

క॥ శాంతియెసర్వస్వము నుతి
మంతులకిలదాన ముక్తమావరియించున్
గంతునిబాధహరించున్
స్వాంతమునన్ శివుఁడు తాండవముసల్పెడురా ॥ ౭౬౨

క॥ తెలియమి తెలియుట తెలియఁగ
వలచుట తెలివాత్మదనుచు వైరాగ్యమునన్
నిలుచుటయాత్మగ భవమునఁ
బడియుంబడకుంట కిదియుపాయముజీవా ॥ ౭౬౩

క॥ చాలునుజాడ్యము బాలుని
లీలన్ శ్రీలోలు వేయులీలల లోలో
లాలింపవలెను భక్తుల
లాలింపన్ వలెను మాటలా? సేవలచేన్ ॥ ౭౬౪

క॥ పారలస్నియుల్లిగడ్డగుఁ
బూరపారకునన్నుల్లిగడ్డ పారపారవిడనం
తరమున శేషించుమొలక
పరతేజోమయమిధునము భంగిఁజెలంగున్ ॥ ౭౬౫

క॥ దుర్జయమగుదృశ్యవయసు వి
సర్జింపగబోధఁ జేసె సారథిగాఁ దా
నర్జునునకు శ్రీకృష్ణుఁడు
మార్జాలము కాష్ఠమట్ల మఱచినభంగిన్ ॥ ౭౬౬

క॥ మఱచినదానినిజస్థితికిఁ
దఱచుతరచులోనదానుదజ్ఞులబోధల్
కఱచుచుఁగాష్ఠాకృతితోఁ
దెఱచునుజ్ఞాననయన ముపదేశంబిదియే ॥ ౭౬౭

గీ॥ ధర్మమాత్మశాంతిదాయకంబని యాచ
రించు నవని బుధుఁడు ప్రీతిఁదులువ
దానికొఱకటంచు దబ్బరలాడుగా
ధర్మమూర్తి గురుడు దాల్చుచుండు ॥ ౭౬౮

క॥ తలఁపుల కెడమీయక లో
పలిదికై ప్రబలుతపసి బయలుపడెడుచో
నడఁపక దుమికెడుమృగమటుఁ
గడువేగన్ గడచి పూర్వగతిశాంతించున్ ॥ ౭౬౯

గీ॥ స్వస్వరూపానుసంధాన సరణి జగము
నీకునాకునులోలుకుల కేకరీతి
స్వగతిస్వస్థితిద్వంద్వంబు బ్రహ్మమొకఁడ
యాత్మయోగమ్మునందునోమ్మంపుఃందు ॥ ౭౭౦

ఆ. వె. బ్రహ్మమొక్కఁడతని ప్రభయగుసర్వంబు
ప్రభులు పెక్కురైన నగ్రమముగలదె
సృష్టిజాలమందునష్టాత్ములైపోర
సహజమైనయది యసహ్యమగునె ॥ ౨౨౧

ఆ. వె. దీనినరసిగాదె దీనతలేకుంటఁ
జెడడు బ్రహ్మబుద్ధివిడడు బుధుఁడు
నిత్యమంగళంబు నేర్పుమైసాధించు
దివ్యశక్తిభక్తి దేశికోక్తి ॥ ౨౨౨

సీ॥ సమయోచితంబుఁగాజరుగరాదనిగాదు
వేదననీకేలభేదబుద్ధి
సర్వమాతనియందుసమరసంబునుగాంచు
శాంతితోవర్తింపుభ్రాంతివలదు
భేదవర్తనలందుఁ బ్రీతిరామునియందు
నుంచుటయాత్మ సేవించుటరయఁ
జంతెఁబాసిననాఁడుశ్రీరామచంద్రుఁడై
సర్వార్థసంసిద్ధిసంగ్రహించు

గీ॥ నావరణమందుఁ బ్రతిబింబమందుబయట
నొక్కరీతిని వెలిగెడు నిక్కమాత్మఁ
డొక్కఁడేగద యూరకపొక్కనేల
జీవయాత్రవాడజూడుము దేవుఁడౌదు ॥ ౨౨౩

ధర్మాంబనిరంజనుని పెండ్లియాడుమని ప్రోత్సాహపఱచుట

క॥ జనకునిబోధల నజ్ఞత
చనియెనిరంజనునకుఁగొనసాగువివాహం
బనియూఁదిచెప్పఁదొడఁగెన్
జననియునపుడాత్మజునకుసంప్రీతినిటుల్ ॥ ౨౨౪

సీ॥ కాత్యాయనీపాదకంజంబులర్చించుఁ
జర్చించువేదాంతశబ్దసరణి
నర్పించునజపంబునాయూస్థలంబుల
దర్పించుఁగవిజనఘాటిసూటిఁ
జాలించుఁగర్మంబునాలించునాదంబు
సోలించునిజనాథుసోమనాథుఁ
బాలించుభక్తాళిభావించుముక్తాళి
ధ్యానించుగురుమూర్తిధర్మవర్తి
గీ॥ నించునానందమెదనుబోషించుఁబెంచు
జ్ఞానయోగంబుయోగంబుఁగాలవశతఁ
బూర్ణభావంబునవరసస్ఫూర్తిఁగాంచు
నట్టిబుద్ధిమతిసతిగఁబుట్టెనీకు ॥ ౨౨౫

క॥ శ్రీరామామలభక్తిన్
బారముముట్టంగఁగల్గుపండితులకుసం
సారంబేసారంబా
ధారంబేజాడఁజూడఁదత్త్వముజీవా ॥ ౨౨౬

క॥ విదితాత్మయువిమలాత్మయు
మువితాత్మయుమోక్షలక్ష్మిమునిజనమతత
త్పదమాత్మనిలిపివెలిగెడు
నదిరాణీప్రాణయుతయారాధనకుఁ॥ ౨౨౭

క॥ ఆమార్దవకాఠిన్యముఁ
లామానమునిరభిమానమాంయూనందం
బామంత్రశక్తిఁగనశ్రీ
రామామయమట్లుదోఁచురానాతండ్రీ ౨౨౮

క॥ రంగనిఁగనిలక్ష్మింగని
గంగంగనివిభునవంగుఁగనికుశలంబా
లింగనిలింగశరీరము
భంగముగనుగుమనికరుఁ౩భగవత్కృపచేఁ ॥ ౨౨౯

క॥ కందంబందముకవితకు
సుందరిహృదయంబుధర్మసూక్ష్మజ్ఞునకుఁ
చందమగుడందముపాత్రికి
నందటికందంబుశాంతియావేయేలఁ ॥ ౨౩౦

క॥ కుందనమునుగుణమణితో
నందంబుగఁగూర్చుమండనాకృతిఁదనరఁ
గొందఱుకొనలేమియుకా
కందఱకానందమిచ్చునాశయుహెచ్చఁ ॥ ౨౩౧

క॥ ఖగవాహుఁబిగికౌఁగిటఁ
దగఁజేర్చిసుఖించువేళఁదనచందలతక్
దిగనాడితన్మయత్వం
బాగిఁదాల్చినకనులనీకునోఁగుణభంబుల్ ॥ ౨౮౨

ఆ. వె. పూర్ణభావమందుబుద్ధిలయించినఁ
గాంతిశాంతిదాంతి కలుగుకలన
నిన్నుజూచుచోట నీవయైతానుంట
బుద్ధిమతికిన టఁపుడమిఁగలదె ॥ ౨౮౩

క॥ ఆముఖమున నవరసములు
నాముఖమునషడ్రసములుహోనాగిస్థం
బౌముఖమునసమరసముగు
నాముఖమేనారసంబునమ్యోక్షనీనా ॥ ౨౮౪

ఆ. వె. మెచ్చిసర్వమిచ్చుమేలైనబోధంబు
నిచ్చునునసునిచ్చుసచ్చరిత్ర
హెచ్చుకీర్తినిచ్చుపిచ్చలవిడినచ్చు
జాతిరూపమూర్తినాథుకీర్తి ॥ ౨౮౫

అ. వె. తనువుమనువుప్రహిణముధైర్యంబువిద్యయు
ధనముసుఖముగొప్పదనముశుభము
శక్తియుక్తిముక్తిభక్తినినిఱగనుఁ
దెలియజాలవింతచలునుదేల ॥ ౨౮౬

ఆ. వె. నమ్మిచేరువారినయమునఁ బాలించి
బుద్ధిచెప్పిచిత్తశుద్ధినిచ్చి
తత్త్వదృష్టినిచ్చిధైర్యంబునీవలె
స్వగురుధర్మనిరతభక్తకామి ॥ ౨౭౨

క॥ ఆనందమొసఁగిప్రోచుట
జ్ఞానముసర్వార్థసారసంగ్రహమదిరా
పానము ముక్తినిధానము
మానితవిద్వద్విభూషమహియోషగదా ॥ ౨౮౭

ఆ. వె. కమలనేత్రహరికిఁ గమలార్చనము సేయు
వేడ్కఁ గమలభవుని వేఁడికోనఁగఁ
గన్నతల్లిఁ జేసెఁ గమలాంగిఁ గాఁగొల్వఁ
గమలనాభుసహజకమలతతిని ॥ ౨౭౮

క॥ హృదయంబాసనమత్తులు
వదనముగరపదములాత్మవనజములగుటన్
వదనముహృదయము శ్రీహరి
సదనములగుఁ బూజకుసహజకమలతతియా ॥ ౨౮౦

క॥ కువలయముకువలయమ్మని
కవిజనములువిడిచినారుగదసరిమఱలన్
గువలయము లేలకోరిరో
వివరించెద వేడ్కనీకుపిన్నముకుమారా॥ ౨౮౧

క॥ కువలయభక్తులుమర్త్యులు
కువలయనాథుండెయమృతకోశుండనియా
కువలయమువిడిచికవులా
కువలయములఁజేరినారకుంఠితభక్తిన్॥ ౭౯౨

క॥ తనయుజఠరముననుంచుము
జననీజఠరంబువలదుశాశ్వతపథముకా
గనఁదగునీజఠరంబున
మునిగేయారామరాయముక్తనికాయా॥ ౭౯౩

మాలిని॥ సరససుగుణశీలా సచ్చిదానంద హేలా
పరశివరతిలోలా బ్రహ్మవిద్భక్తపాలా
జయతుజయతుబాలా శాంతిసౌభాగ్యలీలా
కరుణకిరణజాలా కాళశైలాగ్రశాలా ॥ ౭౯౪

గద్యము.

ఇదిశ్రీమదమృతానందనాథగురునాథబోధసుధాబ్ధికన్యాధవ
పదాబ్జసేవాలబ్ధమనీషాజనితోభయభాషాకవితాభూషా
లంకృతకనకావిర్భూతజీవయాత్రాఖ్యమహాకావ్య
సంగ్రహంబునందుజీవాధికారంబనుప్రథ
మోల్లాసంబు
సంపూర్ణము

శ్రీరామ.

శ్రీరస్తు

# జీవయాత్ర.

## ద్వితీయోల్లాసము

క॥ శ్రీశేషమహీధరవా
సాశేషః వీంద్రపోషణాంగీకృతవే
షా శ్రీరామాసద్భా
షా శేషశయనసుచరితలాలింపుహారీ ॥ ౧

క॥ జననీజనకులబోధల
వినిమాతెనుజీవుఁడాత్మవిదుఁడగుట నిరం
జనుఁడుగ మునిసన్నిధిశ్రీ
సునాజ్ఞజుమి శేషగిరినిశుభలగ్నమునన్ ॥ ౨

క॥ నిజముగ ద్విజుఁడై తనపూ
ర్వజన్మవృత్తాంతము గృపఁబ్రకటించిన యో
గిజనులకు మ్రొక్కి మదివా
రిజనేత్రుభక్తిఁబొగడెనుకృతకృత్యుండై ॥ ౩

—: నిరంజనుఁడు గురుస్తవము చేయుట :—

క॥ వింటిం దొల్లిటికథలన్
గంటిన్ మీమూర్తి నిచటఁ గనుపండువుఁగా
నుంటిన్ మీపదపద్మము
లంటన్ దత్సారమహిమ నజ్ఞత గెంటన్ ॥ ౪

క॥ నగుమొగము ముద్దుపలుకులు
సుగుణంబులుతో త్త్వనిష్ఠఁ జూచినభక్తుం
డగు యుక్తుఁడగును ముక్తుం
డగునీ మూర్తి స్ఫూర్తి నాత్మభజింతున్ ॥ ౫

క॥ అకలంక స్థితినుంటకు
సకలాత్మవునీశుదగును స్వామికినగుగా
వికలాత్ముఁడనా కెటులో
పికవాణీతత్త్వనిష్ఠ పెంపుము ప్రీతిన్ ॥ ౬

క॥ జీవాళికై వసదరా
జీవము జేసెతదమృతము సేవించుట చేఁ
గైవల్యమనితపింపఁగఁ
గేవలకృపఁదద్వ్యముక్తి కే? మీమూర్తుల్ ॥ ౭

క॥ నిజకృపచేసుజనాళిసి
నజపదమునసిల్పగలుగునంబన్ని న్నే
భజియింపలేమినాకై
నిజమూర్తిందాచి యెదుటనిలిచితితల్లీ ॥ ౮

ఉ॥ "లేనిజగంబు లేకయగు లే" యను లేమవు లేమిఁ బాపఁగాఁ
బూనితివాదయామయుఁడు బోధలనజ్ఞత గెంటఁబూనెమీ
పూనికలన్ని యున్ సఫలముల్ దగఁ జేయగఁబూనినాఁడు బో
శ్రీనిలయుండు దాసునలసిద్ధులఁ జేసెడు వేడ్క నమ్మరో॥ ౯

సీ॥ నీపదాబ్జను సేవనియతిమైఁ జేసిత
త్కౌముదీలబ్ధవిజ్ఞానసుహిమ
వస్తుతత్త్వంబులవరుసగాఁగన్గొని
యంపరంగమునందునాత్మగూడి

సర్వవాసనలవిసర్జించితిని గురు
మూర్తి నీఋణమెట్టుఁదీర్తునైన
నిర్మలమతితోడనినుబోలివర్తింపఁ
గలిగినఁజాలదేయలఘుచరిత

గీ॥ నిన్ను మెప్పించి తీర్పించి నీఋణంబు
భవముతప్పించి కైవల్యపదమొసంగి
పూర్ణఁజేయఁగ నేనొల్లఁబోపరాప్త
కామమెన్నడు శ్రీరామరామరాము
రూపుఁడవునీవుస్వామి నీప్రాపుగోరి
యడుగడుగునకునీయడుగులనుసరింతు ॥ ౧౦

క॥ తత్తత్త్వయోగభావిత
సత్తామాత్రాప్తమూర్తిసమరససూక్తిన్
బత్తిభజించుటసత్యం
బుత్తమసద్గోష్ఠినిట్టులుంటినిశాంతిన్ ॥ ౧౧

క॥ తెలియమిఁబోయినపోకడ
లలయించెన్ మిమ్ముమంత్రినాచార్యునికే
వలకృపబోధంబొసఁగిరి
లలితాకృతినందఁజొక్కలాగుననాకున్ ॥ ౧౨

క॥ హరిప్రేరేపఁగ వేఱుగఁ
దరమాచేయంగనేనుదరియింపంగాఁ
గరుణించికూర్చెనన్నిటిఁ
దిరుమలవరధుండనుచునుతించుచునవియోన్ ॥ ౧౩

క॥ జననీ జనకా మునివర
యనుపమనిజగేహమునకునాశీర్వాదం
బొనరిచిమంత్రివరునితో
జనెననతఁడుతోమగాఁగనమునికులశుభమౌల్ ॥ ౧౪

క॥ అనవినివారణ్లానా
నని సెలవీయంగఁజనియెనానంగముతో
ననిశమ్మజయంతాశ్రమ
మునఁగలమునిజనులబోధమునువారినెదన్ ॥ ౧౫

క॥ చింతించుచునిట్లనునిజ
మంత్రివరుంగూడిభక్తిమెశిరమునన
శ్రాంతంబంజలిఁజేర్చుచు
శాంతిన్గనసచ్చరువగుసచివాగ్రణికిన్ ॥ ౧౬

నిరంజనుఁడు గురుబోధమునుస్మరించుట.

క॥ నీచుఁడనాకెటుజన్మవి
మోచనమననెనదయగుమునిసేవమ్మగి
లోచనదయచేనంత
శ్శోచంబునదేశికేంద్రసత్యోపాస్తిన్ ॥ ౧౭

ఉ॥ ఎవ్వరునాకుదిక్కుపరమేశ్వరుఁడివ్విధిదేశికేంద్రుఁడై
యవ్వనితాశిరోమణిపరాంబికయైననువెంటనంటినా
కెవ్వరిదుష్టవర్తనములేమియుఁజేయకయుండునట్లనిన్
శివ్వననెత్తిసత్పథముఁజేర్చుచునుండినఁగాకచిత్తమా ॥ ౧౮

క॥ యోగీశ్వరసత్కృపచే
నాగమసంసిద్ధికలిగెనమృతముల్ గ్రోలఁగన్
శ్రీగురుకృపగల్గినవాఁ
గాఁగలదెద్దైనవృద్ధికాములకెందున్ ॥ ౧౯

చ॥ గురుఁడుగురుండు బాంధవుఁడు కోవిదుఁడబ్జదళాయతాక్షుఁడన్
నిరతముఁ గొల్చుభక్తుఁడును నిర్మలహృత్సరసీరుహాలుండును సం
సరణమహాబ్ధితారకముస్వామినిరంతరమశ్వ రాయణుం
డరమరలేకప్రోచుశిశుభాయతదృష్టినిమమ్ము నిత్యమున్ ॥ ౨౦

క॥ అష్టవిధంబులమూరుల
సృష్టిప్రారంభమందుఁజిత్రించెనుము
న్నిష్టమునెఱవేర్పన్ మూ
ర్త్యష్టకముందాల్చినాకునాకరుఁడొసఁగెన్ ॥ ౨౧

ఆ. వె. భక్తవత్సలుండు బ్రహ్మాద్యడచ్యుతి
పాదభజనపరుఁడు పాపహరుఁడు
సర్పరాజునాఁగ సకలకలాపుండు
విశ్వనుతుఁడు దేశికేశ్వరుండు॥ ౨౨

ఆ. వె. గురునిపాదవారిఁ గొన్నాళ్లుద్రావిన
భక్తుఁడెట్టులైన శక్తుఁడయగు
సక్తుఁడౌను హరినిస్మరియింపవరియింప
యుక్తుఁడగును వేగ ముక్తుఁడయగు॥ ౨౩

ఉ॥ నాకిదుతల్లివై పరమసౌఖ్యముఁగూర్చుచుఁదండ్రివై భువిన్
జీకొని కాచుచున్ సతము సేమముఁగోరెదుసద్గురుండవై
ప్రాకటతత్త్వబోధలశుభంకరమాపదమిచ్చిప్రోచుని
న్నేకరణిన్ నుతింపనగునీశ్వరుడీవనుకన్న దేశికా ॥ ౨౪

ఉ॥ ఏనిస్మరించుమాత్రనశుభేచ్ఛజనించునుజీవకోటి కె
వ్వానిసుదర్శనంబువరభక్తులసత్పథమందునుంచు నె
వ్వానియనుగ్రహంబుతడనంబనిలేకవిముక్తుఁజేయునా
దీనదయాళులోకగురుదేవుభజించిభవంబుఖుంచెదన్ ॥ ౨౫

క॥ ఈనాఁటికిఁదెలిసితినా
చేనేమియుఁగాదటంచుస్థిరముగ నేడే
పూనెదమౌనముఁబ్రోవుము
దానినిన్ భక్తిప్రముక్తిదనుగురుమూర్తీ ॥ ౨౬

క॥ నాకున్ నేనేతోఁచక
నీకరుణన్ సంచరింపనిజముగనీవే
లోకులకుఁగానవచ్చెదు
నాకాయమునందుముదమునన్ గురుమూర్తీ ॥ ౨౭

క॥ నడచుచులో వెలిగాలిన్
విడుచుచుఁబలుకుచుబుధులనువినుచునువినకే
గడిపెడుఁగాలమునీకృప
బుడుతఁడునీభజనమందుబోగురుమూర్తీ ॥ ౨౮

క॥ అందఱు యోగ్యులమధ్యన్
మందునినన్నిలిపివారికుహాసీయతచే
డెందముఁగల్మషరహితం
బందంబుగఁజేసినావయాగురుమూర్తీ॥ ౨౯

క॥ దేవేచ్ఛచేతసర్వము
గావింపంబడునుదానిఁగానకమూఢుం
డై వికలతనొందెడుఁగద
నీవాక్యమువినక తెలియునేగురుమూర్తీ॥ ౩౦

క॥ పిత్తముశ్లేష్మమువాతము
విత్తమునన్జక్కఁబడునెవిధినగుననితా
మత్తతనుండన్వశమా
చిత్తముచిదధీనమగుటచేగురుమూర్తీ॥ ౩౧

క॥ లోచూపునీవుదయతోఁ
జూచినఁగదమౌనముద్రఁజూడఁగలిగితిన్
దోఁచినఁదోఁచగనిమ్ముచ
రాచరమీవనినసర్వమౌగురుమూర్తీ॥ ౩౨

క॥ చేయుచుఁగర్మంబులఁదాఁ
జేయనియట్లున్నవాఁడుచేసియునైనన్
మాయనుదాఁటుచునీపద
మేయనిశముఁగొల్చుచుండఁడేగురుమూర్తీ॥ ౩౩

క॥ పంచప్రణవంబులలో
నంచితగతినుంచుకొని నెడునపాయునినో
మ్మంచుఁగొలిచిత్వత్కృపని
ర్వంచనభక్తినీఁదరింతురాగురుమూర్తీ ॥ ౩౪

క॥ మనముండు చోటనుండెడు
మనమదివిశ్రాంతికొఱకునుసలుచునుండున్
మనమిటునటుఁజెదఱుటచే
మనమునుదనువుననునిల్పుము సద్గురుమూర్తీ ॥ ౩౫

ఆ. వె. మాయమాయమయ్యెమహనీయుబోధచే
నిశ్చలాత్మనైన నేననైతి
భక్తిఁగొల్తుముక్తిపర్యంతమాత్మలోఁ
బరమహంసభక్తవరునిగురుని ॥ ౩౬

క॥ ఎవ్వనిసంస్మరణంబున
మువ్వురుమూర్తులనుస్మరణముఁ జేయుఫలం
బివ్వసుధఁగల్గునవ్విభు
బువ్వులఁబూజింతుజ్ఞానముఁగృపసేయున్ ॥ ౩౭

క॥ అంతశ్శూన్యందునుశ్రీ
మంతుఁడుముప్పోకలాఁడుమహనీయుఁడువి
శ్రాంతిపరాయణుఁడుదయా
స్వాంతుఁడుశివసాంబమూర్తిసద్గురుఁడౌరా ॥ ౩౮

క॥ పారగమైజీవులకిల
ధారకమైప్రాణతతికిధన్యాత్ములకున్
దారకమైకుజనాళికి
మారకమై వెలయుమూర్తి మదిస్మరియింతున్ ॥ ౩౯

క॥ భక్తుల మోక్షాసక్తుల
యుక్తులముక్తులుగఁజేయు యోజనయందా
సక్తియుశక్తియుఁగలగురుఁ
బ్రాక్తనసుకృతమునఁగంటిఁబ్రణవమువింటిన్ ॥ ౪౦

క॥ ఎయ్యదిగాంచిననితరం
బెయ్యదిగాంచందుసర్వమీశ్వరకృతమం
చయ్యెయెడలసుఖించునో
యయ్యదియేయాప్తమూర్తి యచ్యుతభక్తిన్ ॥ ౪౧

గీ॥ తెలిస తెలిసియుఁనసమదికలతఁబోలు
భవ భవమహాబ్ధిలంఘనోపాయమైన
తెప్పనీపాదపద్మంబు తేలియాడు
తప్పకదినమ్ముమిమ్మకదాఁటనిమ్ము ॥ ౪౨

క॥ అప్పటికప్పుడుసరియగు
చొప్పునఁజింతించిపలుకుచున్ జేయుచునున్
మెప్పించుహరినిఁదపమున
నిప్పించున్ముక్తి దేశికేశుఁడుకరుణన్ ॥ ౪౩

క॥ దిక్కన్న లేకయున్నను
దక్కనుబరమార్థమార్తదర్శనమునఁదా
వృత్తైక దృశ్యముఁదనలో
నొక్కఁడుధీరునకుసకలనుతసర్వంబుల్ ॥ ౮౪

క॥ నరులమనియుమాకదదు
ష్కరమనియుందెలిసిముక్తిఁగనవినుగొలువన్
బరమాప్తుఁడవై మమ్మున్
గరుణంగనుకాలమెపుడుగలుగుముకుందా ॥ ౮౫

క॥ ఛిన్నులమైనీచతఁబ్ర
చ్ఛన్నులమైఖలులఁజేరఁజాలమెటులనో
పన్నగభూషణాధీసం
పన్నులమముఁజేయవలయుభయవిరహితులన్ ॥ ౮౬

క॥ నిద్రయనిత్యప్రళయము
ముద్రన్ సాధించిదృశ్యముల్ విడనాడన్
భద్రంబగుమాకెపుడును
భద్రానుజపాదపద్మబంభరతతికిన్ ॥ ౮౭

ఉ॥ నన్నుఁగృతార్థుఁజేయఁగజనార్దనుఁడద్దిర'యిట్టివ్యూహముల్
బన్నెనుగన్నతండ్రివలెఁబాలనచేసెనుబూర్ణబోధసం
పన్నునిఁజేసిశాంతినిదపంబొనరింపఁగశక్తుఁజేసెశ
శ్వన్నుతిఁజేసెదన్ గురునిశాంతివిధాయినిశేషశాయినిన్ ॥

క॥ కీర్తింతు నిన్ను రామా! భ
వార్తిన్ భక్తులకుఁ బాపునార్యుఁడ వనిస
ద్వర్తనమున నిలిపెదవని
కీర్తిగ దా నిలుపుకొనుము కృపఁ జూడుము మమున్ ॥ ౪౯

గీ॥ సమ్మతించిన మాదాస్యసరణిధరణిఁ
జేయనెంచిన మమ్మెల్లసిద్ధవరుల
దృక్కుపడనిమ్ము నీదిక్కు నిక్కముగను
సర్వవిధములఁ గరుణించి చక్రపాణి ॥ ౫౦

క॥ మాయాశీర్వాదంబున
ధ్యేయుం బో గురుని పాదతీర్థంబునఁ బ్రో
ణాయామబలంబున మో
క్షాయత్తుఁడనై త్రిమంత్రయతినిన్ రామా ॥ ౫౧

క॥ మకరము కరినింబలెనే
వికలతనొందెం జేఁగాలవేగమునన్నున్
మకరాంకజనక ప్రోవుము
త్రికరణశుద్ధిగఁ జరింపఁ దీవనలీవే ॥ ౫౨

క॥ లోపలవెలుపల నొకఁడై
పాపంబులు లేనినాఁడు పాధియునల్లో
లోపంబగు గురుకృపచే
నీపాదముఁ బట్టుసు మహనీయుం డెయగున్ ॥ ౫౩

క॥ ఆకాళికి శ్రీకాంతకు
లోకం బేవలదటంచులోవసియింపన్
నాకేలలోకబాధలు
శ్రీకాంతపదాబ్జసేవఁ జేసెదఁ బ్రీతిన్ ॥ ౫౪

ఉ॥ కాయమునమ్మి యేవిభునిఁగానకమూఢులు దానిబుద్బుద
ప్రాయముగా నెఱింగి పడరానియనర్థలఁ గ్రుంగి యేనిభ
ద్రాయతమూర్తిఁగొల్చెదరహర్నిశమాహరి సర్వసౌఖ్యసం
ధాయిని శేషశాయినిఁబునర్భవదోషహరున్ భజించెదన్ ॥

క॥ జ్ఞానియగుమౌని మానియ
పూనుంజిన్ముద్ర దానఁబూర్ణాత్ముండై
గానంగను శ్రీనిలయుని
తోనైక్యముశక్తిసర్వతోముఖవృత్తిన్ ॥ ౫౬

క॥ సామగ్రియెంతగల్గిన
నేమంబుననున్న నెట్టినేర్పరియైనన్
రామునడామోదింపక
యేమియునొనరింప లేఁడనీశుండగుటన్ ॥ ౫౭

క॥ వెనుకఁగనముందుఁగాంచిన
ననంతమగుఁజూడకుం డనాచింతయ లే
దనవిందు నట్టులుండియు
కనుఁగొందున్ రామనిత్యకళ్యాణంబున్ ॥ ౫౮

క॥ హరిలీలసర్వమనిగను
నరుఁడేనారాయణుండునమ్ముచునరులన్
బురుషప్రయత్న మొనరుచు
నరుఁడరయన్నరుఁడయెన్నినాళ్లకునైనన్ ॥ ౫౯

ఆ. వె. ఊరకుందుమన్న నూఁచెదుజీవుల
నూఁగఁదలఁతు రేనిసాగనీవు
కన్ను లప్పగించికడ తేరవలెఁగాక
చేయఁగలదిలేదుసిద్ధమో దు ॥ ౬౦

క॥ చేయుటమానుటదలపఁగఁ
జేయుమిగాఁదోఁచి తోఁచిజీవత్వంబే
మాయగఁదోఁచునవలనా
కాయంబే దేవళంబుగదనీకుహరీ॥. ౬౧

క॥ జీవుఁడుతోఁచుటమృత్యువు
దేవుఁడుతోచుటయమందుత్రిపుటిహరింపన్
గైవల్యమద్దిసద్గురు
సేవాఫలమీశ్వరేచ్ఛ సిద్ధమురామా ॥ ౬౨

క॥ లక్ష్మియమాఁకొసఁగెడుజయ
లక్ష్మి యులక్ష్మియును మోక్షలక్ష్మియువిద్యా
లక్ష్మియును ధర్మసూక్ష్మము
లక్ష్మీవరభక్త సేవలన్ దత్త్వంబున్ ॥ ౬౩

క॥ సకలాధారులుమేశులు
సకలాధారులునుసరససద్భక్తులనున్
సకలాత్ములఁజేసెడుమా
మకగురుమూర్తులుసకలమంగళకరులున్ ॥ ౬౪

క॥ పలికించినపలుకులు లో
కులకేయనుభ్రాంతితొలఁగుకొఱకిటునన్నా
కులపెట్టిజననినిజపద
జలజంబులభృంగమట్లుచక్కఁజేసెన్ ॥ ౬౫

క॥ నేవిరమించినపిదపన్
గావించుచునుండుసర్వకార్యంబులనా
కావేశముగల్పించును
వేవిధములఁబూర్ణుఁజేయువేడుకనుమయే ॥ ౬౬

క॥ నీసంకల్పంబునఁగా
దేసర్వముఁగూడెవిడెడు సిల శైలసుతా
శ్రీసద్గురూక్తవిధిని
న్నేసదమలభక్తిఁగొల్వనీజగదంబా ॥ ౬౭

క॥ శ్రీవిద్యాసంపత్ప్రద
కేవలచిన్మూర్తిగురునికిఁజేయందున్
వేవిధములనీమూర్తిని
సేవించుసుశీలమబ్బఁజేయఁగదేవీ॥ ౬౮

కం॥ చిత్రంబులు మీ లీలలు
పాత్రుం డెట్లగును దెలియఁ బలుకఁగ నేత
న్మాత్రుఁడు మీ సత్కృపకుఁ
బాత్రుండుగా నున్న నో భవానీ వాణీ ॥ ౬౯

కం॥ శుభ సూచన ప్రభవించెఁ
విభవంబును విష్ణుభక్తి విమల బ్రహ్మా
నుభవంబ భయము గురుకృప
నుభయంబున నొసఁగు బాలయుద్యల్లీలన్ ॥ ౭౦

కం॥ మోహంబుం బెడఁ బాపుచు
దేహాదులఁగ నసిక దృక్కుగ నిలుపన్
జోహారు చేసెదన్ శ్రీ
కైహికమాముష్మికంబునం దెడు వేడ్కన్ ॥ ౭౧

ఉ॥ భూరివివేకశాలురగు పుణ్యులు సర్వము వీడి నీ పదాం
భోరుహముల్ భజింతు రంట ముక్కుడ నన్ను భక్తి కోటితో
జేరి భజించు నట్లు కృపఁ జేసి ప్రమాద పరంపరాళికే
నారక ద్రుంచి ప్రీతి నను నాకుము శ్రీకర చంద్రశేఖరా ॥ ౭౨

గీ॥ ఆత్మబోధంబు నొసఁగక యంతరాత్మ
నాత్మ నాత్మీయులను గూడి యనవరతముఁ
గొల్చి నిల్చు నీ భక్తుల కొలువు నుండ
నిమ్ము రామలింగేశ నిన్నమ్మ మమ్ము ॥ ౭౩

క॥ గురుశిష్యులుజీవాత్మలు
ధరనింగియు స్త్రీపురుషులుదంపతులున్ సం
సరణముతరణముజననము
మరణముకార్యముకరణముమూరమణుండే ॥ ౨౪

క॥ మనసునువాక్కునుగాయము
ననుపుగనొకరీతినుంటనాత్వమునన్
ఘనయోగశక్తికలిమిని
మునులెందున్ జిక్కరై రిపున్ బరమేశా ॥ ౨౫

ఆ. వె. ఆత్మభజనమన్నియమరినపిసపనాఁ
గపముగాదుసట్టినెపముగాని
అయ్యవచ్చువఱసునమనసయూఁగునా
రజతగిరినివాసరామదాస ॥ ౨౬

క॥ శాంతియుబ్రహ్మాంబనిగురుఁ
డెంతయుఁగృపబోధఁజేయనెఱిఁగియునరుఁడు
భ్రాంతిముభ్రాంతిందగిలియ
హాంతన్ విడనాఁడలేఁడుప్రారబ్ధమునన్ ॥ ౨౭

ఉ॥ లోకముఁజూడఁజూడననులోమవిలోమములేకదాసదా
వాకునువ్యర్థపుచ్చుకొనివారినివీరినిఁజేర్చిలోవెలిన్
గాకనుగుందనేలనుపకారముసేఁతకునేనెవండనా
పోకడలన్నిమానిపరిపూర్ణుభజించెదభక్తకోటితోన్ ॥ ౨౮

ఆ. వె. ఊరకుండువాఁడెయుత్తముండనుటకుఁ
గారణంబునేఁడుగంటిమంటి
నూరకుంట యన్ననొంటినుంచుటయన్న
నాత్మయాటయన్ననరయనొకఁడ ॥ [౮౯

ఉ॥ మానమువీఁడియోడి యనుమానము సెందిగృహాంగణంబు
శ్రీనిభజించిపెంచిబహురీతులభంగమునొందగుంది లో
కానికిమంచివానివలెఁగానబడంగఁగృతార్థుఁడెట్లుచీ
మానములేదునీకునభిమానమమానముత్రోసిపుచ్చెదన్ ॥

క॥ తోఁచినహరినింజూచుచుఁ
దోఁచుటమానంగనాత్మతోఁగలియుచునా
లోచనములన్నిమాని వి
మోచనముంజూచుకొనుముముక్తుఁడవుఁదలఁతున్ ॥ ౯౦

క॥ సిద్ధునకన్నియుఁదామై
సిద్ధించున్ శాంతికలిమిసిద్ధించుఁగదా
సిద్ధియనఁజిత్తశుద్ధియ
బుద్ధిన్ హరిఁజేర్చుటొండెపూర్ణతయొండే ॥ ౯౧

క॥ ఆత్మార్పణమొనరించివి
శ్వాత్మునియందిఁకభక్తినందితినైక్యం
బాత్మానాత్మలఁదెలుపుమ
హాత్మునిసద్బోధబలిమిహరికృపకలిమిన్ ॥ ౯౩

ఉ॥ కామకళావిలాసముజగమ్మునిజమ్మనినమ్మినెమ్మదిన్
శ్రీమహిళాధవున్ బరునిఁ జేరిభజించిశివంబుపెంచిని
ష్కాముఁడనై చరించిగుణసన్నిధిపెన్నిధినెంచిమించిన
ద్ధామమణీలసద్భవనతీర్థముస్వార్థముగాసుఖించెదన్ ॥ ౨౪

క॥ తనకేతావులులేమిని
ఘనయోగమునందుఁ దెలియఁగలుగుటచేతన్
గనిస్థైర్యముకైవల్యముఁ
గనియెడునీదేహమందుఁగనకబుధుండే ॥ ౨౫

క॥ సృష్టిపరంపరలెన్నియొ
నష్టంబై చనుటవినియు నయపథమునసే
యిష్టమువచ్చినయట్టుల
కష్టింపకవీరివారిఁగాంచుటమేలా ॥ ౨౬

క॥ ఎందాఁకలోకమందున
నిందలువినిపించుపరులనిందించెదనో
నందాత్మజకృపసేయుము
సందడిలేసట్టితావుసరససుజనులన్ ॥ ౨౭

క॥ ఈజ్ఞానమునాకిచ్చిన
విజ్ఞానునినీదుభక్తువివిధార్చనలన్
బ్రజ్ఞాయత్తతఁగొల్చెద
నోజ్ఞంబగునీదుమూర్తినుతియింతుసదా ॥ ౨౮

క॥ తత్పరులై విహరిం. (గ
సత్పురుషుల కేలచిత్రసామగ్రిమదిన్
మత్పతినారాధించివి
యత్పథమునసంచరింతునానందమునన్ ॥ ౮౯

ఉ॥ తప్పులుదిద్దిము క్తుఁడవుతప్పకుమానిజధర్మమునుచుఁడా
జెప్పెనురాజ శేఖరుఁడు శ్రీపతియొప్పను దప్పదింక మా
కెప్పటికైన మోక్షమది యీశ్వరద త్తముశంక లేదుమా
యప్పరమేశ్వరార్చనలనాత్మవరించుసుఖించునాత్మనిన్ ॥

క॥ తెలివియుగలిమియుబలిమియుఁ
గలిగియు నెద్దైనఁజేయఁగలిగియుఁదెలియం
గలఁడాతత్వం బాత్మన్
నిలువఁగగీలకము తెలియ నేరనిజడుఁడున్ ॥ ౯౧

క॥ స్వశరీరేంద్రియములుతన
వశములుగాకుండమెలఁగవారిన్ వీరిన్
వశపఱచుకొ...ఁగ యత్నం
బశివము దెచ్చుంగదయరయఁగఁబరమేశ ॥ ౯౨

క॥ సంపర్కదోషమేగద
కంపముగల్గించు నాత్మకాంతిహరించున్
సొంపగుజోడేభవముహ
రింపందగునైకన్యబుద్ధి శ్రీహరికరుణన్ ॥ ౯౩

క॥ రాగద్వేషంబులఁ బా
రోగనిపల్కినవిచారముండునెయిదిన
ద్యోగిమనోగమనమునకు
బాగగుపాథేయమగుటభక్తిభజింతున్ ॥ ౯౪

క॥ కర్మాకర్మములందతి
నిర్మలుఁడగుఁదన్మయుఁడఁ జునిజధర్మముఁ గన్
శర్మదమగునోంకారం
బర్మిలిజీవుఁడుభజించియుజ్జతమించున్ ॥ ౯౫

క। పేతువది శిరోజాతము
ప్రీతియురోజాతమగుటఁ బెద్దలు భక్తిన్
నీతియని యమృతమని ని
ర్హేతుకమని సహజమహారికృపయనియెదరో ॥ ౯౬

క॥ సుమనస్స్వాంతవిహారిని
దమోహహారినిసమాధిధర్మజ్ఞులు ధ్యా
నముఁ జేయుచునెడమియాయక
నమోభగవతేసమోయనన్ వినికందున్ ॥ ౯౭

క॥ కలదనిజగముంగలియును
వలదనివిడనాడు దాసబాధగలుగఁ బె
ద్దలచేభేదనివినువే
ళలమించిసుఖించుఁగన్నులఁగనిభ్రమించున్ ॥ ౯౮

క॥ ఇన్ని విధంబులవలలన్
బన్నుటయోపన్నుగొనుటఁ బరమాత్మానీ
కన్నన్ వేఱేమియులే
దన్నన్ జడుఁడెట్లు తెలిసియానందించున్। ౯౯

గీ॥ చచ్చిపుట్టిననాఁడుసంసారమేది?
యేది?మమతావికృతివెరపేదబుధున
కేదిజాడ్యంబు శ్రీరామ!యిహపరసుఖ
సాధనంబేది వేదంబుశాస్త్రమేది?॥ ౧౦౦

ఆ. వె. అష్టసిద్ధులమరెనానందముదయించె
నాత్మమహిమపెంచెనతఁడుపురముఁ
జేరునంతకిట్లుసిద్ధులకరుణకు
మేరదెలియఁదరమె నీరజాక్షి ॥ ౧౦౧

—: నిరంజనుని వివాహము :—

ఆ. వె. రాజధానిఁజేరరాజసుతునిఁజూచి
మంత్రివరుఁడుపెండ్లిమాటలాడ
ధర్మబుద్ధినతఁడుతగుయత్నమొనరింప
మనుడురాయబారమతఁడుచేసె॥ ౧౦౨

గీ॥ శేషగిరిమీఁదఁబెండిలిసేయఁదలఁచి
పెండ్లివారెల్ల విడిసిరిప్రీతితోడ
జరిపిరచటవివాహలాంఛనములెల్ల
బుద్ధిమతిపూర్వపుణ్యాబ్ధిపొంగెననఁగ ॥ ౧౦౩

క॥ విందులతోఁ జని బ్రహ్మా
నందముగా గురులఁ గొల్చి నరపతిసుతుఁడా
నందపురిఁ జేరె సతితో
నందముగాఁ బౌరులెల్ల నానందింపన్ ॥ ౧౦౪

—: నిరంజనుఁడేకాంతంబున భార్యతో స్త్రీప్రశంస చేయుట :—

ఆ. వె. అంతఁగొన్ని దినములైనంత నేకాంత
మునను బుద్ధిమతిని గని యొకింత
స్త్రీప్రశంసఁ జేయఁ జెంతకు రాఁ దీయ
నా పెరాఁగఁ బలికె నాతఁ డిట్లు॥ ౧౦౫

ఉ॥ నీరధిమేరమీఱఁగ నేరమిఁ జీకటిగొందిదూరఁ సం
చారము మాని చోరతతి జారఁ జకోరము దప్పిదీర నీ
హారము నిగ్గుదేర ధరనంతట వెన్నెలతీఁగఁ బారఁ దో
షారమణీమణీహృదయజాలము మక్కువఁ జిక్కెఁ జంద్రుఁడున్ ॥

క॥ నీకృపకు న్నే పాత్రుఁడ
నో కంజదళాక్షి నన్ను నోరుగాఁ జూడం
బోకుము పెరపోకడలన్
బోకుము లోకంబుఁ జూడఁ బోకుము పీఁకన్ ॥ ౧౦౬

క॥ పదగతిమందం బనిమది
ముదమున నిన్ జూడఁ గోరి ముందడుగిడఁగన్
బదముల చేతనములగుటఁ
గదలవు నే నేమి సేయఁగలుగుదుఁ దరుణీ ॥ ౧౦౭

క॥ బుద్ధిమతిసతిగఁ జేసిన
బుద్ధిమతిం దలఁతుఁ బూర్వపుణ్యంబే నా
శుద్ధచరిత్రగ నిద్ధాత్రిన్
సిద్ధించెన్ నిజగృహిణిగ శ్రీలన్ బెంచన్॥ ౧౦౯

క॥ శ్రీరామాయణమంతయు
నా రామామణియె బోధనౌ నానందం
బౌరామయొడలెఱుఁగక యా
త్మారాముఁడగుగద విస్మయంతన రామా॥ ౧౧౦

ఉ॥ కాంచిన నిన్నెఁ గాంచవలెఁ గారుణికత్వముఁ జూపి మేలుగాఁ
బెంచిన నీవ పెంచవలె భీతి జనింపఁగ శత్రుకోటులన్
ద్రుంచిన నీవ ద్రుంచవలెఁ దోషముఁ బాపి మనంబు జ్ఞానమున్
నించిన నీవ నించవలె నిశ్చలభక్తి ఘటింపఁగావలెన్
సంచితమెల్లఁ ద్రుంచవలె శాంతియు ముక్తియు నీవ యీవలెన్॥

గీ॥ కరుణఁ జూచెడు తరుణులు కలరు గాని
జ్ఞానముండుట కష్టంబు మానినులకు
రెండు గల్గిన వారికి దండమిడుదు
భవము దాఁటింపవారె సద్బంధువులిల ॥ ౧౧౨

ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గురువు దాతయు దైవము నై చరించు సం
ఫుల్లసరోజలోచనను బూజ లొనర్చెద నిష్టసిద్ధికిన్
గల్ల జగంబుమించఁ గృపనన్నను దేవతలోవఁ గొల్చి రం
జిల్లెద సద్గురూత్తముఁడు చేసిన మేలని సంస్మరించుచున్॥ ౧౧౩

ఉ॥ సారస పత్రనేత్రజలజాతభవుండుసతీమణిన్సదా
ధారణజేయువాక్కున సుధాకరశేఖరుఁడంబకర్ధమై
భారముదాల్చుదేహమున భామమఱొక్క తెయూర్ధమందునీ
వారయలచ్చికిత్తుహృదయంబునయంబుననిట్లుగాంచిసం
సారమసారమౌజనులుసారసనేత్రలగాంచలేనిని
స్సారులుతామరామ!సువిచారతనీమృదుపాదపద్మముల్
గోరిభజించువారికనుకూలపువృత్తిఁజరించుభార్యయే
సారముతారకంబుసరసామృతవృష్టికృపార్ద్రదృష్టినే
భారముఁదోఁచకుండనను పారము జేర్చుమహానుభావవి
స్తారపుభక్తిఁగొల్చెదనుదానిబలంబుననిన్నుగొల్చెదన్॥

క॥ దైవాధీనముసద్గురు
సేవాఫలమాత్మయోగసిద్ధిప్రదమౌ
శ్రీవిద్యారూపమునగు
నావనితాసంపదమనసారభజింతున్ ॥ ౧౧౫

క॥ తలలోఁగలవల విచ్చఁగ
బలమెచ్చగనాదుతపముఫలియించఁగఁగే
వలమూర్తమూర్తిగానీ
లలనారత్నంబుఁగూర్చెలలితాకృతితోన్ ॥ ౧౧౬

క॥ అనవినికాంతారత్నము
మనమునసంతోషవార్ధిమగ్నతఁగనుచోఁ
గనెశ్రీరామాకృతినాఁ
గనిమోన్సర్వార్థసిద్ధిగలవిభుసంతన్ ॥ ౧౧౭

—: నిరంజనుని సన్నిధికి నన్నంభట్టువచ్చుట :—

ఆ. వె. కాంచికాశిమొదలుగాఁగలక్షేత్రముల్
తీర్థరాజరాజిదేవతాళి
భక్తవరులను నిజభార్యతో సేవింప
బుద్ధివొడమెరాజపుత్రకునకు ॥ ౧౧౮

గీ॥ సంఘసంస్కారమునకైనచదువులెల్ల
సంగ్రహింపంగదూరదేశంబునందుఁ
జిక్కియున్నయన్నంభట్టుచెవినిఁబడెను
రాజపుత్రుండుఁజాబాలిరాజయోగ
మభ్యసించుటపెండిలియాటమొదలు
గాఁగలవిశేషములుతానుఁగలఁగియలుగ ॥ ౧౧౯

ఆ. వె. అంతఁబయనమయ్యె నాతురుండై లోన
జీవయెంతపనినిఁజేసె తెట్ట
కేలకిట్టిచెట్టతేలపుట్టెనటంచు
మోసపుచ్చితంచు ముంచితంచు ॥ ౧౨౦

ఆ. వె. ఎంచియెంచుకొనుచు నేమియుఁదోఁచమి
బరుగులిడుచునెత్తిబాదుకొనుచు
వెట్టివానివోలెవిప్రుండుసంఘసం
స్కారమింకననవనిసాఁగదంచు ॥ ౧౨౧

గీ॥ చేఁకల్యాణపురమున శ్రీలఁబెంచి
రాజ్యభారంబువహియించి రమణమించి
కనకసింహాసనంబున జ్ఞానముద్రఁ
దాల్చియున్న నిరంజనధరణిపతినిఁ
గాంచె మోదించెఁ బ్రశ్నించెఁ గలువకంటి ॥ ౧౨౨

క॥ అంహతి నెఱుఁగక ప్రియజన
సంహతిసింహాసనమున స్వామింబలెనే
బృంహితశరీరుఁడై నర
సింహా! కూర్చున్నయంతఁ జేరునె శుభముల్ ॥ ౧౨౩

క॥ అన్నా యిట్టివిచిత్రము
పున్నెము సంఘము మఱచితి పూర్వస్నేహం
బెన్నవుగద మతిమారిన
దున్నట్లుండి యిటు సేయనుచితంబగు నే ॥ ౧౨౪

క॥ మొన్నగలమాటలన్నియు
నిన్నన్ మఱచితివి పెండ్లి నేఁడనఁగానే
విన్నంతనమ్మ లేదది
కన్నన్ వేఱెట్లుతలఁపఁగలుగుదు చెపుమా ॥ ౧౨౫

క॥ అన్న నిరంజనుఁడిట్లనె
నన్నంభట్టునకు నింతయాశ్చర్యంబే
యన్నా! యన్నన్నా! హరి
కన్నన్ వేఱొండుకర్తగలఁడే వలఁపన్ ॥ ౧౨౬

క॥ మున్నొనరించినకర్మము
లన్నితొలఁగె వానితోడనాయోజనలున్
జన్నవిమనముననొక్కం
డున్నదిశ్రీరామతత్త్వమూరః యున్నన్ ॥ ౧౨౭

క॥ అదినీవవలంబించిన
మదిసంశయముడుఁగు పరమమౌనముకుదురున్
గదబ్రహ్మతేజమదితా
నుదయించున్ బెంచునించును త్తమపదవిన్ ॥ ౧౨౮

ఆ. వె. ము క్తియన్ననొక్కమూలనుడాఁగునా
నరకమొక్కమూలనక్కియున్నె ?
జీవునందెయుండు దేవుండుతథ్యంబు
తెలియవనఁగ విప్రుఁడలిగియనియె ॥ ౧౨౯

ఆ. వె. ముక్కుమీఁదనుండుమూఁడవకన్నంద్రు
చూడఁజూడనాకుఁజోద్యమయ్యె
కన్నుచెదిరెనేని గన్పించుఁజిత్రముల్
జీవదీనికేమిచెప్పెదీవు? ॥ ౧౩౦

ఆ. వె. నన్నుఁబోలునరుఁడునాకెట్లుగురుఁడౌను
కన్నుముక్కుచెవులునన్నియొకటె
ఉన్నయట్లులుండియూహించుగాఁబోలు
జీవదీనికేమిచెప్పెదీవు? ॥ ౧౩౧

ఆ. వె. చక్రపట్కమంద్రుచచ్చినవారలఁ
గోసికోసినమ్మిమోసపోతి
నిజముగాంచలేనినిష్ఠయోగంబౌనె
జీవదీనికేమిచెప్పెదీవు ? ॥ ౧౩౨

ఆ. వె. మతములాఱటంద్రు మౌనంబువిధియంద్రు
నామతతియువేలు నేమమట్లు
వింతదేవుఁడెట్లువేదంబుబల్కెనో
జీవదీనికేమిచెప్పెదీవు? ॥ ౧౩౩

ఆ. వె. నిజముబల్కఁజాలునిష్ఠలువలదంద్రు
నిష్ఠనిజములేక నిలువదంద్రు
సులభపదములయ్యుస్వోక్తివిరోధముల్
జీవదీనికేమిచెప్పెదీవు? ॥ ౧౩౪

ఆ. వె. పతియదేవుఁడంద్రు పాపంబులేదందు
రతనియాజ్ఞకొలదియాచరింప
నీతినియమరహితమేతీరుగానగు
జీవదీనికేమిచెప్పెదీవు? ॥ ౧౩౫

ఆ. వె. గుళ్లగోపురములగోవిందుఁడున్నాఁడె
మొద్దుదేవుఁడెట్లుమోక్షమిచ్చు
మందబుద్ధులందువిందారగించుటె
జీవదీనికేమిచెప్పెదీవు? ॥ ౧౩౬

క॥ వేదములుపౌరుషేయము
లాదిగ వర్ణములు లేనివయ్యనుమిథ్యా
వాదులుకల్పనఁ జేయఁగ
వేదముతోఁగూడనవియు వెలసెధరిత్రిన్ ॥ ౧౩౬

ఆ॥ పూర్వకాలమందుఁబుర్వుఁబోఁడులకెందు
పాఠశాలలేదు పరువులేదు
గానవిద్యలేదు జ్ఞానంబులేదయా
జాతరూపమూర్తిసత్యకీర్తి ॥ ౧౩౭

ఆ. వె. నేటికట్టిమాట నోటుగాఁదోఁచదే
పాఠశాలలెందుఁబ్రబలుచుండ
విద్యఁగాంచెవనిత వెజ్ఞినివదలెఁగా
జాతరూపమూర్తిసాధుకీర్తి ॥ ౧౩౮

క॥ జ్ఞానంబనదానంబా
గానమపానంబలేక ఘనమూర్ధనమా
మానంబాలాభంబే
లేనిదిమాకేలచాలులేన్నృపతియనన్ ॥ ౧౪౦

క॥ చిక్కులబొరలెడిభట్టున్
బక్కననగియిట్లుమిత్రబాధహరింపన్
నొక్కివచించెనునరపతి
తిక్కనివారించిపరమధీరునిఁ జేయన్ ॥ ౧౪౧

—: నిరంజనుఁడన్నంభట్టును మందలించుట. —

క॥ భుక్తియుముక్తియునొక్కట
భక్తింజేకూరునంచుఁబ్రాజ్ఞులువలుకన్
యుక్తులఖండింపఁగనా
సక్తియగాబట్టుగల్గుశక్తిజనులకున్ ॥ ౧౮౨

ఉ॥ చక్కనిబోధలన్వినఁగఁజాలవు చాలవుభాష్యశాంతికిన్
మక్కునబాంధవాళి పయిమానవుమానవుదుష్టవాసనల్
పెక్కువిధంబులన్దలఁపుఁబెంచెదు పెంచెదుసంచితంబునే
ఫక్కిఁదరింతువో తెలియవచ్చునెవచ్చునెనీకుజ్ఞానమున్॥౧౮౩

క॥ కనిదక్షుండగుదక్షుని
వినియాతనిచరితమేషవేషముగనియున్
జనులెట్టివెట్టులోహరి
మనమునధ్యానింపలేరుమాపతిదీక్షన్ ॥ ౧౮౪

క॥ పటమగునుగపటసూచన
నిటలాక్షుండదియుజ్ఞమినిశ్చింతుండై
కటకటలయించులోకము
పటమున్ధరియించిశౌరిపాలనఁజేయున్ ॥ ౧౮౫

క॥ తనకాపదగల్గినచోఁ
దనతల్లియొతననుజాంపుఁదదితరజనులే
మనిచెదరనితమినాలిం
గనమొనరించెడినిఁజడుఁడుగాన్పడుగురునిన్॥ ౧౮౬

క॥ అకలంకస్థితినుంటకు
సకలాత్ములకొ అరుఁగాక చపలాత్ములకుꣳ
బ్రకటింతురెగురుజనములు
సుకరంబెట్లగును ధర్మసూక్ష్మంబవ్వా॥ ౧౪౭

క॥ కాదన్నదియౌనౌనఁట
కాదఁటయౌనౌనఁటన్నఁగలకాలంబుꣳ
వేదనఁజెందుదురఁటదు
ర్వాదంబులమరగినేటిబాలకులకటా॥ ౧౪౮

క॥ భయమేనయమైతోఁచꣳ
నియమంబులవెట్టివేలనిష్ఠలవేలా
భయవిరహితపదమేలా
నయమొక్కటిచేయుజన్మనాశముభళిరే॥ ౧౪౯

క॥ భీతినిసర్వముగలుగꣳ
భీతాళుండొకఁడెచాలుఁబెఱవారలతో
భూతలమునఁబనిలేదిఁక
నేతీరుననైనభీతియేసాధించుꣳ॥ ౧౫౦

క॥ దేవుఁడులేఁడనిలోలత
నేవిధములసర్వమనుభవించునరునకా
దేవునిసత్త్వముతోఁచినఁ
జావేనిజమగునదెంతసాహసమున్నꣳ॥ ౧౫౧

క॥ దేవుఁడుకలఁడని తెలిసియు
నావంతయుసంశయంబునందకసకలం
బేవిధినిషేధముఁగనక
దేవేచ్ఛగననుభవింపధీరుఁడుగాఁడే ॥ ౧౫౨

ఆ. వె. మంచివారిఁజూచిమహనీయులాయంచు
నెంచునీచుపాపమెంచనేల
నీచతకునుదుష్టనీతిగేఁ బంధువు
పట్టుఁదలనుగుణముపుట్టునెట్లు ॥ ౧౫౩

సీ॥ కోరినావారలంచునుజేరివారి
సేవచేఁగొంతకాలంబుచేటుఁగాంచి
నరుఁడుహరిపదద్వయిఁజేరెవిరతిఁగాంచు
భక్తిహరిఁగన్నసద్గతిఁబడయుఁదన్న ॥ ౧౫౪

ఆ. వె. పక్షిపల్కుచుండువృక్షంబుమీఁదన
పుట్టనుండుఁబాముగుట్టుగఁగద
కంటఁబడినయంతఁగార్యమునుదాల్చుఁ
గలియవలయుఁజెలిమి తెలియవలయు ॥ ౧౫౫

ఆ. వె. పాలమీఁదఁబ్రీతిబాలురకిలలోన
ఫలరసంబునందుభక్తులకును
గాఢనిద్రయందుమూఢాత్ములకుఁబ్రీతి
ధన్యులకునుబ్రీతితత్త్వమందు ॥ ౧౫౬

ఆ. వె. పనులుచేయలేనిపనిముట్లఁదిట్టుఁగా
బుద్ధిలేనివాఁడుబుధులఁ దిట్టు
ధనములేనివాఁడుధర్మాత్ముఁదిట్టుఁగా
జన్మరోగమందుశాంతిమందు ॥ ౧౫౭

ఆ. వె. ధర్మబుద్ధిలేదుదయయుసత్యములేదు
దేవునొల్లఁగాంచుదీనుఁడకట
పంట్లులేకచెఱకుఁబట్టిపీకిన యట్లు
ముక్తిఁబడయగురునిసూక్తిశక్తి ॥ ౧౫౮

ఆ. వె. గురునిఁగొల్వవచ్చుగోవిందుఁగనవచ్చుఁ
బ్రాణమైననిచ్చిప్రబలవచ్చు
మర్మమిచ్చునపుడుమహిమాఁగఁబడిచచ్చు
భక్తవరులఁగొలిచిబ్రదుకవచ్చు ॥ ౧౫౯

ఆ. వె. దేవుఁడనఁగవేఱెదేశమందున్నాఁడె
మాయయనఁగవేఱెమహిమగలదె
తననుగాంచుచోటఁదగులునురెండింట
గరుఁడగమనుఁగొలిచికడచుబుధుఁడు ॥ ౧౬౦

క॥ అన్యాయపుజీవనమున
ధన్యత్వముఁగాంచఁదలఁచుదారిద్ర్యమునన్
సన్యాసముచేఁబట్యము
ధన్యత్వమునున్నపప్పుదప్పళమొన్నన్ । ౧౬౧

క॥ పారముముట్టందలచిన
ధీరుండేదైన నేలతిండికి బాధల్
బేరము సేయునుముందుగ
గారెలకై జన్మమెంతకష్టంబకటా॥ ౧౬౨

క॥ బ్రతికెడుకాలంబల్పము
మెతుకులకై పాటుపడుచు మెక్కెడుచోస
ద్గతిగోరరుమతిలేమిని
మృతిమాటయమఱచిహద్దుమీరినశుంఠల్ ॥ ౧౬౩

క॥ ఏదైనవాగవచ్చున్
వేదంబునుదిట్టవచ్చువిజ్ఞానులతో
వాదంబుఁ జేయవచ్చున్
మోదంబొకయింత లేకమునుఁగఁగవచ్చున్ ॥ ౧౬౪

క॥ కలిరాజుకృపనుగాకిలఁ
దులువలురచ్చలనునలగఁద్రొక్కంబడరే
వెలయాలియాజ్ఞ చెల్లుట
పలు తెఱఁగులనృపతికృపనుబడయుటఁగాదే॥ ౧౬౫

క॥ కటకటదుష్టులసంగతి
యటువీస్థలమునకునెక్కడయెక్కెన్ భయమం
దటనుండున్ మృగజాతం
బిటలేకయయట్టిబాధయేగలుగుఁగదా ॥ ౧౬౬

ఆ. వె. కానరానిబాధకంటిలోనినలుసు
కన్ను తెలుప రాదు కానరాదు
తనకునితరులకునుతచ్ఛాంతిశోకంబు
భట్టయేమిసేయవచ్చు నరుఁడు ॥ ౧౬౭

క॥ మతిమంతుఁడుభయమునకై
వెతఁజెందుచుఁదిరుగనేల వెఱ్ఱింబలెనే
సతతముహరిపదపద్మము
లతులితగురుభక్తిఁగొల్వనో విప్రవరా ॥ ౧౬౮

క॥ జ్ఞానికానివాఁడు కాననంబులమెచ్చు
మానిగానివాఁడు మాటమెచ్చు
గొప్పబుద్ధినిజముగురుమూర్తిమెచ్చఁగాఁ
దలనుబుట్టుఁబట్టుఁదలనుగాదు ॥ ౧౬౯

క॥ కనఁగలగర్భంబున్నది
కనిమొదశిశువులనునేనకావలయునవే
అనియెంచుకొనువనితఁజూ
చినవ్వరెయిల నెవ్వరైనసిగ్గుఁగాదే ॥ ౧౭౦

క॥ కానన్ నీచులకిలలో
హానియగున్ ధర్మసూక్ష్మమార్జించుటసి
ధ్యానంబునఁగానందగు
దానిన్ వేఱొందుగ్రంథతతిఁగూడదుసూ ॥ ౧౭౧

క॥ కానఁగుసుకృపకై వి
జ్ఞానులుభజియించుచుందురుగద భువిమిథ్యా
జ్ఞానులుశక్తిఁగొలఁదినభి
మానముతోవాదములనుమరుగుదురెందున్ ॥ ౧౭౨

క॥ జ్ఞానంబనగాఁదెలియుక
గానసభన్ జూడఁబోవుగతిఁబరుగిడుచున్
దానన్ స్వేచ్ఛన్ గానక
మానవునిన్ సేవచేయమౌఢ్యంబనురా ॥ ౧౭౩

గీ॥ పోషణార్థంబుసహజమౌరోషముడిఁచి
పరులసేవించివిత్తమ్మువడయుకన్న
మృత్యువదిమేలుబుధులకుసత్యముభువి
వాసనాబలమెంతదుర్వారమకట ॥ ౧౭౪

ఆ. వె. రసములేనివారిరాగమెట్లుఫలించు
సానమీఁదజలముచల్లకుండఁ
జెక్కపట్టికొక్కచిక్కనాగంధంబు
మధ్యవర్తి లేనిమనువదెట్లు ॥ ౧౭౫

ఆ. వె. కూళలఱచుచున్నఁగూరుకురాదెందు
మంచిమాటనిద్రమబ్బుఁదెచ్చుఁ
బూర్వకర్మఫలముపురుషునేమనవచ్చు
వాసనయుడఁగుగురువరునికరుణ ॥ ౧౭౬

క॥ నిద్దురయూర్మిళకోరెను
నిద్దురముచికుందు డట్లనేర్పుగఁగోరెఁ
ఇద్దఱుపతికై కోరిరి
ముద్దులునిద్రింత్రువిభునిముందరనన్నా ॥ ౧౭౭

ఆ. వె. హూయురూపమయ్యెమర్యాదలేదయ్యె
విద్దెలేదుదొడ్డబుద్ధిలేదు
గురునిభక్తిలేదుగుణమేమిలేదింక
భవముదాఁటరాదుభ్రాంతిపోదు ॥ ౧౭౮

ఆ. వె. ప్రకృతివాదులంటప్రారబ్ధవాదులు
భేదవాదులంటభీరులంట
వాదమేలభక్తివైరాగ్యమబ్బిన
మాధవార్చకులకుమతములేల ॥ ౧౭౯

ఆ॥ వె॥ సులభశైలినొరస్వోక్తివిరోధముల్
బలుకుచుంటగొప్పప్రజ్ఞయండ్రు
తెలివిమాలినట్టిదీనులబ్రదుకిట్లు
భవముదాఁటరాదుభ్రాంతిపోదు॥ ౧౮౦

ఆ॥ వె॥ ఉత్తచదువుచదువుతీర్ణతకుఁగాదె
నీతినిష్ఠజూడనేతిబీర
భక్తిశక్తియుక్తిప్రబలెవిద్యలయందుఁ
దెలియకూరకిటుఁ బలుకదగునె ॥ ౧౮౧

ఆ. వె. ఇలనుసత్యమరయహేతుహేత్వాభాస
రీతిఁదెలియుచుండురీతిరెండు
మార్గములనుజూడమనలనిట్లుసృజించు
శేషగిరివిభుండుశ్రీధరుండు ॥ ౧౮౨

ఆ. వె. కన్నువినుటమెట్లుకనునట్లుచెవియును
కొయ్యకరుగునెట్లుకొలిమినూద
దొడ్డయత్నమునను దొలుఁగునా నైజంబు
పట్టుదలనుగుణములుట్టిపడునె ॥ ౧౮3

క॥ అంగారముదిద్దిడిచో
శృంగారముభంగమైనసిగ్గుననోరుల్
దొంగికనుదొంగవలెవా
రింగనివంకరయినదనరెడుమదినోరా ॥ ౧౮౪

క॥ తనవలెలోపముగలనరుఁ
గనిసంతసమొందుఁగానికనఁడుగుణంబుల్
గనినన్దుఃఖంబెచ్చును
ననుభయముననోర్వలేమినవ్యాధిఖలుఁడున్ ॥ ౧౮౫

క॥ లోకములోఁగలహంబున
కేకారణమేలనరులకీర్ష్యయుచాలున్
లోకమునదుష్టజనముల
శ్రీకృష్ణుఁడుభంగపఱచెజిత్రముదీనన్ ॥ ౧౮౬

క॥ భారతకథలంజదివిన
సారంబివ్విధినిఁ దేలుసాధులు తెలుపన్
శేరెసుయోధనునకువిన
నేరమియేమట్లుఁ జేసెనిజముగనతనిన్ ॥ ౧౮౭

క॥ తెలిసియుమూఢులవలెవా
రలసిరియుద్ధంపురంగమందునదానన్
దెలిసెనుహరికర్తృత్వము
జలజాతభవాండమతని జాలంబన్నా॥ ౧౮౮

క॥ కేవలముక్తికిధరలోఁ
గావలసినజ్ఞానముండఁగాఁజాలునన్
నేవినినవ్వేదనేతిని
సేవింపఁగ నేలకంపుసిద్ధించినచో॥ ౧౮౯

క॥ నరుఁడులతాంతములకయిళు
దురుననిషనునీరుభ్రాంతితోనిడనగునే
ధరనులతాంతమ్మునహరి
చరణమువిడిస్వకృషినమ్ముజడునింబలెనే ॥ ౧౯౦

క॥ వేదముమూలంబనిత
చ్చోదితకర్మంబుముక్తిశోభనమీయన్
లేదనివేదాంతంబుల
నీఁదఁబడికొట్టుకొంటమిథ్యాదృష్టిన్ ॥ ౧౯౧

క॥ తపముఁ యోగముకర్మము
నెపమొక్కఁడుదారుకఁదో యనేర్చినయంతన్
జపలాత్ముఁడౌనుగాకటు
సుపథంబునని జెపు గురునిఁజూడంగలఁడే॥ ౧౯౨

గీ॥ దేవిసత్కృపనమ్మినధీరుఁడగును
దీనులనువేఁడిబ్రదికినదేబెయగును
గానతత్పాదపద్మముల్ ఘనుఁడుగొలుచు
భక్తిగలిగినఁగల్గునాబ్రతుకుఁదెరువు॥ ౧౯౩

క॥ ప్రారబ్ధం బేసంసృతి
కారణమని లోకులంట కంటపంబుంటన్
ప్రారబ్ధంబెవ్వరిదో
కారణమన్నిటికి హరియగాదే విప్రా॥ ౧౯౪

క॥ తనసంగతి తానెఱుఁగఁడు
విననెంచున్ గనఁగనెంచు వీరిన్ వారిన్
ఘనమైనకొలువుదొరకెన్
మనవానికిఁ జెడఁగవేఱు మార్గంబేలా॥ ౧౯౫

క॥ తనతప్పుతనకుఁదెలియదు
వినయముగానుండివెదకు వేత్తలతప్పుల్
ఘనమైనగురునిసన్నిధిఁ
దనతప్పెతానుగాంచుఁ దత్త్వజ్ఞుండై॥ ౧౯౬

క॥ యోగంబోపిక లేమిని
భోగము రోగభయముమదిం బొందుటబలముర్
రాగముమిత్రుండుసంపద
త్యాగమునిర్భయము లేకుండ త్త్వము లేమిర్ ॥ ౧౯౭

క॥ గానముశ్రుతిరహితంబయి
జ్ఞానముగురుభక్తిలేమిగౌరవమొందుర్
మానము లేమిని ధ్యానము
మానము లేమినిఁగుదురవృమందుల కెందుర్ ॥ ౧౯౮

క॥ భరియింతురువరియింతురు
చరియింతురుశిష్యులట్లశాంతముతోడర్
బరికింతురులోపములర్
దరియింపఁగనెట్లుఁదెలియుఁద త్త్వంబన్నా॥ ౧౯౯

క॥ నతిఁజేసెడుమతిమంతుల
గతిమాలినపురుషపశువు గాసిలఁజేయుర్
మతియెట్టులో స్థితియట్టులఁ
గుతుకము లేనట్టివారి కూటము లేలా॥ ౨౦౦

క॥ అగ్రజులగుటకు లేదుకు
శాగ్రమునుంబోలుబుద్ధిసత్సేవయు లే
దాగ్రహమునఁగుగ్రహములు
సుగ్రీవులుపలుకులందుశూన్యులుక్రియలర్ ॥ ౨౦౧

క॥ ఓపికలేమిన్ లోపము
లోపమునన్ దాప మంతలోఁ గోపంబున్
గోపమువలనన్ బాపము
పాపము బాపండు చేడ నుపాయంబన్నా ॥ ౨౦౨

క॥ చనవునమనమునలాఘువ
మనయము నాచార్యుఁ జూచిహాస్యము సత్యం
బునులోపమాచరించుట
వినునదిమఱచుటయుఁ దెలుపవే ముక్తిచ్ఛన్ ॥ ౨౦౩

క॥ తెలిసినది తెలియకున్నది
యలయఁడు భేదింప భక్తినలయఁడును మనో
విలయముగమ్యస్థానం
బలవడినదిబుద్ధిలేమి పశు యాతనికిన్ ॥ ౨౦౪

క॥ లోపము లేక చరింపఁగ
నోపిక లేదయ్యె దానినొప్పకొనెడుచో
లోపము పాపము వీనికిఁ
దాపముకర్తవ్యమండ్రు తథ్యమువిబుధుల్ ॥ ౨౦౫

క॥ అందఱనెంచుట దనకే
యందము లేకుంట పుణ్యులానందింపన్
డెందముగుందుటతనకు
ఖ్యాతిం దెలియకజగము మెచ్చ లోలోఁ బుచ్చన్ ॥ ౨౦౬

క॥ ఎద్దానినైజమవ్విధి
ముద్దుగఁగాపాడలేవె మొండివినీవే
దిద్దగఁబెద్దవైప్రజలన్
సుద్దులచే మోసపుచ్చుచున్ మహనీయా॥ ౨౦౭

క॥ నీతికిఁదప్పినవారల
కేతీరుననైనదుఃఖమేప్రాప్తించున్
నీతికిలోవెలినైక్యం
చేతగువేషంబుదోషమేమహనీయా ॥ ౨౦౮

ఆ. వె. మూఢుఁదృష్టిఁజేయమొదలుశాస్త్రముపుట్టె
మూఢుఁడెంతచదువమూఢుఁడయగుఁ
దృష్టిలేదుభవముతీరమ్ముఁజేరుట
లేదుబుద్ధిలేదు లేదుశాంతి ॥ ౨౦౯

క॥ తలగోరుగుటజలజాత్ముల
విడిపించుటభాష్యశాంతివిధియునిషేధం
బులులేమియుబుధదూషణ
ములుచిత్రముముక్తబంధములుకలిసెరా ॥ ౨౧౦

క॥ కేసరులుగర్జనమునస
దాసనములఁగోరమినినుదాసీనులుస
న్న్యాసులుగద బూదిని దు
ర్వాసులుతామసమునగురువంచకులుజడుల్॥ ౨౧౧

క॥ ఇంతయసాధ్యపుఁగార్యము
పంతంబునఁ జేయ నెంచి భగవంతుఁడుమా
కాంతుఁడు కలి సకలకళా
వంతునిస్వాంశమున ధైర్యవంతునిఁ జేసెన్॥ ౨౧౨

క॥ అందఱు చెప్పఁగ సాగిన
మందులు విను వారలెవరు మహనీయుల నేఁ
డిందఱఁ జేసిన కలికిన్
వందనములు చేసి తెలియవలెఁ దత్వంబున్ ॥ ౨౧౩

క॥ కలికాలంబున మనుజుల
కలవియొస త్త్వవచదువులబ్బినమాత్రన్
జలికాలంబున వలువలు
కలవానికిఁ బూర్ణరక్షకల దెమహాత్మా ॥ ౨౧౪

క॥ సత్యాసత్యము దెలియక
జాత్యంధులఁ జేయ నెంచి జాత్యంధత చే
నిత్యము శ్రమలన్ బొందుచు
భృత్యుఁడవై సంచరించితే మహనీయా॥ ౨౧౫

క॥ జాతివ్యక్తులకల్పన
చేతన్ దత్త్వంబు తెలియఁ జేయుట చేతన్
జాతివ్యక్తులకైక్యము
నీతియొ సత్పథమనఁదగు నే మహనీయా ॥ ౨౧౬

క॥ అందఱనొక్కెడఁ జేర్పఁగ
సుందరమై యుండుఁ జూడఁ జూడ వివేకం
బెందున లేకుండు విజయ
మందెడు మార్గంబు తెలియ రామహనీయా ॥ ౨౧౭

క॥ రూపంబున భేదము త
ల్లోపంబున నైక్యముండు లోకమునంతన్
బాపంబొక్కటి చేయఁగ
నీపాలంబడెను మెచ్చ నేనిను జగముల్ ॥ ౨౧౮

క॥ మూఢుని వైరాగ్యంబతి
గాఢంబుగ నుండుఁ గష్టకాలమున నెయా
రూఢజ్ఞానము లేకని
గూఢంబుగ లోనఁ బాదుకొను మాఢ్యంబుల్ ॥ ౨౧౯

క॥ వంచించెద లోకంబని
యెంచుల్ మూఢుండు కాని యెంతయుఁ దనుదా
వంచించుకొనుచు దాసన్
పంచితముం బెంచుఁ బెంచు సంసారంబుల్ ॥ ౨౨౦

క॥ నిజమెఱిఁగి గురుని పదములు
భజియింపంగల్గినరుఁడు పండితుఁడైనన్
విజనస్థలముల మెచ్చక
కుజనాళిన్ రచ్చలందుఁ గూడుచునున్నే ॥ ౨౨౧

క॥ ఆర్జింపఁబడినపూర్ణత
నార్జించుటయెట్లుమఱలయాయాగతిని
త్త్యార్జనమువశోకర్తృత్వా
ధూర్జనులిలనూత్న పద్ధతులుకల్పింత్రో॥ ౨౨౨

క॥ సృష్టిపరంపరలెంచిన
నష్టాంత్ముండౌను దేహినానాగతులన్
శిష్టజనసేనలన్ సం
తుష్టింగను మంత్రమూర్తితోఁగనుహారినిన్॥ ౨౨౩

క॥ అభయంబొసఁగెడు శాస్త్రము
విభుఁడును విత్తంబుఁ దత్త్వవేత్తలు గలుగన్
శుభమై పరఁగెడు స్వస్స
న్నిభమగుసభసభయగుఁగద నిందకుసభయే॥ ౨౨౪

ఉ॥ మోసముఁ జేయవచ్చు ధనముల్ గడింపఁగవచ్చు దానిచే
దోసము చేయవచ్చు బుధదూషణమాననవచ్చు నిష్టమా
వేసము వేయవచ్చును నవీనమతంబులబోధఁ జేయుచున్
గాసులకై సహోదరులఁగల్పనఁ జేయుచుమించిమున్గుచున్॥

ఉ॥ బోటివరించిమీకుఁ బరిపూర్ణసుఖంబుల నీయఁబోదు సా
పాటును లేదు కర్మపరిపాకము లేదది మున్నె జ్ఞానమా
నూటివినావచించుటలు సూనృతమన్న హుళిక్కి విద్యము
మ్మాటికిలోటునూటికిసుమారుగుణంబులుచాలునంద్రయో
యేటికి సర్వతోముఖుని నీశుభజించెదురిక్తవాంఛ మీ
బోటులకేమిచెప్పినను బూడిదఁబోసిన నేతిరీతినా॥ ౨౨౬

ఉ॥ ఈఁతకు లోఁతు లేదు జగదీశ్వరునాజ్ఞకు లాతిలేదు ప్ర
ఖ్యాతికిఁ గోఁత లేదు పరమార్థపుదృష్టికి జాతిలేదు సం
ప్రీతికి భీతి లేదవనిఁ బ్రేతకుఁ బూఁతయు లేదు లేదహా
నాతికిఁ బ్రీతి కాయజుని నారికి నారికి నీతిలేదు ని
ర్హేతుకమీశు సత్కృపకు రీతులు సేఁతలు లేవు భూసురా॥ ౨౨౭

చ॥ తెలియుమిఁ గప్పిపుచ్చికొన దేశికులై చరియింతురక్కటా
కలియుగమందు మూఢు లది కానని యన్నలు చిన్నలై సదా
కొలుతురు భక్తశేఖరులకుం దులఁదూఁగెడు వేడ్క ముక్తికా?
వలలు నుదూరి దూర్చుటకు వారికి వీరికి నైక్యమబ్బెడుం॥ ౨౨౮

క॥ నిజమెఱుఁగరు సుజనాళిని
భజియింపరు దుష్టవార్తఁ బ్రకటింతురు సా
మజవరదుఁడు వారికెపుడ
పజయము సమకూర్చు జ్ఞానవహ్నిని నార్చున్॥ ౨౨౯

క॥ ఏ మహిమ లేనినరులకుఁ
బ్రాముఖ్యం బొసఁగు నూత్నపద్ధతులిట్లు
ప్రామాణికులై కల్పిం
త్రిమహి మహనీయులెన్నియేన్ నిశ్చింతన్॥ ౨౩౦

క॥ దేనిం దర్శించినఁ దన
కానందము గల్గు మనము నాత్మయుఁ గలియున్
దానిఁ గనుమాప్తమూర్తిఁగ
మానవ! జన్మంబు లేదు మరగినదానిన్॥ ౨౩౧

క॥ దూరముఁ గొండలు నునుపని
యూరక యెంచెదరు చేరి యొడుదుడుకులలోఁ
జారుచుఁ బడుచున్ లేచుచుఁ
జేరరు మఱివాని మదినిఁ జేర్పరుగాదే॥ ౧౩౨

ఆ. వె. ఇంకనైనఁ బరుల నెన్నుట మానుము
నిన్ను నెంచుకొనకు నీచగతిని
సర్వముహరిలీల సంశయించినగోల
ముక్తి బుధులుధర్మమూలమండ్రు॥ ౧౩౩

ఆ. వె. భ్రాంతిహెచ్చుకొలఁది భక్తి తగ్గును దాన
బలము తగ్గు మొగ్గుఁ బాపమునకు
సిగ్గుబలములేమి సిద్ధించుఁ గొఱగామి
లేమియేమిసేయలేదు నామి॥ ౧౩౪

క॥ డీయనడీయనుజందం
బాయెను బరమార్థమబ్బదాయెనులోలో
మాయన్ బాయగలేకిటు
లాయెను మర్యాదఁ గోరుటాయెను నాచేన్ ॥ ౧౩౫

క॥ ప్రారబ్ధమనుభవింపక
పోరాడిన లాభమేమి బుధుఁడైనన్
దారాపత్యాదుల భ్రమఁ
జేరక శ్రీహరిహరగురుసేవల నుండున్॥ ౧౩౬

ఆ. వె. అన్నికామములకు నజ్ఞుఁడై యునికియే
కారణంబుగా నజ్ఞానవహ్ని
గామదహన మార్యకర్తవ్య మందురు
కానిదానిఁగూడ ఁగామమనరొ॥ ౨౩౭

క॥ కోపాగ్నిదగ్ధమానస
మోపదు తపమునకు శాంతి నుత్సాహమునున్
జేపఁగఁగానసతతమా
కోపముపుట్టించెడు ఁజెడుగుబడుగు లేలా॥ ౨౩౮

క॥ ఇదమిద్ధమ్మనువాఁడే
యదిగాదని మఱియునొకటియౌనని యదియున్
మదిఁదృప్తికరము గాదనుఁ
గద మదమో ముదమొ గురునిఁగాంచమిచెయు కటా॥ ౨౩౯

ఆ. వె. మంచిచెడ్డ లెంత యెంచుచుండిననేని
వంచనంబుగాని వన్నెగాదు
స్థైర్యమబ్బదెందు సమరసంబేమందు
స్వాత్మమూర్తితోడ నైక్యమందు॥ ౨౪౦

ఆ. వె. మిత్రవిముఖుఁడైనఁ జిత్రంబుతననీడ
తనకుఁజిక్కదయ్యెఁదన్నుఁగొనినఁ
దనను వెంబడించుఁ దనయత్నమే లేక
హానికభిముఖుఁడైన యంతఁజూవె॥ ౨౪౧

ఆ. వె. ఫలముఁబడయఁగోరి పలుపాట్లుపడుచున్నఁ
గర్మముఫలియింపఁగలదె యకట
ఫలముఁగోరకుండ భగవంతు సేవించి
ధర్మమాచరింపఁ దానెతగులు॥ ౨౪౨

ఆ. వె. ఎంతదూరమైన నెగిరిపోవునుసృష్టి
నొక్కదానికన్న నొకటిమెఱుఁగు
కాలునిల్వదెందు గణియించుచుండినఁ
జింతఁబాసి పరునిఁజెందకున్న॥ ౨౪౩

—: అన్నంభట్టారకుని పశ్చాత్తాపము. :—

క॥ నావినియన్నంభట్టపు
డీవిధిఁజింతించె నోర యెంతయుఁగృపణో
నీవసుధాధిపుఁడోసఁగెఁ
గేవలబోధంబు కీర్తికే? యనితనలోఁ॥ ౨౪౪

క॥ లోహముననా యజుఁడుసం
దేహమునన స్వేచ్ఛఁదనదు నేర్పననాహో
సాహసముననా చేసెను
నాహృదయము మందిఁజెఱచనా చెడిపోనా॥ ౨౪౫

క॥ రెపరెపలాడెడు దీప
మ్మొసగిది నునికియును లేమి బోధపడదుగా
కపటాత్ముని వైదుష్యము
చపలత నన్నింటనుండఁ సంశయముండుఁ॥ ౨౪౬

క॥ లోకముననుండుపురుగుల
నేకంబులు వారిలోన నెవఁడవునీవీ
కాకన్ శోకింపకుమో
కాకీ! నీత్రోవనీవ కనుఁగొన శుభమా॥ ౨౪౭

క॥ హితమెఱిఁగించెడువారల
గతిఁబల్కుచు నెప్పుడు తమకార్యముకొఱకై
నుతియించుచు భ్రమముంచెడు
నుతచరితులవలన మనసునొచ్చినకతనన్॥ ౨౪౮

క॥ పుస్తకభాండాగారము
నిస్తులమగు శాంతినీయనేర్చుననెడి లో
కస్తవముల నమ్మచునే
వాస్తవముగ మోసపోయి వదలితినాసన్॥ ౨౪౯

క॥ నినుగొల్వనినాస్తికులన్
ఘనతమమునఁద్రోసి నీచగతిఁద్రిప్పెదుగా
నినుభక్తిఁగొల్చువారిని
ననయము నుచ్చైఃపదంబునందింతు శనీ॥ ౨౫౦

క॥ నీచర్యలద్భుతంబులు
నీచునిఘనుఁజేయు ఘనునినీచునిఁజేయున్
గోచైన లేకత్రిప్పన్
భూచక్రంబంతను నధిపునిఁజేయు శనీ॥ ౨౫౧

క॥ హితమెఱుఁగమి మతిచెడుటన్
గతిలేమినిఁ దుచ్ఛబుద్ధి గర్వితమతి నే
నుతికొఱకు నెట్టులేనియు
బ్రతుకుటకున్ బడ్డపాట్లు పతితునిఁ జేయన్॥ ౨౫౨

క॥ ఎద్దానియందు ద్వేషం
బద్దానిని నాశ్రయించి యడఁగిమెలఁగఁగా
గ్రుద్దెనన దైవ మద్దిర
బ్రద్దలుగావించి మెదడు భంగించెననున్॥ ౨౫౩

క॥ తలలోని క్రొవ్వువదలెన్
బలువిధముల మోసమయ్యె బాధలు హెచ్చెన్
వలలన్ ద్రోయక నీపద
తలమును జేర్పుము తనయుని దయతో రామా॥ ౨౫౪

మాలిని॥ వలదువలదు రామా వారినిన్ వీరినింకన్
గలఁచుటదియు మేలా కర్మమున్ బెంచనేలా
కలిమిబలిమి కల్గన్ గల్గునా సౌఖ్యమెచ్చోన్
బుడుతబడితచేతన్ బుద్ధిమైమెల్గఁడో కోర్కె॥ ౨౫౫

గీ॥ పూర్వపద్ధతులన్నియుఁ బోవిడుచుట
రూపమొక్కటినిలిచెను రూఢిగాఁగ
మనుజపతి మాత్రుఁడే యితఁడనుచుభక్తి
వేఁడెగుసుభావమున నిట్లుపీడెభ్రాంతి॥ ౨౫౬

క॥ కపటమువిడిచి చింతించెద
పాపములనరయక యు నన్ను నిజకింకరుగాఁ
కృపఁజూచిన జీవించెద
నపకీర్తిం బొందకుండ నటుఁజేయవలెన్॥ ౨౫౭

క॥ కృపఁజూడుము చపలాత్మునిఁ
గపటాత్ముని దుష్టభ్రష్టుఁ గఠినాత్మునినన్
దపమునకున్ సామగ్రిని
కృపసేయుము బుద్ధిసిద్ధికృపసేయు సఖా॥ ౨౫౮

ఉ॥ చేసినదోసముల్ తెలియఁజేసినసిగ్గగుఁదెల్పుకున్ననా
యాసము మోసమున్ గలుగునంచిటుఁగుందినలాభమేమివి
శ్వాసములేనివాఁడ నపచారశతంబులు సేసియైననీ
దాసుఁడనౌటనాయెడనుదారతఁజూపుము పాపుపాపముల్॥

ఉ॥ చేసినవెల్లపాపములు చెప్పినవెల్లనుగల్లలౌటనా
యాసముగల్గెనింకఁబరిహాసపు జీవనమేలయాత్మస
న్యాసముఁబొందు నిచ్ఛగలదన్నియు గూడుటనీపదంబనా
యాసముగాలభించెఁ బరమాప్తసుధీమణి రాజచంద్రమా॥

ఉ॥ కాలముపోవుచుండె పృథగాభవదీయకృపావిహీనతన్
జాలముదాటలేదు సిరసంపద స్వేచ్ఛఁజరింపలేదువా
చాలతమూనలేదుసరిసాధులఁగొల్చుట మున్నె లేదున
న్నేలవయార్ద్రదృష్టిఁదరియింపఁగఁజూడవు మిత్రరత్నమా॥

క॥ దానముఁ జేయుము జ్ఞానము
స్థానము హరియందుఁ జూపు సమరసదృష్టిన్
మానుము మాయలు నాయెడ
మానము నాశీర్వదింపు మహీపతి కరుణన్ ॥ ౨౬౨

గీ॥ గుణము కుదురలేదు గోవిందు సేవించు
భక్తగణము లేదు శక్తి లేదు
ముక్తికొఱకు నిన్ను ముమ్మాఱు వేడెద
భక్తపాదపద్మబంభరంబ ॥ ౨౬౩

గీ॥ ఆత్మదమనంబు కూడ దిహపరములకు
కీర్తికొఱకయప్పనికినస్గీలుకొలుపు
వేషధారుల నాలించి దోషినైతిఁ
జాలుఁ జాలు వేషంబిక సత్యనిరతి
జ్ఞానయోగంబు యోగంబుఁ బూని గురుని
పాదపద్మార్చనంబునఁ బాపమెల్లఁ
గాపుకొననున్న నాపెనుప్రాపు నీవె
శివుఁడు గురురూపమున వచ్చి చెప్పునంట॥ ౨౬౪

క॥ లోపము లెన్నఁగ నెంచినఁ
బాపఁడు తాళంగ లేడు భవదావాగ్నిన్
బాపము ద్రోయకుమీ తని
నీపజ్జ నిల్పు విడుచు నే? రాజసుతా॥ ౨౬౫

క॥ నాకంటెజడుఁడుదుష్టుఁడు
లోకంబున లేడు సంఘులోలతనిటు నీ
శోకదచేసితి నన్నిఁక
నీకృపతోఁ బాత్రునిగ గణింపుము నృపతీ ॥ ౨౬౬

ఉ॥ పూటయుగంబుగాఁగఁబరిపూర్ణసుఖంబులు లేములట్లనా
నాటికిదోఁచ హంసహరినాగఁగఁడుంగడుఁబ్రజ్వలింపఁబా
పాటవులందహింపగలప్రాజ్ఞత లేమిఁజరించుచుంటసా
పాటుకృపాకరామిగిలెఁబాపఁడ నైజననంబుఁగాంచుటన్ ॥ ౨౬౭

ఉ॥ పుట్టినదాదిగాబలముపోకడగానిసుఖంబు లేదుచే
పట్టుము నేటికైననిజభక్తునిశక్తునిఁజేయుమీకృపన్
జెట్టలఁద్రోచిపుచ్చుమికశ్రేయముగూర్పుసమాధినీశ్వరున్
గట్టిగనిల్పెదన్ హృదయకంజమునందున రాజచంద్రమా ॥

క॥ శంకలువదలెనునీకృప
జంకన్ బనిలేదు లేదుసంసారబా
తంకము లేదు భజనమే
వంకన్ జేయంగఁగలుఁగుపాత్రత గల్గెన్ ॥ ౨౬౯

క॥ ధనమంటెన్ బాల్యంబున
వనమంటిన్గొన్నినాళ్లు వైరాగ్యమునన్
జనమంటి నాకుసంజీ
వనమాయూఁటెన్ సుఖంపవచ్చితినీలోన్ ॥ ౨౭౦

క॥ అన్నంభట్టారకు మొర
విన్న నిరంజనుమనంబు వేగము కరఁగెన్
వెన్నవలెననఁగ నప్పుడు
చిన్నగబోధామృతంబుఁ జేఁపగఁదనలోన్ ॥ ౨౨౧

—: నిరంజనుండన్నంభట్టునను గ్రహించుట :—

క॥ దీపావళితమమిటునటుఁ
బాపుం బలిదీపమునకుఁ బారంపర్యం
బాపగిదిఁ గానదానిని
గాపాడుట శుభకరంబుగద యొకఁడొకఁడున్ ॥ ౨౨౨

క॥ కానన్ భూసురునకువి
జ్ఞానము నా చేనిపుడు ప్రకాశము జేయం
బూనెను దైవంబతఁడుం
బూనెను భక్తియును సర్వముం దెలియంగన్ ॥ ౨౨౩

క॥ అనుకొనుచునిట్టులని యెన్
మనుజేశ్వరుఁడపుడు విప్రమాణవకునితో
ననఘా పెద్దలఁ గొలువమి
వినుమా యజ్ఞతకుఁ బాదు వినయముఁ గనుమా॥ ౨౨౪

ఉ॥ చెల్లెను దీర్ఘకాలమెటొ చెల్లిర నేకులు మిత్రబాంధవుల్
చెల్లు నెదుష్టవర్తనము చెల్లు నె దేహము గుడ్డిగవ్వకున్
గల్లజగమ్ము నమ్మికడిగాపుగనుండుట యేటిన్యాయమా
ఫుల్లసరోజనేత్రుఁ బరిపూర్ణుభజింపుము మేలు మేలగున్ ॥ ౨౨౫

ఉ॥ చేసినదోసముల్ మదినిఁ జేర్పక చేర్పుము మామహేశవి
శ్వాసము మీఱ మీఱకుము స్వాముల యాజ్ఞను ధర్మమార్గమం
దాసవహించి యెంచకుము హాయని దాసుల దోషులన్ని జా
వాసము వీడి వేడకుసు వస్తువనాథుల నన్యనాథులన్॥ ౨౭౬

క॥ అపవర్గ మొందఁ గోరినఁ
బిపీలికపథంబు గాదు వెఱ వేదవిహం
గపథంబుఁ బట్టి శాంతిభ
వపయోధిం దాఁటఁగలవు పరమాత్ముఁడ వై॥ ౨౭౭

క॥ శివశక్తులిద్దఱొకఁడుగ
నవనిన్ జీవుండనంగ సమరినకతనన్
శివకళ బ్రహ్మానందము
భువిసంపదతలఁపశక్తి పూర్ణపుఁగళయై॥ ౨౭౮

క॥ తనరుచునుండఁగ మానవు
లనయము పరసంగతి యెటులాశించెదరో
కనులుండి గ్రుడ్డియన్న
ట్లనన య్యోను దీనిఁ జూడ నన్నంభట్టా॥ ౨౭౯

క॥ ఎప్పుడు తన కై తానే
చప్పుడు చేయంగ నెంచుఁ జాపల్యముతోఁ
నప్పుడె చప్పగు జీవము
ముప్పే సిద్ధాంతమగును మూఢునకప్పా॥ ౨౮౦

క॥ చప్పుడుచేయమి లోలోఁ
దప్పక గురుమూర్తిపాద దాస్యము చేయన్
జెప్పన్ వశ మే యాతం
డెప్పుడు హరితోడ నైక్యమేగనుభట్టా॥ ౨౮౧

క॥ ఐక్యాఁ జేసిద్ధించిన
లౌక్యపుబాధలు హరించు లలితాకృతిఁ దై
లోక్యము హరిఁగఁగను మహా
వాక్యార్థములన్ భజించు వాక్కు ఫలించున్॥ ౨౮౨

క॥ వాక్కుంగలిగినవాఁడే
చక్కనివచియింప నాత్మసారం బేవే
ఫక్కల దక్కనునోటం
జిక్కనుపదములనునొక్కఁ జెలువుఁడచక్కన్॥ ౨౮౩

క॥ తనబుద్ధితనకు మేలగుఁ
దన దేశికుబుద్ధి మేలు తన కేలాయిం
ధనములు నరుఁనకునిల బం
ధనములు పరబోధలకట తనుఁగాల్చుటకే॥ ౨౮౪

క॥ ధ్యానమునన్ సాన్నిధ్యము
దానన్ జ్ఞానంబు భక్తి దానన్ భక్తిన్
ధ్యానించుమూర్తిబలమున్
దానన్ మౌనంబుఁ దత్త్వదర్శనమబ్బున్॥ ౨౮౫

క॥ తత్త్వంబేదర్శించిన
సత్త్వముచే వెలయునతఁడు సామాన్యుఁడే బ్ర
హ్మత్వముసిద్ధించును బా
లత్వముఁగననగు నతనివిలాసముఁ జుమా॥ ౨౮౬

క॥ భ్రమరహితము సుజ్ఞానము
సమరసము విదేహముక్తి సంశయరహితం
బమలము శూన్యహృదయము శు
భమభయము సదాశివంబు బ్రహ్మపదమగున్॥ ౨౮౭

గీ॥ తనువుతోఁచిన మంత్రంబుఁదలఁచుచుండు
మైక్యసాధనమది పరమార్థమరయఁ
దోఁచకుండిన ఁగర్మంబుతోడ నైక్య
మొందిస్వస్వరూపము దాల్చియుండు మనఘ॥ ౨౮౮

క॥ సందియములఁబొరలక నీ
డెందమునానందమందు శీవినిలిపిసత్
బృందము మెచ్చఁగ శ్రీగురు
వందనమే గతిగ నెఱుఁగవలయున్ భట్టా॥ ౨౮౯

క॥ నిజముగఁదెలిసినవాఁడే
భజియించుచుఁ గాచియుండు భగవత్కృపకై
విజనస్థలి గురుపదముల
సుజనావనమౌనముద్రసుఖ మల్పంబే॥ ౨౯౦

క॥ ఆముద్రను సూచించిన
శ్రీమంతునిగురుని మదిని సేవించుచుఁగా
శీమార్గంబుంబట్టుట
క్షేమము హరిహరులపొందు క్షేత్రం బందుఙ్॥ ౨౯౧

చ॥ అరమర లేనిశిష్యునకు నాశ యెఱుంగనిసద్గురుండు తాఁ
బరముసుఖంబుఁగల్గు సదుపాయము దెల్పెడునంతరంగముఙ్
గరుగఁగఁజేయు బోధలనుగర్మముద్రుంచి భరించు నాత్మలో
నిరతము దైవయోగమున నిల్పుసమాధిని సత్ప్రబోధముఙ్॥

క॥ తానన్నది లేకుంటఙ్
నేనన్నది సుఖముఁనుంట నిజముగ నెవఁడీ
దీనుఁడు భవభారంబుఙ్
బూనెడు హరిలీల తెలియముగదా భట్టా॥ ౨౯౩

క॥ పరిపూర్ణ మైన యాత్మఙ్
బరిపూర్ణంబగుట ఁదాను బలుమఱుఁ గాంచుఙ్
బరిపూర్ణుఙ దనుఁగాంచఁగ
వరశిష్యులు ముక్తులెపుడవశ్యంబన్నా॥ ౨౯౪

సీ॥ నిజధర్మమెంతఁగా నిర్వహించునుపర
ధర్మపోషణమంతదగిలినడువుఁ
దనకెంతస్వాతంత్ర్యమునుగోరునితరుల
కంతస్వాతంత్ర్యంబునబ్బఁజేయుఁ

దానెంత సత్యవర్తనము వనుండును
బరులనడవడినంత పాటిచేయు
మనుజులండఱకిట్టి మర్యాదయేగాని
సమయమైనయపుడు సంశయించి

గీ॥ దోషములనెంచియితరుల వేషధారు
లనుటసహజంబు ఖలులకు నట్లుగాక
తనవనితరులనొకరీతిఁ దలచుచుండు
నిండువేడుక యోగీశ్వరుండొకండు॥ ౫౯

—నిరంజనుండన్నం భట్టునకు మంత్రిపదం బొసంగుట :—

గీ॥ తీర్థములనెల్ల సేవించి తిరిగిరాఁగ
బుద్ధిపుట్టెనునాకు నీబోఁటిహితుఁడు
బుద్ధిమతియును వెంట రాఁబోలునయ్య
యనఁగసమ్మతించెను భట్టు నంతనృపతి॥ ౫౬

ఆ. వె. మంత్రిబిలువఁబంచి మర్యాదఁగావించి
పెద్దకాలమీవు పేర్మితోడ
మంత్రిపదముఁదాల్చి మముఁగొల్చిప్రజకెల్ల
శాంతిపెంచితంచు సంస్తుతించి॥ ౫౭

క॥ వానప్రస్థమునడుపం
బూనిననిఁకొక్కచెల్లుఁబో శీఘ్రమునన్
నేనీభట్టును మంత్రి
స్థానంబుననిల్పితినికధన్యుఁడవుగదా॥ ౫౮

గీ॥ ఐనసకుటుంబముగ నిస్పృడతనితోడఁ
దీర్థరాజముల్ సేవించితిరిగిరాఁగఁ
బయనమయ్యెడనెల్లి ప్రవాసమందుఁ
జింతలేదీవప్రజల శాసించవేని॥ ౨౯౯

ఆ.వె. నా సుదర్శనుండు నయము మెప్పనౌనన
భట్టుఁజూచిపలికెఁ బార్థివుండు
నెల్లిపయనమయ్య మెల్లరహాస్యముల్
బోధపడును క్షేత్రములఁజరింప॥ 300

ఆ. వె. అందఱొక్కరీతి నంగీకరింపంగఁ
బయనమయ్యెనపుడు పార్థివుండు
బుద్ధిమతియుభట్టుముదమునఁదోతేర
మంచిలగ్నమునస్మరించిగురుల॥ 30౧

—శారదజయంతాశ్రమముఁ జేరుట.—

గీ॥వనజనేత్ర, వారుజయంతమునకు వేగ
రాఁగలరునీవుఁగనియెదురమ్మటంచు
వేఁడనాశ్రమవాసులఁ జూడఁగోరి
హంసవెంబడిఁజనియె జ్ఞానాంబతోడ
భక్తవరుల కన్యోన్య విశ్వాసమకద ॥ 30౨

గీ॥ దేవతాజవంబునవారు తెల్లవాఱు
నప్పటికినాశ్రమముఁజేరిరంతలోఁబ్ర
భాతకాలోచితంబుగ భక్తినచటి
వారుశ్రీహరిగీతముల్ పాడిరిట్లు॥ 303

శ్లో॥ శాంతాయసాధువరదాయ పరాత్పరాయ
గోపాంగనాహృదయపంకజభాస్కరాయ
యోగీంద్రవేద్యనటనాయ భక్తప్రియాయ
ధర్మాయ ధర్మనియమాయ నమోనమస్తే॥ 304

శ్లో॥ నందాత్మజాయ నళినాయతలోచనాయ
దుర్యోధనాదినరవైరికృతాంతకాయ
రామానుజాయ పరితోషితదేశికాయ
ధర్మావలంబనధియా మహసేనమస్తే॥ 305

శ్లో॥ శ్రీవేంకటేశాంఘ్రియుగాశ్రితానా
మస్మాకమానందభుజాంగుహాణామ్
సత్సేవకానాం భవతారకాణామ్
కిందీయతే దీనజనేన కావ్యమ్॥ 306

గీ॥ ఆలకించుచుఁ దాదాత్మ్యమంది పిదపఁ
గలయఁజూచెను హంసయుఁగానరామి
మిత్రుఁడుదయించుచుండనమ్మానసయన
పొంగితద్ధ్యానమునమండి నింగిఁజూచి
హరిని లోకబాంధవునిటు లభినుతించె॥ 307

క॥ వేవిధములఁదలచూపెడు
జీవుల తనువుఁ హరించి సిద్ధులఁజేయం
గావలయు వేయిచేతుల
తోవచ్చెదు నిత్యమీవు తోయజమిత్రా॥ 308

క॥ ఆలోనశ్రీఘ్రగతితో
బాలుం డొక డరుగుదెంచి ప్రణమిల్లుచునా
సీలాలకలం గొనిచనె
వేలోనికి గురునియాజ్ఞఁ బ్రియ మొప్పహరీ॥ 308

క॥ మునివరునిఁ బరమభక్తులఁ
గని పెన్నిధిఁ గన్నయట్లు కాంతయనెభవా
బ్ధినిఁ దరియింపఁగవిధియిటు
పని చేనుమముమిమ్ముఁ గొలిచిపరముభజింపన్॥ 309

క॥ మీకృపకై వేచుచుఁ బలు
పోకలుడిఁగి పూనిధర్మమును జీవదశా
రాకానిశి జరుపఁగ నెటొ
వేకువజామయ్యె నన వివేకోదయమా॥ 310

క॥ అనఁ దల్లీ శారద! ర
మ్మని ముని కక్కుశల మరసి యవనిపుత్రీని
ట్లని యొసని స్నేఁ బ్రశంసిం
చినవనితామణి యిది శ్రితచింతామణిసూ॥ 311

క॥ అని శారదవృత్తాంతం
బును సర్వముఁ దెలిసియుంట మునివరుఁ డాపెన్
గని గౌరవమున నిట్లని
కొను మనమునవిముడకునికి నెంతయుఁ బ్రీతిన్॥ 312

క॥ నీనిర్మలచరితంబే
జ్ఞానము యోగంబు నిత్యకల్యాణంబుల్
దానిఁడఁ జేయునుమాపతి
మానినిదేవుఁడగుదోడమాయిఁకులకనన్ ౩౧౪

గీ॥ కాంచియానందభరితులై కమలనయనఁ
బ్రస్తుతించిరి వారెల్లఁబరమభక్తి
స్వస్వరూపాను సంధానసరణిఁదెలిపె
రాజయోగీశ్వరుఁడు మంత్రరాజిఁగఱపె ॥ ౩౧౫

క॥ అంతర్గాంతామణియును
శాంతియు నిజపూర్వకాంతి సందడిల్గన్ వి
శ్రాంతిన్ భజియించుచుశ్రీ
కాంతునిసెరనమ్మియుండె ఘనయోగమునన్ ॥ ౩౧౬

గీ॥ అవలజ్ఞానాంబ యొకరాత్రినధికభక్తిఁ
జేరిశారదాదేవి సంసారజలధి
తారకంబైన సదుపాయమారయుచిటు
సంస్తుతించెను సద్భక్తి శార్ఙ్గపాణి॥ ౩౧౭

ఆ. వె. పద్మమధ్యమందు భ్రమరంబు కదలక
నిలిచిలోనిమధువు వలచిత్రాగి
జగముమఱవఁగాంచుజన్మముసఫలతఁ
పద్మనేత్రవగుట ఫలమునీకె ॥ ౩౧౮

గీ॥ వేచియుంటినే నిన్నాళ్లువాచియుంటి
శాంతినీకెప్పుడాయని శారదాంబ ?
పరమహంసమునీంద్రుని కరుణవలనఁ
గలిగెనదినీకునీకృపఁగలుగునాకు
ననఁగనాలించి వీక్షించి యాదరమున॥ 309

గీ॥ చిత్తమున నెంచి ప్రీతినాశీర్వదించి
తత్క్షణంబామెఁదరిఁజేర్చి తాపమార్చి
గుహ్యనిస్మరియించి చిత్తంబుగుదుఁపఱచి
బోధసుధనింపెనిట్లు సంపూర్ణవృష్టి
శారదాదేవికెంత విశ్వాసమీశ॥ 310

—శారద జ్ఞానాంబకుఁదత్త్వోపదేశముఁజేయుట.—

క॥ తెలియుమి తెలియుట తెలియఁగ
వలచుట తెలివాత్మదనుచు వైరాగ్యమునన్
నిలుచుట యాత్మగ భవమునఁ
బడియుం బడకుంటకిది యుపాయముతెన్నే॥ 311

గీ॥ దీనిభావంబుఁదెలియసందేహమేల
నిత్యమాత్మనునాత్మలో నిల్పినిల్పి
తపముఁజేయుటయుత్తమోత్తమముతల్లి
సకలశుభములనిచ్చు విశ్వంబుమెచ్చు॥ 312

ఆ. వె. సంశయంబుఁబాసి సర్వకాలంబుల
బోధమరసి యితరగాథలడఁచి
ముక్తిబడయుమమ్మ ముమ్మాటికినిగొమ్మ
కనకలలితగాత్రి కంజనేత్రి॥ 313

క॥ తపమొనరింపుము శ్రీగురు
కృపనెంచుము రామచంద్రుఁగీర్తింపుమి కే
నెపములనైనఁజొఁబడకుకా
నిపనికిసద్భక్తగోష్ఠినెట్టుసుఖంబుల్॥ 329

గీ॥ శోధితుండైనజీవుఁడు శోకరహితుఁ
డాత్మఁగాంచనమయుఁడు బ్రహ్మమునిజంబు
ఎవ్వరీడతనికి నెంచనెపుడుశుభము
జ్ఞానయోగంబుముక్తికిసాధనంబు॥ 330

క॥ సంకల్పరహితుండైయా
ప్వంకజనాభుని నాఁగఁబరతత్త్వంబున్
గింకరులకుబోధించున్
శంకారహితుండు యోగి జనమాత్రుండే॥ 331

క॥ కృతకృత్యుండైనయోగిని
సతతసమాధి పరమాత్మసన్నిధి గనుచు
న్నతి శాంతి నిర్విచారత
రతివిరతులయందు సహజరాగము తన్వీ॥ 332

గీ॥ జీవుఁడు పశువు, హవిర్భోక్త, పావకుండు
జ్ఞాన, మాత్ముండు కర్త, సంశయము సమిధ,
సోమిదమ్మమనము, సదస్యులువిబుధులు,
సోమపానంబు దేశికస్వామిపాద

తీర్థపానంబు, పరమార్థమర్థ, మాత్మ
తర్పణంబగు భూతసంతర్పణంబు,
పమరసంబాజ్యము, ఫలము శాంతి, విష్ణు
కృపధనంబు, సాధనము, నిష్కపటవృత్తి
శక్తి, దీక్షకాలమహర్నిశంబు, విషయ
నిరసనంబుపవాసము, గురువరుండు
తలపనధ్వర్యుడంద్రు, మంత్రంబు ప్రణవ,
మంతరంగంబు శాలయా, నాత్మయజ్ఞ
మునకు నవబృథము సమాధి ముక్తిసిద్ధి,
దయయు సత్యంబు శౌచంబు దత్త్వబుద్ధి
యోగమైతైన తపసికియ్యాగమార
పవిత ! వేమేలనిరుపాధికునకు ముక్తి॥ 323

గీ॥ ఆత్మశక్తుల నైక్యమనాదిగాఁగఁ
గూడివిడుచుండు పద్ధతిఁ గొరతపడదు
తదతిరిక్తమానాలంబతతివలదన
పహజమాత్మీయమునకు విసర్జనంబె॥ 324

క॥ తపమాత్మార్పణమేయగుఁ
దపమనఁగావిష్ణుభక్తి తత్త్వంబేయాఁ
దపమునిరాలంబముగురు
కృపతపముహితము హితులకు నీశ్వరకృతమౌ॥ 325

క॥ ద్వైతా ద్వైతవిశిష్టా
ద్వైతముగఁ ద్రివిధముభక్తి తనకేసర్వం
బాతనికిఁ దనకు సమముగ
నాతనికంతయును దనకునదియ యతనికే॥ 33౬

ఆ. వె. పంచదారపొట్టనుంచుటొక్కటినీరు
పాలుకలుపుటొకటి పంచదార
నీటనుంచుటొకటి నీటినిసుకనుంచు
టొకటికాలునినమునుంచుటొకటి॥ 33౭

క॥ ఎండయుసూర్యుఁడు దలపఁగ
రెండని సూర్యుండు నిజమరీచులలోఁదా
నుండునని యతనిరూపమె
రెండగునని యెంతురీధరిత్రిఁ బహుధా॥ 33౮

గీ॥ శాంతితపము పెంచుఁ దపము శాంతిని బెంచు
జ్ఞానముతపమును దపము జ్ఞానమొసఁగుఁ
గృపనుదపముగుఁ దపమునఁ గృపయుఁగల్గు
ముక్తిఁబడయంగ సద్గురుసూక్తి శక్తి॥ 33౯

క॥ గురువరులు భక్తవరులుఁ
హరిహరులును నాస్తికమూర్తులౌటఁగదసుధీ
వరులంతస్సుఖులైగం
దురు సర్వంబాత్మశాంతిఁదోలిపున్నెమునన్॥ 3౪0

క॥ అభిమానినైయైన జీవుం
డుభయమునకుఁ జెమరుగా దెయూహింపంగా
నభిమానమె ప్రథ చెఱచుని
రభిమానుం డాత్మమూర్తి యచ్యుతభక్తీ॥ ౩౪౧

క॥ అహామహామను నభిమానం
బహామహాముఖ్ బెంచుచుండు నఘములు మోహం
బహాహా! సంతతతప మే
బహువిధముల దీనిభంగపఱచును దన్వీ॥ ౩౪౨

క॥ నైరస్యమడఁపరసమిల
ధీరులు గ్రోలవలెనని ప్రతినిమిషమారా
ఆరూఢము శైవాలము
పారముముట్టంగ ద్రోయుసద్ధతిగన మే॥ ౩౪౩

క॥ దాహము తీరెడువరకీ
దేహమువంచుకొని పరమదీర్ఘసుసేవన్
సాహసమున నెడమీయక
సోహమ్మని యూహ బాపుచుందురుధీరు ॥ ౩౪౪

క॥ ధీరులు సజ్జీవనమున్
గోరిసవితృదీప్తిఁ గప్పికొనుసర్వంబున్
సారెకుఁగాల్లం జేతులఁ
జీఁచుఁద త్రొప్పి సంతసింతురు తరుణీ॥ ౩౪౫

గీ॥ నియమవృద్ధికి హేతువనేకమగుట
నైక్యసిద్ధికి నియమంబులరయలేవు
నోటిపాటకు సుతినూటియేటికమ్మ
తల్లి! చిన్ముద్రయేసుమి తారకంబు॥ ౩౮౬

క॥ నిజధర్మాచరణంబున
గజవరదుఁడు సంతసించుఁగర్మము త్రుంచున్
కుజనులమదమడఁగించున్
సుజనాళిన్ జేర్చుఁబరమశుభములఁగూర్చున్॥ ౩౮౭

గీ॥ స్వాభిమానుల సంసర్గమరసిచూడ
దుఃఖభూజంబునకుఁ దల్లిదుంపసుమ్ము
స్వస్వరూపాను సంధానశక్తి ముక్తి
మానినీమణిపూనుము మౌనముద్ర॥ ౩౮౮

గీ॥ తెలిసి తెలియఁడు తెలియక తెలియుచుండుఁ
జిత్రవైఖరి జీవుఁడపాత్రుఁడగుట
నాత్మభజనముకర్తవ్యమందఱికగుఁ
దల్లిచిన్ముద్రయేసుమి తారకంబు॥ ౩౮౯

॥క ఈచిత్రసృష్టినింగల
యౌచితిపరికింపధైర్యమబ్బెడుఁగదయే
నీచునికైనను నరుఁడటు
చూచు తెలివి గను హరికృపచూచినగాదే॥ ౩౯౦

క॥ పరులను రక్షించెదనని
పరిపరివిధములను దానుబరితాపముతోఁ
బరిచర్యసేయసాగినఁ
బరులకుఁదనకిచ్చునదియు భాగ్యముసుదతీ॥ 3౫౧

క॥ స్వాభిప్రాయముమార్చని
లోభిజనులమైత్రితమకులొజ్జనిధీయుల్
శ్రీభగవద్భక్తులసే
వాభిరతిఁ నిత్యసుఖము నందుదురుగదా॥ 3౫౨

గీ॥ భయమువర్జించి సర్వంబుబ్రహ్మమయము
గాఁగమది నెంచి కర్మంబు కడకుఁద్రుంచి
మించుద్వంద్వంబు సుఖయించు మేలుగాంచు
వనితవేయేలనిరుపాధికునకుముక్తి॥ 3౫3

క॥ యోజనమానినభక్తుఁడు
రాజీవదళాక్షుపాదరాజీవములఁ
వేజీననంబుగనికనఁ
డేజాడఁ దదితరముసహించుఁ మించుఁ॥ 3౫౪

గీ॥ పరులఁగూర్చికదా సదా ప్రబలుచుండు
సంశయజ్ఞానములులేవు స్వవిషయమునఁ
బరులఁ గూడని యాత్మవిద్వరులకేల
సచ్చిదాత్మకము జగత్తుస్వామిసొత్తు॥ 3౫౫

క॥ తెలియనివారెవరిలలోఁ
దెలిసినయట్లాచరించుధీరతలేమిన్
జడులంబలెఁదడఁబడుటయు
నడియానన్ మోసపోవుటభవునిమాయన్॥ ౩౫౬

ఆ. వె. అన్నయట్టులుండునాచారమేయున్నఁ
గన్నవారిఁ బోలెకన్నవారు
తన్నుపోషణంబు దిన్నగాఁజేయరో
కనకలలితగాత్ర కంజనేత్ర॥ ౩౫౭

క॥ తోఁచునువేఱె ప్రతిమగ
దోఁచును గన్గవనుమాయఁదోఁచును దానై
లోచనములఁ ద్రిప్పినచోఁ
జూచుటతోఁచుటయు మానుఁజుమ్మాత్మునకున్॥ ౩౫౮

ఆ. వె. పామరుండుదృష్టిఫలమందునిడిచెడు
ధీరుఁడునిజధర్మదీక్షనుండు
నిత్యమంగళంబునేర్పునసాధించు
శిష్టమోక్షదాయిశేషశాయి॥ ౩౫౯

ఆ. వె. కామమెద్దియైనలేమిగావునదాని
లేమి యొక్కసిద్ధి స్వామితోడఁ
గానమిన్నకున్నఘనుఁడన్ననిజమెన్న
ధీరుఁడైస్వధర్మదీక్షనున్న॥ ౩౬౦

ఆ. వె. పూర్ణభావమందుఁ బురుషుండు రాముఁడై
యోగియైన నేమి భోగియైన
నేమి కామియైన నేమి యేకాంగియై
మోక్షకామియైన ముక్తుఁడైన ॥ ౩౬౧

ఆ. వె. చింతఁబాయుటన్న జీవతవిడుటన్న
భ్రాంతిలేకుయన్న శాంతియన్నఁ
గామము విడుటన్నఁ గైవల్యమేయెన్న
నీశ్వరేచ్ఛయున్న నెఱుకయన్న॥ ౩౬౨

ఆ. వె. గురునికరుణయన్న గోవిందుకృపయున్న
శరణమున్న యోగశక్తియన్నఁ
గర్మనిష్ఠయన్నఁ గైవల్యమేయెన్న
నూరకున్నఁ జాలునుత్తమంబు॥ ౩౬౩

ఆ. వె. సాధుసేవయన్న సమరసంబేయున్న
సకలశుభములన్నఁ జదువులన్న
శక్తిముక్తి భుక్తిసాయుజ్యమేయెన్న
ముక్తిబడయ రామభక్తి శక్తి॥ ౩౬౪

క॥ దృక్కై నిలిచిన యోగికి
దిక్కెవ్వరు వలదు స్వాత్మదిక్కై యుంటన్
బొక్కఁడు చిక్కఁడు స్రుక్కఁడు
చిక్కఁడు హరిమాయనతనిఁ జేరినకతనన్॥ ౩౬౫

ఆ. వె. దేవతార్చనమునధీసాక్షితర్పణ
ధర్మదీక్షఁగర్మమర్మమరయఁ
గప్పురంబువోలెకర్మముహరియించు
విష్ణుభక్తితానవిస్తరిల్లు॥ ౩౬౬

ఆ. వె. స్వామిరూపమైన జగముజీవునికెందు
దుర్భరంబుదానిదూరెనేని
దానివానిజేరఁ దనరూపమేయది
సహజమైనయెడ నసహ్యమౌనె॥ ౩౬౭

గీ॥ పూర్వపుణ్యంబు గురురూపమున ఫలించుఁ
బాపకర్మంబు బంధులపగిదిఁదగులు
దీనిమర్మంబు దెలియమి దీనుఁడగుచుఁ
బరులనర్థించిసేవించిపాపసమితి
కట్టుకొనుగాని తుదముట్టఁజెట్టఁడైన
నితరసంకల్పములుమానియీశ్వరేచ్ఛ
హరినిభక్తులగురువులనాశ్రయించి
నిత్యము స్వధర్మమందున నిలిచి నిలిచి
ప్రణవమంత్రజపంబునఁ బండితుండు
గ్రహగణంబును దేవతాగణము సకల
జంతుగణమును సంశయమింత లేక
బ్రహ్మమయమని సర్వంబుభక్తిఁ గొలిచి

ముక్తుఁడై మించు విహరించుఁ బూర్ణశాంతి
నాశ్రితులకిచ్చు శరణంబు నవ్యయము ప
విత్రమొనరించు సర్వాఘ వినుతిఁ గాంచు॥ ౩౬౮

క॥ తానొనరించుకొనిన యెడ
దానిన్ నైష్కర్మ్యమనుఁ బ్రభు తత్త్వవిదులిలన్
దాననఁగా జీవాత్మలు
జ్ఞానికి జీవతయుపాధి స్వాత్మయె యతఁడౌ॥ ౩౬౯

గీ॥ పశువులకు దేహధర్మంబు శిశువుల కటు
రసికులకు మనఃప్రీతి నీతి సకలాత్మ
లైన భక్తుల కిలఁ దన్మయత్వ మొండు
సహజధర్మంబు పూర్ణంబు శాంతికరము
తెలియరాదు స్వానుభవమువలనఁగాని
యారదేశికస్వామికృపార్ద్రదృష్టి
మెట్టి కార్యంబు సాధించు హితము పెంచు
సంచితార్థంబులెల్లను ద్రుంచివైచు॥ ౩౭౦

గీ॥ ఎఱిఁగి చేసెడు కర్మము దెట్టిదేని
దూష్యమందురు సుకవులు తోఁచకునికి
జరగుచుండెడు దానిని సాత్త్వికంబు
గాఁగ గణియింతు పూర్ణసుఖంబు నీఁగ॥ ౩౭౧

క॥ పరుల నొగిఁ దెల్పఁబూనుట
హరికిం ద్రోహంబుఁ జేయుటంతియగాకీ
హరిమయమగు విశ్వంబునఁ
బరుఁ డెవ్వఁడు మానసమ్మునఁ బాటింపుమిఁక౯॥ ౩౨౨

క॥ మౌనము శ్రేయస్కరము౯
జ్ఞానోదయకారణంబు కలుషహరంబు౯
సానంద మాప్తపదము భ
వానీగురుసేవఫలము భవహరముకదా॥ ౩౨౩

క॥ అమనాన యోగరాజము
గామించి భజించుచుంద్రు జ్ఞానులు సతము౯
గామేశ్వరిపదయుగళము
నేమంబున నిల్పి వేడ్క నిజముగ నెదలో౯॥ ౩౨౪

క॥ వినిసంతుష్టింగనిశాం
తినిగనికనె శక్తి భక్తితేజంబు౯ దాఁ
గనెఁ గనెఁ దన ముసరింపఁగ
ననుకాలంబైన నెలవునానందంబు౯॥ ౩౨౫

క॥ జ్ఞానాంబపుణ్యమే మో
జ్ఞానంబుదయించె సర్వకాలంబులనీ
ధ్యానంబున యోగంబున
మౌనంబున సర్వమనరె మాధవ! వేగ౯॥ ౩౨౬

—నిరంజనుండు తీర్థయాత్రలకు వెడలుట.—

గీ॥ తీర్థయాత్రలకుబయలుదేఱివారు
కాంచిఁ జేరి కామాక్షి నర్చించిరచట
నున్న శ్రీచక్రమును మదినెన్నుకొనుచు
భక్తిఁబొగడిరిదేవిని బద్మనాభ॥ 322

ఆ. వె. వారిలోనిరంజనుఁడు నిర్వాణ సిద్ధి
మిత్రవరునకు నిజసత్కళత్రమునకుఁ
గలుగునట్టులఁ దత్త్వంబు దెలియునట్లు
స్తోత్రమొనరించె నివ్విధిశుభముపెంచె॥ 323

శ్లో॥ పరాంబికాపాదసరోజసేవామ్
నిరంతరంసత్కృతిభిఃప్రపూర్ణామ్
కరోతుమత్పూర్వసుకర్మ సర్వమ్
గుహోత్తమాంఘ్రిద్వయ రూపమాశు॥ 324

క॥ అంబానీరూపేమాం
యంబా కుటిలాత్మగుంకన్యాయంబేమా
యంబైతోఁచుట సుగుణక
దంబా సేవకపరమౌదంబ మదంబా॥ 325

క॥ బాలా నీ లీలయొశివ
లీలయొలోకంబులెల్ల లేవాకలవా
హేలాగతినిటులేలా
చాలఁగఁ జిత్రించుచుంట చలిమలబాలా॥ 326

క॥ కాళీ! నీకీలోకము
కేళియొ నిన్నీశు నెఱుఁగఁ గీలకమో నీ
జాలమొ నిక్కం బెఱుఁగం
జాలము నీలీలలింకఁ జాలింపు కృపన్॥ ౩౮౨

క॥ మాతా మన్నింపుము కృప
నీతనయుఁడు చేయుతప్పు నీసంకల్పం
బేతప్ప వేఱెటులులో
కర్త్రయి నిలుచుఁగద సాక్షిగ శివుఁడిదిగనన్ ౩౮౩

క॥ కాళీ పాలితనిజభ
క్తాళీ శివశంకరసుగుణాళీ లీలా
కేళీసమ్మోహితలో
కాళీ నిర్జితమదాసురాళీ కాళీ॥ ౩౮౪

క॥ ఆనందద మానందన
మానందదమంత్రము స్వర్గమందును భువిలో
నేనందును నీపదమే
యానందదమనుచు నిజమొయమ్మా జగదంబా॥ ౩౮౫

క॥ నీపదముం బట్టినవాఁ
డాపదలం బొరలుచున్న నాశ్చర్యంబౌ
నాపాత్రను దొలిరంగం
బాపగిదిం జేసె దానినాపఁగవశమే॥ ౩౮౬

క॥ బాలుండేమియుఁజేయక
చాలఁగభక్షించుచుండు సరసాన్నంబుల్
బాలుఁడఁగద నేనట్టుల
లీలన్ నీకృపనుగాంతులే సర్వముమా॥ ౩౮౭

క॥ నీపద సంగతి బీజము
లోపికతోఁదేనెఁదెచ్చుచు పెడు నోటన్
ఆపానకమధురమై
తాపంబడగించు రామదాసులకంబా॥ ౩౮౮

క॥ నీదాస్యముకష్టము మ
ర్యాదాభంగంబు గురునియారాధనమున్
మోదంబీయదు నిజకాం
తాదాస్యంబిట్టి బ్రదుకు దబ్బరగాదే॥ ౩౮౯

క॥ నినుస్మరియింపఁగ మంత్రము
వినుతింపంగల్గు ఫణితి వేదార్థంబుల్
ఘనయోగబలముకిలిమినిఁ
గనిసాంగోపాంగముఁగను ఘనగురుకృపచేన్॥ ౩౯౦

క॥ పశుపతికింజీవుండే
పశువగు పశువునకు శిశువు పశువుగదా యా
శిశుపశువే యంబాయపఁ
బశువునే పశుభంగినై సంబలుకేయంబా। ౩౯౧

క॥ పశువుం బలెనో కాకిటు
శిశువుం బలెనో జగతి వసించున సిద్ధుం
డశనము వసనము దలపఁడు
పశుపతి మార్గంబుఁ బట్టుభళి రేయుంబా॥ ౩౭౨

క॥ నీతిన్ జనకుని బోలుట
కేతకఁదన యుంషు ధర్మ మేకపయిఁగిసె
వాతని కృపకుం బాత్రుని
నేతీరుం జేయవలెనొ యెఱుఁగుదువం బా॥ ౩౭౩

క॥ సుస్తిం గాంచిన వానికిఁ
దృష్టియగుఁబు సర్భవంబు డెట్టులఁ గలుగున్
సుప్తియెని శ్యప్రళయము
సుస్తియు మేల్కొనుట నీదు సూచనలంబా॥ ౩౭౪

క॥ సంకల్పము జన్మంబున్
శంకయుఁ గపటంబు వివిధసంచారంబుల్
జంకును నిత్రత్వము నకి
లంకతగాంచిన బుధునకు లలితాత్మనకున్॥ ౩౭౫

క॥ బాలా! నీవే ప్రౌఢవు
చాలఁగ నీలీలలలోకజాలముఁ జేయున్
బాలనఁ జేయున్ మాయన్
ఫాలాక్షుని దేహమర్ధభాగముఁ జేయున్॥ ౩౭౬

క॥ ఎన్ని విధంబులఁ జదివిన
నెన్నాళ్లకునైన బుద్ధిహెచ్చదుభక్తిన్
నిన్నుంజూచిన సత్పథ
మున్నదినీపాదమందు నొప్పగ దేవీ॥ ౩౯౮

క॥ నీచిత్తను శివసత్తున్
నీచిత్తమువచ్చినట్లు నేప్పగఁ జేర్పన్
దోఁచును సర్వముఁదోఁచదు
నీచందము దెలియుటెట్లు నీచుఁడు దేవీ! ॥ ౩౯౯

క॥ దేవాంశనుజనియించెన్
జీవుండన లాభ మేమి సిద్ధంబసల
ప్రావిఖ్యాత కణంబుల
నేవైనన్ దగులఁబడు నెయిలలో నంబా॥ ౩౯౯

క॥ నేమంబున యోగంబునఁ
గామంబునఁ గామరహితకర్మంబుననా
రామంబున నామంబునఁ
గామేశ్వరి! నిన్నుగాంచఁగల్గిరిధీరుల్॥ ౪౦౦

క॥ నిలిచెదపదకమలములన్
గొలిచెద గురుభక్తి హానిగోష్ఠిన్ లోలో
బలిసెదబంధరవృత్తిన్
గలిసెద బ్రహ్మంబునీదు కరుణన్ జననీ॥ ౪౦౧

క॥ కామము దహనము చేసిన
నేమము బాధింపుచుండు నీకృపచేను
ద్దామధ్యానము గల్గిన
శ్రీమంతుఁడు దాఁటు ద్వంద్వసీమను బాలా॥ ౪౦౨

క॥ ఏకంబై సకలగుణా
నీకంబై ప్రోచునెడ ననేకంబైల
శ్లోకంబై నాకంబై
సాకఁ బరమిథునమాత్మ శాంతిభజింతుఁ॥ ౪౦౩

క॥ సర్వోపకారకంబుఁ
శర్వారాధనము సకలసాధుహితంబుఁ
గుర్వాజ్ఞానిర్వహణము
సర్వముమాప్రణవజపము సాయుజ్యమునే॥ ౪౦౪

క॥ లోకకుటుంబిని నీపద
మేకమతిఁ గొలుచువారి కేలాబాధల్
సాకెదొ కేకలు వేయుదొ
ప్రాకెద నీపాదపద్మ పంజరమందుఁ॥ ౪౦౫

క॥ నీకంటె చిన్నవాఁడగు
నీకంటెం బెద్దయగును నీయంతగులో
కైకగురుఁడీవయగునఁట
నీకల్పనమ యిదిశివుని నేర్పా దేవీ॥ ౪౦౬

క॥ త్రిపురాసుర సంహారము
కపటాకృతిఁ జేయనిన్నుఁ గలియుటచే నీ
కృపకుఁ ద్రిమూర్తులు పాత్రులు
విపులన్ యత్నింత్రు స్వేచ్ఛ వెట్టులు దేవీ॥ ౪౧౧

క॥ రసమన్నను బ్రహ్మంబఁట
రసములు తొమ్మిది దలఁపఁగ రసఁగలవఁటన
ప్రసమన్నను శాంతమునం
తసమనువారి రసము ఘనతమమగు దేవీ॥ ౪౧౨

క॥ నీ లీలాతత్త్వముఁగన
ఫాలాక్షుండయ్యె శివుఁడు భక్తుండయ్యెన్
గేలీలోలత నగమై
చాలెన్ నీకృపకుఁ దెలియఁజాలునె జడమఁడున్॥ ౪౧౩

క॥ శ్వాసావరోధనం బా
యాసము వేసములగుఁగద యాసనములు స
న్న్యాసము దోసము గురువి
శ్వాసము భక్తియును లేమ శాంతియెటులుమా॥ ౪౧౪

క॥ అసహాయతలోకంబులఁ
గ్రసియించెమకాంతలుండఁ గాళీ! విలయ
వ్యసనం బలసతయున్ నీ
కసమంజస మట్టులగుట నందితివభవున్॥ ౪౧౫

క॥ తెరియింపఁగ గురుకృప నీ
దరిఁజేరితి భవములొల్ల దర్శనమిమ్మా
దరమున దోషమునేటికి
సరి వరమగు నీపదాబ్జసారం బంబా॥ ౪౧౬

క॥ ముక్తికి నాత్మజ్ఞానము
భుక్తికి నానంద మొసఁగుముక్త్యంగనవై
సక్తిన్ భవుఁడు నటింపఁగ
శక్తిపీఠముననుందు సమరసభంగిన్॥ ౪౧౭

క॥ పాత్రులఁజేసెదపాత్రుల
శత్రుల మిత్రులను జేయఁజాలుదు నీకై
చిత్రింతు జగమొరులు లో
కత్రయమున వేఱుఁజేయఁగలరె మదంబా॥ ౪౧౮

క॥ లోకము దైత్యానీకము
నాకింకన్ వలదుదానినానుట నఘముల్
సోఁకును భవముల్ దాఁకన్
నీకృపలోఁచూపు నాకునిలుపుము దేవీ॥ ౪౧౯

క॥ భండాసురవధఁ జేయఁగ
గండిమగండెందులేమిదారుణగతినా
త్ముంమూఁడెఁజిదగ్నినిబ్ర
హ్మాండమునటుఁగాంచితి లలితాకృతిచండీ॥ ౪౨౦

క॥ జ్ఞానము శాస్త్రంబులచేఁ
గానందగ దంచుఁ దెలుపఁగాఁ బోలు భవ
ధ్యానముఁ జేయని ఖలుల భ
వానీ! సృజియించెదు చదువగల ధరిత్రిన్॥ ౪౨౧

క॥ ముక్తింబడయఁగ నీకృప
శక్తియౌనని తెలియఁబలుక సాధులఁబూజా
సక్తులఁ జేసితి చిత్రము
శక్తినీయున్న గడలసారము తెలియన్॥ ౪౨౨

క॥ ఈ రెండు మార్గములచే
నీ రేడుజగంబులందు హితమతి నీచి
త్సారము దెలియం జేసితి
గారి తెలియఁగ నెవండుగలఁడో రుఁ దెందున్॥ ౪౨౩

క॥ సంకల్పరూపిణీ నీ
కింకరుఁడన్ గుహునిఁ గూర్చి కేవలకృపతో
సంకముఁ జేర్పుము తనయుని
బొంకంబగు జ్ఞానముద్రఁ బూర్ణత నీవే॥ ౪౨౪

క॥ ఏవేళనో యెచ్చోటనో
యేవిధినో మృతిని బొందు టెవ్వఁడెఱుంగున్
జీవుం డస్వాధీనుఁడు
దేవుండగుచుండు స్వేచ్ఛఁ దిరిగెడ పీవున్॥ ౪౨౫

శా॥ ఈకాలంబని యిట్టిహేతువనిలేకెల్లైన నాత్మార్థమే
పాకంబుంబొనరించిమించినియమాభావంబుగాఁ జేసిస్వర్
లోకాదుల్ తలక్రిందుఁజేయఁగలుగన్ రూఢిన్ స్వతంత్రాఖ్యవై
లోకైకావనదక్షతన్ దనరునీలోనన్ గురుండుండ శాం
తాకాంక్షన్ మదిలోఁ దలందనను నేలానమ్మభక్తుండుమా॥

క॥ ఉత్తమపద మొసఁగెద వీ
వెత్తఱి శివభక్తవరులకెందును గరుణా
యత్తత దోషాకరునిన్
నెత్తిని నిల్పుటయ దెల్పు నిజముగనంబా॥ ౮౨౭

క॥ ఊరకవాదంబులచేఁ
బారము ముట్టంగలేరు పశువులువిశ్వం
బారాధించినచోనీ
యారాధన మగునఁగాదెయదియ మదంబా॥ ౮౨౮

క॥ నీ కృపఫలించుసర్వము
లోకమునన్ జంతువులకులోలత యేలా
చీకాకుఁబొందనీయక
నీకైమరలింపు దృష్టి నిత్యము దేవీ॥ ౮౨౯

శా॥ సాకల్యంబుగఁ జిత్తగింపు మనిన్ సత్సంఘమేలేదుము
న్నేకర్మంబు నశించెసాధుజనులన్ నిర్భాగ్యులిప్పట్టునన్
బైకొన్నంగనియూరకుండఁదగవా పాపాత్ములంద్రుంచి పే
నీకై ప్రోవుము నీదు భక్తివరులన్ నిక్కంబుగాఁ గాళికా॥

క॥ మంగళకరమగు సచ్చి
త్సంగంబున శివుఁడుహరుఁడు సర్వజ్ఞుఁడు ని
స్సంగుఁడు భోగియునగు స
న్మంగళముభయులకు సర్వమంగళసాంబా॥ ౪౩౧

క॥ సహజంబై భయదంబై
యిహపరకల్పనలయందనేకంబౌనా
యహమను పశువుంబట్టఁగ
సహనీకాఠిన్యమెన్ననౌ జగదంబా॥ ౪౩౨

క॥ పెంచిన దానిని దానై
త్రుంచుట యన్యాయమనిబుధుల్ పలుకుటయీ
కించిద్జ్ఞుల విషయముని
ర్వ్యంచనగతినిమెలఁగెడు శివకునీకగునే॥ ౪౩౩

క॥ హేతువు సృష్టికిఁదెలియఁగ
మాతరమా! విమల భక్తి మాతరమాంకా
దోఃపల్లీ నీ సత్కృప
చేతఁ గురుమూర్తికరుణచేఁగ దక్కున్॥ ౪౩౪

క॥ మనమున జీవుఁడననుకొని
ఘనతిమిరమునందు నుండుగతి నేమార్గం
బునుగనఁడు శాంతికంబా
నినుజూచుఁ దక్షణంబునీయతోత్సుంగ॥ ౪౩౫

క॥ ఆరోగ్యభాగ్యాలచేఁగల్గిన
స్థైర్యంబే భక్తిరూపుఁదాల్చెను నాలో
నిర్యాణము పర్యంతము
కార్యము నీసేవ బాగుగాదే వాదే॥ ౪౩౬

క॥ జీవేశ్వర భేదంబుల
నావేశము కలుగఁగా నహంతను బెంపన్
నీవే కారణమయ్యున్
దేవి క్రీడింతువు జగతిన్ లయమందున్॥ ౪౩౭

క॥ అంబా నీకృప నాయిటు
లంబల్కెదఁ దనువు పులకలంబడయఁగ స
త్యంబుం బలుకుట నాలో
నింబలుకుట నా నిజముగ నీపలుకుట నా॥ ౪౩౮

క॥ అనియంబాస్తోత్రముఁ జే
సెను మంత్రియు బుద్ధిమతియుఁ జెవియొగ్గి వినన్
జనపతి తీర్థాదులఁ దాఁ
గాని కొనుమని పనిచె వారిఁ గోవెలభక్తిన్॥ ౪౩౯

క॥ వరదుని కోవెలకవ్వల
నరుగుచునేకామ్రనాథునర్చించిరి వే
తిరువన్నామలయుఁ జిదం
బరమును దర్శించి పరమ వైష్ణవభక్తిన్॥ ౪౪౦

—శ్రీరంగయాత్ర :—

క॥ శ్రీరంగంబే రంగము
సారంగధరుండు రంగసన్నిధిలోఁగా
వేరీతీర్థంబును సం
సారోత్తారకములు మనసాయటుచనుమా॥ ౭౭౧

క॥ అనిప్రస్తుతించినరపతి
చనియెనుదక్షేత్రమునకు సతియునుభట్టుల్
దన వెంట రాఁగఁగావే
రిని గ్రుంకెను రంగనాథుఁబ్రీతి భజింపన్॥ ౭౭౨

క॥ చనుచుండ నొక్కవైష్ణవుఁ
డనఘుల మువ్వురను నాపియడ్డముగా ని
ల్చెనదు ద్వారంబున దర్శన
మునకున్ గాసులనుఁ గోరిమూథుండంతన్॥ ౭౭౩

క॥ అన్నంభట్టాగ్రహమునఁ
గన్నెఱ్ఱగఁ జేసి యిట్లు కఠినోక్తులఁ ది
ట్టెన్నంబిని నోడలెఱుఁగక
యన్నంబెరుమాళ్లఁ జూచునాసన్ శ్రీశా॥ ౭౭౪

ఉ॥ దేవళమంతసీదియని దేవుఁడునిన్నెకృతార్థుఁజేయఁగా
సీవిధిమూర్తిఁదాల్చెనని యేలభ్రమించెదు వెఱ్ఱికుఱ్ఱఁడా
జీవనమెట్టులోయనెడు చింతమఱంతకలంత పెట్టఁగా
సేవకుజీతగాఁడవయిసిద్ధులదూరకు మోసమౌసదా

యావలమూర్తి నింగనుచు నైక్యమునొందెడు వారుధీరులీ
పావనభక్తకోటికిటు పాపముసేయుట నీవురోయుటా
గోవులు క్రుమ్మనెంచినను గోవిదుఁడెంతయు నాగ్రహించినన్
దైవము తప్పఁజూచినను దాళఁగనేరికి శక్యమౌనహో
కావుననింకనైన నుపకారముసేయుము భక్తపాళికిన్
వేవురు తిట్టిపోయఁదగ వేయిటు మోహముదాహముక్కటా
యీవికి నీకులేదు సరి యీశ్వరదర్శన మాఁపఁగాఁజుమీ
చేవగలాఁడితండనుచుఁ జెప్పుకొనన్మది నెట్లుగుందెదో
భావిదలంపుమాయసురభావము మానుము శాంతిఁ బూనుమా
తావులులేవు జీవులకుఁ దక్షులఁగొల్వుము నీకు మేలగున్
దేవుఁడు వేంకటేశ్వరుఁడు దిద్దెడు బుద్ధినిసిద్ధుఁజేసెడున్
సేవల సత్కృపన్నిలుపు నిన్నదనీయెడ నిల్చునిచ్చలున్ ॥

గీ॥ అంతనానంబి తొలఁగ భూకాంతుఁడంత
రంగమునఁ బొంగిసేవించె రంగనాథు
బుద్ధిమతియును భట్టును ముందునిలువ
స్వామిఁగీర్తించె నృపుఁడిటు సరసఫణితి॥ ౨౨౬

శ్లో॥ మిత్రంత్వదీయం శివసార్వభౌమః
సత్రంచసర్వం జగదంతరాత్మన్
చిత్రంకళత్రంచలనాత్మకశ్రీః
పుత్రస్తు సర్వోప్యశరీరఏవ॥ ౨౨౭

క॥ దేవా! నీసేవయమా
ఘేవా! భక్తాళిఁబ్రోచి యిహపరములనీ
ఠీవా! నవరసమూర్తివి
కావా భావమున నిల్పఁ గావఁ రావా!॥ ౨౨౮

క॥ మంచికిఁ జెడ్డకు భేదం
బించుకయును నాకు దోఁచదీవిటు స్వేచ్ఛన్
వంచించెదు లోకము క
ల్పించెదు భేదంబు తమము పెంచెదు రంగా॥ ౨౨౯

క॥ ఆపదఁ గాంచునప్పుడె
నీ పదముల్ గాంచుచుండ్రు నిశ్చలభక్తిన్
శ్రీపతి! భక్తుల కెప్పుడు
నాపదలన్ గల్గఁజేసెదది హేతువుగాన్॥ ౨౩౦

క॥ ఆలించెద నీనాదము
మేలెంచెద భక్తతతికి మిథ్యావాక్కుల్
చాలించెద సంసారపుఁ
గీలెంచెదఁ బూర్ణుఁడనయి కీర్తించె నిన్॥ ౨౩౧

క॥ ఆ కీర్తన నీతోనే
నేకంబై యాడుచుండ నేకాంతమునన్
నీకృపచే నాకెందున్
లోకంబులు దోఁచవాత్మలో శ్రీ రంగా॥ ౨౩౨

క॥ శ్రీపతిరూపంబనిగా
శ్రీపాపముఁ జూచిబ్రదుకు సెన్వఁడు ధరలోఁ
బాపాత్ములుఁ బుణ్యాత్ములు
నీపాత్రలెవారియందు నేరము లేలా॥ ౪౯౩

క॥ మాయలఁబన్నుట నీకే
న్యాయంబా మాకసట్టులా లోకంబ
న్యాయముగా బాధించుట
శ్రేయమయద్వయుఁడవగుటఁ జిత్తమ్మ! రంగా॥ ౪౯౪

క॥ కమలాపతి! నినుజేరఁగ
విమలాత్ముండైనఁ జాలువిజ్ఞతయేలా
భ్రమఁజెందరె నినుగానక
కుమతులు విద్వాంసులయ్యుఁ గోర్కులఁదగులర॥ ౪౯౫

క॥ కరుణారసభరణా భవ
హరణా త్వచ్చరణకమలజామృతపానా
చరణకృతూహలమతియగు
శరణాగతునకు శుభంబు శాంతియు రంగా॥ ౪౯౬

క॥ సాంబుఁడు నీమోహినిరూ
పంబుఁగని ప్రాకృతుఁబలె భ్రాంతికలుగఁగా
నంబయని వెంబడింపఁగ
సాంబుఁడు సర్వజ్ఞుడంట సత్యమె రంగా॥ ౪౯౭

క॥ వరముల కొఱకై యజ్ఞులు
వరియింతురు సరియనిన్ను వైరాగ్యమునన్
వరియింతురు గదప్రాజ్ఞులు
వరుఁడవు చిత్రంబు పురుషవరుఁడవు రంగా॥ ౪౫౮

క॥ లోకంబంతయు నీవై
వైకుంఠములో ననునికి వలచినగతినే
నీకంటె వేఱు లేదని
యేకమతిన్ దెలిసివలతు నేకాంతంబున్॥ ౪౫౯

క॥ వైకుంఠంబుననుండియు
లోకములన్నిటిని నీవులో నడచిన యు
ల్లోకాంతంబుననుండియు
నీకళ గాఁగాంచుచుందు నే విశ్వంబున్॥ ౪౬౦

గీ॥ కాలచక్రంబు తిరుగును గరుణమాలి
యదియు నీచేతిలోనున్న నాఁపవైతి
కారణం బెంచ స్వేచ్ఛనాక్రాంతుఁడవట
రమహృదబ్జాత భృంగ శ్రీరంగ రంగ ౪౬౧

గీ॥ తప్పుఁజేయుట మాపనితత్త్వబుద్ధి
నిచ్చిప్రోచుట నీపని! లచ్చిమగఁడ !
కాకఘూధుండు నిన్నెట్లుగాంచఁగల్గు
సాధుజన కల్పభూజ! విస్ఫూర్తి తేజ!॥ ౪౬౨

గీ॥ బ్రహ్మమైతివి హరిహర బ్రహ్మమై
లోకమైతివి దేవతానీకమైతి
పురుషుఁడైతివి స్త్రీయునపుంసకుఁడవు
దేవతా సార్వభౌమవై తేయ భీమ॥ ౪౬౩

గీ॥ స్వామియద్వైతయగు నీదుశక్తి నీవ
దానినెఱుఁగకమూఢుండు ద్వైతవనముఁ
జొచ్చినీదివ్యతత్వంబుఁ జూడఁడయ్యె
జానహృదయ నళినపతంగ రంగ॥ ౪౬౪

క॥ కరుణాకర నారాయణ
పరమాత్మా యదుకులేశ భక్తాధ్యక్షా
శరణాగతకులశేఖర
వరదా మముఁ బ్రోవుగరుడవాహనరంగా॥ ౪౬౫

క॥ మాయాపాశము జీవుల
నాయాసముపెట్టికట్ట నంతర్ముఖుఁడై
గాయత్రిన్ ధ్యానించినఁ
బాయున్ భవబంధమార్తబాంధవ రంగా॥ ౪౬౬

క॥ పావనిఁయంతటివాఁడే
పావనుఁడగుటకునోయేమొ భక్తిన్ గొల్చెన్
కైవల్యము మాకెటునిన్
భావంబున నిల్పకార్తబాంధవరంగా॥ ౪౬౭

క॥ సారములేమి బుధులు సం
సారముదిగనాడినిన్ను సారెకుఁగొలువన్
ధీరత సర్వజ్ఞులుగా
పారముముట్టెదరు సకల బాంధవరంగా॥　　౪౧౮

ఉ॥ సారసపత్రనేత్రబుధసన్నుతిపాత్ర శుభాంగరంగ సం
సారభవాబ్ధితారకమస్వామి మహాత్మ త్వదీయపాదముల్
సారెకుమ్రొక్కి వేఁడెదను శాంతిని నింపుము నామనంబునే
భారముదోఁచకుండనిను భక్తినిగొల్చెదు భాగ్యమబ్బఁగన్॥

క॥ ఉన్నట్లుండియు నీవో
యన్నా! నిరూపు నీవయాలోకింపన్
భిన్నంబై స్వేచ్ఛా సం
పన్నంబగు విశ్వమగుదు ప్రబలతఁ దండ్రీ॥　　౪౨౦

క॥ నెపమెద్దియెనఁ గానీ
తపమునకున్ భంగమెపుడుఁ దద్దయుఁగలుగున్
దపసులకు నదియతోఁచెదు
నపమృత్యువుగాఁగదాని హరియింపుహరీ॥　　౪౨౧

క॥ తపమనఁగ నీదురూపము
తపమనఁగా నీవు ధర్మతత్త్వము తపమా
తపమనఁగా నమృతత్వము
సుఖము శ్రీరంగనిన్నుఁ జూచ్చుటకదిరో॥　　౪౨౨

క॥ గతులెన్ని యైనఁగానీ
స్థితియొక్కటి యాటఁదపము సిద్ధించుట శ్రీ
పతి నీదుకరుణఁగాదే
పతితులఁ బావనులఁ జేయు వ్రతమదినీదే॥ ४२३

క॥ కలవలె జగమునుజూడం
గలవాఁడే తత్త్వబుద్ధికలవాఁడుకన౯
గలవాఁడు సర్వమీావని
కలవాఁడగు నీదుకరుణగలవాఁడు హరీ! ॥ ४२४

క॥ తపియింపఁ గృపనుపొందెదు
కపటంబు౯ విడువశాంతి కాపాడెద వే
నెపముననైనను బ్రోచెదు
చపలతలేకుండఁ గొల్వఁజాలినరంగా॥ ४२५

—మధురయాత్ర :—

తే॥ గీ॥ రంగవిభునిట్లు భక్తిమీాఱంగఁబొగడి
జంబుకేశ్వరు దర్శింప సాగిరవల
మధురకేగిరి మీానాక్షి మహిమఁగాంచి
సంచితార్థంబులెల్లను ద్రుంచివైచి
ముక్తివడసినయోగులు మునులుపొగడఁ
దెలిసి యుద్దేవికృపఁగడతేఱఁదలఁచి
భక్తిసేవింపఁ జనిరిప్రభాతమందు
బుద్ధమతివేఁడ దేవిని బొగడఁదొడఁగె
మంత్రవిదుఁడు నిరంజనమహావిభుండు॥ ४२६

శ్లో॥ త్యక్త్వాదృశ్యమతీంద్రియేశ్రుతివచస్సారాత్మనైకాక్షరీ
మంత్రేణాత్మని వేదనందృఢతరంకుర్వన్ స్వధర్మేరతిమ్
స్వచ్ఛందంచరతీహభక్తవరదోభూత్వానితాంతంముదమ్
ప్రాప్నోత్యేవగురూత్తమాంఘ్రియుగళధ్యానైకపారీణః॥

క॥ మనముననితరముదలఁపక
నినుఁగొనియాడెదను మంత్రనిచయస్మరణన్
ననుగురుభక్తులవుఁగాము
జననీ నీపాదపద్మషట్పద తతినిన్। ౪౭౮

క॥ తాపత్రయమునఁ బొరలుచుఁ
గాపాడు విభుండులేనిగతి శంకలచే
నీప్రాపుఁజేరరు గదా
పాపంబవ్వారిబోధపఱచుము దేవీ॥ ౪౭౯

క॥ కాంతారమనాబలమగు
శాంతిన్ బ్రహ్మాస్త్రమంత్ర జపమున సంపా
దింతున్ నీపదములమో
దింతున్ గురుభక్తి భగవతీ త్వత్కృపచేన్। ౪౮౦

క॥ నీచిక్కులు వేషక్కులు
నీచందంబంద మెఱుఁగనేర్తునె నాకా
లోచనమిమ్మింక మిమ్ములఁ
జూచెద సంశయమువిడఁగఁజూచెదనంబా। ౪౮౧

క॥ నినునమ్మ వానిజనసము
ఘనదోషసమన్వితంబుగానున్నను వే
కనుసఫలత్వము నత్వం
బని తెలిసితి సర్వవిభావమని తెలిసితింగా॥ ౪౮౨

క॥ ఎన్నివిధంబుల వెదకిన
నున్నదిమాకొక్క తల్లి యుగ్గంబెట్టన్
గన్నదిమమ్మందఱిందా
నున్నదిమాక్రీడఁ జూడను త్సాహముతో॥ ౪౮౩

క॥ కుక్కలఁబందులఁగనుగతిఁ
జిక్కులలోఁ బొరలుచుండుజీవునిగనువాఁ
డెక్కనుభవముఁ జిక్కక
చక్కని నీచక్కికవలసాయుజ్యంబే॥ ౪౮౪

క॥ తనతపమున సర్వంబగు
ననునాస్తికుఁజేరరాదహర్నిశముగ దా
ననుమదముడిగి భజించినఁ
గనుఁదన్వాత్కృష్టంగార్యసిద్ధి ఘనుఁడు మదంబా॥ ౪౮౫

క॥ అంబానీ సత్కృపచే
తంబరమార్థంబు దెలియఁదగు ననుఁడిల మా
నంబుంభజియించుచు నుల
భంబుగసకలంబుఁ జూచుబ్రహ్మంబుగనే॥ ౪౮౬

క॥ జననీదయఁజూపు మునీ
తనయుఁడనేఁ జేయుతప్పుఁ దలఁపకుమదిలో
జననము మరణంబులుఁగని
ఘనపదమ్మున నిల్పినన్ను గావుము వేగన్॥ ౪౮౭

క॥ సంకల్పరూపమున హృ
త్పంకజమున నిల్చినీవ బహుభంగులనా
శంకల బాపెదుజన్మం
బింకన్ రాఁబోదు తల్లి మాయాభ్రాంతిన్॥ ౪౮౮

ఉ॥ నారసహీన సంసరణ సాగరమీఁదఁగనేరిశక్యమం
బాగొనసేసి బంధురమ్మునై భవదీయపదాబ్జమందు సం
చారముఁజేసి ముక్కెదను శంకరతత్త్వవిశారదత్వమే
తీరున నైనఁ గల్గునటుదీవెనలిచ్చుచుఁ జేర్చుపారమున్॥

క॥ బ్రహ్మస్వరూపిణీసు
బ్రహ్మణ్యాంతఃకరణనివాసిని జననీ
బ్రహ్మదివిసుత బగళా
బ్రహ్మపదంబిచ్చినన్నుఁ బాలింపఁగదే॥ ౪౯౦

క॥ పరమాప్తుల భజియింపని
నరపశువులఁ జూచి తల్లి నవ్వకుమమ్మా
నరపశువుగఁ దనుఁగనఁగాను
పురుషుఁడు శ్రీసాంబశివునిపుత్రుఁడు కొమ్మా॥ ౪౯౧

క॥ సేతువు సంసారాబ్ధికిఁ
బాతకహర మార్యమతము భగవద్భక్తి
ప్రీతికరమగుట సాధులు
నీ తత్త్వంబరసి ముక్తినిరసింతురుమా॥ ౪౯౨

క॥ లీలన్మూర్తులఁ దాల్చెదు
నీలోనీ విట్టులాడ నేర్చెదు నీవే
పాలించెదు చాలించెదు
కీలెఱుఁగని జీవులు పరికింపరు భ్రాంతిన్॥ ౪౯౩

క॥ తనమార్గము తాఁబట్టుచుఁ
గనుదెఱచియు మూసియైనఁ గల్లజగంబుల్
కనకుండు ధీరుఁడంబా
నినుఁగను నీలోననుండు నీవైయుండున్॥ ౪౯౪

క॥ అమృతంబులు సమమయ్యెన్
విమలతపంబునను గాచి వేయఁగ వేత్తై
యమృతముఁబోలుట జడమగు
నమృతంబమృతంబయగు నుమా నీకృపచేన్॥ ౪౯౫

క॥ పొగరెక్కిన జీవులనిలఁ
దగుదువు వంచింపఁ బిదపధన్యులఁ జేయన్
నగుబాటుఁ జేయకుమునా
దగు జీవనము నగరాజతనయా సునయా॥ ౪౯౬

క॥ నినుగొలుతు శివునిఁగెలుతున్
ననునీకళగాఁగఁజూతు నావనొనర్తున్
ఘనగురుని, దేవి, భక్తుల
నినుమనమునఁ గట్టివైతు నీవై నిలుతున్॥ ౪౯౭

క॥ జీవత్వశంకఁదగిలినఁ
గేవల సద్భక్తిఁ బ్రణవకీర్తన నీతోఁ
గైవల్యమబ్బు నవ్వల
జీవుండేగాఁడు భక్తశేఖరుఁడంబా॥ ౪౯౮

క॥ ఓంకార రూపిణీ హృ
త్పంకజమున నిల్చి పరమభక్తులఁ బ్రోవన్
శంకలఁబాపంగని నిను
శంకరియని పిల్తుఁ గొల్తు శశ్వద్భక్తిన్॥ ౪౯౯

క॥ పుల్లియగాలికి నిటునటు
నల్లాడెడురీతి జీవుఁడల్లాడుఁగదా
పెల్లగునిజకర్మంబునఁ
దల్లీనీకృపనునిలిచి తరియించుఁగదా॥ ౫౦౦

క॥ నీలీలలోక జాలం
బౌలేయని భక్తిశాంతి నానందింపన్
దాలేమిఁ దన్మయుండై
క్రీడించున్ యోగి ముక్తికేలెటఁగించున్॥ ౫౦౧

క॥ ఎద్దేని జేయఁగలనీ
యొద్దిక గనుఁ గొనుచు జీవులుత్సాహముతో
నెద్దులవలె సంసారము
దిద్దెద రేమందు వారి తెలివి మదంబా॥ ౫౦౨

క॥ అమ్మాయని యెద నీలో
కమ్మాయని యెద మనియెద కనకాంబరునీ
విమ్మని యెదుగదము క్తిని
నమ్మని యెద శాంతనాత్మ నుత్తమగోష్ఠిన్॥ ౫౦౩

గీ॥ పినతిగావించి మీనాక్షి వేవిధముల
సేతువునకుఁ గ్రుంకి కాశికిఁ జేరఁదలఁచి
దర్భశయనంబు గడచి దారిలోన
క్షేత్రమహిమలు సెప్పుచు సేతుపర్ణ
నము నకుఁ గడచెను స్వప్నుఁడంతటయుసంత! ॥ ౫౦౪

క॥ సేతుస్నానము జనులకుఁ
బాతకహారమంచుఁ జెప్పఁబడుగద స్మృతులన్
సీతారాముని దరిజ
మాత్రోద్ధమునఁ దవెలయునామహిమంబుల్॥ ౫౦౫

క॥ అనియందుఁ గ్రుంకులిడిరట
జనపతిబోధలఁగజిపుచు సంతర్పణముం
బొనరిచి దక్షిణలను బె
ట్టెను ద్విజులకువారలు పొగడిరిస్వప్నునటుల్॥ ౫౦౬

క॥ సేతుస్నానంబయ్యెన్
బ్రీతిన్ శ్రీరామలింగ విభుఁగని కాశీ
క్షేత్రంబుఁ జేరవలయున్
యాత్రాక్రమమిదియయనుచు నటుఁజేసిరోగిన్ ॥ ౫౦౭

—కాశీయాత్ర:—

క॥ ఆసందకాననంబునఁ
గానందిగు ముక్తశివుఁడు ప్రసన్నుఁడై
దానైతారకమంత్రం
బీనున్నాఁడనచుఁబలికి హితముగనృపుఁడున్ ॥ ౫౦౮

శ్లో॥ గంగాతీరే సకలశుభదే కాశికాయాం ముక్తిమీశం
నిత్యంధ్యాత్వా పరమపదవీప్రాప్నువంతో మహాంతః
త్యక్త్వాచారాన్ బుధజననుతాస్సిద్ధసంకల్పయుక్తాః
మోదంతే తే శివగురుకృపాపాంగదృష్టిప్రసాదే॥ ౫౦౯

ఆ. వె. చంద్రశేఖరుండు బిందుమాధవుఁడిందు
నుండు లోకనాకరుపొంది సర్వ
జంతువులకు రామమంత్ర విముక్తి నీ
నంత్యకాలమందు నైక్యమందు॥ ౫౧౦

క॥ కాశీ! సకల శుభోదయ
కాశీ! భవలతలఁగోసి రయమునఁ బ్రోచు
మ్మాశంభుపదంబులఁగను
నాశీర్వాదంబుఁ జేసి యభయమీయమ్మా॥ ౫౧౧

క॥ ఈకోవెలలో భక్తులఁ
కాఁకలిదీర్పంగ సాదముంబయొయిచ్చున్
గాకులవలెఁ బరపిండం
బీకష్టాత్ములు భుజింపనేలన్ జాలిన్॥ ౫౧౨

క॥ పొట్టకుఁ బెట్టెఁడు ముద్దం
బెట్టెడు నాస్తికులనెపుడు ప్రీతింబదముల్
పట్టి భజించెడువారికిఁ
జెట్టయొగాకెట్లు మేలుచేకురు ఁగాశీ! ౫౧౩

క॥ పొట్టంగొట్టకయన్నము
పెట్టుచుఁజీవాట్లు లెస్సఁబెట్టుచు మనమున్
గట్టుచుఁ బుట్టువుఁగడవం
బెట్టెను పట్టెల్లఁ బ్రోచిపెంచెడు కాశీ॥ ౫౧౪

క॥ మాటలు ధనకోటులుభువి
బూటకములు మోసపుచ్చుబోఁటులు లలినా
నాఁటికిదాఁటెను నీటులు
కోటలు సుఖియింప నేటికో శివకాశీ॥ ౫౧౫

క॥ నేఁటికిఁగంటిని ముక్తిక
పాటము దీయంగ మేలుపాటము జగమున్
దాఁటెడు బాటయువెలిలో
నోటికితాళంబు వేయుమనుతచరితులనున్॥ ౫౧౬

క॥ బహిరంతరములఁజూడక
యహమాయికనెటేమిసేయనౌనను శంకన్
దహతహపడకుముజీవా
యహింశయనునితోడ నైక్యమందెదుదృక్తిన్॥ ౫౧౭

క॥ లింగనిఁగని లింగనియా
లింగని యాలింగని గురులింగనిఁ గనిలీ
లంగనె లింగశరీరము
భంగము జీవాత్మయోగభంగిని లింగా॥ ౫౧౮

క॥ త్రిపథగవై భక్తులను భ
వపయోనిధిఁద్రోయక హరిపదమొసఁగంగా
సుపథముననిల్పిప్రోవ శి
వపదముఁజేర్చెదవు పొగడవశమా గంగా॥ ౫౧౯

క॥ శ్రీశుండును శ్రీశుండున్
గాశిని వసియించుచుంట గంగయునుంటన్
గాశీవాసంబొసఁగెడు
నాశములేనట్టిపదవి నరులకుననుచున్॥ ౫౨౦

క॥ రంగత్తరంగలేఖా
భంగీకృతరాగతాళభావజ్ఞాంగన్
మంగళకరనిజకరనిక
రాంగీకృతసహృదయాంగనాడిరిగంగన్॥ ౫౨౧

క॥ సాంబా ! సరసంబా ! నే
మంబా ! సుగుణంబ ! రామమంత్రంబా ! జ్ఞా
నంబా ! సత్యంబా ! మా
యంబరము ! స్వబలంబ ! నీకు ! నానందంబీ॥ గీ ౨౭

క॥ నీపదములనుసరింపక
యాపదఁగడవంగశక్యమా ! తెలియమినీ
పాపము చేసినపాపము
లోపికమున్నించియేలుకో పరమేశా॥ గీ ౨౮

క॥ సకలము నీవశమయ్యెన్
సకలాత్ముల మమ్ముఁజేయు సంసారాబ్ధిన్
సుకరముగ దాఁటఁజేయఁగ
సకలము వర్జించినావు సకలకళాపా॥ గీ ౨౯

క॥ భక్తులఁగూడుచు నిన్నున్
భక్తుల హృదయంబుఁదెలియఁ బల్కెదనుయథా
శక్తిగ నీప్రేరణనా
సక్తిన్ పాలోసఁగు భిక్షుచాలునుమేశా॥ గీ ౩౦

క॥ పతితుఁడనై వెతలంబడి
గతినీవని నమ్మి ముక్తికాంక్షన్ జమ్మా
ఘుతరముమఱచి భజించెద
సతతము నిజపదమునొసఁగు స్వామివినీవే॥ గీ ౩౧

క॥ తెలుపకయుండుట తెలుపుట
తెలియుటదేవేచ్ఛ పరులుతెల్పఁగ తెలియన్
వలచుట కలచుట మనమని
తెలిసితి బోధాకృతినిను ధీరశరణ్యా॥ ౫౩౨

క॥ కమలాహితచూడామణి
కమలాహృదయేశ మోక్షకమలాధీశా
కమలభవయోగివరహృత్
కమలనివాస సుమనఃప్రకాశ మహేశా॥ ౫౩౩

క॥ తెలిసినపిదపన్ జలనము
పలుచనన్ విడిచియుంట పరమాత్మాన్
గలిసిన పిదపన్ జలనము
తెలియమినీభజనమంద్రు ధీరశరణ్యా॥ ౫౩౪

గీ॥ అజ్ఞతాలాంఛనుండను పృథాభిమాని
తన్నుఁగాపాడుకొనఁగ దాఁదల్లడిల్లు
నంగరక్షలలక్షల నమరిచికొను
జిక్కితాఁబన్నువలలఁ దాఁజిక్కుచుండు
మ్రొక్కుచుండు దేవతలను మూఢభక్తి
భయముసర్వులయందు సంశయము నయము
కలిగికల్పించుకొను సర్వకాలమందు
లేనిసంసారభారంబు దీనగతిని

మాటిమాటికి దిగ్గునమరలుఁదఱలు
జీవుఁడివ్విధినజ్ఞత దేవులాడు
సర్వమీవను గురుబోధ శాంతినొందు
నీవురక్షింపఁ దలఁచిననిముసమందుఁ
దనదుయత్నంబులన్నియు దబ్బరనుచుఁ
దెలిసివర్తించు నీపాదజలజభక్తి
ముక్తుఁడయ్యును సంసారమునఁజరించు
నీదుభక్తులచరితముల్ నిఖిలలోక
పావనంబులగును నీకృపావశమున
నుండిలేకుండి నీలోననుండి యిట్లు
పండితుండగు బరమభక్తుండొకండు
కనకదుర్గామహేశ యాకాశకేశ॥ ౫౩౫

గీ॥ నీకు వేఱైన వస్తువులేకయునికి
నీవు నీలోనఁ గ్రీడింపజీవుఁడెవఁడు
పుణ్యపాపంబులనుఁజేయఁ బూనుకొనఁగఁ
సుఖములను దుఃఖముల లెక్కచూచుకొనఁగ
బక్షపాతివిగా నెన్నిపలుకుకొనఁగ
నిచ్చవచ్చినయట్లు చేయించిచేయు
నీకునియమముల్ కల్పించు నేర్పుకొలఁది
నొరపుట్టు దరిద్రమనోరథంబు

దేశికోత్తమ పుత్రుఁడీయాశ లేమి
నాశరహితపదమున ననారతంబు
నుండు నీపాదజలజమందూర కెట్లొ
కనకదుర్గామహేశ భక్తప్రకాశ। ౧౩౬

ఉ॥ ఉండినయట్లులుండు దనువుండిననుండునుగాక దానిచే
నుండు నెయార్తిబాధ లవియూఁదుచులోకముజ్ఞానవహ్నిలో
మెండుగ వేల్చుధీరునకు మేటితపస్వికిఁ బూర్ణబోధధ
ర్మ్యుండుసదా ప్తమూర్తికిఁబ్రపూర్ణునకాత్మునకంబికేశ్వరా॥

క॥ ధర్మాధర్మజ్ఞానము
ధర్మము జీవునకు జీవదశతొలఁగినని
ష్కర్మంబై తద్ద్వంద్వము
నిర్మలహృదయమునఁ గెలుచునీవై నిలుచున్॥ ౧౩౮

గీ॥ సర్వథా సదా సర్వత్ర సమరసంబు
శాంతి తత్త్వాదభక్తసంసర్గమిమ్ము
ముక్తిఁగాంతుము నీపాదములను హేశ
సచ్చిదానందరూప విశ్వప్రదీప॥ ౧౩౯

గీ॥ ధర్మభేదంబుచేత స్వాతంత్ర్యసిద్ధి
కలుగునని భ్రాంతి జీవులగలఁతపెట్టు
ధర్మభేదాన నింద్రియతతికి నెందు
దేహిస్వాతంత్ర్యమున్నె సుధీశరణ్య॥ ౧౪౦

గీ॥ సైకమును గప్పునేర్పది నీకె చెల్లుఁ
గాక యివ్విధి లోకులు కాకులట్లు
లేకిపోకడల్ పోదురే కేకలిడుచుఁ
గనకదుర్గాసహేశ యాకాశకేశ॥ ౫౪౧

కం॥ కాలం బేశూలంబై
జాలియ లేకుండఁ బ్రజలఁ జంపఁగఁ జొచ్చెన్
శూలీ శూలంబేలా
మేలా భక్తాళిఁ బ్రోవమికళయె సాంబా॥ ౫౪౨

కం॥ యోగవియోగంబులలో
రాగవిరాగంబులు చతురత్వముతోఁ బా
గోగుల్ మఱచుచు వలచెడు
రోగికిఁ దగు నీచరణసరోజము ఘనువిలన్॥ ౫౪౩

కం॥ కలఁడో లేఁడో తెలియఁడు
తెలియక తన్నెతరు లట్టిధీసునకును నీ
కిలసామ్యంబమరంగాఁ
గలదా పరమార్థమొంచను కైలాసపతీ॥ ౫౪౪

కం॥ ఎయ్యదికర్తవ్యంబని
యయ్యలలోఁ నూఁగుగతిని నుండును మనుజుం
డయ్యో! తెలియమి నాకా
దయ్యా! నీకరుణలేమి నవ్విధి యభవా॥ ౫౪౫

గీ॥ ఐక్యసిద్ధినిఁ బూర్ణత్వమందుఁదలఁప
విధినిషేధంబులేలేవు బుధులకునిల
జ్ఞానికజ్ఞానికొ కభంగి జరుగుచుండు
జ్ఞానమున శాంతి భ్రాంతి యజ్ఞానకలన
జ్ఞానులను కర్మతంత్రులఁగలుగఁజేసి
యన్వయవ్యతిరేకములందు స్వస్వ
రూపదర్శన ప్రాప్తసద్రూపుఁడైన
దేవుఁడవు నీకెగాక యీదేహిదేహ
ములుపయులకగునె శరణముగురుపదము
గాఁగనమ్మిన సాధులఁగాచుతల్లి
మమ్ముఁబాలించునున్నిద్రమానముద్ర
నిన్నుఁగూర్చెదు వేడుక నిజముసాంబ॥ ౧౪౬

ఆ. వె. ఉల్లమన్యదేవు నొల్లదేమందుదా
నూరకుండునొకట నూరునొకట
రోటరెంటనిల్చు రోకలిచందాన
రజతగిరినివాస రామదాస॥ ౧౪౭

గీ॥ నిముసమేనియు నెడమీక నిర్మలుండు
ప్రణవమంత్రజపమున నీపజ్జనిలిచి
తనకునితరులకేక త్రతారకంబు
కల్పనముఁజేయు మహిమంబు కలిగిమొలఁగు
నీదుకరుణను గురుమూర్తి యాదరమునఁ
గనకదుర్గామహేశ యాకాశకేశ॥ ౧౪౮

గీ॥ వేదసారంబు ప్రణవమ్మె వెలుఁగుచుండ
లంకె వేయించు జీవాత్మలకుగురుండు
దాని వెలుఁగున బలమున ధర్మబుద్ధిఁ
ద్రిపుటి సంతత మేకాకృతిఁగనొనర్చు
భక్తనరుఁడెందు నీపాదపద్మమందు
భక్తపాలనదక్ష కృపాకటాక్ష॥ ౫౭౯

క॥ తెలియనుగద బాల్యంబునఁ
దెలిసియునీ బాలుఁడైతి ( దెలియఁగవలెనా
తెలియఁగలనా వేత్తె
తెలియఁగ వేఱొండుగలదె త్రిపుటియునీవే॥ ౫౫౦

క॥ రజతాద్రిఁ వసియించుట
గజగమనఁ శక్తి భార్యగవరించుటయుఁ
గజవరదుని భజియించుట
భుజగాభరణంబు భిక్షముంగోరుటనా !॥ ౫౫౧

క॥ ఉన్నదినీవనిదృఢముగ
కన్నఁ వేఱొండఁ కోర్కికలుగునెతానే
మన్నఁ విన్నను నెట్టులఁ
న్నున్నను నీవనుచుము క్తుఁడుండును మేశా॥ ౫౫౨

శా॥ నీకై చూపుల్ నిల్పఁగాఁ జవని పన్నిన్ వ్యూహము బ్బాము నో
పై కల్పంబు జనించె లోకమున నావారేరి సర్వంబు మీ
కే కాకే కృపఁ జూతుమీ తనయునిన్ శ్రీశా యుమాభక్తులన్
నీ కన్నన్ గురుఁ డెవ్వఁ డంబ కొకోఁ అక్కై నీతత్త్వముం దెల్పఁగన్॥

కం॥ స్వాతంత్ర్యంబధికారికి
నీతంత్రం బెట్లొ యట్లనీ మనికి నిక
స్వాతంత్ర్యమది యెయ్యా యఁగ
నోతండ్రీ వెఱ్ఱియేల నుభయము నీవే॥ ౫౫౪

కం॥ దైవంబని పౌరుషమని
జీవుండిల భేదబుద్ధిఁ జింతించి చెడున్
దేవుండీ ఘటమునఁ దాఁ
జీవుండై నాఁడటంచుఁ జిక్కు హరించున్॥ ౫౫౫

ఉ॥ ఎన్నటికైన నీపదములే భజియింపఁగ వేడ్క లోనమా
కున్నదినిక్క వంబయిటులున్నది నీదయ దానిఁ బ్రోవఁగా
నున్నది నీవొకండ నను నూరకత్రిప్పకు మన్నభక్తి సం
పన్నునిఁ జేయుమన్న యనుమానము వీడి భజింతు నిన్ను నో
పన్నగభూషణా పరమ పావన పావన భక్తజీవనా॥ ౫౫౬

గీ॥ చేతశ్శ్రద్ధా నదీ శుద్ధచిత్తజలము
లందు నభిషేక మొనరించి యధికభక్తి
దినము మా మాపురీహృన్నళిన సునిష్ఠ
మణిని భాత్మలింగంబు సమాధికుసుమ
ములను బూజింతు మనపద్మములనుమంతు। ౫౫౭

[నిరంజనాదు లయోధ్య దర్శించుట]

క॥ గయమును హరిద్వారంబట
నియతిఁ గా సేవించి గంగనీరముఁ బట్టన్
దయమునఁ బ్రయాగఁ జేరిరి
యయోధ్యారామపురినిగని యానందింపన్॥ ౧౬౩

క॥ చనిరాముని సేవంగని
కనిరానందంబు భక్తిఁగని రౌరా! ము
క్తినిఁగని రచ్చెరువందిరి
కనదుర్లభమిట్టిభక్తి కలిలోననుచున్॥ ౧౬౪

శా॥ ఏఁడీరాముఁడు చూతమన్నఁ దరమా! యీరేడులోకంబులన్
బాడింపప్పక సర్వమూర్తులొకఁడై పాలింపుచున్నాఁడు లో
వాడన్ మోహము వర్ధిలంగఁ దపమున్ వైరాగ్యసంపన్నుఁడై
తాడకుఁల్ విడువంగ మెచ్చుకొనుచున్ దాదాత్మ్యమిచ్చుంగదా

క॥ చనియెను రామువిభుఁడని
మనమున సంశయము మాని మాధవభక్తిన్
వనచరులయ్యు నయోధ్యన్
గనిపాలించెద రీకేమికావల మునిలన్॥ ౧౬౬

క॥ అనితద్భక్తిని మెచ్చుచు
వినుతించెను రామచంద్రుఁడు వేవిధములన
మ్మనుజపతిభక్తిరసమది
తనతనువున్ దాల్చినట్లు తద్దయుఁ బ్రీతిన్॥ ౧౬౭

ఉ॥ రాముఁడుసద్గురుండు రఘురాముఁడుతండ్రిభవాబ్ధిదాఁటువో
రాముఁడు కర్ణధారుఁడుఁపరామమునిచ్చును రాముఁడాత్మకున్
రాముఁడుసర్వకామదుఁడు రాజిలుసర్వముఁదానయాపరం
ధాముఁడు నిత్యరక్షనిజధర్మముఁబాయనిభక్తకోటికిన్॥

శ్లో॥ శ్రీరఘుకుల సోమంసీ
తారామం జీవ! దశరథాత్మజమాద్యమ్
సారాకారం సకలా
ధారం వాయ్వాత్మజవరదం భజసతతమ్॥ ౨౬౯

క॥ రామా ! భామయ ! సామా !
తామా ! సత్త్వము వివేకధామా ! అటవీ
సీమయు ! ప్రేమను ! మేవరా
వేమాఱుం దెలియంజెప్పవే ! శ్రీరామా॥ ౨౭౦

క॥ శ్రీరామునిపాదంబే
సారము సకలేప్సితార్థ సంగ్రహ మఖిలా
ధారము గతభారము సం
సారము శరణంబు సాధుసరసాళికిలన్॥ ౨౭౧

క॥ నీకొఱకై నీవేవే
ప్రాకటభయభక్తులొందనఁబాలించెదవం
చీకొంటొయురారకుండెన్
జేకొనుమీసుతునిబ్రోవఁజీకాకేలా॥ ౨౭౨

క॥ నాతప్పా నీతప్పా
సీతమ్మదిగాని దీనిచిత్రంబప్పా
కౌతుకమునననీ జేర్పఁగ
సీతమ్మకుఁదెలియఁజెప్ప శ్రేయంబొప్పన్॥ ౫౭౩

క॥ ఏదయస్వామీ నీదయ
రాదయనామీఁద రామరామా యింకన్
బోదయనామనమెందున్
లేదయవేఱొక్కపదము లేదయరామా॥ ౫౭౪

ఆ. వె. ఒక్కఁడయ్యునీవు పెక్కుమూర్తులుగాంచ
శక్తిగల్గె దేనయుక్తిగల్గె
నట్టిదానికొనఁగుఁమంబొప్రసాదంబు
రఘుకులప్రదీప రామభూప॥ ౫౭౫

క॥ శివశక్తుల నెవఁడేనియు
నవినయముగ భేదబుద్ధి నర్పించినచో
భవముల్దాఁటం జేస్ఫధి !
శివకేశవభేదబుద్ధి చెఱచును గాదే॥ ౫౭౬

క॥ భయమేభక్తికి హేతువ
భయమిచ్చుట నీదుసుస్వభావముగాదే
నియతింగొల్చినయంతనె
దయయే మనముండకున్న ధన్యత రామా॥ ౫౭౭

క॥ వేదాంతసారమది నీ
పాదాబ్జమునందునిల్చి బంభరమైయా
స్వాదనఁజేసెద నేనిఁక
నీదయ శ్రీరామరామ నిర్మలనామా॥ ౫౭౮

క॥ తాళంజాలము జాలము
మేలా గోపాలబాల మిథ్యావాదం
బేలాచాలింపుము నీ
జాలము దయనేలుము మనజాలముకృష్ణా॥ ౫౭౯

క॥ రాముండని కృష్ణుండని
నీమహిమలు తెలియలేమినీ నామములన్
గామింతురు వేర్వేఱుగ
రామా! శివరామ కృష్ణ రామారామా॥ ౫౮౦

క॥ నామముఁ బేకుఁయొనర్చిన్
నీమహిమలు నిన్నుఁగూడి నిలుచునుగాదే
ప్రేమించిన ప్రహ్లాదున్
భీమాకారంబు బాధపెట్టెనె రామా॥ ౫౮౧

క॥ కోఁతులుపోరెనునీకై
నాతిమొవలపించెనిన్ను నయముఁగ దానన్
భీతిజనిరిపఁగఁగట్టితి
సేతువుకపిసముసనిఁగూడి చిత్రము రామా॥ ౫౮౨

క॥ నీకార్యము సాధింపఁగ
లోకైకగురుండు హనుమ లోకములోనన్
నీకున్ భక్తుని బలెఁదా
నాకారముఁదాల్చెఁగాదె హనుమంతుండై॥ ౫౮౩

క॥ మీకిరువురకున్ భేదము
లేకుండుటఁదెలుప నిట్టిలీలలు చేయన్
మీకే తగు శివరామా
కానున్నన్ మిమ్ముఁదెలియఁగలరే లోకుల్॥ ౫౮౪

క॥ పంచాక్షరి జపియించెను
పంచాస్యుఁడు రామమంత్రపఠనముఁ జేయన్
సంచితములు ద్రుంపఁగనో
పంచుట మంత్రద్వయంబు ప్రభువులు రామా॥ ౫౮౫

క॥ నీలీలలద్భుతంబులు
ఫాలాక్షుఁడు పద్మజుండు భక్తుండెఱుఁగున్
శ్రీలలనారత్నమెఱుఁగు
బాలుండేమెఱుఁగుఁ దెలియఁబలుకు ముకుందా॥ ౫౮౬

ఆ. వె. నిన్ను నమ్ముచుంట నీపాదపద్మముల్
గొలుచుచుంట దేవిఁదలఁచుచుంట
మాయఁ ఱచునంట మాకేమిరాతంట
రఘుకులప్రదీప రామభూప॥ ౫౮౭

ఆ. వె. నిన్ను మఱవఁదోఁచు నిక్కంబు విశ్వంబు
దాని మఱవదోఁచె దవ్వుర మేశ
నన్ను నేను మఱచి యున్నవంతయు నీవు
దేశి కేశ సకలధీప్రకాశ॥ ౫౯౩

ఉ॥ ఆసకు మేర లేదు తనువా క్షణభంగుర మందు సౌఖ్యమా
వీసము గానరాదు తగవే దయ లేదన ధాత కాలుఁడుం
జేసిన టీశ్వరేచ్ఛ నలచెం గురుఁడట్లు స్వతంత్రుఁడౌట వి
శ్వాసము లేమిఁ దత్తరము సర్వము నీదయ రామ నీదయా॥

క॥ రామార్చన రామార్చన
కామేశ్వరియర్చనట్లు కామార్చనయా
సామీప్యము సాలోక్యము
స్వామీ సారూప్యమట్లు సాయుజ్యంబౌ॥ ౫౯౪

క॥ శ్రీరామాంతస్సంచా
రా రాముఁడు భక్తుఁడజుఁను హరి యాత్మగుణం
డా రామాంతస్సంచా
రా రాముఁడు సకల జగదభిరాముఁడిలన్॥ ౫౯౫

క॥ తాఁ దోఁచుటయే బీజము
భేదము సూరంబు కర్మ పేరుము పుణ్యా
వేదన ఫలము గుభనము ప్ర
జ్ఞానము సకుఁ బౌద్ధము సుజ్ఞానంబౌ రా॥ ౫౯౬

క॥ నీదఁటయీూకల్పన మప
వాదముమూకంట భ్రాంతివాడిన జన్మం
బేదియులేదఁట నిజమిది.
నీదయ శ్రీరామరామ నిఖిలాత్మహరీ ॥ ౧౯౮

క॥ తెలియుటలేదది సరియే
తెలియమిఁయును దెలియద య్యె దిద్దుటపనిగా
వలచినజడులకు నూరక
కలిలోవాగుటయె భుక్తి కారణమయ్యెఁ ॥ ౧౯౯

క॥ ఇటుచేసెదు నినుఁగాంచినఁ
దటుకునగాయత్రిమంత్ర తాత్పర్యంబ
బ్బుటయరుదా కరివరదా
యెటుచేసినఁజేయఁగలవుహితముగస్వామీ ॥ ౨౦౦

క॥ అనియెదవనుకొనియెదు జీ
వునిక్రియఁబన్నెదవు లోనవ్యూహములఁ భ్రాం
తినిశాంతి నీయసర్వము
కనితుది సమకూర్తువీవ కావెముకుందా ॥ ౨౦౧

క॥ నీయందు మనసునిల్పఁగ
నేయిట్టులఁజేయుచుందు వీవెనిజముగా
నోయీూ పన్నగశాయీూ
నీయంతటివాఁడవీవె నిఖిలంబీవే ॥ ౨౦౨

ఆ. వె॥ బద్ధమైనరసము శుద్ధముయినభంగి
బద్ధుఁజేసినను బ్రబుద్ధుశుద్ధు
సిద్ధుఁజేసితయ్య శ్రీరామనీపాద
పద్మములను నిలుతుభక్తిఁగొలుతు ॥ ౬౦౩

క॥ లింగరహితుండవగుట ని
నుంగనరా దట్లుమాయనుంగనరా ద
య్యంగనకు నీకు వేఱగు
గంగాబె మ్యేతలఁగాన రాదు మురారీ ॥ ౬౦౪

క॥ వేదంబు నిన్నుఁదెలియ
న్లేదని చెప్పంగవింటి నేఁ దెలియుదునే
నీదయయిదినీదయదా
మోదర! యీవే భజింతును త్తనుపదవిన్ ॥ ౬౦౫

క॥ సహజంబగు నీక్రీడకు
నిహపరములు పెంచ్రుతుంచి యెంతయునీలో
రహిమీరసంతసించెన
వహీశయనానిన్నుఁ బొగడనో నెటుచెపుమా ॥ ౬౦౬

క॥ నీకన్న వేఱు లేదని
యేకతముననైనఁ బురుషుఁ డెఱింగిన చో నీ
లోకంబారాధించుఁ
జేకొనుఁగైవల్యపదము సిద్ధమునంతా ॥ ౬౦౭

క॥ ఉన్నదియున్నట్లుండుట
కన్నన్ దత్త్వంబువేఱొకలుగునె నీవే
యున్నదని కనియు జీవుఁడు
పన్నున్ దానే మొజన్మబంధము రామా ॥ ౬౦౮

క॥ పలుభంగుల యోజించుచుఁ
గలవరముం జెందుమనము కొంచపునిన్నున్
బలుభంగులఁ జరియించుచుఁ
దలఁపుననిన్నిల్పఁగాంచుఁ దథ్యము రామా ॥ ౬౦౯

క॥ చచ్చినటులుండి నీలోఁ
జొచ్చినపురుషునకు లేవుసూ బాగోగుల్
నిచ్చలులోలోనాసన్
బుచ్చెడుజీవునకుఁ దప్పవుగదసుఖకుంబా ॥ ౬౧౦

క॥ చంపెదనటు కనిపించుచుఁ
గంపము కల్గింపఁ బుద్ధిగల్గెడునని నో
ర్పింపఁ దొడంగెద వదిమా
కింపుగ భవబాధఁ బాపునే గద రామా ॥ ౬౧౧

క॥ కొట్టుట నివలెఁ దెంపుచుఁ
బెట్టెడన్నంబు ప్రియము పెంపఁడుగద తాఁ
బట్టినపట్టది చదునఁట
పట్టియుఁ దెలియండు తెలియఁబల్కఁడు తానున్ ॥ ౬౧౨

క॥ కృతకృత్యుఁడైన బాలుఁడు
కృతికృత్యుఁ జనకుఁగాంచి కీర్తించును స
ద్గతినిచ్చితనను సద్గురు
సుతుఁజేసినధీరుని పురుషునిఘనునిన్నుఁ ॥ ౬౧౩

క॥ పీఁడుట ద్వంద్వములుగ వే
కూడుటధర్మమగునీకుఁగూడఁగవిడఁగాఁ
గ్రీడకుఁజేసినజగములఁ
బీడించుట పెంచుటయును బ్రియములగుహరీ ॥ ౬౧౪

క॥ తనకర్తృత్వముతానే
కనిన్ మునివృత్తినిల్వఁగాలేఁడుహరీ
మనమదిచలియింపఁగసా
గునఁబిదపన్ నీదుకరుణకొఱకుఁదపించున్ ॥ ౬౧౫

క॥ నీకీర్తనసేవఁజేసియు
లోకోత్తరరీతిఁజేసి లోలతవిడుచున్
గాకుత్స్థతిలక వానికి
నీకరుణన్ గల్గుముక్తి నిజముగనిందే ॥ ౧౬ ౬

క॥ తానస్వతంత్రుఁడఁట మే
నేనస్థిరమఁటత్వదీయమేసంకల్పం
బా నఁటచేయున్ దెలుపన్
బూనునవాగ్దానమునకుఁబూనునటహరీ ॥ ౬౧౭

క॥ పూనినఁ బూనెను దెలియక
మానుటయుఁగ నైన మేలు మహనీయతయున్
ధ్యానము కుదురుట నీపై
జ్ఞానోదయ కారణంబు కలుషహరంబున్ ॥ ౬౧౮

క॥ అహమను పశువుం బట్టెద
విహపరముల శాంతిఁ గూర్తు వెంతయుఁ బ్రీతిన్
వహియింతు భారమంతయు
నహిశయనా నిన్ను నమ్మి యర్థించిన చోన్ ॥ ౬౧౯

క॥ కింకర హృదయము హ్రదమగు
సంకల్పము పంకమందు సమరసము రసం
బోంకారము సుమము మహిప
ర్యంకా నినుఁ జేరు ధ్యాన మది వాసనయై ॥ ౬౨౦

క॥ మలినప్రకృతిం గెలువన్
వలె శుద్ధప్రకృతిచే నవల రెంటిన్ లో
పల నడఁపన్ బురుషుండై
వెలయున్ నీ పేరుఫలము వేముక్తుండై ॥ ౬౨౧

క॥ హృదయమున నిల్పుకొనినన్
వదలక యితరంబునందు వైరాగ్యమునన్
బదపదము నరున్ మాఱెడు
గదనీ భక్తుండు తెలియక చపలు నివలెన్ ॥ ౬౨౨

క॥ నిజధర్మమరసినదువృట
గజబిజిలేకుంట సర్వకాలంబులనీ
భజనము సేయుట తెపమగు
గజవరదా గురుసపర్యకై నల్యంబుల్ ॥ ౬౧౩

గీ॥ ఎంత చెట్టునకంతియ యెంచగాలి
యనెడునా మెతనిజమురా మయ్య శౌండ్రి
పెక్కు లిడుమలుకష్టముల్ నిక్కువముగఁ
బెంచి మొదలంటఁద్రుంచెద పేర్మి భవము ॥ ౬౧౪

ఉ॥ ఏటికిసృష్టి భేదమది యేటికి నేటికిరాకపోకలుల్
మాటికిమాటికిన్ గ్రమము మాఱుట యేటికిరిక్తవాంఛలన్
బోటది యేటికో తెలియబో హరినీకటా శ్రీవధూటికో
వాటమెఱుంగనీ త్వరకవాటముఁదీసి భవంబుదాఁటెదన్ ॥

ఆ. వె॥ నీనికేతనంబు నీశంఖచక్రముల్
వాహనంబు భక్తవరుని సిద్ధ
పఱచి ముందునిల్పి పాలింపనున్నావో
భక్తవరులభవమువలనరామ ॥ ౬౧౬

క॥ నిజసామర్థ్యంబుననిన్
భజియింపఁగనెంచువాని బయసాద్వేదవం
గజబాధల దుర్మేధల
గజబిజిగల్పించి భ్రాంతుఁగాఁ జేసి హరీ ॥ ౬౧౭

కం॥ నానావస్థలనీమెడ
ధ్యానమునిలుపంగ వానిదరిఁజేర్చెదవా
ధ్యానమునిలుపఁగవలసిన
జ్ఞానముగలుగంగ మాయకల్పనరామా॥ ౬౨౮

కం॥ నీకెట్టులో యిష్టంబటు
పోకున్నన్ జీవుభంగముల్ జేసెదు తాఁ
డాఁకక యెద్దియుసాక్షిగఁ
బోకడశుద్ధుఁడగు వానిఁబోషింతువహో॥ ౬౨౯

కం॥ పరమేశపార్థసారథి
యరయఁగ విశ్వంబుదానినాడింపంగా
మరనీవఁటనీదఁటనే
చరమార్థంబిచ్చి మమ్ముసాకుముకరుణన్॥ ౬౩౦

కం॥ ఏమేమో రోవచేయున్
లోమనమదిదానిమాటలో బడనీకో
రామానిరతమునీపద
మేమరగెడునట్లు బుద్ధినేలుము కరుణన్॥ ౬౩౧

కం॥ నినుఁగదియునాత్మజుః మునఁ
దనవది కదలుభవదాజ్ఞఁదనుపరులూఁపన్
మనమిఁక శాంతినిఁ బొందున
మనస్కు మనఁగనిద్రియుండు మాపతిభక్తుల్॥ ౬౩౨

క॥ అంగవలెనన్నకొలందిని
రేఁగును సంకల్పవితతి రేభగవంతా
రాగము మానెను నీకృప
సాఁగును దప్పమిఁకను మాకుసాధుశరణ్యా ॥ ౬౩౩

క॥ శాంతిన్ని పదములన
శ్రాంతము సద్భక్తిఁ గొల్చు సాధులకిలనే
కాంతంబునఁ నీచింతన
హంతట విడనాడి నిల్వనౌ శ్రీకాంతా ॥ ౬౩౪

క॥ మానుటసర్వము భజనము
బూనుట నీయాజ్ఞదలనుబూనుట నొకకా
లానఁగల్గును సీతా
జానీ నీకృపను బరమసాధులకెందుఁ ॥ ౬౩౫

క॥ శాంతింగల్గించితివ
త్యంతము సత్కృపనునాకుదానినిస్థిరగా
వింతువనినమ్మెదనుమా
కాంతా సర్వత్ర నీవకాపాడవలెఁ ॥ ౬౩౬

సీ॥ తానుదోఁచిన తన్మయత్వంబులేదు
తన్మయుండైనయప్పుడు తానులేఁడు
దీనితత్వంబు నీకృపఁదెలియఁగలుగు
ధీరవరులకు నైక్యమీదేశికుఁడవు
దేవతాసార్వభౌమ దైతేయభీమ ॥ ౬౩౭

క॥ ఎప్పటికప్పుడు క్రొత్తఁగఁ
గప్పక దనుమాయ యెంతకష్టము రామా
చెప్పఁగవలెనా! నీకృప
తప్పక లేదొంటు దెప్పదరిఁ జేర్పంగన్ ॥ ౬౪౮

క॥ జీవులకెవ్విధిముక్తి స్వ
భావోదురతిక్రమయని ప్రాజ్ఞులు పల్కన్
శ్రీవల్లభ నీకృపయే
గావలె వేఱొండు త్రిప్పఁగలదా మాయన్ ॥ ౬౪౯

గీ॥ రామ నీక్రీడకే యగు రాజ్యమందు
నియమమే లేదొకండైన నెట్టుకొనుటఁ
బట్టుదలతోడ వర్తించి పశువులైరి
తెలివిమాలిన జీవులు తెలియనీవె ॥ ౬౫౦

గీ॥ మరణమనుమాట మఱపించి మనుజపశువు
లకువృథాశ్రమ భ్రమణంబు విఫలమయును
కల్పనముఁ జేసి క్రీడింతుగాదె దాసు
తనదుకర్మంబటంచు నెంచు మనుజుండు ॥ ౬౫౧

ఆ. వె. పరులవలనఁ దనకుఁ బరులకుఁ దనవల
నభయముండ రాదు నతియుఁ నలదు
నిన్నుఁ గోరువాఁడు మిన్నకుండినఁ జాలుఁ
బన్నగేంద్రశాయి భవ్యదాయి ॥ ౬౫౨

క॥ వలఁచుటమానినబుధుఁడిల
నిలుచుఁ గనీపాదభక్తినియతాత్ముండై
నిలుచునుస్వాత్మఁగుసుస్థిర
నిలుచుంగదప్రణవమంత్రనిష్ఠముకుందా ॥ ౬౫౩

క॥ కించిజ్జ్ఞులమోరామా
వంచనమొనరింపకీక వాత్సల్యమునన్
నించుముజ్ఞానమునిన్నెద
సంచితసద్భక్తిఁ గొల్తు మానసమునఁ గన్ ॥ ౬౫౪

క॥ అపరాధశతముచేసెడు
కపటాత్ములనుసుమ్ము గాంచఁగలవాఁడవుగ
నృపరాత్పరమమునురా
తపోనిష్ఠఁగృపఁబాసి ధీయుతగనిల్పుమిఁకన్ ॥ ౬౫౫

క॥ కంపింపకయంపశయ్యను
తింపంగలఁడెట్లు సురనదీసుతుఁడీవే
నింపనిచోఁదనహృదయము
సంపూర్ణకృపార్ద్రదృష్టి శాంతిన్ రామా ॥ ౬౫౬

క॥ వలదిఁక వాదమునీతోఁ
గలసినయందాఁక భక్తి కలిగినఁజాలున్
బలుచేఁదనంబగునితరము
వలచుట గొలుచుటయు వలదు వలదు ముకుందా ॥ ౬౫౭

క॥ ఎమ్మెయిగురుపదములనే
సమ్మతిహృత్సనునిల్పి శాంతిఁ దాంతిఁ
నెమ్మదిఁగొల్చుచుశ్రీహరి
నొమ్మనిశాంతింతు నిజమహోన్నతపదవిఁ॥ ౬౫౮

సీ॥ శ్రీజగన్నాథుసేవించి శిరము వంచి
పాండురంగనియర్చించి భవముద్రుంచి
కోరికొల్లాపురంబునఁ గోదువతీర
లక్ష్మిభజియించి యాత్రసులక్ష్యముంచి
క్రమముమీఱఁగ సేతువుఁగంగఁగలుపఁ
జనుచుసద్భక్తివిడిచిరి స్వామి హర
భద్రగిరిసహుదర్శించి భద్రముఁగని
వేధసుపోట్కట సురకోట్టి వేడ్కమీఱఁ
జేరియాత్రను సంపూర్తిఁజేసి శేష
గిరికిగిఱునదిరిగిరి కేవలునకు
భక్తినాత్మార్పణముఁజేయభాగవతులు
తత్పరత్వంబువర్ణింపఁ దరమెశ్రీశ॥ ౬౫౯

ఆ. వె. శ్రీశ వేంకటాద్రికేశవ పరమాత్మ
భాసమానమూర్తి భవ్యకీర్తి
సాధుహృదయవర్తి స్వాత్మానుసంధాన
చక్రవర్తి రామచంద్రమూర్తి॥ ౬౬౦

క॥ శంకరతాండవతోషిత
పంకజనేత్రాకటాక్షపరిపాలితస
త్కింకరసమూహభవనా
శంకరచరణాబ్జయుగళసరసిజనాభా ॥ ౬౬౧

మాలిని॥ హరిహరవిధిరూపం హ్యార్తరక్షాప్రతాపమ్
కలిమలహరదక్షం కామజిత్సత్కటాక్షమ్
సరససుజనగేయం సాత్వతాంభాగధేయమ్
పరమపురుషమీశం భావయే వేంకటేశమ్ ॥ ౬౬౨

గద్యము

ఇది శ్రీమదమృతానందనాథగురునాథబోధసు
ధాబ్ధి కన్యాధవపదాబ్జసేవాలబ్ధమనీషాజని
తోభయభాషాకవితాభూషాలంకృత
కనకావిఖ్యాతజీవయాత్రాఖ్య మహా
కావ్యసంగ్రహంబునందు దేవాధి
కారంబనుద్వితీయోల్లాసంబు
సంపూర్ణము
శ్రీరామ

శ్రీరస్తు

తృతీయోల్లాసము

[వేంకటాచలయాత్ర]

క॥ శ్రీశ! వరప్రద! కేశవ
శ్రీశంకర! శేషభూష! శ్రితపోషక! స
ద్దేశిక! యాలింపుము కృప
నీశుభ చరితంబు భక్తి నే వివరింతున్ ॥ ౧

క॥ ఆశ్రితసచ్ఛరణంబగు
నీ శేషమహీధరంబు నృపతినిఁ జేర్చెన్
శ్రీశివ కేశవ భేదము
లేశము లేనట్టిభక్తి లే పూర్ణంబై ॥ ౨

క॥ తిరుమలతిరుమల నిజముగఁ
దిరుపతి చే క్షేత్రమయ్యెఁ దీర్థంబులచేఁ
బరగును వేంకటగిరియై
పరమార్థముఁ గోరు భక్తవరులు వసింపన్ ॥ ౩

క॥ నీస్థానముఁ జేరి నృపుఁడు
స్వస్థానముఁ జేరినట్లు శాంతింగనియా
త్మస్థితి వేంకటనాథా
సుస్థిరసద్భక్తిఁ బొగడ చన్నిన్నని యెన్ ॥ ౪

శ్లో॥ శ్రీ వేంకటేశం శ్రితదాసపోషమ్
యోగీశ్వరేశం నుతపార్వతీశమ్
సూర్యాబ్జనేత్రం సురలోకమిత్రమ్
వందేసుకీర్తిం పరమాత్మమూర్తిమ్ ॥ ౫

శ్లో॥ నిరాలంబంమార్గం హరిపదశివానందలహరీ
ప్రసాదాజ్ఞానాతిస్వయమపినశక్నోతిగమితుమ్
సదాకర్మాసక్తస్సకలనిగమాలంకృతసుధీః
వృథాయత్నంకుర్వన్ గురుజనపదాంభోజవిముఖః ॥ ౬

క॥ శ్రీధరశంకరనీలప
యోధరవర్ణాంగమంత్రయోగపతంగా
నాథుహృదయానుషంగా
బోధామృతగంగసకలభువనశుభాంగా ॥ ౭

క॥ శంకరసేవితచరణా
వేంకటరమణానుతగుణవిశ్వసుశరణా
పంకజనయనాభరణా
సంకటహరణాసకరుణసజ్జనతరణా ॥ ౮

క॥ పోషితరమానుగుణమణి
భూషితసకలాంగదాసపుణ్యవిశేషా
ఘోషద్ఘోషాసహనా
శేషాచలవాసనుడనసేవితవేషా ॥ ౯

క॥ రోషారుణలోచనదృక్
శోషితదోషాచరద్వృగగోచర యోష
ద్దోషాసహనా శ్రీమణి
భూషితహృదయారవిందబుధనుతవేషా ॥ ౧౦

ఆ. వె. ఒకటెలోకమగుదు వొకటయులోకంబు
నాదుచిత్రమూర్తి వౌదు వౌర
నిన్నుఁదెలియనెవఁడునీవసీవాఁడవు
శేషగిరినివాస శ్రీనివాస ॥ ౧౧

గీ॥ బాధఁదొలఁగించినీప్రాపుపదిలపఱచి
ముక్తుగావించినీపాదభక్తిపెంచి
యెట్లుపాలించెదో వేంకటేశనన్ను
నిన్నునమ్మినభక్తుండనిజమునిజము
వ్యక్తిభేదంబులెంచఁబ్రసక్తిలేదు
సక్తియునులేదు లేదహాహాముక్తిదాన
ద్వైతవాసనహెచ్చు ముదంబుచచ్చుఁ
గానసర్వంబునీరూపుగాభజించు
భక్తనరునకునిందందుఁబరమపదము ॥ ౧

క॥ ఔదాసీన్యమువ్యక్తివి
భేదములసహించునేర్పు వేదాంతరసా
స్వాదనము పోషహింపుయు
నీదగుగుసుకృతనగల్లునిల్పుసనంతా ॥ ౧౩

క॥ నీసౌజన్యపుకలిమియు
నా సామర్థ్యంపు లేమినామదికిఁ గారాఁ
జేసితి శ్రమతో నైనన్
దాసునిధన్యునిగఁ జేయుఁదగునికఁ శ్రీశా ॥ ౧౪

క॥ హరిహరులసఖ్యమారా
పరమాత్మ నికరుణలేక భావమునందున్
బరికింప నేరిశక్యము
హరపుత్రునిఁ జంపిపట్టి వాఁడుహితుండే ॥ ౧౫

క॥ ఆకారంబేలేదఁట
సాకారతనయు నెవఁడు నాత్మకుమటనీ
వేకంబయ్యును భేదం
బేకల్పనఁ జేయ నెద్ది హేతువుస్వామీ ॥ ౧౬

క॥ పాకారిప్రముఖులకున్
నీకపటముఁ దెలియనీవు నీకృపలేకో
నీకల్పనలోఁ బాత్రల
కాకలుషపు పాపుగతియొ హరిహరనాథా ॥ ౧౭

గీ॥ స్వాత్మతనియుంగఁదనియు నాత్మాధినాథు
... ... ... ... ... ఁబు ... ... ని యుఁ
గా సి ... ... ... సంఘటనము పకు
లేసనాథ ... ... ద్దియుఁ గాదు భువిని

స్వానుభూత్యేకమానమార్యాళిశరణ
ముండిలేకుండుమార్గ మేయుత్తమంబు
నిరతమాత్మావలోకననియతిదప్ప
కుండజీవుండుతపమునమండి వెలుఁగ
దేహనౌకభవాంబుధితీరమునకుఁ
జేరనడిపించుచుండుఁబో శ్రీగురుండు
మధ్యఁదోఁచినఁదోఁచునుమాయజగము
దానిహింసించుచుంటనీధర్మముకద
భక్తజనులకుసంసిద్ధిప్రబలునట్లు
కాలరూపంబుఁదాల్చినిష్కారణముగ
లీలఁజేయించిచేసెదీరేడుజగము
లాత్మతృప్తికిశక్తికినంతరాత్మ
వేద వేదాంత వేద్యసద్విబుధసాధ్య ॥ ౧౮

క॥ నగుమొగమునసహజమయ్యెఁ
నగపతినీవిట్లువీరనారాయణుఁడై
యుగపడుటకలియుగంబున
నోగిదుష్టులశిష్టవృత్తినుంపుటకేకదా ॥ ౧౯

క॥ చూపిననందుకొనఁగలుగు
బాపలుమున్నెన్నగలరుప్రకృతములేర
పాపలఁబథమునవిల్వగఁ
గోపింపలేఁగొండమీఁదఁగూర్చుంటిబళీ ॥ ౨౦

క॥ నామస్మరణముకంటెన్
క్షేమంబుగఁగొల్చినిన్నుఁజేరెడుమార్గం
బేమియునితరములేదఁట
కామేశాశ్రీనివాసకలుషవినాశా ॥ ౨౧

క॥ శరణార్థులరక్షించెడు
బిరుదమునీదౌటశుభముపెంపుముమారన్
సురవినుతభుజగభూషణ
పరమేశాశ్రీనివాసభవభయనాశా ॥ ౨౨

క॥ సంకల్పమునీదనియున్
జంకెడుమందునకువిడునెసంశయముహరీ
గొంకకనిత్యమునీకున్
గింకరుఁడైయొడలుమఱచికీర్తింపనిచోన్ ॥ ౨౩

క॥ యోగికిమానముఁబూనిన
సాగునుసద్వ్రతముబ్రహ్మసాయుజ్యంబే
తాఁగల్గునన్నినీకృప
వేగమసమకూరుమాకువేంకటనాథా ॥ ౨౪

క॥ చేయుటచేఁగాదెద్దియు
మాయుటచేసర్వమగునుమునిజుదిగనిన్
డాయునుబంచేంద్రియముల
మాయునునిర్మమతశాంతిబూర్ణుఁడగుహరీ ॥ ౨౫

క॥ చేయించుసీదుమాయయ
చేయుఁజేయించుకొనునుజీవుండిటులో
నాయూయవస్థఁదగుగతి
న్యాయమెమెప్పింపమెచ్చనరులకునృహరీ ॥ ౨౬

కం॥ నీకృపమాపై రావలె
నోకేశవసర్వశక్తియుతునకునీకే
సాకఁభారంబైనఁ
మాకెవ్వరుదిక్కుధర్మమార్గముఁదెలుపఁ ॥ ౨౭

క॥ అనుసక్కంబనఁగసతత
సమాధితాదనకులేమిజనులకునికియుఁ
సమరసమైక్యముసీతోఁ
జుమిశేషాచలనివాసశోభనవేషా ॥ ౨౮

క॥ ఏమియుఁజేయఁగలేనిఁక
నేమైననొనర్తుగాక యెటానీపదముల్
కామించెదఁగామించెద
సేమంబుననిలుపునన్నుశ్రితమందారా ॥ ౨౯

క॥ తపమనఁగబ్రహ్మచర్యము
తపమనశాంతియునుదాంతితత్త్వజ్ఞాన
మ్ముప్రకృతిసర్వంబునునీ
కృపమేశ్రీ వేంకటేశశ్రితజనభూషా ॥ ౩౦

క॥ తపమున నిను సేవించుచుఁ
దపమున నఘమడఁచు సర్వతంత్రములందుం
దపమున స్వాతంత్ర్యముఁ గను
దపమన నీరూపు నీవు దనుజవిదారీ ॥ ౩౧

క॥ పిల్లలపోషణ తల్లిది
యల్లరి బాపంగ మంత్రమాచార్యునిదే
పిల్లనిదగు జనకుఁడు రం
జిల్లఁగ కృషి సేఁత సిద్ధి శ్రీహరి నీదే ॥ ౩౨

క॥ శివశక్తులిద్దఱొకఁడని
కవిజనములు పొగడుచుండ్రు గద చిత్రంబే
భువి నేఁడా మూర్తిత్రయ
మవిరళగతి దిరుమల నిటులైక్యంబందెన్ ॥ ౩౩

ఉ॥ భ్రాంతి నశించెఁ గర్మము విపాకముగాంచె శివంబు పెంచె స
చ్ఛాంతి ఘటించె సంతతము స్వాంతము ముక్తికి నిస్వరించెఁ దా
నెంతయు వేంకటేశ భజియించి తరించెను మేలు మేలు వ
ర్ణింతుఁ ద్వదీయభక్తులఁ దృణీకృతయుక్తుల నిత్యముక్తులన్ ॥ ౩౪

క॥ భోశంకర మృత్యుంజయ
కాశీపతిసేవితాంఘ్రికమలాస్పృహారీ
శ్రీశాపన్నగభూషా
శ్రీశేషాచలనివాస శ్రితజనపోషా ॥ ౩౫

సీ॥ మామకభ్రాంతిబాధుముమధువిదారి
బ్రహ్మమయుఁడనని వినివిరక్తిలేమి
వాసనాబలముగద యెవ్వారికైన
వాసనహరించుదేవతాబలముకలిమి
శేషగిరివాసనతదాసశ్రీనివాస ॥ ౩౬

క॥ జీవత్వము హరియింపఁగఁ
గైవల్యంబీఁగసర్వగతులన్ గరుణన్
గావలయునుబాలాజీ
కేవలశూన్యునిగఁజేసి క్రీడించుననున్ ॥ ౩౭

క॥ శంకరపదపంకజ మున
శంకతఁగొల్చెడుమహాత్ము లలితాకారున్
బంకజనాభుని నిముఁగని
శంకలుహరియించు రంగ! సద్గురురులింగా ॥ ౩౮

క॥ కాలాధీనులుజీవులు
చాలుదురెటు నీముచిత్రజాలంబెఱుఁగన్
గేలెత్తిమ్రొక్కలిమనీ
బాలుంగాపాడుకొనుము భక్తునశక్తున్ ॥ ౩౯

క॥ జీవభ్రాంతినివిడఁగా
నీవాఁడన్ జేసినాఁడ [illegible]
నీవాఁడ[illegible]
నీవాఁడ[illegible] బ్రోవవలయు నిజముగ[illegible] ॥ ౪౦

క॥ అప్పా సంసారాబ్ధికిఁ
దెప్పా సుగుణములకుప్ప దీనుని జేయుఁగా
గొప్పా తెలియుఁగఁజెప్పఁగ
దప్పా నుతిఁజేయు మొప్ప దాసుని తప్పా ॥ ౪౧

క॥ నీలీలా కేళులకీ
బాలుకు తను తెలివిచేత బహిరంగైక్యం
జేలా యత్నించెదరది
గోలయగాకెందు శాంతిగొలఁగునె యజా ॥ ౪౨

క॥ సేవింపలేమి నిన్నెద
భావింపఁగలేమి నెట్లొ వాంఛింపుమల్
దేవా కామించెదరఁట
నీవే కామజనకుఁడ వనిరి కేమి హరీ ॥ ౪౩

క॥ నీమంత్రరాజజపమునఁ
గామము చేకూరుఁ దుదకుఁ గామము దంగుఁగా
గామముఁ బెంపగఁ ద్రుంపగ
స్వామీ హరిహరుఁడవీవు సకలాత్ములకుఁగా ॥ ౪౪

క॥ తారకము మనశ్శోధన
కారక మంహోఘహారకము సంసారో
[illegible] మహాధి[illegible]
[illegible] లునీవు [illegible] ॥ ౪౫

సీ॥ ఎంచి యొంతసిద్ధాంతీకరించుకొన్నవిశ
నిల్వఁడెందేని నీయందునిలుచుభంగిఁ
జ్యోతములన్నియునీవయుచ్యుతుఁడవగుట
ధీరులాత్మాభిముఖులైరి దేహయాత్ర
నంతరంగంబు శాంతించునంతదనుక
సర్వథాసదాసర్వత్ర సమరసంబు
కలిగిమెలఁగిరి సిద్ధసంకల్పులైరి
శేషగిరివాస నతదాస శ్రీనివాస ॥ ౪౬

ఉ॥ నీచరణాబ్జదర్శనము నీచులకబ్బునె? లోకమేమియుం
దోఁచకపూర్ణభావమున నొక్కమనంబునునిగ్రహించిధ
ర్మాచరణంబుఁ జేయుచునిరంతరభక్తి శివంబుపెంచిశే
షాచలగహ్వరంబులనుధ్యానముసేయక వేంకటేశ్వరా॥ ౪౭

గీ॥ శ్రోత్రబిచ్చగానిపగిదిఁగూంశనాది
వేదవేదాంతతత్త్వసంపాదనమును
సట్టిభ్రాంతినశించినయంతవింతఁ
స్వస్వభావంబదిబయలుపడునుగాదె
యెత్తుత్రొలఁగించితానెంత మొత్తుకొనిన
గుండు తేలు నెమునుఁగు నేఁజెప్పునదిని
ధీరులిల్లాటఁగద చేరనీరుదీన
జనులజములనియెంచివిశ్వప్రదీప ॥ ౪౮

క॥ అనివేఁకటపతినతియిం
చినపిమ్మటభక్తవరులఁజేరుచువిడుచున్
దనపతియుమంత్రివరుఁడున్
మునమునఁస్తోత్రమునముక్తిమూదర్శింపన్ ॥ ౪౯

—: నిరంజనాదులు జయంతమునకుఁ బోవుట. :—

క॥ జాబాలిఁదీర్థమాడఁగ
బాబుల దర్శింపమనము వలచెడుననియా
జీవతవిడిచినజీవుఁడు
కేవలసంప్రీతి వెడలెఁ గీలెడలింపన్ ॥ ౫౦

సీ॥ నిరసహంసాశ్రమముఁజేరభక్తులరిగి
[illegible]
[illegible] ద్వారా
కాంచిపెట్టియున్నారు మీయనుమతికి ని
తెలుపు మునిశిష్యుఁడి వారి లోపలికిఁబిలువఁ
బనిపనాము వ్యాసునివచ్చి ప్రణతిఁజేయఁ
కూరుచుండంగ నియమించి కుశలమరసె
నంతరంగంబుపొంగ ననంతరముని
రంజనునిఁజూచిపలికె ధర్మాంబ తండ్రి
యెన్నినాళ్లయ్యెఁజూచి మీరెచటనుండి
వచ్చుచున్నారు వే తెల్పవలయుమువ్వ
రనఁగఁదాన్నాశ్రమము విడిచినది మొదలు

పెండ్లియాదిగాఁగల సర్వవిషయము లెల్లఁ
జెప్పియాత్రాక్రమంబును జెప్పనవల
బుద్ధిమతి నట్లు భట్టును బుజ్జగించి
యాత్మ మోదించి ధర్మాంబ యుండ నచట
శాంతి నుండఁగ శారదాకాంతఁ జూచి
భక్తి దళుకొత్త నెవ్వరి పడతి యనుచు
లోన యోజించుచుండె నానగి గంగుఁడు
పడుగఁ దలఁచియు నడుగక యూరక భట్టు ॥ ౫౧

క॥ నిజపుత్రాగమనంబున
స్వజనుల సద్గోష్ఠి రాజచంద్రుఁడు లోనన్
గజవరదుఁ గూర్చి మ్రొక్కెన్
నిజాంతరంగంబు పొంగ నొసరున నిటులన్ ॥ ౫౨

క॥ అంతఃకరణములు ముఖ్యము
లంతేవాసులు నలువుర హంబ్రహ్మాస్మ్య
త్యంతశాస్త్ర నివహంసం
భింతియ పురుషోత్తమ గురుఁడీవసుఖంతన్ ॥ ౫౩

క॥ నీపాదవారిశివునకుఁ
దాపాపహమన్న నింకఁ దత్త్వార్థులమై
నీపాదముఁ బట్టినమా
కాపదలన్నియును శమనమందవె రామా ॥ ౫౪

ఆ. వె॥ కనకదుర్గసేవ ఘనవిఘ్నకుమూల
మనెదనట్లనాకు మనుటకునిలఁ
దద్వయంబుఁగాల్చి ద్వంద్వంబుదాఁటితి
ననుచుఁజింతసేయునవసరమున ॥ ౫౫

—: నారదాగమనము. :—

క॥ శ్రీరామనాయకేంద్రుని
చేరేయింబవలుగడపిసిద్ధుండై సం
సారాబ్ధినీఁదనేర్చిన
నారదమునిముఖ్యుఁడటకునాఁడరుదెంచెన్ ॥ ౫౬

క॥ నిత్యంబాశ్రమస్థితిఁగృత
కృత్యుండై సంచరించు కేశవపాత్రుం
బ్రత్యుత్థానముఁజేసిరి
యత్యంతముభక్తితోడ నాశ్రమవాసుల్ ॥ ౫౭

సీ॥ చేసియుచితాసనమున నాసీనుఁజేసి
స్తోత్రమొనరింప నబ్జజసుతుఁడుపరమ
హంసరాజశేఖరులఁబ్రశంసఁజేసి
కృపఁగటాక్షించెధర్మాంబఁగీర్వాణి
శారదాదేవిఁజూచెనుగౌరవమునఁ
బెరలనాశీర్వదించుచుఁ బ్రీతిఁబలికె ॥ ౫౮

కం॥ మిమ్ముం జూడఁగ నానం
దమ్మయ్యెను నాకుఁ దాత దయఁబను పంగాఁ
జమ్మిటు నేనరుదెంచిని
జమ్మాగోష్ఠినిగనుట రసనదెల్లన్నన్ ॥ ౫౯

క॥ సంచారము చాలించివి
రించిన్ దర్శించి చిత్రరీతినిజగముల్
ముంచెడు సజ్జనులున్
వంచించుచు పాయమెఱుఁగ వలెనని వేడ్కన్ ! ౬౦

క॥ కలియుగమున గలవింతలు
నలువ కుమిస్నపముఁ జేయ నప్పుడు నినిగాఁ
గలకార్యము తెప్పంగఁగ
నలవియె హరిహరులకైన ననుచున్నాతన్ ॥ ౬౧

క॥ అవధారు భక్తి నారద
భువినిజయంత్రాశ్రమంబు ముక్తిదముకలిన్
బ్రవిమలభక్తుఁడు శేషుం
డవతారముదాల్చెఁ బరమహంసగనందున్ ॥ ౬౨

క॥ ఆయాశ్రమమును గృపనా
రాయణదేవుండు వేంకటాద్రీశుండై
పాయక ప్రోచుచునుండున్
శ్రీయుతుఁడై భక్తవరుల శ్రేయంబునకై ॥ ౬౩

ఆ. వె॥ పరమహంసశిష్య వరుఁడొకఁడు గలఁడు
రాజశేఖరుఁడను రాజశేఖ
రుండు రాజశేఖరుండో యనంగ నాఁ
గౌతుకంబు మిమ్ముఁ గనఁగఁ గలిగె ॥ ౬౪

క॥ అనవిని మునివర ధన్యం
డను బ్రాంపర్యవర్ణనము నీచేనే
వినుటనని మ్రొక్కనునిరం
జనుఁడతనిఁ భట్టు చూడనా గనుపించెన్ ॥ ౬౫

క॥ శారదుఁడదిగనిసర్వవి
శారదుఁడగుటన్ ద్వదీయసంశయమును నేఁ
దీరిచెదనంచుఁ జెప్పఁగఁ
బ్రారంభముఁ జేసెనిట్లు పరమప్రీతిన్ ॥ ౬౬

—: శారదపూర్వవృత్తాంతము. :—

క॥ ఈశారదచరితము విన
నాశించెదవీవు భట్ట యది యెఱుఁగుదునీ
యాశయము సర్వమెఱుఁగన్
జేసెదఁ జెవిపంపు విపుడు చేసెద వినుమా ॥ ౬౭

ఆ. వె॥ ఈమెచరితఁ దెలియ నేరికిశక్యంబు
మునికి రాజశేఖరునకుఁ దక్క
నీదుప్రశ్నమునకు నేర్పు మైప్రత్యుత్త
రంబు నీయఁ గౌతుకంబు నాకు ॥ ౬౮

ఆ. వె॥ పాడమె నేఁడె బ్రహ్మముఖమునఁ దెలిసిన
వాఁడనగుటఁ దెలియఁబలుకవలతుఁ
దృప్తినీకునాకుఁ బ్రాప్తించునద్దాన
ననమహాప్రసాదమనియెభట్టు ॥ ౬౯

క॥ విను శారదపూర్వభవం
బున శ్రీ సీమంతమందుముదమునధరియిం
చినజీవమణియటంచున్
వినిచెను దచ్చరితతాత వివరింతునొగిన్ ॥ ౭౦

క॥ క్రీడార్థముకమలజుఁడొక
నాఁడా శ్రీదేవిఁజూడ నయగతిఁజనఁగన్
నీలాలకతనశిరమునఁ
దాలిచెనొకధవునినంచుఁదహాతహాపడుచున్ ॥ ౭౧

క॥ పరిపుష్టనిశీథమునని
తరుణీమణి శివశయనమునఁ దగ్రహంబా హాహా
తరమాభరియింపఁగనీ
కరణిన్ నిజభార్యచేయఁగాఁబూనసురున్ ॥ ౭౨

క॥ అనిచింతించుచు సంశయ
మునువెల్లడిపుచ్చెనజుఁడుముదితయు వేయు
ట్లనియెను భయవిరహితయై
వినయమునన్ బ్రహ్మమనము వెన్నగఁగరఁగన్ ॥ ౭౩

క॥ స్వామీ మీప్రతిమయె చూ
డామణిఁగని యిట్లుపల్కుటతగునె? యనగాఁ
దామరసభవుఁడుసిగ్గున
నామణినింగాంచికాంచి యూరారయుచుర్ ॥ ౭౪

క॥ నాకిట్టిభ్రాంతిదోషము
నీకునుగల్పించుమణికినిజమొకనిముసం
బోకాంతజడతగలుగఁగ
నాకెంతయుఁజూడఁగోర్కె నా హంసనగెన్ ॥ ౭౫

క॥ నగుటకుఁగారణమేమన
ఖగరాజంబనియెనిట్లు కమలజుతోడన్
దగుదురుజీవులుభ్రాంతికిఁ
దగునే? మీవంటివారుతగులం దానన్ ॥ ౭౬

క॥ అనుటయునాహంసంగని
వనజభవుండోర యింతవదరెదునాతోఁ
గనుశాంతినమ్మి యిఁకభ్రాం
తిని బాస్చింగుడి యనఁదెలియుదువుకదా ॥ ౭౭

క॥ తేజముతగ్గుటభ్రాంతియు
నోజన్‌గలిగెడినిసౌక్య మోజన్‌జుమ్మా
యీజీవమణికినీకని
రాజీవభవుఁడన హంసరాజంబనియెన్ ॥ ౭౮

క॥ కపిలుండై గురుఁడయ్యెఁ
గపటాకృతితోడ మోసగాఁడయ్యె సుతుం
డుపచారంబపచారము
విపరీతపుచర్య చేసి వేడుక సించెన్ ॥ ౮౯

ఆ. వె॥ మన్ను దినుచు నోరు కన్నతల్లికిఁ జూపి
లోకజాలమందు లోకసకలము
జూపియైనఁ దన్నుఁ జూడనీఁడని
మోసగాఁడు కృష్ణమూర్తి యగునె ॥ ౯౦

క॥ నాతల్లి నేసట్టుల
నేతీరుననైన సుతుఁడ నేకడిషిరాకున్
జేతో మోదంబీయఁగ
నీతిన్ నటసంబుఁ జేయ నేర్తునె భక్తిన్ ॥ ౯౧

క॥ వినయమున నెపుడు సేవిం
చునుగద యీతాంటె జగముఁ జూఁడక యోగం
బున ముక్తిఁ గాంచు వేడుక
జననీ మిమ్ము తనికరుణ సాకుము వీఁకన్ ॥ ౯౨

క॥ అనవిని వాణియు బ్రహ్మం
గని పరిహాసమునకైనఁ గాంతా మీారి
ట్లనఁ జెల్లునె నిక్కువమై
జన్నుఁగద మీానోట మాట జారిన యేనిన్ ॥ ౯౩

ఆ. వె॥ ఎప్పు డాశ్రయించు నీజీవమణి నన్ను
నిన్ను మోయుచుండు నిజము హంస
జడతభ్రాంతి తలంపఁ జను నెట్లు వీరికి
భక్తవరులఁ బ్రోవఁ బ్రభుఁడవీవ ॥ ౮౪

క॥ కానక్ వేదీనికి నె
ల్లెనక్ బరిహారమిప్పు డారయుఁదగునా
లోనక్ లోనక్ శాంతం
బే? నాథా! మనకనంగ నెంతయుఁగసుణక్ ॥ ౮౫

క॥ ఏకాంతభక్తరక్షణ
మోహంజదళాక్షి! యింతయొప్పునె! నీకున్
నాఁకొంబడుటన్ మనచేఁ
బోకడలైవెన్నవారిఁబొందు నెయఘముల్ ॥ ౮౬

గీ॥ నీశిరంబునుండి నిముసంబులో మణి
జారితిరిగి నిన్నుఁ జేరఁగలదు
ఒక్కనిముసమయ్యెఁ బెక్కువత్సరములు
మనుజతతికి దేవ మానసమాట ॥ ౮౭

ఆ. వె॥ ఆంధ్రదేశమందు నాపినాకినితీర
మందుసోమశిలకు ననతిదూర
మందుఁ జ్యోతముగాఁగ నాఁడురూపును దాల్చి
జీవయాత్ర నడుపుఁ జిత్రగతిని ॥ ౮౮

గీ॥ పరమహంసమునీంద్రుండు కరుణఁజూపి
సకలసకలకళానిస్తారగరిమ
నాంపనార్థక్యమునకునై భూమిలోన
శారదాపీఠమునునిల్పు శారదాంబ ॥ ౯౯

సీ॥ అనుటయునువాణి సంతోషవనధిఁ దేలె
భక్తనగులకుశాంతిని భద్రమొసఁగు
దేవిశారదాదేవి సందేహమేల
ఈచరిత్రంబుపుట్టించు నేర్పుకైన
వినఁగఁగడువింతనాకు నవ్విధినిగలుఁగ
జేరితాంకితముమనవిఁ జేసికొంటి ॥ ౧౦౦

క॥ ఘనులగునాంధ్రలసంద
ర్శనమెట్టుఁగల్గునాకు జనకా? యనఁగన్
గనిమునియురాజశేఖరుఁ
డునుగలరాశ్రమమున నిపుడునిరంజనుఁడున్ ॥ ౧౦౧

క॥ తనయాత్రపూర్తికాఁగాఁ
జనుదెంచెను భార్యతోడ సచివాగ్రణితో
మునినిన్ గురువులఁజూడఁగఁ
దనయా! యెల్లరనుజూడఁదగునటచనినన్ ॥ ౧౦౨

క॥ అనవినుటయె తడవుగనేఁ
జనుదెంచితినీటకుఁబరమసాధులమిమ్మున్

గనికనులకువిందొనరిచి
తిని భట్టాయనుచు బయలుదేఱుచుమునినిన్ ॥ ౧౦౩

క॥ జనవిభునిరాజశేఖరు
వనితామణిశారదాంబ వరుసగఁబ్రీతిన్
గనిపోయివచ్చెదను న
న్ననుపుడనుచువీణెమీటి హరిస్మరియించెన్ ॥ ౦౪

క॥ నారాయణ నారాయణ
నారాయణ యదుకులేశ నళినాక్షహరీ
గౌరీజానిపరాయణ
శ్రీరామారామరామ శ్రితజనకామా ॥ ౧౦౫

క॥ ఆరావముచెవిఁజొచ్చిన
నోరూరెన్ వారికెల్ల నుడువంగన మోం
నారాయణాయయనియోం
కారముతోననిరటుమమకారమువీడన్ ॥ ౧౦౬

— అన్నంభట్టు పశ్చాత్తాపము. —

ఆ. వె॥ మునియుఁదాతలోకమున కేగగాభట్టు
పెన్నిధిఁగనుగొన్న పేదవోలె
శారదాంబవలనసదుపదేశముఁగోరి
చింతచేసెమట్టిచెంతనిట్లు ॥ ౧౦౭

శా॥ కూపుంబెట్టఁగఁగుస్తలీగ సురతింగూడన్ దరింపంగ హా
క్రీడాసక్తినిగూడివీడితిఁగదా రేలుంబవల్లందఱన్
బాధించద్ప్రకవిన్ను గొల్పుబుధులం బాటింపకే రీతినే
నాడాడన్ వృధచేసితిన్ జననమున్ హాస్యాస్పదుండై తినీ
ఛాడం దెల్పెడు దేశికున్ హితులనున్ సద్భక్తి సేవించినీ
బాలుండై విహరింతుఁ ద్రుంతు భవమున్ బ్రజ్ఞాసినిమ్మా హరీ॥

క॥ అనుచితకర్మంబులనిటు
మనువుంజెడఁగొట్టఁబోకు మర్యాదయనీ
కనినన్ వినకయునన్నిటు
లనుమానంబులనుముంచ నగునేజగపమా ॥ ౧౦౯

క॥ చేయనిదుష్కృతి లేదిల
వేయని వేషంబు లేదు వెలయాలికినా
కేయెడ భేదము లేదుగ
ఛీ! యని నన్ననివాడు ఛీ! లేడుగదా ॥ ౧౧౦

క॥ కోటికిఁబందెము వేయుట
కూటికిముమ్మాటికాత్మఁగూడుటకా ఛీ!
యేటికిసంసారంబిక
నాకేఁదత్త్వంబుసఖుఁడు నాహృదయమునన్ ॥ ౧౧౧

క॥ ఎందఱివేడితిఁ గూడితి
నెందఱి నెందఱిమనమున కెక్కఁగబోధల్

తొందఱఁబాడితినడుగక
ముందే నః బోలునునాదు ముందెందుఁగనన్ ॥ ౧౧౨

కం॥ ఎన్నివచించిన నేమగుఁ
బున్నమ పురుషార్థము జగమున విష్ణుమయం
బన్న మహాత్ములపల్కది
విన్నన్ దక్క్యముగఁ గన్నవిభుఁడే యెన్నన్ ॥ ౧౧౩

కం॥ వేదంబా శాస్త్రంబా
మోదంబా తన్నువలచుముదితల కృపచే
సాదంబా లేదేమియు
సోదరభావంబదయము యోర్చా నేర్చా ॥ ౧౧౪

కం॥ ఈద్వేషంబాద్వేషము
మోదంబున బుధులమీద మోపుచుఁ దనము
త్పాదన్ గొని యూడెడునా
సోదరభావంబదేటికో పరమేశా ॥ ౧౧౫

కం॥ దయలేనికపటమిథునము
నయవిదులనిపించుకొనుచు నలువురిలో లో
భయముననూపిరివిడిచెడు
శయనము చందైనఁ బాడుశవము నగిత్రిన్ ॥ ౧౧౬.

కం॥ ఆదరమొలుఁగనివారల
మాదిరిఁగని సంశయంబుమానుము మనమా
జూదరులు పొట్టకూటికి
వాదంబులు సేయుచున్నదు వైరులు? హితులా? ॥ ౧౧౭

క॥ నింబఫలంబునకునుగా
లంబుగడఁ దీపిగల్గులాగునఁగద యో
యంబామూర్ఖునికినిం
త్యంబునఁగూర్చెదవదెట్లొ ధర్మలవంబున్ ॥ ౧౧౮

క॥ మాయారహితయుయుగుటన్
మాయంగడవంగఁజాలుమానవుడిలదుర్
జ్ఞేయంబగుబ్రహ్మముఁగను
నాయమకృపనందినిల్చెనాంరమేశా ॥ ౧౧౯

క॥ కనకాచలసాయకహా
వనకరచరణాబ్జసేవ వనరుహనాభున్
గనిముక్తిఁగనెడుశారద
గనియెన్ ద్వంద్వాత్మకంబుగా సర్వంబున్ ॥ ౧౨౦

క॥ శారదశిరోమణియొయీ
శారదకరుణింపను సర్వముగాదే
శ్రీరామతత్త్వమీయఁగ
నీరామున్ బోలువార లిలఁగలిఁగలరే ॥ ౧౨౧

ఆ. వె. నారదమునిమాట నవరత్నములమూట
యనుచుభట్టునమ్మి యనియెశార
దాంబపదముబట్టు చంబ్రపోవుమనుచు
విన్నదానిఫలముఁగన్నయట్లు ॥ ౧౨౨

ఆ. వె. తల్లిరాజపుత్రుడయ చేతనిన్నాళ్లు
వింటిబోధలవలఁగంటినిన్ను
బీజమంత్రములను బ్రీతినిశ్రీవిద్య
నొసగిప్రోవసుదతియొప్పసంద్రు ॥ ౧౨౩

గీ॥ మఱియుబీజమంత్రములకుమహిని జూడ
రెండుసిద్ధారిచక్రంబునందురవల
విప్రులకునుప దేశమీావిప్రులంద్రు
కానినిను వేడెదనునన్నుఁగరుణఁగనుము ॥ ౧౨౪

—: శారదభట్టునకుఁదల్లోపదేశంబుఁజేయుట :—

క॥ అనవినినిరంజనుండా
నని శారదయునుగరుణసుఖాసీనుంజే
సెను దీక్షాతత్పరుఁజే
సెను దక్షిణమందుభట్టు శ్రేయంబొప్పన్ ॥ ౧౨౫

ఆ. వె. ఇచ్చెమంత్రమవల నీనెంచిబోధంబు
చెప్పఁదొడఁగెనిట్లుశ్రీవధూటి
శిరమునందుఁజేర్చిచిట్టిబోటి యహాహా
పలుకవశమెయతనిభాగ్య మీాశ ॥ ౧౨౬

క॥ ఘనసంప్రదాయరీతిని
మునిశిష్యుల కట్లవారుబుధజనులకొగిన్
వినిపింప సద్గురుముఖ
ముననేవిన్నట్లునీకు ముదమునవినుతూ ॥ ౧౨౭

క॥ జలజభవుఁడుల్లసిల్లగ
నిలసద్భక్తులకు ముక్తినీయన్ రహిన్ నాఁ
జలజాక్షుఁడవతరించెన్
ఖలులహరింప సుజనులకుఁ గల్యాణంబిన్ ॥ ౧౨౮

క॥ తల్లికిఁ దత్త్వముఁ దెలుపుచు
నెల్లప్పుడు తండ్రి దండ నెడబాయక జ్ఞా
నోల్లసమున గురుఁడై ప్రజ
నెల్లఁగాలిచి దీర్చను ఋణ మెల్లర కొకఁడై ॥ ౧౨౯

క॥ అందఱు జీవులు హరిలో
నుందురు జీవునివలెనతఁడుం దనులందు నుం
దందఱు నాశివమూర్తిని
నుందు నతఁడు మొదటిమూర్తి నొందుచుఁ దనరన్ ॥ ౧౩౦

క॥ కలలోఁ గను మూర్తులలో
పలఁదా నొకఁడయ్యుఁ దెలివిఁబడసిన చో నా
కలఁగల యనుభవమంతయుఁ
దలఁపున కున్ దన కెనచ్చుఁ దథ్యము రుకో ॥ ౧౩౧

క॥ ఆరీతి లోకమంతయు
నారాయణులీలగాయ్యు నలువురితో నే
దారినో యుండియు నుపసం
హారంబొనరించు వేళ హరియైనిల్చున్ ॥ ౧౩౨

క॥ రాముఁడుజగతినినునవలె
నేమేమోచేయుచుండ నేమునిఖిల
సోమునితోఁ జంద్రికవలె
వేముఖుమఱకొనంగఁబూర్వవేషముఁదాల్పన్ ॥ ౧౩౩

క॥ చంద్రుఁడుగ్రుంకినపిదపన్
జంద్రిక నడుమిలఁగలగనిజాగ్రద్వపున్
బొందినఁదగ్గతజీవులు
నుందురె యెందైన మఱలకుదురె తోడ్తోన్ ॥ ౧౩౪

క॥ తనకళలలోఁదానొండై
కసునితరుల వారు తానుఁ గలవిరమింపన్
దనతోడలోననుందురు
తనపూర్వపుమూర్తిఁదాల్చుతరిగతి లేమిన్ ॥ ౧౩౫

క॥ ఇలమిథ్యయయ్యుఁదద్గత
లలితాద్భుతగురుసుబోధలాభకరమయౌఁ
గలబావిఁబడినకోఘునుం
డలశబ్దముసున్నమెలకువదిగుణా సున్నన్ ॥ ౧౩౬

క॥ ఏచేనోఁగనుచుండిన
నీచేనునఁబఁటుపండునే తెలియుమియో
యాఁచేలన్ యాచించుట
నీచమటుచపలాత్ములవుటనిజముధాత్రిన్ ॥ ౧౩౭

క॥ తనకై తాఁ జేసినకృషి
తనలో నేఫలముఁ గాంచుఁ దదితరులందుఁ
దనబలమున్యర్థపుచ్చిన
మనుజులకాత్మీయునుపేఁమమహి నెటుఁగలుగుఁ॥ ౧౩౮

గీ॥ దిక్కుతో చకపసులనాథింపుచుంట
లేనియోగ్యత కల్పింపఁబూనుకొనుట
విద్యలనిచెప్పుదురు మూఢవితతికెందు
నూరకుండినవాఁడెపో యుత్తముఁడిల॥ ౧౩౯

గీ॥ దిక్కువేఱొండుఁగలదని దిక్కుచుందు
బక్కజీవుండు భవమునఁ జిక్కియుందు
దృక్కుమారెదిక్కుద్రిప్పక చిక్కుచుందు
ధరణిచిన్ముద్రయేసుమి తారకంబు॥ ౧౪౦

గీ॥ మ్రొక్కుచుందుసుదీనుల కక్కటకట
మనుజపశువిట్లు హరిమాయనుపేఁమఁగాదె
తిరుగుచుండునుజగమునఁ దెలివిమాలి
జ్ఞానసాధనమెంచదేని మౌనముద్ర॥ ౧౪౧

క॥ పారాయణమొనరించెద
రూరక తెలియంగఁజాలరో యనుకొన్నఁ
బారుఁశిధరరుచిఁజూచిన
కాఁకితజ్ఞానమాత్రవచ్చునెసుమత్తుఁ॥ ౧౪౨

క॥ శివుఁడెప్పుడుశివుఁడేగద
శివునిశివాశివమయముగఁజేయుట తలఁపన్
శివశక్తియెశక్తినిజము
శివుఁడదిగతముగఁగదా వశీకృతుఁడయ్యెన్ ॥ ౧౪౩

క॥ ఎప్పటికెయ్యదితగునది
తప్పకమనమునకువచ్చు దైవంబిచ్చున్
దప్పఁగుఁజుమ్మాతగులం
బెప్పుడు క్రీడింపుమాత్మతృప్తికి శాంతిన్ ॥ ౧౪౪

క॥ కాలమురాకయ తెలియుట
కాలమురాఁదెలియకునికి కల్లసుమీయీ
కీలెఱుఁగుము లోలత్వము
జాలింజాలింపు మాత్మశాంతికివిప్రా ॥ ౧౪౫

క॥ సరిగాఁగూర్పగనేర్పది
నరుఁడారయుశాంతిలేమి నలిగెడుఁగదత
త్పరుఁడై చింతలఁగుందక
సరిగాఁగూర్చునుమనంబు సరిగాఁగురిగా ॥ ౧౪౬

క॥ జీవత్వమనగనొరులకు
గేవలసత్పురుషునట్లొగిన్ గనపడఁగా
గావలసినయత్నముసు
మ్మీవిధిబరికింపమిథ్య యిదిలోపంబే ॥ ౧౪౭

క॥ తనకుంగలగుణదోషము
లనుగితరులఁదెలియకుండ లాలింపంగాఁ
బనిపూనుటజీవ తత్త్వం
బనఁదగుఁగపటంబు వేష మనఁదగుఁదమముల్ ॥ ౧౪౮

ఆ. వె॥ కొలదియత్నమునను గొప్పఫలంబులఁ
గోరుచుంట జీవకోటికెందు
సహజమాట ముక్తిసాధించుచుందురు
స్నానములనొ శోకదానములనొ ॥ ౧౪౯

క॥ మృత్యువుతత్త్వముఁదెలియఁడు
మృత్యువుసమయమునుదెలియఁడికనిజధర్మం
బత్యంతభక్తిసల్పడు
మృత్యువునిత్యంబుసత్యమితనికిఁబ్రదుకే॥ ౧౫౦

క॥ నీకెవ్వరుబంధుగులిల
నీకెవ్వరుహితులువిప్రనీవెవడవునీ
వాకుజనమాలింపఁగ
లోకము లెల్లహరియాజ్ఞలోమెలగంగన్ ॥ ౧౫౧

క॥ ఒకనాఁడొకఁడగుమిత్రుం
డొకనాఁడాతండెశత్రుపూరకయగుని
వికలతమానుమువిప్రా
సకలంబున్ద్రిప్పఁజక్రిచాలునునీకా ॥ ౧౫౨

కం॥ తపఁబడును జెడుగుఁ జేయఁగఁ
బుధవర్గబుగ్వాత్ముఁ డట్లుపుణ్యముఁ జేయన్
దపఁబడుఁ బాపి జడుఁడగు
గపుగునఁ బోగడుఁ దెగడును బరాధీనులనన్ ॥ ౧౪౩

కం॥ రాముఁడుసోమునిమిత్రుఁడు
భీముఁడుకృష్ణునికిహితుఁడు వింటి వెయనుచున్
దామునియెదరనకొనియెద
రీమహి జడులందఱరయ శ్రీశునిభృత్యుల్ ॥ ౧౪౪

కం॥ కలయనెదఁగల్లయనియెద
వలయనియెద వార్ధియనెద వలదనియెద నీ
ఁబలఁగనఁగలవన్నియుజం
చలములునా కీశ్వరునకుశాశ్వతగుణముల్ ॥ ౧౪౫

గీ॥ పదపదార్థసంయోగంబు ప్రాణపదము
తద్వియోగంబుచేఁ బదతతినిఁగోరఁ
బ్రతిమవలెనుండుఁ బ్రాణరహితముగఁగద
యర్థమెప్పుడుఁ బదమైత్రినమరియుండు
రసఁబదము వేఱుగాగ నిరర్థకంబు
పలుకునర్థంబులేకుండఁ బలికెనేని
హానిదెలియకజగముల మరగునట్లు
కానహరిభక్తిఁగనినచోఁ గలదుముక్తి ॥ ౧౪౬

గీ॥ దేనిరూపంబు దానినిఁబూనుదాని
విడిగననుభవించుటయున్న దింతగాదె
ప్రతిమగల్గినమూర్తానఁ బ్రాణమున్న
ధరణిప్రాణంబుఁ బ్రాణియే తాల్చుఁగాక
విష్ణుమూర్తిరూపంబ యీవిశ్వమరయ
దానిఁగోరుచుమఱచు నవ్వానిజీవుఁ
డట్లుగానసదియగు నిరర్థకంబు
హరికిసహజంబు నిత్యంబుసార్థకంబు ॥ ౧౫౭

క॥ ధీరుఁడు వైదికజనులన్
దూరఁడు పామరులతోడ దుర్వాదములన్
బోరఁడు గౌరవమొందెఁ
గోరఁడు విషయములనెదనుగూరఁడు విప్రా॥ ౧౫౮

క॥ ఏరఁడుపరదోషంబుల
జారఁడుధ్యానంబునుండి జగమువొగడఁగా
నూరఁడు సంసారంబున్
గోరఁడు తత్త్వమసివాక్యగురుయోగమునన్ ॥ ౧౫౯

క॥ తారఁడునిట్టటుసిద్ధుల
గోరఁడు నెద్దేనిఁ జేయఁగోరఁడు భీతిన్
బారఁడుమృత్యువుఁగనియున్
జేరఁడుగర్భంబదేమిచేసియు మరలన్॥ ౧౬౦

కం॥ ఈసద్గతిఁ గల్పింపఁగ
ధీసాక్షిగఁ జేయఁ బరమధీరుని జేయున్
శ్రీసద్గురూక్తిఁ బోలునె
యేసాధనమునఁ దెలియరే మందబుద్ధుల్ ॥ ౧౬౧

కం॥ తెలిసియుఁ దెలియరు జడులని
తెలిసియుఁ గాంబోలు బుధులు దెలుపుదురు కృపన్
బలుమఱు నొకఁ డేతత్త్వం
బలవడునే జడులకదియుఁ బ్రారబ్ధమునన్ ॥ ౧౬౨

ఆ. వె॥ మధ్యరాల నర్ధమండలాకృతిగోడ
గట్టి పిడపవాని నెట్టునట్లు
బాలువాతగుణము వాసిఁ జేయఁగనుల్లి
గడ్డ నములి నోరు కడుగునట్లు ॥ ౧౬౩

ఆ. వె॥ వాసనాత్రయంబు వైరాగ్యవహ్నిని
హుతముఁ జేసియైన సతతపరమ
పురుషపాదసేవ బోధామృతంబున
నైనఁ గడిగియైన హాతముచేసి ॥ ౧౬౪

ఆ. వె॥ మొదటిమూర్తిఁ దాల్చు ముదమున నాత్ముండు
జీవశంకఁ బాసి చింతఁ గోసి
కన్నుమూసి తెఱచి కాంచక కాంచియు
గాంచనాంబరుని మదిఁ గాంచుచుండు ॥ ౧౬౫

క॥ ఎంచ మనితరము దేనిని
నుంచునొ మనసమందు నుంచి యుడుగక కలము౯
జాంచల్యము మను స్థైర్యం
బంచితధర్మంబు పరమహంసలకిలలో౯ ॥ ౧౬౬

క॥ వివిధార్థములొగిదాను
యవని౯ లభియింపంబొందునానందముతో౯
గవిదైన నజ్జుఁడస్సు౯
దవిలెడునవ్వానిలోలత౯ జూమి తానై ॥ ౧౬౭

క॥ వినుప్రాయశ్చిత్తంబన
మనస్సమాధానమగు దమము౯ డెందస్సు౯
గనుఁగొన సర్వము బ్రహ్మం
బనువాదం బెన్న సున్న యాత్మస్థితిచే౯ ॥ ౧౬౮

క॥ రూపము ద్రవ్యము నొక్కఁడఁ
బ్రాపించిన బ్రాణపదము పరమపురాపర
బాపదనొసఁగును శ్రీహరి
రూపుగఁ దెలియనిజనులకు రూపీగజగము౯ ౧౬౯

గీ॥ విష్ణుఁ గొంచిన విశ్వంబు విశదమగును
విశ్వము మజూడ విష్ణుని వెదకలేఁడు
నరుఁగనిన గుణితించుఁజిత్తరవు దాని
గనిన నరునిగుర్తింపుట కల్లగాదె ॥ ౧౭౦

క॥ ఊఁతగుగురుభక్తి స్వకృషి
యాఁతన్నైర్వ్యంగలోకు నిచ్ఛ యువలయుక్
భూతలమునభవజలనిధి
నేతన్మాత్రుండుకడచునే విప్రవరా ॥ ౧౨౧

క॥ లోకుగదింపకదిగకయు
యాఁతన్నైర్వ్యంగఁగలఁడె యిలనెవ్వండే
నాతీరుననసహాయుం
డై తరియించుభవము గురునాజ్ఞ మనీషిక్ ॥ ౧౨౨

క॥ జంకకరామపదముని
శ్శంకతఁదాల్చుబుధమానసము గ్రుంకకతా
గింకర్తవ్యమ్మనదాఁగిఁ
బంకజమై తేలియాడుఁ బంకముపైఁజక్ ॥ ౧౨౩

గీ॥ భూతపంచకమునఁబుట్టుఁబోలియుఁబెరుఁగు
నాక్కృతినిభూతము లుంతురెట్టు
లాక్కరూపంబుతోడను నిక్కమట్లె
సహజసంస్కారమదవృద్ధిఁ జరుగుచుండు
దేహవంబెద్దిరయైన సందేహమేల ౧౨౪

క॥ దుర్గుణముల సుగుణంబుల
దుర్గమముగుతత్త్వనిష్ఠఁదోలుచు శాంతిక్
దుర్గాశ్రావ్యదంబున
నిర్గుణుఁడైయుంచు నెవరినేఁబూజింతుక్ ॥ ౧౨౫

ఆ. వె॥ గంటగంటకుపుడిఁ గట్టనేర్చినయంతఁ
జిత్తశుద్ధిగలిగి చెలఁగునెవఁడు
బల్లెమున్నబంటు బలమేడఁగానవచ్చుఁ
బూఁతరోఁతకాక ప్రీతియగునె॥ ౧౭౬

కం॥ జ్ఞానపుక్రియాజనకమే
యానానందంబుగల్గు ననుభవమునసే
కానఁ బ్రమాకీఁకీఁ జాలున్
జ్ఞానం బేయనగరాదుగద విప్రవరా॥ ౧౭౭

కం॥ జ్ఞానంబునసీఁదులకై
తానెంతయుయత్నపడఁగఁదగునంతియగా
తానన్నదినిదరించుట
కౌనాయభ్యాసగరిమనౌగాక యోగీ॥ ౧౭౮

కం॥ సగమందునసగమిందునఁ
దగవాఁబీగియింపమనము ద్వంద్వాత్మకమౌ
జగమదితోఁచనిస్పృహన్
ఖగవాహానుఁడౌనఁగు శాంతిఘనయోగమునన్॥ ౧౭౯

కం॥ ఆరాధనపలదందురు
నారామలభక్తిఁబలుకఁజాలునఁటబలీ!
నేరరునిల్వఁగఫణిఁగన
పేరాజగమందునైక్యవేత్తలువిప్రా॥ ౧౮౦

క॥ ఐహికమెద్దియుఁ గోరక
సాహసమున ముక్తికాంతసరససుఖించున్
దేహముఁ దెలియక భక్తుఁడు
సోహమ్మని జపము చేయుచో విప్రవరా ॥ ౧౮౧

క॥ జలజముఖ మయ్యులోనన్
జడాశయము పంకమునుంట సరసులు గనిలో
వెలి నుపయోగించుటకున్
వలనై నదిగాని కతనవలతురు చూడన్ ॥ ౧౮౨

గీ॥ ఆత్మతృప్తికిఁ గొఱగానియల్పబుద్ధి
చేతఁ ద్రిప్పంగఁబడెదు దుశ్శీలురకట
మోహవారిధిఁ గ్రుంకిత మోహాభివృద్ధిఁ
జేయుచుందురు తమదుష్టచేష్టితములు ॥ ౧౮౩

క॥ లోకంబాకుల మొందిన
నీకేమి భయంబు లేదు నీకై నీవే
లేకుంటలోక మేటికి
శ్రీకరుఁ శంకరుండ నిఖిలచిన్మయుఁడగుటన్ ॥ ౧౮౪

క॥ ఆనందరసముఁ గ్రోలెడు
జ్ఞానుల కెందేని పూర్ణశాంతి యొసుమిషై
శ్వానరుఁడాజ్యాహుతి నె
ట్లీనూర్ధ్వముఖుండుగాఁడె యేపున నెందున్ ౧౮౫

క॥ పాపంబులమదినెంచక
శాపంబులఁబాపునట్టిధన్యుని శ్రీవి
ద్యాపారంగతుసద్గురు
సాపాతముఁగొల్చుటన్న నాశ్చర్యంబే ॥ ౧౮౬

క॥ శ్రీవిద్యావసంకల్పం
బేవిధముసఁగల్గఁజేసెనెవ్వఁడుమనలో
నావిధులన్నియుదానికిఁ
గావలసినవగుటవాఁడకావించునొగిన్ ॥ ౧౮౭

క॥ తలలోనిచిక్కువిడుటకుఁ
బలుభంగులదువ్వచిక్కుపడవలెనుగదా
తలలోనిచిక్కువిడుటకు
పలుమరుహరిదిక్కుదృక్కుపడవలెవిప్రా ॥ ౧౮౮

క॥ ఎయ్యదియెవ్విధిజరగిన
నయ్యలలోనూఁగునట్టులుండనివాఁడే
చయ్యనవిధియునిషేధం
బెయ్యెడలన్ లేనిపథముసేగనుభక్తిన్ ॥ ౧౮౯

క॥ అహాహాయహంకృతితొలఁగఁగ
నహమున్ నిశియున్ విడువకయాత్మధ్యానం
బిహమున్ బరమున్ దలఁపక
సహనముతోఁజేయునానుసమరసదృష్టిన్ ॥ ౧౯౦

క॥ స్వాత్మీయాలంబమును మ
హాత్ములు పల్కెదరు భువిని రాలంబముగా
స్వాత్మీయేతరసంగం
బాత్మన్ జెఱచుట నిజము పరాలంబంబై॥ ౧౯౧

క॥ పుట్టుటలో గిట్టుటలో
గుట్టెఱుఁగంగలఁడె యెంతకోవిదుఁడైనన్
బట్టవలెఁ గురునిపదములు
నట్టవలెన్ మాయ భక్తినిన్ విప్రవరా॥ ౧౯౨

క॥ తనకొఱకె తాను దేహము
తనయాత్మన్ గూడు రీతి తథ్యము లోకం
బనయము హరియాశ్రయముం
గనుచుండున్ దాను నిల్వఁగా విప్రవరా॥ ౧౯౩

క॥ అక్షీణవైభవంబున
సాక్షిగఁ దానిలిచి జగముచాయకుఁ జనకే
వీక్షింపఁ గలిగియుండిన
మోక్షంబఱచేత నుండు మునివరునకిలన్॥ ౧౯౪

క॥ క్షమకలుగును భ్రమవదలిన
భ్రమవదలును భేదమడఁగఁ బలువిధముల బ్ర
హ్మము దోఁచెడు నని యనఁదనతోఁ
దనము ను భేదంబు వాంఛ తద్దయు నడఁగున్ ౧౯౫

క॥ సత్యము శ్రీహరిజగముగ
నిత్యము వెలుగంగనీవు నేనెవరిలలో
కృత్యము దెలియుట తాఁదన
కృత్యము లేదంచునుంటకృతకృత్యతకున్ ॥ ౧౯౬

క॥ పరులకు బాధయొనర్పమి
పరబాధసహించు నేర్పు పరతత్త్వంబున్
గురుమంత్రము ప్రజ్ఞానము
చరమార్గంబీయుఁ జాఁబసమతివహింపన్ ॥ ౧౯౭

క॥ దనుజానీకము చక్రా
గ్నినిముఁ హరి వేల్చినట్లు నియతాత్ముండై
ప్రణవాగ్ని వేల్చుచుండున్
మునియెంతయుఁ బూర్వకర్మము ననిశ్చింతన్ ॥ ౧౯౮

క॥ నిజధర్మాచరణంబే
సుజనుల మెప్పించు సకలశుభములఁ బెంచున్
నిజతేజోదర్శనమున్
గజవరదుని భజనమూను గైవల్యమెయగా ॥ ౧౯౯

ఆ. వె. ప్రణవమంత్రమెన్నఁ బ్రాజ్ఞులసొమ్మన్నఁ
గన్నతల్లిఁబోలుఁ గాంతఁబోలు
నాత్మమూర్తిఁబోలు నన్నియునీఁజాలు
బీజమ యపవర్గ భూజమునకు ॥ ౨౦౦

కం॥ విద్యాలతాలవాలం
బాద్యము సర్వార్థసంగ్రహంబగు బ్రణవం
బుద్యమరహితునకొసంగుట
కద్యన్నాయుజ్యమండ్రు సాధులు విప్రా ॥ ౨౦౧

గీ॥ దివ్యమంగళవిగ్రహుని నిత్యమహిమఁ
గాంచి సుఖియించు మేధావి కాంచఁడెద్ది
పరమాత్మ నాత్మను నాత్మచే సులభభక్తిఁ
గొల్చి హరికృపఁ బూర్ణుఁడై నిల్చియుండు ॥ ౨౦౨

కం॥ నిజధర్మము భజియింపక
సుజనుండనిపించుకొనఁగఁ జూచుచు జగముం
భజియించెను మోహంబున
నిజధర్మంబీశ్వరేచ్ఛ నేరఁడు తెలియన్ ॥ ౨౦౩

గీ॥ సన్యసించిన పిదప సంసారమందుఁ
గలుగు లేములు కలుములు గానరావు
శ్రీనివాసుని పదములఁ జేరి కొల్చు
సిద్ధునకు లేవు విధులు నిషేధములిల ॥ ౨౦౪

కం॥ మనమిటునటు చలియింపక
తనయాత్మన్ గూడుచుండి ధన్యతఁ గాంచున్
దనగురులకు శిష్యులకున్
ఘనశాంతిన్ గూర్చుచుండుఁ గద సతతంబున్ ॥ ౨౦౫

క॥ కలజగములన్ని హరియని
తెలియుట తెలియుటయు కాక ధీచాతురిచే
పలువిధములఁ బరజనముల
వలలఁ బడఁద్రోయుట దియువల చెడునది యే ॥ ౨౦౬

క॥ ఎంచనిచో జగములఁదా
గాంచఁడు విశ్వంబుఁదన్ను గాంచక యుంటన్
గంచుకము లేక విభుఁడై
మించున్ ద్వంద్వానుభూతి మేలుం గాంచున్ ॥ ౨౦౭

క॥ తననిద్రయ మరణంబని
తనకెప్పుడు విదితమగును దత్త్వంబప్పుడే
కనువిరతియు ఘనభక్తియుఁ
గనిదానన్ యోగనిద్రఁ గనుగద విప్రా ॥ ౨౦౮

క॥ నీనాభేదము లేనిదె
యానందంబందు నుండు నఖిలజగంబుల్
నానాక్షర సంతానము
లీసంబగుఁ బ్రణవమందు లీలన్ వినుమా ॥ ౨౦౯

క॥ భేదము పెంచుచు దానన్
మోదించుచుఁ గడుపు కాలమును దుర్బోధన్
లేదని తెలియఁడు జగము బ్ర
[illegible]దమునన్ గోరు దురానందుండనర్హు ॥ ౨౧౦

క॥ మలినాగారము దేహము
నెలవగు నజ్ఞతకు మనము నీచుఁడు తాఁ జం
చలములిపియనుచుఁ గనుచుఁ
గొలువఁడు జీవుండ దేటికో విప్రవరా ॥ ౨౧౧

గీ॥ సాధుబుధతారకంబు సద్బోధకంబు
సకలశరణంబు ప్రణవంబు శంకరంబు
సర్వశబ్దార్థబీజంబు సమరసంబు
మంత్రరాజంబు నిత్యంబు మదిస్మరింపు ॥ ౨౧౨

క॥ లోకాతీతత్వంబున
శ్రీకరమగు పరమపదము చేకురు దానన్
దాఁకఁడు వేల్పో కదానిని
లేకుండఁగ హరినిగూడి లీలాకేళిన్ ॥ ౨౧౩

క॥ చెప్పించున గావ్యంబులఁ
దప్పించును జన్మభరము దారుణభీతిన్
నొప్పించు దుష్టమనముల
మెప్పించు బుధాళి మంత్రమిత్రము విప్రా ॥ ౨౧౪

ఉ॥ దేవతలుల్లసిల్లఁబర దేవతదర్శనమీగ సద్గురుల్
సేవలసంతసిల్లమఱచేఁగద దాసుఁడు సర్వదృశ్యమున్
గేవలదృక్కుగా నిలిచి కీర్తియుఁ బూర్తి గ్రహించి మించి తా
నావలమూర్తితోఁ గనుచు నైక్యము భక్తులఁ గూడియాడుచున్ ॥

ఉ॥ అందఱుబంధుగుల్ హితులునందఱుయోగ్యులుభక్తులాదరే
మందునభూసురాతలఁబనందఱుస్వార్థపరాయణుల్ సుమీ
యిందఱనమ్మిచుంటతగవేదురదృష్టపుఁగాలమక్కటా
మందునిఁజేయుచుండఁదరమాయొకమాత్రపువానికూరకే
సందియముల్ హరింపబుధసన్నుతమూర్తి నిరామమూర్తిగో
విందువరింపుకన్నులకువిందొనరింపుసుఖింపుమింపుమై॥

క॥ ఫలవాంఛవలనఁగర్మం
బులుసఫలతగాంచవంద్రుముక్తికిసత్వే
వలుచేయుజడుఁడుదానిని
నడుగడుగునఁగోరిమఱచుహరిభజనంబున్ ॥ ౨౧౭

క॥ తనునితరముప్రేరేపఁగ
మనుగడనడుపుటయెత్తుమునుహానీయతయో
గనిధానంబగుముక్తియుఁ
దనకై తానడువభవముతగులునువిప్రా ॥ ౨౧౮

క॥ తనమనమునహరిఁజూచుచు
తనునితరముపట్టిత్రోయఁదలయూచుచులే
కునికిఁగనిముక్తుఁడందురు
జనులెంతయునతనిఁబ్రీతిసాకుదురవనిన్॥ ౨౧౯

క॥ నీచులలోచనములకున్
దోఁచుటతద్దోషమలినదూషితమైమున్
దోఁచెనుసీలాంగంబని
దాఁచునుహరిమూర్తిలోనఁదాదాత్మ్యమునన్ ॥ ౨౨౦

క॥ తెలియక తెలియఁగఁజాలెనను
దెలియందితరంబుతనువు తెలియక యున్నన్
తెలియునుడ త్త్వముబ్రహ్మము
గలియునుగురుపాదతీర్థకలశన్ విప్రా ॥ ౨౨౧

క॥ పట్టుదలమానిపారినడ
గుట్టుగభజియించి తెలిసికొనఁదగుఁగదమె
ప్పట్టునసైననుడ త్త్వము
పట్టినగురుమూర్తిపదముఁబొయక విప్రా ॥ ౨౨౨

గీ॥ బ్రదికియుండియుఁజచ్చినపగిదినుండు
నిస్పృహుండైనయోగిసందేహమెడల
బ్రహ్మతాదాత్మ్యబుద్ధిసక్రమముగాఁగఁ
బలుకుభావించుఁజేయుసర్వత్రనొకట
యత్న మేలేదువానిమాహాత్మ్య మేమొ ॥ ౨౨౩

క॥ ధారుణి గురువిడిచిననరు
నారాయణుఁడేనిఁబోషణమొనర్పఁడుసూ
నీరమువిడిచిననీరజ
మారవిశోషించుఁగదదయారహితుండై ॥ ౨౨౪

క॥ సిద్ధికినిర్వచనంబది
బుద్ధింజర్చింపఁ దెలియఁబోలునె యొందున్
సిద్ధంగనిద్వంద్వంబుల
బుద్ధిందలఁపకతత్త్వమానగనుండన్ ॥ ౨౨౫

క॥ నానాత్వమందు నైక్యము
గానక గ్రంథంబులందుఁ గలుగు నుజ్ఞానం
బనియెడ వారిని యెదవది
జ్ఞానింగని శాంతిగాంచిక ని యెదవవలెన్ ॥ ౨౨౬

క॥ ధైర్యంబున ననిఁ జేసెడు
కార్యంబులు గ్రంథములఁ గనుటా విరుటా
దుర్యోజనలన్ మనుటా
వీర్యము గనుఁగొనుటగాక వీరులవడమున్ ॥ ౨౨౭

క॥ అర్థింపని వ్యర్థులనున
మర్థింపుచు వారి వెంట మాటికిఁ దిరుగన్
స్వార్థము నెఱవేరదటుప
రార్థమునన్ లేదిఁక పరమార్థ మెటులనో ॥ ౨౨౮

క॥ పులితన్ను భ్రమింగ రాఁగా
వలదిది ఘోరాఘము నెదు బ్రాహ్మణుభంగిన్
దులువలు నీసుస్థితిఁ గని
విలపింతురుగా దెనీకు వెజ్జీయుటుంచున్ ॥ ౨౨౯

క॥ ప్రవిమలమతి గురుపదమే
యవధారణఁ జేయుచుండిక నైనను వెలచే
నవయావనమంత యుఁజనె
భవతారక మగుక వన [illegible] ॥ ౨౩౦

క॥ వనితయొ? కవిత? యటంచుర్
మనమునసంశయమువలదుమహిసంసారం
బును జెంతురుకులకాంతలు
ఘనబోధంబిచ్చువనితకవితయెబాలా ॥ ౧౩౧

క॥ వనితాజనములకలిమినిఁ
దనుతాపమువాయురామతత్త్వముదెలియుర్
వనవాసంబీక్రియనా
కనుకూలంబగునెయనకుమారామమునర్ ॥ ౧౩౨

క॥ ఘనులుండురుమునులుందురు
వనమందిరమందులక్ష్మివసియించునురా
తనుతాపమతనుతాపం
బునుబోవునువారిసేవపుణ్యముబాలా ॥ ౧౩౩

క॥ వనమేజీవనమగునీ
వనుకూలతనుండుమచటనారామంబే
ఘనసంసారంబగురా
మునులందఱుభక్తకోటిముదమగుబాలా ॥ ౧౩౪

క॥ రాకేందువదనదరికిఁ
రాకుండగమ్రొక్కుచుండురాజీవాక్షుర్
లేకుండుబాధదానర్
జేకొనుకైవల్యమింకసిద్ధముబాలా ॥ ౧౩౫

క॥ ఇల్లద్దెకిచ్చితివి నీ
యుల్లాలాపరుగులిడుచు హితమతినీవీ
యిల్లాలినింటియయ్యను
నెల్లప్పుడుఁగొల్వశాంతి హెచ్చును విప్రా॥ ౨౩౬

ఆ. వె॥ ఆత్మశాంతికిఁగొఱఁగానియల్పబుద్ధి
చేతఁద్రిప్పంగఁబడెడుదుశ్శీలురకట
మోహవారిధిఁగ్రుంకిత మోభివృద్ధి
చేయుచుందురుతమదుష్టచేష్టితముల॥ ౨౩౭

క॥ ఆత్మత్రయపోషణమది
స్వాత్మత్రయతోషణమున నలయక యేధ
న్యాత్ములు చేసెదరఁటదు
ష్టాత్ములక వ్వారిచరితలారయవశమే॥ ౨౩౮

క॥ మరణస్మరణమ్మునగురు
చరణమ్ముల వెదకికొనునుశరణంబనిసం
సరణంబుదాఁటుశ్రీపతి
కరుణగుసుబోధమహిమఁగాంచునువిప్రా॥ ౨౩౯

క॥ అనుభవము లేనినరులకు
ననుమానము హెచ్చుహెచ్చునభిమానంబున్
గనువారినెల్లవాదం
బునకీడ్చుటవారినైజముగదధరిత్రిన్॥ ౨౪౦

క॥ తెలియుమినితరుల నెంచుట
వలదుగ జ్ఞానస్వానుభూతిఁ బడసినవారి
స్నేహముఁ గోరఁగ పరవాద
ములు దాల్చిరుమానముఁ గ్రబోధి ప్రవరా ॥ ౨౪౧

తే. గీ॥ దుష్టసంగతిదగ దెంతశిష్టుఁడైనఁ
గుండ రాతినిదగులఁ బగులునుగాని
రాయికుండకు నాశ్రయమీయఁ దాన
లొంగిపోవును వే మేలభంగమూను ॥ ౨౪౨

గీ॥ ఇతరజనయోగమెవ్వఁడఁ బతితుఁ జేయుఁ
జేయునాత్మీయజనయోగమేయనఘుని
బాగునోగు లేమ పదసద్యోగకలనఁ
దెలియమెట్టెట్టులో పల్కెఁ జెముడు పకడ ॥ ౨౪౩

క॥ కానన్ నీకుఁ బ్రమానముఁ
బూనుము సద్గురుని పాదపూజలఁ బనిగాఁ
బూనుము యోగములోనన్
బూనుము జ్ఞానంపుముద్రఁ బూర్ణతగలుగున్ ॥ ౨౪౪

క॥ నమ్మినబుధాళికిఁ గురుప
దమ్ములుదమ్ములగు శివపదమ్ములగును ద్వం
ద్వమ్ములగునుఁ గవితకుసుప
దమ్ములనుపదేశవిధిపదమ్ములు వత్సా ॥ ౨౪౫

క॥ ధ్యేయముసదుపాయమున
ద్గేయంబభిమానహరముక్తిప్రదమున్
గాయత్రీమంత్రార్థం
బేయుగుఁబరమార్థదంబుహితకరముగదా ॥ ౧౪౬

క॥ తాలేనని తెలియుటచే
మేలేమియులేదుగాని మిథ్యాజ్ఞానం
బీలీలనాశ్రయింతురు
కాలోచితలౌక్యకర్మకాంక్షసమూహముల్ ॥ ౧౪౭

క॥ మనమెపుడుశాంతినుండున్
మనసువుడేగొల్వఁగలముమోక్షప్రదముల్
మనఁగలముమాధవాకృతి
మనమదిశాంతించుస్మరణమాత్రనఁగాదే ॥ ౧౪౮

క॥ ఒక్కటిరెండనుగనుండున్
ఒక్కఁగనారెండునొకట సామ్యమునొందున్
నిక్కంబొక్కండయ్యున్
దక్కనజీవులకుభేదదర్శనమొసఁగున్ ॥ ౧౪౯

గీ॥ పుట్టినపుడెచావుమొదలు పెట్టుచునితి
జన్మకర్మంబుఁబెంపఁడు సాధువంచుఁ
దాళిఫలముచెట్టువిడిచిధరణిఁగూలు
నంతదనుకనుబడుచుండుసంతతంబు

జననిగర్భంబునందుండిజారునరుని
జన్మమాదిగమరణంబుజరుగునట్లు ॥ ౨౫౦

క॥ ఉరగంబునకిలబల్కర
మరయఁగనిజవిషముపరులనదియేచంపున్
బరధర్మాచరణంబటు
నరులకువిషతుల్యమగుటనచ్చపుమునికిన్ ॥ ౨౫౧

క॥ ముక్తునకద్దియులేదఁట
యుక్తులనూహించువారికుండునెజీవ
న్ముక్తియువిదేహముక్తియు
యుక్తుండౌకొంటెఁదెలియునొకటిగవిప్రా॥ ౨౫౨

క॥ మనమునవరిషడ్వర్గము
లనయముజనియింపకుండునట్లుఁజేయన్
మనుజులయెడశమనుగాదది
మనమిటునటుఁజెదరనీఁకుమహనీయతకై ॥ ౨౫౩

క॥ సంకల్పపంకజాతక
ళంకుఁడుజీవుండుకర్మలాంఛనుఁడంత్రి
శ్శంకోపార్జితదేహుఁడు
వేంకటపతిసర్వమనుచువిశ్వముమఱచున్ ॥ ౨౫౪

క॥ అంతయుమిథ్యయగు నవ
స్థాంతరమున దానికొఱకహోవాదమునీ
వెంతయు నభిమానంబున
భ్రాంతిన్ బెంచెదవు విప్రబద్ధకమెందున్॥ ౧౫౫

క॥ జగదాత్ముఁడు శ్రీరాముం
డగుటఁగదా ధన్యులయ్యె నాత్మాలంబుం
డగురాముని నిష్కారణ
ముగఁగొలుతురు దేహమాత్మమునుదగులుగతిన్॥ ౧౫౬

క॥ వేతనమునకై భృత్యులు
ఖ్యాతికిఁగలవారు డబ్బుకై నిరుపేదల్
భీతినిఁగ్రూరులుస్వాత్మ
ప్రీతిగధీరులును నీతిఁ బెంచెదరిలలోన్॥ ౧౫౭

ఆ. వె॥ తేలిపోవుచుండుదీర్ఘంబుపైఁగాష్ఠ
మదిప్రవాహవేగమందినట్టు
లాత్మసహజమైనయానందమయ్యెయో
మూర్ఖతతికివిషయములనుబొందు॥ ౧౫౮

ఆ. వె॥ చేయఁగోరుదానిఁజేసినదానినిఁ
గూర్చిచింతయాత్మకుదురుచెఱచు
నాచరించుకర్మమానందమేయిచ్చుఁ
గవులుబ్రహ్మమరయఁగర్మమంద్రు॥ ౧౫౯

క॥ చేసినదానికిఫలముల
నాసింపమినిముసమైననాలోచింపం
గాసాగమిభావికినా
దాసీన్యముప్రకృతకృతిని ధన్యునిఁ జేయున్ ॥ ౨౬౦

క॥ చూచుటమానుట వెనుకకుఁ
జూచుటసర్వంబునాత్మఁజూచుటయటుపై
వేచుట హరిపదమునమన
మూఁచుట సర్వంబుమఱచియుండుటయెటులో ॥ ౨౬౧

క॥ గురుమిత్రరుచిని దెల్పఁగఁ
బరమార్థమరందమునఁగభక్తాళికి మో
క్షరమానిలయంబగుటకు
నరవిందంబయ్యెసహృదయహృదయమారా ॥ ౨౬౨

క॥ గురుమిత్రచరణసేవా
చరణాతురశిష్యహృదయజలజమువిచ్చున్
బరమార్థైకపరాయణ
వరభక్తాళియమృతంబుఁబడయుచుమెచ్చున్ ॥ ౨౬౩

ఉ॥ దేహివసించుదేహమునదీనునిభంగిఁగృశించునంతలో
నూహాజనించుసద్గురునినుత్తముఁగొల్వఁదదీయబోధచే
నీహానశించుయోగమున నెంతయుశాంతివహించుభక్తితో
శ్రీహరినెంచుమించుభవసింధువువేగఁదరించురాముఁడై

ఉ॥ కోరిభజించుసాధులకుఁగోవిదులుజ్వలపూర్ణతత్త్వమున్
సారపువాక్కులందెలిపిశాశ్వతసౌఖ్యమునిచ్చిప్రోచుచున్
భారముఁజేరునంతకునపారకృపాకరదృష్టిచేసహా
ప్రారమునందునిల్పఁగలరాప్తులసాటియెవండుధారుణిన్ ॥

క॥ హారిహరులసఖ్యమరయఁగఁ
బరమోత్కృష్టంబునిజముబ్రహ్మానుములువా
రియువురయినఁదచ్చరితలు
పరమాద్భుతభేదభంగిఁబరగుంగాదే ॥ ౨౬౬

క॥ గుణములుగణములుసేవక
గణములురూపములుకృతులుగాథలుశక్తుల్
గణుతించిభేదమైక్యముఁ
బ్రణుతింతున్న్వాత్మధర్మపరతన్ విప్రా ॥ ౨౬౭

ఆ. వె॥ తెలిసినట్టిఁడేనుదెలియుఁడువీఁడన్న
తెలివితెలివియగునెద్విజవరేణ్య
బ్రహ్మమయముజగముభ్రాంతియావైకుంఠ
పాళియందుఁబెద్దపామువోలె ॥ ౨౬౮

—: పరమబోధ :—

క॥ దుర్జయమగుదృశ్యమునువి
సర్జింపన్బోధఁజేసె సారథిగాఁదా
నర్జునునకుశ్రీకృష్ణుఁడు
ఘూర్జాలముకౌష్ఠమట్లుమఱచినభంగిన్ ॥ ౨౬౯

క॥ మఱచినదానినిజస్థితిఁ
దఱచుతఱుచుఁగాంచఁదానుదక్షజ్ఞులబోధల్
కఱచుచుఁగాష్ఠాకృతితోఁ
దెఱమనుజ్ఞానవయనముపదేశంబిదియే ॥ ౨౨౦

క॥ అమనస్కమనఁగ పనమది
విమలమగుటవడినిమలమువిడుదిగఁబడకుణ్
క్రమమెఱుఁగమిలేకుంటని
కుమతులువచియింతురదియుఁగూడునెవిప్రా ॥ ౨౨౧

క॥ తలఁపులకడమీయకలోఁ
పలిదిక్కుప్రబలుతపసిబయలుపడెడుచోఁ
నడువకదుమికెడుమృగముటు
కడువేగంగడచిపూర్వగతిశాంతించున్ ॥ ౨౨౨

గీ॥ స్వస్వరూపానుసంధానసరణిజగము
నీకు నాకనులోకులకేకరీతి
స్వగతిస్వస్థితిద్వంద్వంబుబ్రహ్మమొకఁడ
యాత్మయోగమ్మునందునోమ్మందువిందు ॥ ౨౨౩

క॥ తెలియమితెలియుట తెలియఁగ
వలచుట తెలివాత్మదనుచు వైరాగ్యమునన్
నిలుచుట యాత్మగభవమునఁ
బడియుం బడకుంటకిదియుపాయమువిప్రా ॥ ౨౨౪

క॥ అనుభోగ్యసుచుజీవుఁడుండఁగఁ
దనమార్గముతానుబట్టు దైవము భళిరే
కనికపరపు రెంటినాత్ముఁడు
తనకన్యంబొందులేమిఁ దాదాత్మ్యమునన్ ॥ ౨౭౫

క॥ చింతయు నిశ్చింతయుని
శ్చింతగ నేకలుగుచుంట చేనా రెంటన్
నంతయు స్వాతంత్ర్యము లే
దంతయుఁబరమేశ్వరేచ్ఛనగుటన్ విప్రా ॥ ౨౭౬

క॥ కృతకృత్యుఁడుండుఁగా ప్రా
కృతినిర్వృతినొందుచుండుఁ గేవలమాత్మ
స్థితినుండునెందుఁగనఁడుత
దితరము నిరుపాధికుఁడయి యిలఁ గలిగినన్ ॥ ౨౭౭

ఆ. వె॥ కట్టెగృహముత్వష్ట కట్టెగృహస్థునా
వార్తపుట్టినట్లు వసుధలోనఁ
జేయుజీవుఁడంచుఁ జేయునీశ్వరుఁడంచు
వార్త తెలిసిమెలఁగవలయు బుధుఁడు ॥ ౨౭౮

క॥ ఈపద్యములాలించినఁ
బాపముశమియించు జన్మభరముహరించున్
బ్రాపగుహరిచరణంబునఁ
బ్రాపించున్ భక్తిముక్తిభాగ్యముమించున్ ॥ ౨౭౯

క॥ విని శారదాంబ నివ్వెధి
వినుతించెఁ బరమశాంతి విప్రుండమ్మా
విని తనకై జనియించిన
దని పరమేశ్వరునికరుణయనిసర్వంబుల్ ॥ ౨౫౦

—:అన్నంభట్టు శారదాంబనుస్తుతించుట:—

శ్లో॥ శ్రీదేవీంతాం మమహృదిపరాం భావయేబ్రహ్మనిష్ఠామ్
సర్వార్థానాంసరసవచసాంసాధులోకస్యదాత్రీమ్
మిత్రాకారాంనిబిడతమసోయోగినీంహంసవేద్యా౯
నిత్యగ్రాహ్యాం గురుకరుణయాపద్మనేత్రాంపవిత్రామ్॥

దండకము:—శ్రీమానినీపాద సేవారతి౯ సాధుసత్సంగతి౯ బుద్ధి
శ్రీభారతి౯ నిన్నుభావించెదర౯, సక్తిసేవించెదర౯
భక్తిఁగావించెదర౯ నీదుసంకీర్తనల్ సాధుభక్తుండనై
శక్తియుక్తుండనై పాపముక్తుండనై సిద్ధనారీశ్వరీ
భక్తలోకేశ్వరీ యోగిసద్గమ్య మజ్ఞానవిచ్ఛేదకంబా
ర్తిసంహారకంబైనతత్త్వార్తి నానందవార్ధిందగన్నిల్ప
నీకుందగుఁదల్లి సద్ధేమవల్లీ సుయోషిన్మతల్లీ నమస్తే
నమస్తే నమస్తే నమః ౨౫౨

క॥ నీయండనుండుభక్తుఁడ
జేయుండై సేవకులకుఁజేయండై స
ద్ధేయుండై సిద్ధుండై
చేయుండై హితముగవాంఛ సేయుఁడుజననీ ॥ ౨౫౩

క॥ తల్లీ కవిజనకల్పక
వల్లీసాధ్వీమతల్లి పరమపురుషమహోత్
ఫుల్లారవిందమందిర
తల్లక్షణలక్ష్మితాత్మ ధర్మశుభాంగీ ॥ ౨౮౪

క॥ జీవేశ్వరైక్యమబ్బఁగ
భావాతీతాత్మవయ్యు భక్తులకొఱకై
యీవిధిజనియించుటరయ
నీవేముక్త్యంగనవుగ నిజముదితల్లీ ॥ ౨౮౫

క॥ ముట్టితిఁ గైవల్యంబిటు
పుట్టితివేఁకొక్కమాఱుపురుషోత్తముఁడై
పట్టుగనిల్చెనునాయెడ
నుట్టిపడన్ రసములెల్లనుత్తమఘనతిన్ ॥ ౨౮౬

క॥ వందనమొనరించెదనీ
కుందనయుఁడనగుట భక్తకోటులతో నా
నందంబుననన సించుము
సుందరపదములనుఁజూపుచున్ జగదంబి ॥ ౨౮౭

ఉ॥ కోరితపంబుఁజేయనసుకూలపువృత్తినినున్న నిన్ను నే
నారయనెంతవాఁడఁ బరమాత్మ నీదగుదృష్టినాపయిన్
బాఱఁగసర్వపాపములఁబాయఁగఁదోలితిఁబూర్వపుణ్యవి
స్తారముసన్ భవదీయపదసారసముఁగ్రోలిభవాబ్ధిదాఁటుఁగాఁ
భారముఁగంటిఁగంటి శివపాదముఁదొంటిఫలంబునమ్మరో ॥

ఉ॥ నమ్మినపుణ్యపూరుషులు నాశము లేనిపదంబున న్నివా
సమ్ము ఘటింప సర్వమున సారముగా మది నెంచిమించి స
త్యమ్ము స్మరింపుచున్ బరసుధాబ్ధి కవృత్తిఁ జరించుచుండ్రి రే
షమ్ములు వాలె సంతతము భక్తులు గొల్తురు నీపదాబ్జముల్ ॥

క॥ సర్వముఁ దెలిసితి ననినే
గర్వితమతిఁ దొల్లి కన్నుఁగానక తిరుగన్
బూర్వంపుఁ బుణ్యవశమున
నిర్వాణంబొసఁగినావు నీవై కరుణన్ ॥ ౨౯౦

క॥ పొగరెక్కిన దుర్జనములు
నగుదురు నీపదభజనంబునఁ దగులన్
నగరెక్కినవాలు కరున్
దగునా సొగసైన పప్పుదప్పు శిరమున్ ॥ ౨౯౧

క॥ కంటిన్ నీకృపమూఁటిని
గంటిన్ రెంటిన్ గడవఁగఁ గంటిన్ మూర్గం
బంటిన్ నీనామముచే
గొంటిన్ గైవల్యపదముకుడుసుగఁ దప్పీ ॥ ౨౯౨

ఉ॥ కాలము వ్యర్థపుచ్చుట యకారణవైరము దుష్టవాసనా
జాలమునం దగుల్కొనుట చంచలభావము రిక్తవాంఛలున్
జాలని నాఁటిభాగ్యమది చాలు నినీపదపద్మసార సే
గ్రోలెడు భాగ్యమిమ్ము సిరులుంగొన నొల్లను నీ మనమున నాసక్తరూపమున్

క॥ జీవేశ్వరైక్యమీాయఁగ
నీవేగదదివ్యశక్తినిజముగనన్నుం
గావుముయుష్మత్పదరా
జీవములేసుమ్మునాకుజీవనమంబా ॥ ౨౯౪

క॥ జపవిధివిధివిద్యలగుచు
కృపసంపాదించినీవుకేలూఁతయిడఁగ
నెపమొకటిగలుగదేశము
చపలుఁడనైయింకఁదిరుఁగఁజాలనుదల్లీ ॥ ౨౯౫

క॥ ఓమ్మనియెదఁదవదాసో
హమ్మనెదసతతసమాధిసోహమ్మనెదఁ
హుమ్మనెదబంభరమనై
కమ్మనితేనియలఁగ్రోలఁగఁగుసుసూక్తిఁ ॥ ౨౯౬

క॥ తఱచుగభవాబ్ధి దరిచితి
వెఱచితిబడబాగ్నిఁజూచివిజ్ఞతకైవే
పఱచితిసద్బోధలచే
మఱచితిసర్వంబునిన్నుమాత్రముమఱవన్ ॥ ౨౯౭

క॥ కీర్తింపఁగలనెనీస
ద్వర్తనములఁగల్గుమహిమవైరాగ్యంబుం
మూర్తీభవించెవాకని
చేర్తుంగాకెదనుజ్ఞానసిద్ధికిదేవీ ॥ ౨౯౮

క॥ సన్నిధియేబలమందురు
విన్నపమేనొకఁడొనర్తువినఁదలఁచినచోఁ
గన్నమ్మాకన్నిమ్మా
సన్నిధినిన్ నిలిచితపముసల్పెదఁజుమ్మా ॥ ౨౯౯

క॥ గంగాయమునావాణీ
సంగంబునజలకమాడిసద్గురుమూర్తిన్
సంగముఁబాయుటకై యు
ప్పొంగుచునేఁగొల్చుచుంటపుణ్యముగాదే ॥ ౩౦౦

క॥ తనవారనిపెఱవారని
మనమునఁదలపోయరాదుమనవారైనన్
మనసిచ్చిమాటలాడుట
యనుకూలవృత్తినుంటయదిసౌఖ్యంబౌ ॥ ౩౦౧

క॥ నినుఁజేసెనుమముఁజేసెను
గనుఁగొననొకదేవుఁడన్నజ్ఞానంబున్నన్
మనలందఱనొక్కఁడనిటు
గనిముదముంగాంచువాఁడుగాఁడేవాఁడే ॥ ౩౦౨

క॥ కథలంజెప్పుచుబాలుర
నథముఁజేసెదరుతల్లి యాంధ్యాత్మోక్తుల్
బుధసేవాపరతంత్రుల
కధికారముకొలఁదిధరణి నబ్బెడివిగదా ॥ ౩౦౩

క॥ వినుతించిప్రణవబీజం
బునునిరుగని మోదమందియు క్తిపదంబుల్
గనిభక్తకోటి గొల్వఁగ
ననుకూలతబ్రహ్మవిద్యుఁడ నై విహరింతుల్ ॥ 304

క॥ నీసన్నిధినివసించిన
వాసననశియించునరుఁడు వైరాగ్యమునన్
జేసినతపముఫలించును
దాసీనుండౌనుభక్తుఁడౌ ముక్తుండౌ ॥ 305

క॥ నీసన్నిధిఁ గల్పింపుము
నీసత్వముచేతఁ దెలుపునీతత్త్వంబుల్
నీసరినీవుచుసద్గురు
కేసరిమిమ్మిరువురనెదఁగీర్తింతుసదా ॥ 306

క॥ పన్నవనందనవనసమా
విన్నపమేనొకఁడొనర్తువినఁదలఁచినచో
నిన్నే నమ్మినగురువు
ద్రున్న నుదీవింపుమమ్మరోనిత్యమ్ముల్ ॥ 307

క॥ తల్లీనీమృదుపదముల
నుల్లంబుననిల్పిభక్తుఁడుత్సాహమునన్
గల్లజగంబులఁగానక
మెల్లనద్వంద్వంబుమించు మేలుంగాంచుల్ ॥ 308

క॥ వర్ణింపలేమినాలుక
పూర్ణంబగుతత్త్వముఁదెలుపుభవద్వాణిన్
గర్ణరసాయనమంచుభ
వార్ణవమున్దాఁటునాథులర్థింత్రుసదా ॥ ౨౯౯

క॥ ఐనన్కీర్తనఁజేయఁగఁ
బూనితినాయందుఁగరుణఁబూనుమునాచే
నైనన్గాకున్ననునీ
వైనంగృపఁబల్కనీయవాజగదంబా ॥ ౩౦౦

క॥ తనబాధఁదొలఁగఁజేయఁగఁ
దనయుఁడనన్భక్తికలదుతల్లినిసేవిం
పనుగాదుకాదుకాదది
మనమెఱుఁగనిదొంగతనముమహిలోఁగలదే ॥ ౩౦౧

క॥ అవశంబైమనముండఁగ
శివశివతనకొఱకయనఁగఁజెల్లునెలేదా
శివపరమేయనిదబ్బరఁ
దవిలివచింపంగనగునెదాసునిభక్తిన్ ॥ ౩౦౨

క॥ వేదాంతముయోగంబున్
వాదములన్వేఱువేఱుభక్తుండైసీ
పాదద్వంద్వంబేయనుఁ
గాదేసేవాఫలంబుగాదెమదంబా ॥ ౩౦౩

క॥ అంతయుమిథ్యయయనువా
కొంతవచించినబద్ధమేయగుఁగల్లలో
వింతయుబద్ధముమెఱుఁగుమ
నంతయుశూన్యముసమాధియందుననంబా ॥ ౩౧౪

క॥ దుర్మార్గుఁడనేననినా
మర్మముఁదెలుపంగవినియుమాతల్లీనా
కర్మఫలంబెట్టిదోకద
ధర్మంబెఱిఁగించితివనుధన్యునిఁజేయన్ ॥ ౩౧౫

క॥ కొంచెన్ జేసినపుణ్యం
బుంటన్ గుణముఖులనెపుడునూహలచేతన్
బంటయునినెంచుచున్ని
ష్కంటకమైనట్టిపథముఁగాంచుటజననీ ॥ ౩౧౬

ఆ. వె॥ పెక్కుబంధములునుబొక్కులుచిక్కులు
వలనుబోలుసృష్టివలచునెఱఁడు
పురుగువోలెనొకటఁబురుషోత్తమునిస్మరి
యించుచుందుభవముఁద్రుంచుచుందు ॥ ౩౧౭

క॥ శక్తికిసృష్టించెదుచో
శక్తియెలేకుండెభక్తిసారముఁగోలన్
ముక్తంబైయాసారము
సక్తిన్ శ్రీశారదాంబసరణిజనించెన్ ॥ ౩౧౮

క॥ కోటికినైనన్ గోదవే
నాఁటికి లేదమ్మ నిన్ను నమ్మిన కతనన్
మాటికిఁ దత్త్వముఁ దెలుపఁగ
నా కేల నీబోధ హృదయనళినము బోఁటీ ॥ 3౧౯

ఉ॥ శ్రీమాత్రాకృతి బ్రహ్మవిద్యసిరులన్ ప్రేమంబునన్ మాఁకుసీ
భామారత్నము శారదాంబ సృజియింపం బద్ధదంచంతరా
రామానీకము మెచ్చుచుండ వినిస్వర్గాదిభ్రమల్ లేమి శ్రీ
రామారాధనదీక్షఁ గాంచి శివముల్ ప్రార్థించి సేవించెదన్ ॥

క॥ వినుతించి శారదాంబన్
మునిసన్నిధి కేఁగి యోగిముఖ్యులు గొలువన్
గనకాంబరు తత్త్వము ప్రజ
కనుపుగ బోధించు హంసనతులితభక్తిన్ ॥ 3౨౧

క॥ కనియన్నంభట్టారకుఁ
డని మెచుప భవాగ్రప్రీతి నానానసఁగా
మునికృప నానందపురం
బున మాకండలకుఁ గుశలముగ దాయనుచున్ ॥ 3౨౨

— పరమహంస నన్నంభట్టు స్తుతియించుట —

శ్లో॥ అచ్యుతానంద యోగీశమ్ దేశికేశం మునీశ్వరమ్ ।
త్రికూటవాసినం వందే భక్తాభీష్టప్రదాయకమ్ ॥ 3౨3

శ్లో॥ శాంతిస్సదాయస్యకృపాకటాక్షాత్
జ్ఞానంచమేయస్యవచోఽమృతత్వాత్
ముక్తిస్తుయద్దర్శనమాత్రలాభాత్
తస్మైగతింసద్గురుమాశ్రయేఽహమ్ ॥ ౩_౨౪

శ్లో॥ జానేనజానేపరమార్థసారమ్
జానేనదానేకిమపిప్రవీణః
జానేఽభిమానేఽహమహోనిమగ్న
స్థానేఽసమానేత్వయిభక్తిరస్తు॥ ౩_౨౫

శ్లో॥ మాతాపితాసర్వకళాసునేతా
దాతామహాత్మాబుధసేవితాత్మా
యోమేఽభవత్తారకమంత్రమూర్తిః
వందేముకుందప్రియభక్తమార్యమ్ ॥ ౩_౨౬

శ్లో॥ వాణీంగిరీశంవనజాతనేత్రమ్
బృందారకారాధితపాదపద్మమ్
వందేగణేశంభవవిఘ్ననాశమ్
సందేహవిచ్ఛేదకదక్షమాప్తమ్ ॥ ౩_౨౭

శ్లో॥ ధర్మార్థకామాన్విపరీతదృష్ట్యా
సంత్యజ్యముహ్యంతివిముక్తిలోభాత్
లోకేబుధాస్తారకమాత్మనిష్ఠమ్
జానంతిభక్తాఃపరమార్థదృష్ట్యా ॥ ౩_౨౮

శ్లో॥ సంగంపరిత్యజ్యగురూక్తమంత్రమ్
నిత్యంస్మరన్నస్మిముకుందమాద్యమ్
మౌనంసమాశ్రిత్యగురుప్రసాదాత్
ప్రాప్తస్సదాశంపదమాత్మనిష్ఠమ్॥ 3౨౯

శ్లో॥ చిన్ముద్రయాభద్రముపార్జయత్వమ్
మౌనీభవస్వాత్మనివేదనార్థమ్
ఇత్యేవయోబోధయతీశ్వరేశః
సఃపాతునిత్యంశరణార్థినస్సః॥ 330

శ్లో॥ దేశికేశమహానందే
రమ్యంరాజాంఘ్రిభాసమృతమ్
పిబంతంయోగిభిర్జ్ఞేయమ్
జ్ఞానముద్రాంకితంసదా॥ 33౧

శ్లో॥ భవసాగరతరణేమమ
భవతుసునోవృత్తిరభవభవావ్యాపిమలా
శివచరణధ్యానపరా
శివరామబ్రహ్మతత్త్వసిద్ధిసమగ్రా॥ 33౨

శ్లో॥ లోకానపిసకలాన
స్త్రీకానందాన్ కురుష్వసుజనానస్మాన్
స్వీకృతభక్తాన్ యుక్తాన్
శ్రీకరశాంతించదేహిశివకైవల్యమ్॥ 333

క॥ శ్రీశంకరరూపముభవ
నాశంకరమభయదంబునానాకరముఁ
బాశుపతంబనపాయిని
కేశవనుతమగుప్రణవముఁగీర్తింతుసదా ॥ 334

క॥ సీస్తోత్రపఠనమయ్యది
యస్తోకానందదంబహర్నిశముఁ వి
శ్వస్తుత్యభక్తకోటికి
వస్తుజ్ఞానంబునిచ్చువైరాగ్యంబుఁ ॥ 335

క॥ మూర్తిత్రయరూపముస
త్కీర్తిప్రదమార్తిహారముదివ్యమనఘముఁ
మార్తాండకోటి తేజ
స్స్ఫూర్తిఁ దనరారుమూర్తిబుద్ధిఁ జేర్తుఁ ॥ 336

క॥ జగములునిజలీలం జే
యఁగఁ బెంపఁగసంహరింపనౌటజలధినిం
బగయోగనిద్రఁగనిమెడు
ఖగవాహనుఁడిచ్చుమనకుఁగల్యాణంబుల్ ॥ 337

క॥ ఆస్తికులమగుటనీదుప్ర
శస్తంబగుబోధకతనసద్గురుమూర్తీ
స్వస్తిమెయెూకెపుడుభవదు
పాస్తిఁ బ్రహ్మానుభూతిభగవత్ప్రీతిఁ ॥ 338

క॥ గురుమూర్తిబుణముదీర్పఁగఁ
దరమానావంటితుచ్ఛతమునకునతఁడే
కరుణించిముక్తుఁజేయుర్
స్థిరకల్యాణంబుమాకుసిద్ధించుఁగదా॥ ౩౩౯

క॥ శంకరచరితననుమనుప
శంకలడఁపబోధమెపుడుజపియింపంగా
నోంకారమంత్రమిాగురు
వేంకటపతిమమ్ముఁబ్రోచు వేడుకఁగూర్చ్ర్॥ ౩౪౦

క॥ వరదుఁడునాగాభరణుఁడు
పరమాప్తుఁడుయోగినుతుఁడుబ్రహ్మాంబచలా
కరుఁడునుబిల్వప్రియుఁడగు
తిరుమలహరిహరుఁడుమమ్ముఁదీరముఁజేర్చుర్॥ ౩౪౧

సీ॥ భాషాబ్ధినిలమహాభాష్యనౌకనమర్చి
శిష్యులదాఁటించుశేషమూర్తి
నిర్వాణనాథుండుసర్వజ్ఞుఁడగుటస
న్మంత్రోపదేశానమంత్రమూర్తి
శ్రీరామభక్తుండుశ్రితజనపోషణ
నచ్యుతారాధననచ్యుతుండు
వేదవిహితధర్మవేదాంతవేద్యుఁడా
నపవర్గమార్గంబుకృపనొఁజూప

స్వాతంత్ర్యమున నొప్పుసర్వతంత్రములందు
నుపకారబుద్ధిని సుమతుఁబలెయు॥

గీ॥ ఇట్టిసద్గురుపాదంబుఁబట్టినట్టి
పుట్టులేనిఘనునిపట్టిపట్టుపట్టి
యుట్టిపడనవరసముల్పుముచితభణితిఁ
బల్కునాలించిపాలింపుపద్మనాభ ॥ ౩౮౨

గీ॥ పరమభక్తుండుదాసుండుపార్థివుండు
నిన్నుఁగీర్తించుచుంటచేనిర్మలుండు
దనను బాలించుఁగాతనిరంజనవిభుఁ
డార్యనుతగుణవంత యనంతశాంత ॥ ౩౮౩

క॥ వినుతింపముప్వురాశ్రమ
మునఁగలపెద్దలకుమ్రొక్కిముదమునవానం
దనగరికిఁజనిరిశాంతిం
గనియాత్రాఫలమునపుడుగనిశ్రీనాథా ॥ ౩౮౪

గీ॥ దిగువతిరుపతిలోఁగలదేవళములఁ
జేరితద్దేవతాళినర్చించియోజఁ
జనుచుబద్మసరోవరమునన్ముగ్రుంకి
సూర్యనారాయణునిఁగొల్చిసొంపుమీఱ ॥ ౩౮౫

క॥ అంగజజనని సలక్ష్మిల్
మంగాంబల్ భక్తిఁ గొల్చి మాధవ! వారా
డంగ పిలత్తీర్థమునఁ జని
గంగాధరుఁ బూజ చేసి కదలిరి పిదపన్ ॥ ౩౮౧

—: శ్రీకాళహస్తియాత్ర :—

ఆ. వె॥ అధ్వమందుఁ గాళహస్తిని నాదిదం
పతులఁ గాంచ్రఁ గుంకి స్వర్ణముఖిని
భక్తి పల్లవింప భట్టువో గడెనిట్లు
నాత్మ దీక్ష గరిమనుంకుఁ జేసి ॥ ౩౮౨

శ్లో॥ మనసిజకుసుమాస్త్రాత్ మానినీదృష్టిపాతాత్
పశుగృహధనదారాపత్యసంసర్గదోషాత్
పరశివగురుసేవాప్రాప్తవిద్యాభిమానాత్
పటుతరభవపాశాత్ పాతునః పార్వతీశః ॥ ౩౮౩

శా॥ మున్నా కన్నఁడు పండితుండె కవియే పూజావిధానంబు నేఁ
గన్నాఁడే గురుసన్నిధిన్ జడులచీకాకేల చీ! కాకతాఁ
గన్ని చ్చెన్ గురుభక్తి నంచుఁ గృపతోఁ గైవల్యమీయంగ నే
నన్నీయన్ మఱి యేమి సేయఁగలవో నాతండ్రి యూహించితే
జెన్నా ముక్తిని గూడఁ గామమడఁతో శ్రీకాళహస్తీశ్వరా ॥

ఉ॥ నిత్యముసంధ్యలందురమణీయముగాఁగద్రిమూర్తులోక
కృత్యముసేయుచుండరమణీమణిసంతసమందునట్లుగా [టకా
సత్యముసీవుసీపదముసమ్మతిదేవికొసంగఁబూర్ణమా
నృత్యపురంగమీభ్రమరనీరజరంగముచంద్రశేఖరా ॥ 3౫౦

శ్లో॥ సదాత్వత్పాదాంభోరుహయుగళభాభక్తిరమలా
మమాభీష్టంసర్వంజననిసఫలంసత్యమకరోత్
మదోన్మత్తోఽహంతేపదకథముపాసా మమ శివే
సుతత్త్వంహ్యత్రైకోగుణఇతిమహానందభరితః ॥ 3౫౧

క॥ దేవీంధ్యాత్వాకాళీం
ధ్యానాతీతాంచసకలభక్తాభయదామ్
జీవేశ్వరైక్యభావమ్
కైవల్యంభజతికోపిఘనగురుభక్త్యా ॥ 3౫౨

క॥ శిశువులబలెఁజరియించెడు
పశువులకుంబతివెసీకుఁబతిలోకములకా
వశపఱిచెదునీమాయా
వశుఁడైసీయందునిలిచెబలమునబాలా॥ 3౫3

క॥ గంగాధరసంగంబున
గంగయొపార్వతియొసుఖముగాంచెదరౌరా
యంగనలిద్దఱుపోరఁగ
మంగళకరుఁడయ్యెమాకుమాధవుఁడంబా ॥ 3౫౪

క॥ కనిపర్వమంగళయునన్
ఘననామముఁ దాల్చెశక్తిగంగయు వేవే
శశకాంబరుపాదముఁ బ
ట్టినజిత్రము యూఁదువారిధీవిమర్దంబా ॥ ౩౫౫

క॥ హరిహరమూర్తిద్వయముఁ
బరమార్థపుదృష్టిఁ జూడఁ బరమాత్మయయుం
చరసియొకాఁ బోలునటు కు
చరితతెగంగయు భవానిశంకరమూర్తుల్ ॥ ౩౫౬

క॥ ఏపద్యమందునైనన్
నీపదవర్ణనముఁ జేయ నిజముగ నంబా
నీపాదపద్మసారమె
పాపగుఁ గద్యానిఁ గొల్చుభక్తాళికిలన్ ॥ ౩౫౭

క॥ ఆసారమంచుఁ దెలియక
మాసారమటన్న నోటిమాటలు లోఁ చే
వీసముఁదను తెలిపినిసగు
నేసమయంబునకుఁ దోఁచ దెద్దియు బాలా ॥ ౩౫౮

క॥ పలికినదానినిఁ బలుకుచుఁ
బలుకును వేఁయొండుపలుకు భక్తులు వాగడన్
పలుకులు నీపదనీరజ
గళితసుధాధారలగుటఁ గాదే దేవీ ॥ ౩౫౯

క॥ కైలాసంబానిలయము
పాలించెడు వేళ జగము భక్షించెడు నాఁ
గోలాహలముం జేసెడు
వేళన్ నీఁ వెందునుందు వేశివకాళీ ॥ ౩౬౦

క॥ లోకము కొలిమియయనఁగా
లోకమునన్ జీవతతికి లోలతయేలా
తాఁకినఁ దెలియును వేఁడిమి
నీకరుణకు మొఱ్ఱఁబెట్ట నేర్చును దేవీ ॥ ౩౬౧

క॥ పండితుఁడగుఁ బామరుఁడగు
మొండియగునువాఁడెయుత్తముం డగు ధరలోఁ
బండున్ బచ్చిగనుండున్
జండీ నీపన్ను గడల జగములు మెలఁగన్ ॥ ౩౬౨

క॥ స్మరణం బెంతయొనర్చిన
మరణము పర్యంతముండు మఱపుఁ దానిన్
నరుఁడెప్పుడు మఱవక యుహరి
చరణంబులు గొల్చెనేని సద్గతిఁబడయున్ ॥ ౩౬౩

క॥ చారునముంచిన గరిఁటెన్
నారంబుండియును దెలియఁజాలదు గదయి
ధారుణిఁ బెడఁదిరుగు జడుఁడుఁ
దారాముని తత్త్వ మెఱుఁగఁ డరబోయటులే ॥ ౩౬౪

క॥ కరుణాకరశంకరనీ
చరణాబ్జమునజహారిసకలసన్నుతమంబా
భరణముతదీయసేవా
చరణముకరణమువిముక్తిసంపదవడయన్ ॥ ౩౬౫

క॥ బంధునవాగ్ఝరనీపద
బంధమునన్ జక్కఁగొనమిఁబంచితుఁడేరా
యంధత్వముఁగనెమత్తత
నంధతకున్ మూకతయదియాపథమునఁగన్ ॥ ౩౬౬

క॥ పదములుగాంచకమూర్ఖై
పదములుగాంచుటకుఁగనులుబాగుగఁదెలుపన్
ముదముడిగియుంతయున్ ద్వ
త్పదమునఁగనికనెనుబరమపదముమదంబా ॥ ౩౬౭

క॥ దేవీస్తవరాజమువిని
జీవుండిలభయముదక్కిసిద్ధముతుదకున్
నీవాడఁజేరగలఁడో
నీవాఁడభవమువాడనిజముగ సంబా ॥ ౩౬౮

క॥ నీపదహంసకనాదం
బాపట్టికిఁజోలగాఁగహంసంబై తా
రూపరులగువనితలఁగని
చేపట్టుఁడుముక్తికాంతఁజేరెడునేర్పున్ ॥ ౩౬౯

క॥ తనువుఁ దనువుఁ నమ్మఁచు
మనమునఁ జిత్రించు విధుల మనుజుఁడు ధరలోఁ
దనకుం దాఁ దోఁచమిచే
ఘనుఁడగు నీబలము గలుగుకతన మదంబా ॥ ౩౨౦

క॥ అన్నియు సాధనములనఁగఁ
గన్నమ్మా! దేనికన్నఁ గరుణఁ దెలిపె నీ
యున్నది లేకున్నదియును
గొన్నది సున్నయని యాత్మఁ గొల్చెదఁ గొలకే ॥ ౩౨౧

క॥ దెబ్బలు పడుటకు భేదం
బబ్బదు కొట్టుటకు భేదమబ్బదె ధరలో
నబ్బు నెళ మదమములు దా
నబ్బక యైక్యంపుజ్ఞానమది జగదంబా ॥ ౩౨౨

క॥ మూర్తిత్రయముగ తిబుధులు
కీర్తించుట నెపుడు నిన్నుఁ గేవలమూర్త్యా
వర్తము శివశక్త్యాత్మక
మూర్తి నివారకము నయ్యె నంబా శక్తీ ॥ ౩౨౩

క॥ బాలా! లోకముతో నా
కేలా సద్గురుని పదము లేదలోఁ నిలుపఁ
మేలా దేహాంతము చే
లేలెన్ననుకానసములు లేవా మనఁగ ॥ ౩౨౪

క॥ సాంబోక్తరీతిఁగోమరుఁడు
స్త్రీంబగళాయైనమయని యెప్పుడుజపియిం
పంబలముకల్గితారకు
నింబలములతోడఁగూల్చెనీకృపగాదే ॥ ౩౨౫

క॥ అంధుండైలోకంబున
గ్రంథిఁ విడిపించుగురునిఁగానక తానే
గ్రంథంబులసేవించుచు
బంధముకల్పించుకొనునుభళిరేబగళా॥ ౩౨౬

క॥ లోకోపకారమగునఁట
నాకైనే మొఱఁగుచుంటనాప్రీతికినై
నీకొఱకై నీవేయిటు
చేకొనిబల్కుదువనికనిశ్రేయంబుందుర్ ॥ ౩౨౭

క॥ నీవుంచుదేవళంబీ
జీవుండోపద్మనేత్రచిత్సుఖపాత్రా
నీవిమలంబగుమూర్తిని
సేవింపఁగహేతువద్దిసిద్ధులకెదలోకా ॥ ౩౨౮

క॥ చేసినదోసముమఱవం
జేసెదనీకనైనభక్తిఁజేసెదయోగా
భ్యాసముఁజేసెదగురుకృప
నీసన్నిధిజపముసేయనిల్చెదబోలా॥ ౩౨౯

క॥ పదఁగురునొక్కఁడునీమృదు
పదసేవంజేయుచుండభవదీయుండై
పదములమతినిసుఁదేల్చన్
గదయభవుండాత్మబోధఁగైవల్యమునన్ ॥ ౩౯౧

క॥ కనుదమ్మివిచ్చిచూచిన
ఘనశంకరమఘకరముసుఖంబుగసగమ
య్యునుగాంతిగల్గియుండుటఁ
గనిన్ శంకరియయ్యుందుఁగాజ్ఞానాంబా॥ ౩౯౨

క॥ తమమునమునిఁగిననావా
క్యములెట్లుప్రమాణమగునుగలదో లేదో
మమకారబీజమదినీ
విమలంబగుదృష్టిఁజూడవేజ్ఞానాంబ ॥ ౩౯౩

క॥ తపియించెదుననుఁజూచినఁ
గృపరాదాజ్ఞానముద్రకీలెటిఁగింపన్
త్రిపురాసురసంహారిణి
జపియింతున్ నీదుమంత్రజాలముసతమున్ ॥ ౩౯౪

క॥ పలుకుటనవరసములొలుక
నలుకుటదేహంబుభక్తుఁడుత్సాహమునన్
జిలుకుటభవసాగరమున్
గలుగుటబోధంబునీదుకరుణన్ గాదే॥ ౩౯౫

క॥ కన్న న్నమ్మువుమముఁగరుణఁ
గన్న న్నమ్మువునమ్మతిమముఁగాంచుచులోనఁ
విన్న పమాలించుటకై
యున్న న్నమ్మువుచూడనీవతొయికతవయమ్మా ॥ ౩౮౧

చ॥ మదనుసఁగేఁ వనుంబుడిగెమస్గురు సేవలఁబూర్వవాసనల్
వదలెనుశంకరంబగుచుభక్తిజనించెభవాబ్ధిదాఁటఁగా
ముదమునవిన్నుఁగాంచునుముముక్షువునాహృదయాబ్జమం
పదములనేభజించెదనపారకృపాకరదృష్టిఁజూడుమా ॥ [దునీ

క॥ శివ శివశివయనసతతము
సివమెక్కనశిష్టజనులసేవించినచో
శివులగుదురుభువిజీవులు
శివశివశివభక్తుఁదిట్టిచెడుదురుగాదే ॥ ౩౮౨

క॥ శ్రీరామ రామయనుచుఁ
నారాములభక్తిఁబల్కుసత్పురుషులని
త్యారాధనఁ జేసినవాఁ
డారాముఁడుసాక్షాత్కృప్తినారాకాశ్రీ ॥ ౩౮౩

క॥ సోహంమంత్రార్థానుభ
వాహ్లాతతిమిరుఁడగుచుఁదనువారబ్ధంబున్
మోహమువిడిచిభజింపఁగ
సాహసమునవిన్నుఁజేరుసాధుశరణ్యా ॥ ౩౮౪

క॥ కొనియాఁడి శైవమిథునముఁ
దనయాత్రఁ జక్రమునకుఁదగురీతినిన
ర్చనయొనరిచ్చిచనియెనిరం
జనుఁడునుబుద్ధిమతివెంటసాఁగఁగఁబురికిన్ ॥ ౩౯౦

గీ॥ చేరియానందపురమునుశీఘ్రగతిని
చనెసుధర్మనురావించియవనిపతియు
మాత్యపదముభట్టునకిమ్మమంత్రి! తపము
సేఁతదగునీకుఁగోరినరీతిఁబూర్వ
మెన్నియోవిధములనాకుహితముగఁజెపి
శ్రమలఁజెందితివిఁకనైనశాంతివలదె
యొద్దికోరిననీనుంటెసిద్ధచరిత
వనమునందైననానందవనమునందు
నైననుజయంతమందైననాత్మశాంతి
కలుగుననభట్టుఁబిలిపించిగౌరవమున
ముద్రనిచ్చెనుసభలోనముదముతోసు
దర్శనుండంతభట్టందిదానిభక్తిఁ
బ్రజకునివ్విధిఁదెల్పెవిశ్వాసమెసఁగ ॥ ౩౯౧

సీ॥ గురుపాదపద్మంబుఁగొల్చిమించినవాఁడు
గోవిందుపదభక్తిఁగోరువాఁడు
దుష్టబుద్ధులకుఁదాదూరమైయున్నాఁడు
శిష్టాళిసంగంబుఁజేరువాఁడు

వేదశాస్త్రపురాణవిజ్ఞతగలవాఁడు
భక్తజనులబోధపఱచువాఁడు
మంత్రశాస్త్రంబందుమహిమగాంచినవాఁడు
నాశారహితుఁడు యోగీశుఁడరయ

ఆ. వె॥ విన్నవాఁడుమున్ను వేదాంతవాక్యముల్
కన్నవాఁడుసిద్ధిఁగన్నవాఁడు
భక్తవరులనెందుఁబాలించుచుండుని
రంజనుండుశత్రుభంజనుండు ॥ ౩౯౭

ఉ॥ కొందఱు యోగియండ్రుమఱికొందఱుభోగియటండ్రువారిలోఁ
గొందఱు యోగులుంటమఱికొందఱుభోగులునుంటఁదానువా
రందఱికన్నిరీతులుగనైకనిపించుటదానికేమి వే
గందరియిచ్చునాధనముఁగాంచెనుమావరభక్తిఁదన్నుస
ద్బృందము మెచ్చముక్తికయిప్రీతినిఁబూనెనుజ్ఞానయోగమా
నందమునిచ్చునీమనుజనాథునిఁగొల్చినమీకుమేలగున్ ॥

క॥ హెచ్చగునీతనిబుద్ధిన్
విచ్చెన్ హృదయాబ్జమందు వేసుకమీఱన్
జొచ్చెన్సద్గురువరుఁడట
నిచ్చెనతనిగరుణమెచ్చియిహపరసుఖముల్ ॥ ౩౯౮

క॥ వినుఁడీజననీజనకులు
వినయంబున వేదవేద్యు వేడుకఁగొలువన్

జననంబందినఘనుఁడఁట
కనుఁడీతనిఁబరమపదముఁగనుఁడీమనుఁడీ ౩౯౫

ఆ. వె॥ ఫాలనేత్రుఁబోలుఁబద్మాక్షుఁబోలెను
నజునిఁబోలునితఁడుద్విజునిఁబోలు
శక్తియుక్తిభక్తిజపతపంబులయందు
రాజమాత్రుఁడెటునిరంజనుండు ॥ ౩౯౬

తే. గీ॥ తత్త్వమస్యాదిసద్వాక్యతత్త్వమెఱిఁగి
స్వస్వరూపానుసంధానసరణిఁదిరుగు
నితఁడుజీవాఖ్యఁబరగుటయెట్లుదగును
రంజనుండునిజమ్ముగరాచతపసి ॥ ౩౯౭

సీ॥ ఆశ్రమంబులునాల్గునామ్నాయవిధిఁబ్రోవ
హంసయౌచ్చటరాజహంసయిచట
ధర్మసూక్ష్మముస్థూలధర్మంబుఁగఱంగ
హంసయౌచ్చటరాజహంసయిచట
మణికాంతిశ్రీశిరోమణికాంతియిటరాజ
హంసంబుదీపించుహంసయచటఁ
దంత్రశక్తినిమహామంత్రశక్తినిరాజ
హంసయిచ్చటనిల్చుహంసయచటఁ

గీ॥ పంచుకొనినట్టులుండి రాయంచమాఱియుఁ
దత్తదుచితంబుఁగాఁగూర్పధర్మములొగి

నచటనిచటనురాజ్యమందంతినౌర
కర్మభూమినిబుట్టుజ్ఞానులకు || ౩౯౭

సీ॥ శారదోపాస్తిని శారదాసూక్తిని
రాజహంసలకుసర్వత్రశాంతి
సింహాసనంబున సిద్ధాసనంబున
రాజహంసలకుసర్వత్ర శాంతి
ముద్రాధికృతినిజన్ముద్రాధికృతినిమహాజ్ఞ
రాజహంసలకుసర్వత్ర శాంతి
అత్యంతసద్భక్తినానందమునిసృక్తి
రాజహంసలకుసర్వత్రశాంతి
దానభోగంబులజ్ఞానయోగంబుల
రాజహంసలకుసర్వత్రశాంతి
ఆజ్యాన్నభుక్తిబ్రహ్మానందభుక్తిని
రాజహంసలకుసర్వత్రశాంతి
మనుభక్తిపరహోక్తిమనుశక్తిగురుసూక్తి
రాజహంసలకుసర్వత్రశాంతి
శేషాద్రిపతికృపశేషభూషణుకృప
రాజహంసలకుసర్వత్ర శాంతి ॥

గీ॥ స్ఫోటమునుసౌఖ్యమునులలిఁబోలఁజూడుడు
ధరజయంతమ్మునను రాజధానిలోన
శారదాపీఠమునరాజచక్రమున
రాజయోగంబుజరగునిర్వక్రగతిని ॥ ౩౯౯

క॥ భయవిరహితపదవింగని
నయగతినిటుఁపలికెభట్టునలువురువొగడన్
జయముంగూర్చుచునృపతికి
జయంతమునుబ్రజనునించెశాంతిన్ శ్రీశా ॥ ౪౦౦

శ్లో॥ ఆనందరూపాయ మహేశ్వరాయ
వేదాంత వేద్యాయ పరాత్పరాయ
భోగీంద్రతల్పాయ సురార్చితాయ
శ్రీవేంకటేశాయనమశ్శివాయ ॥ ౪౦.౧

క॥ సత్క్రియచేయఁగ లేకుఁజ
మత్కృతినిన్నెపుడు నేనుమహాసీయులతో
మత్కృతినారాధించెదఁ
ద్వత్కృపకున్ సాక్ష్యమిది యెతథ్యముశ్రీశా ॥ ౪౦౨

క॥ శ్రీశావిశ్వేశమహే
శాశేషాచలనివాసనాధునుపోషా
ఆశీర్వదించిభవజల
రాశిన్ దాటింపుదాసురాలినిగృపతోన్ ॥ ౪౦౩

క॥ కనకముపశ్చిమముఖమై
కనియెన్ లోహంపువార్తకనకాంబరయా
కనకంబార్యోక్తులచే
ఘన తేజఃపుంజమాటఁగనికనశాంతిన్ ॥ ౪౦౪

క॥ కనకాంబరనీపదముల
ననిశము సేవింపఁదృప్తినందుట నెటుఁబో
కనిలిచియుండెనుగదయి
మ్మనమెంతయుఁబూర్వపుణ్యమహిమఁగాంతిక ॥ ౪౦౧

క॥ వందన మోజగదీశా
వందనముముకుందభక్తవరదాశుభదా
వందన మోశ్రీశాన్సి
కుందనయనునన్ను నేలుకోపరమేశా ॥ ౪౦౭

గీ॥ ముక్తికల్యాణమంటపమునవసించు
రామచంద్రుండుతోడుగారాఁగజీవ
యాత్రసల్పెదమెట్లొసచ్ఛాత్రవరుల
మమ్ముఁనతఁడై యొనర్చినిజమ్ముసుమ్ము ౪౦౩

క॥ పరమార్థైకపరాయణ
వరభక్తవ్రాతసర్వవస్తుసమేశా
మురళీధరముక్తిప్రద
విరజావరతీర్థపాదవేంకటనాథా ॥ ౪౦౪

ఆ. వె॥ సకలచక్రమందుసకలచక్రమునందు
మంత్రమందురాజతంత్రమందుఁ
గలినిముక్తిశక్తికళయుఁగాంతియునుంట
శ్రీకృపావశమునమోహకాంతి ॥ ౪౦౫

క॥ భద్రము భద్రార్థులకుఁ
ముద్రాధరులకును యోగిపుంగవులగుచి
న్ముద్రాధికారులకునుసు
భద్రానుజపాదపద్మబంభరవృత్తిఁ ॥ ४౧౦

ఆ. వె॥ పరమహంసవేద్యపదహంసకోజ్జ్వల
హంసయానరాజహంసయాన
నలినభవునికొమ్మనారాయణునికోడ
లమ్మలోకమునకునాత్మమాకు ॥ ४౧౧

క॥ తనతల్లిఁజేరి స్తన్యం
బనుకూలతఁద్రాగువేళనటునిటునిజవా
హనమరుగకుండఁజల్లఁగఁ
గనుగణపతిమమ్ముఁగృపనుగనుజగదంబా ॥ ४౧౨

క॥ నిజధర్మాచరణంబున
గజవరదుఁగొల్చినిత్యకళ్యాణంబుల్
భజియించుపథముఁదెల్పెడి
నిజీవయాత్రసుజనులకువిశ్వలభక్తిఁ ॥ ४౧3

క॥ ఈమార్గముసూచించిన
శ్రీమంతుఁడుసద్గురుండుశ్రితజనరక్షా
కాముండాత్మారాముఁడు
నామదివసియించుఁగాతనందాత్మండై ॥ ४

క॥ దీనిన్ వినిచిన వ్రాసిన
జ్ఞానంబుదయించుజన్మకలుషముపాయున్
సానందంబగుపదమే
గానందగుభక్తకోటిగానముసేయన్ ॥ ౪౧౫

ఆ. వె॥ చెట్టుక్రిందపక్షి జీవుండు పైనున్న
పక్షి నాత్మఁజూడఁ బైకినెగురఁ
దథ్యమాత్మయొకఁడు తానునీడయటంచుఁ
దెల్పు జీవయాత్రకల్పనగము ॥ ౪౧౬

క॥ ధ్వనిసారమగుట దేనిని
విని సాధులు మేనుమఱచి వీఁకన్ దనతోఁ
గని సారూప్యము తరియిం
త్రని సామెతయట్టికృతిని హరియే ప్రోచున్ ॥ ౪౧౭

క॥ చండీముండితసాధుశి
ఖండిసుబోధితనయపదకాననచారా
ఖండమనస్సంతాపసు
దండితపామరజనౌఘదావాహంబుదమా ॥ ౪౧౮

మాలినీ॥ గరుడగమనసేవాకామసంలబ్ధయోగాత్
పరమగురుకటాక్షప్రాప్తసంబోధసారాత్
నిఖిలభువనశిక్షానిర్మలానందరక్షా
సకలసకలదోషాన్ సంహరత్యేవముద్రా ॥ ౪౧౯

మాలినీ॥ రజతగిరివిభుశ్శ్రీరాధికావల్లభేశ
స్సహృదయహృదయాబ్జాదిత్యభూతాంతరాత్మా
హిమగిరితనయాశ్లేషాత్మ యోగాభియోగః
పరశివగురుమూర్తిః పాతునశ్చంద్రచూడః ॥ ౪౨౦

మాలినీ॥ కరధృతమురళీసంభూషితాస్యంరమేశమ్
నిజభజనపరాణాంగోపగోపీకలాపమ్
వ్రజదుమధురవచఃపీయూషదాతారమాప్తమ్
పరశివకవితోషంభావయేకృష్ణవేషమ్॥ ౪౨౧

శ్లో॥ మంగళం వేంకటేశాయ
కమలాంతరవాసినే
దేశికేంద్రతనూజాయ
రామభక్తాయమంగళమ్ ॥ ౪౨౨

గద్యము

ఇది శ్రీమదమృతానందనాథగురునాథబోధసు
ధాబ్ధికన్యాధవపదాబ్జసేవాలబ్ధమనీషాజని
తోభయభాషాకవితా భూషాలంకృత
కనకావిఖ్యాతజీవయాత్రాఖ్య మహా
కావ్యసంగ్రహంబునందుబూర్ణాధి
కారంబునుత్పత్తియోల్లాసము
సర్వముసంపూర్ణము
శ్రీరామ
ఓమితిశివమ్.

